# విషయసూచిక.

సర్గము. విషయము.

# వచనగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు॥ | అ॥ |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము | | | |
| ,, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రికృతము, ఒకటే సంపుటము | | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము | | | |
| ,, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, అరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము | | | |
| బాలకాండము | ... | 2 | 8 |
| అయోధ్యాకాండము | ... | 5 | 0 |
| అరణ్యకాండము | ... | 2 | 8 |
| కిష్కింధాకాండము | ... | 2 | 8 |
| సుందరకాండము | ... | 3 | 0 |
| యుద్ధకాండము | .. | 7 | 8 |
| ఉత్తరకాండము | ... | 3 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| తులసీదాసురామాయణము, వచనము | ... | 12 | 8 |
| శ్రీమహాభక్తవిజయము | ... | 12 | 0 |
| ముగ్గురుమూర్తులు | ... | 2 | 8 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 4 |
| ,, II భాగము | ... | 1 | 4 |
| సంస్కృతనాటకకథలు, 1, 2 భాగములు చదలువాడ సీతారామశాస్త్రిగారివి | | 2 | 0 |
| 3-వ భాగము, శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిది | | 2 | 0 |

| | రూ. | అ. |
|---|---|---|
| ప్రతి 1-కి | రూ. | అ. |
| నేటి కాలపు కవిత్వము, అక్కిరాజు శ్రీ ఉమాకాన్తముగారిది | 3 | 0 |
| జగత్సృష్టి, వేల్సు గ్రంథమున కనువాదము ... | 6 | 0 |
| ద్వాదశోపనిషత్తులు. తెనుగువచనము ... | 5 | 0 |
| పంచతంత్ర హితోపదేశకథామంజరి ... | 1 | 12 |
| శామహారాష్ట్రయాత్ర ... | 4 | 0 |
| పురాణగాథలు I ... | 1 | 0 |
| ,, II ... | 1 | 0 |
| త్రిలిఙ్గకథలు ... | 1 | 0 |
| విక్రమార్కచరిత్ర, భా. రామమూర్తిశాస్త్రి ... | 1 | 8 |
| విక్రమార్కునికథలు ... | 0 | 12 |
| వినోదకథాకల్పవల్లి, చిలకపాటి వేంకటరామానుజశర్మగారిది | 6 | 0 |
| చమత్కారకథాకల్లోలిని 1, 2 భాగములు ,, ... | 3 | 0 |
| జీవితరహస్యములు ... | 1 | 8 |
| నీతిరత్నాకరము ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము ... | 1 | 8 |
| సంగ్రహభారతము ... | అచ్చు | |
| సంగ్రహభాగవతము ... | 2 | 8 |
| భోజునికథలు ... | 1 | 0 |
| సావిత్రి, ప్రతిమలతో ... | అచ్చు | |
| హరిశ్చంద్ర, ప్రతిమలతో ... | 0 | 8 |
| రఘువంశకథ ... | 0 | 10 |
| నల, ప్రతిమలతో ... | 0 | 8 |
| 'సైన్సు'పై లోకహత్యారోపణ (ప్రహసనము) ... | 0 | 8 |
| తిలకుగారి సెక్యూరిటీ కేసు, ఉపన్యాసములు ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము ... | 1 | 4 |
| ,, రెండవభాగము ... | 0 | 10 |
| ,, మూఁడవభాగము ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము ... | 0 | 12 |
| చిత్రరత్నాకరము, గుర్జాడ శ్రీరామమూర్తి ... | 1 | 0 |
| నీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరిగారిది ... | 0 | 8 |
| ,, టీకతో ... | 1 | 4 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము ... | 0 | 8 |
| ,, A. S. P. అయ్యరుగారిది ... | 0 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1



శ్రీ ర స్తు.

శ్రీరామాయ నమః.

శ్రీ మ ద్వా ల్మీ కి రా మా య ణ ము

# ఉ త్త ర కాం డ ము



## 1-వ స ర్గ ము

### అగస్త్యాదిమునులు రామునిఁ జూడవచ్చుట

శ్రీరామచంద్రభగవానుఁ డీరీతిగా రాక్షసుల నందఱను సంహరించి రాజ్య మేలుచుండఁగా నతనిని గొనియాడుటకై తూర్పుదిక్కునం దుండెడి యవక్రీతుఁడు, గార్గ్యుఁడు, గాలవుఁడు, మేధాతిథికుమారుఁడగు కణ్వుఁడు మొదలగు మునులును, దక్షిణదిక్కున నుండెడి స్వస్తి,ఆత్రేయుఁడు, నముచి, ప్రముచి, అత్రి, సుముఖుఁడు, విముఖుఁడు, అగస్త్యుఁడు మొదలగు మునులును, పశ్చిమదిక్కున నుండు పృషద్గుఁడు, కవషుఁడు, ధౌమ్యుఁడు, మహర్షి యగురాధేయుఁడు మొదలగు మునులును, ఉత్తరపుదిక్కున నుండెడి వసిష్ఠుఁడు, కశ్యపుఁడు, అత్రి, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, భరద్వాజుఁడు మొదలగు మునులును శిష్యసహితముగా వచ్చిరి. అగ్నిహోత్రునితో సమానమైన కాంతిగలవారును, వేదములు వేదాంగములు చదువుకొన్నవారును, నానాశాస్త్రము లెఱిఁగినవారును నగుమును లీప్రకారముగా శ్రీరామచంద్రుని మందిరము చెంతకు వచ్చి ద్వారమునొద్ద నిలువఁబడిరి. అప్పుడు ధర్మాత్ముఁడును మునులలో శ్రేష్ఠుఁడును నగు అగస్త్యుఁడు ద్వారపాలకుని జూచి యిట్లనియె : "ద్వారపాలకా! లోపలికిఁ బోయి శ్రీరామునితో మునులు వచ్చి ద్వారమునొద్ద నిలువఁబడియున్నా"రని చెప్పి రమ్మనఁగానే రాజనీతిని రాజులయింగితమును నెఱిఁగినవాఁడును, మంచినడవడి గలవాఁడును,

చెప్పినపని వేగముగాఁ జేయువాఁడును, ధైర్యశాలియును నగు నాద్వారపాలుఁడు లోపలికిఁ బోయి పున్నమచంద్రునితో సమానమైన కాంతిగల రామునిఁజూచి యగస్త్యాదిమునులు వచ్చి ద్వారమువద్దఱ నున్నా రని విన్నవించెను.

బాలసూర్యునితో సమానమైన కాంతి గల మునీశ్వరులు వచ్చి యున్నారని ద్వారపాలకునివలన విని, తరువాత శ్రీరాముఁడు "సుఖముగా వారిని లోపలికిఁ దీసికొని రమ్ము." అని ద్వారపాలకునితోఁ జెప్పెను. ద్వారపాలకునిచేఁ దీసికొనిరాఁబడ్డ మునీశ్వరులను జూచి చేతులు జోడించుకొని యెదురుకొని పాద్యము, అర్ఘ్యము మొదలగు వానిచేఁ బూజించి యాదరముతో గోవును సమర్పించి నమస్కరించి రాముఁడు వినయముగా నాసనములమీఁద వారిని గూర్చుండుఁ డని యెను. ఆ మునిశ్రేష్ఠులు రామునియనుమతిప్రకారముగా బంగారుచేఁ జిత్రింపఁబడినవియు, గొప్పవియు, శ్రేష్ఠమైనవియు, మీఁదను దర్భలును, కృష్ణాజినములును బఱచినవియు నగు నాయాసనములమీఁదను వారి వారి యంతరమునకుఁ దగినట్లు గూర్చుండిరి. తరువాతను రామునిచేఁ గుశల మడుగఁబడి శిష్యులు మొదలగువారితోఁ గూడుకొనియున్న వేదవిదులగు మహర్షులు రామునితో నిట్లనిరి :

మహాబాహుఁడవగు నో శ్రీరామచంద్రా! మాకందఱకును కుశలమే. దైవవశమున సమస్తశత్రువులను జంపి క్షేమముగా నున్న నిన్నుఁ జూడఁగలిగితిమి. దైవవశమున నీవు ముల్లోకముల నేడిపించుచున్న రావణునిఁ జంపితివి. రామా! పుత్రపౌత్రాదులతోఁ గూడిన రావణుని జంపుట నీ కొకగొప్పకష్టమైనపని గాదు. నీవు ధనుస్సు పట్టితివేని నిస్సంశయముగా మూఁడులోకములను జయింపఁగలవు. అదృష్టవశమున నీవు రాక్షసరాజగు రావణుని జంపితివి. ధర్మాత్మా! మాయదృష్టవశమున జయము బొంది సీతతోను, నీహితమును సమకూర్చు తమ్ముఁడగు లక్ష్మణునితోడను, తల్లులతోడను, తక్కిన తమ్ములతోడను గూడియుండఁగా నిన్నిప్పుడు మరలఁ జూడఁగలిగితిమి. అదృష్టవశమునఁ బ్రహస్తుఁడు, వికటుఁడు, విరూపాక్షుఁడు, మహోదరుఁడు, ధర్షింప శక్యముకాని యకంపనుఁడు మొదలగు రాక్షసులను జంపితివి. రామా! ఎవనిప్రమాణముకంటె గొప్పదియగు ప్రమాణము లేదో అట్టి కుంభకర్ణుని నీవు

యుద్ధములోఁ జంపితివి. ఇది గొప్పయదృష్టము. మఱియు నో రామ చంద్రా! అదృష్టవశమునఁ ద్రిశిరుఁడు, అతికాయుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు, భయంకరాకారులగు కుంభకర్ణునికొడుకులు కుంభనికుంభులు, ప్రళయకాలపు యమునితో సమానులగు యుద్ధోన్మత్తుఁడు, మత్తుఁడు, బలవంతుఁడగు యజ్ఞకోపుఁడు, ధూమ్రాక్షుఁడు మొదలగు మహాబలపరాక్రమములుగల రాక్షసులును శస్త్రాస్త్రపారగులై మహా ఘోరముగా యుద్ధము చేయుచుండఁగా యమునితో సమానముగా భయంకరమైన బాణములచేతను జంపితివి. రామా! దేవతలకుఁ గూడ నసాధ్యుఁడైన రావణునితో ద్వంద్వయుద్ధము చేసి జయమును పొందితివి. రావణాసురునికియుద్ధములో నెన్నఁడును పరాజయముకలుగలేదు. అదృష్ట వశమున ద్వంద్వయుద్ధమును జేయుటకు వచ్చిన యింద్రజిత్తుని జంపుటయే గొప్ప. మహాబాహూ! దైవవశమున యమునివలె నెదురుగా వచ్చు నింద్రజిత్తుచేతను దప్పించుకొని వానిని జంపి జయమును బొందితివి. మహామాయాధురంధరుఁడగు నాయింద్రజిత్తు నెవ్వరును జంపఁజాలరు. అటువంటివానిని నీవు తమ్మునిచేఁ జంపించితివన్న సంగతి విని, మే మందఱ మును సంతోషించుచున్నారము. ఇంద్రజిత్తును జంపుటయే మాకుఁ జాల నాశ్చర్యమును గలిగించుచున్నది. మఱియు నో రామా! మహావీరులును, కామరూపులును నగు రాక్షసుల నెందఱినో చంపితివి. సమస్త శత్రువులను జంపి పవిత్రమును సౌమ్యమును నగు నభయదక్షిణ నిచ్చి మాకేకాక లోకముల కన్నింటికిని సంతోషమును గలిగించి దైవవశమున వృద్ధిగాఁ నున్నాఁడవు.

భావితాత్ములగు నాఋషులు చెప్పినమాటలు విని యాశ్చర్యపడి చేతులు జోడించుకొని శ్రీరామచంద్రుఁ డిట్లనియె: "ఓమునిభగవాను లారా! మహాబలపరాక్రమములుగల రావణకుంభకర్ణులు, మహోదరుఁడు, ప్రహస్తుఁడు, విరూపాక్షుఁడు, మత్తోన్మత్తులు, తేఱిచూడ శక్యముగాని దేవాంతకనరాంతకులు, మహావీర్యముగల యతికాయుఁడు, త్రిశిరుఁడు, ధూమ్రాక్షుఁడు మొదలగు రాక్షసుల నందఱను గొనియాడక యింద్ర జిత్తు నింతగాఁ గొనియాడుచున్నా రేల? వాని ప్రభావ మెట్టిది? వాని కెంతబలము గలదు? వానిపరాక్రమ మెటువంటిది? రావణునికంటెను గొప్పవాఁ డనిపించుకొనుటకుఁ గలకారణ మేమి? నేను వినుటకుఁ

జాలుదునేని, రహస్యమైనసంగతి కాకుండెనేని సెలవిచ్చినచో వినఁదలఁచి యున్నాఁడను. చెప్పక తీఱదని మీ కాజ్ఞాపించువాఁడనుమాత్రము గానుజుమండీ! ఆయింద్రజిత్తు దేవేంద్రునిగూడ జయించుటకుఁ దగిన వరమెట్లు పొందెను? అతఁడు తండ్రికన్నను బలవంతుఁ డెట్లాయెను? ఆయీసంగతులన్నియు వినఁదలఁచి యడుగుచున్నయీనాకు సెలవిత్తురు గాక."

## 2-వ సర్గము

### అగస్త్యుఁడు రాక్షసులవృత్తాంతమును జెప్పఁబూనుట

మహాత్ముఁడగు శ్రీరాముఁ డడిగినమాటలు విని మహాతేజశ్శాలి యగు నగస్త్యుఁ డిట్లనియె: "రామా! ఆయింద్రజిత్తు శత్రువులచేఁ జావకుండ శత్రువులను జంపుటకుఁ దగినతేజోబలము వాని కెట్లు గలిగినదో చెప్పెదను వినుము. ముందుగా నీకు రావణాసురునికులము, జన్మము, వాని కిచ్చినవరములు మొదలగునవి చెప్పెదను. రామా! పూర్వము కృతయుగమున రెండవబ్రహ్మదేవునివంటివాఁడు బ్రహ్మమానసపుత్త్రుఁడు పులస్త్యుఁ డనియెడు బ్రహ్మర్షి యొకఁడు గలఁడు. అతనిగుణములు వివరించి చెప్పుటకు వీలు గాదు. అతఁడు తన ధర్మమునుబట్టియు, మంచి స్వభావమునుబట్టియు బ్రహ్మకుఁ గుమారుఁ డనియే చెప్పఁదగినవాఁడు. బ్రహ్మకుమారుఁ డగుటచే దేవతలందఱకును మిక్కిలి ప్రేమాస్పదుఁ డాయెను. మఱియు బుద్ధిశాలియగు నాపులస్త్యుఁడు తనస్వచ్ఛమైన గుణములచేత నెల్లలోకములవారికిని నిష్టుఁడై యుండెడివాఁడు. అతఁడు తపస్సు చేసికొనుటకై మేరుపర్వతప్రాంతమం దున్నతృణబిందునియాశ్రమమునకుఁ బోయియుండెను. స్వాధ్యాయముచేతను నియమింపఁబడిన యింద్రియములుగల యాధర్మాత్ముఁ డచ్చటఁ దపస్సుచేసికొనుచుండఁగా నతనియాశ్రమములోనికి దేవకన్యకలు, పన్నగకన్యకలు, రాజర్షికన్యకలు, అప్సరస్త్రీలు మొదలగువా రాటలాడుకొనుచుఁ బ్రవేశించుచుండెడివారు. అతనితపోవనము సర్వఋతువులయందును రమ్యమై యిచ్చకు వచ్చిన మచ్చున విహరించుటకుఁ దగియుండుటవలన నిత్యమును వారక్కడకు వచ్చి పెచ్చుపెరిఁగి యాడుకొనుచుండెడివారు. ఇట్లు సుందరమైన యాపులస్త్యుని యాశ్రమములోనికి వచ్చి యాటలచేతను, పాటల

చేతను, వాద్యవిశేషములచేతను అనింద్యలగు నాకన్యక లాపులస్త్యుని తపస్సునకు విఘ్నమును గలిగించుచుండిరి.

అంత మహాతేజశ్శాలియగు పులస్త్యుఁడు కోపించి, "నాతపోవనములోనికి వచ్చినయాఁడుది గర్భవతి యగుఁగావుత!" మని శపించెను. ఆకన్యక లందఱును మహానుభావుఁడైన యాపులస్త్యునిమాట విన్నవారై బ్రహ్మశాపమువలన భయపడి యది మొదలు లాచోటికిఁ బోవ మానుకొనిరి. ఇట్లుండఁగా నాతఁ డిచ్చినశాపముసంగతి యెఱుఁగక తృణబిందుని కూఁతురు తనసఖులను వెదకుటకై యతనితపోవనమునకుఁ బోయి నిర్భయముగా విహరించుచు నచ్చట నొక్కసఖినైనను జూడకపోయినది. ఆసమయమున మహాతపశ్శాలియగు నాపులస్త్యుఁడు స్వాధ్యాయాసక్తుఁడై యుండెను. ఆమె వేదధ్వని విని యతనిని మహానిధినిగాఁ దెలిసికొన్నది. అంతట నామెకు గర్భచిహ్నములు గనుపట్టినవి. దేహము తెల్లఁబాఱినది. తనకు గర్భము గలుగుట చూచి దిగులుపడి యిది యేమిసంగతియో కదా! యనుకొనుచుఁ దండ్రియాశ్రమములోనికిఁ బోయి నిలువఁబడినది. ఆరీతిగా వచ్చి యెదుట నిలువఁబడియున్న కూఁతుం జూచి తృణబిందుఁడు తెల్లఁబోయి "యేమమ్మా! నీశరీర మీరీతిగా నున్నది?" అని యడుగఁగా, నామె చేతులు జోడించుకొని "నాయనా! నారూప మీరీతిగా మాఱిపోవుటకుఁ గారణము నాకుఁ దెలియదు. కాని నేను సుందరమైన పులస్త్యమహామునియాశ్రమములోనికి నాచెలికత్తెలను వెదకుటకై యొక్కతెను బోతిని. అచ్చట నాచెలికత్తియ యొక్కతెయు నాకగపడలేదు. నారూపముమాత్ర మీరీతిగా మాఱిపోవుటచే భయపడుచు నిచ్చటికి వచ్చితిని." అని దీనదీనముగాఁ దండ్రితోఁ జెప్పినది.

ఇట్లు తనకూఁతురు చెప్పినమాటలు విని తపశ్శాలియు రాజర్షియునగు నాతృణబిందుఁడు ధ్యానదృష్టితోఁ జూచి యిదియంతయుఁ బులస్త్యునిశాపప్రభావమని తెలిసికొని, కుమారితను వెంటఁబెట్టుకొని పులస్త్యుని సన్నిధికిఁ బోయి యిట్లనియె: "పులస్త్యభగవానుఁడా! ఇది నాకూఁతురు; మంచిగుణవంతురాలు. తనంతటఁ దానుగా వచ్చియున్న దీనిని భిక్షగా నంగీకరింపుఁడు. ఇది తాము తపస్సు చేసిచేసి యలసతను బొంది వచ్చు నప్పటికిఁ దమకు నిత్యమును శుశ్రూష చేయుచుండును. ఇందు సందియము లేదు."

అని యిట్లు చెప్పుచున్న తృణబిందుమహర్షియొక్క మాటలు విని యాపులస్త్యుఁ డాకన్యకను బరిగ్రహింప నిచ్ఛగలవాఁడై "వల్లె" యని బదులుచెప్పెను. తృణబిందుఁడు తనకూఁతును యథాన్యాయముగా నతనికి సమర్పించి తనయాశ్రమమునకుఁ బోయెను. ఆమెయుఁ దనగుణములచేతను బెనిమిటికి సంతోషమును గలిగించుచు నచ్చట నుండెను. మునిశ్రేష్ఠుఁడగు నాపులస్త్యుఁ డాకన్యకయొక్క స్వభావముచేతను నడవడిచేతను సంతోషించినవాఁడై యామెతో నిట్లనియె: "సుందరీ! నీగుణములకు నేను సంతోషించితిని. కావున నుభయవంశములకును గర్తయుఁ బౌలస్త్యుఁ డను ప్రసిద్ధిగలవాఁడును నాతో సమానుఁడును నగుకుమారుని నీ కిచ్చుచున్నాను. నే నధ్యయనము చేసికొనుచుండఁగా నీ వావేదమును వినియుంటివి గావున నీకుమారుఁడు విశ్రవసుఁ డనిపేరు పొందఁగలఁడు." ఈరీతిగా సంతోషించిన యామునిచేఁ జెప్పఁబడినదియై యామె కొలఁదికాలములోననే విశ్రవసుఁ డనుకుమారుని గన్నది. ఆకుమారుఁడు మూఁడులోకములయందును బ్రసిద్ధిగలిగినవాఁడును, కీర్తితోడను ధర్మముతోడను గూడినవాఁడును, వేదవేదాంగము లెఱిఁగినవాఁడును, సమదృష్టిగలవాఁడును, వ్రతములయందును ఆచారములయందును మిక్కిలి యాసక్తిగలవాఁడును నై తండ్రివలెనె తపస్సుతోఁ గూడినవాఁ డాయెను.

## 3-వ సర్గము

### కుబేరుని జన్మప్రకారాదికము

పిమ్మటను సత్యవంతుఁడును, శీలవంతుఁడును, శాంతుఁడును, స్వాధ్యాయాసక్తుఁడును, శుచియు, భోగములయం దాసక్తిలేనివాఁడును, నిత్యమును తపస్సునందే యాసక్తిగలవాఁడును, బులస్త్యమహామునికుమారుఁడును నగు నావిశ్రవసుఁడు కొలఁదికాలములోననే తండ్రివలెఁ దపోనిధి యాయెను. అతనినడవడి యంతయుఁ దెలిసికొని భరద్వాజమహాముని తనకూఁతును దేవవర్ణిని యనుదానిని దెచ్చి యతనికి భార్యనుగా నిచ్చెను. ఆతఁడును భరద్వాజమహామునికూఁతుం బరిగ్రహించి సకలశ్రేయోనిధానంబగు గృహస్థాశ్రమము నవలంబించెను. అంతటఁ గొన్నాళ్లకు సంతతిఁబడయవలయు ననుబుద్ధిగలవాఁడై మిక్కిలి సంతోషముతోఁ

గూడి దేవవర్ణిని యను భార్యయందు వీర్యశాలిని గుమారు నొకనిఁ గనియె. ఆకుమారుఁడు ధర్మాత్ముఁడును బ్రహ్మగుణము లన్నియుఁ గలవాఁ డున్నై యొప్పారుచుండెను. ఆకుమారుఁడు పుట్టఁగానే విని వచ్చి బ్రహ్మదేవుఁడు మిగుల సంతోషించెను. శ్రేయస్కరమగు నతనిబుద్ధిని జూచి వీఁడు ధనమున కధిపతి గాఁగలఁ డనిచెప్పి దేవర్షులును దానును నాలోచించి వీఁడు విశ్రవసునికుమారుఁడు గనుకను, సాదృశ్యమునుబట్టి తండ్రిని బోలియున్నవాఁడు గనుకను లోకములో వైశ్రవణుఁ డను ప్రసిద్ధినొందఁగలఁ డనిచెప్పి యంతర్ధానమాయెను. తండ్రితపోవనములో నున్న యావైశ్రవణుఁడు హోమము చేయఁబడి జాజ్వల్యమానముగా వెలుఁగుచున్న యగ్నిహోత్రునివలె వృద్ధి నొందుచుండెను.

ఆతఁ డీరీతిగాఁ దండ్రియాశ్రమములో నుండఁగాఁ దపస్సే మిగుల నుత్తమమైన గతి కనుకఁ దపస్సు చేయవలయు నని యాతనికి బుద్ధి పుట్టినది. అతఁడు వేలకొలఁదిసంవత్సరములు మహావనములో నుగ్రములగు నియమముల నవలంబించి ఘోరమగు తపస్సు చేసెను. మొదటివేయి సంవత్సరములు జలము త్రాగియు, రెండవవేయిసంవత్సరములు వాయువునే భక్షించియు, మూఁడవవేయిసంవత్సరములు నిరాహారుఁడయ్యుఁ దపస్సు చేయుచుండఁగా నామూఁడువేలసంవత్సరములును నొక్కసంవత్సరమువలెఁ గడచినవి. తరువాత నతనితపస్సునకుఁ జాలసంతోషించి యింద్రాదిదేవతలతోఁగూడ బ్రహ్మదేవుఁ డతనియాశ్రమమునకు విచ్చేసి యిట్లనియె: "వత్సా! నీవు చేసిన తపస్సునకుఁ జాలసంతోషించితిని. మహామతీ! నీకుఁ గావలసినవరములు గోరుము. నీవు వరము లిచ్చుటకుఁ దగినవాఁడవు." అని చెప్పినబ్రహ్మదేవునిమాటలు విని "తాతా! నేను జేసినతపస్సునకు సంతోషించితివేని నాకు లోకపాలకత్వమును, ధనాధిపత్యమును దయచేయుము" అని యడిగెను. ఆమాటలకు సంతోషించి, "నాయనా! నీవు కోరినప్రకారముగానే యిచ్చితిని. నేనును నాల్గవలోకపాలకుని సృజింపవలయు ననియే యాలోచించుచున్నాను. యమునిపదమో వరుణునిపదమో యింద్రునిపదమో నీ కేది కావలయునో దానిని గైకొనుము. ధర్మజ్ఞా! నీవు నిధుల కధిపతి వయ్యెదవు. యమవరుణేంద్రులకు నాల్గవవాఁడ వయ్యెదవు. ఇదిగో నిది పుష్పకమను పేరుగల విమానము. సూర్యునితో సమానముగా వెలుఁగుచున్న దీనినిఁ బుచ్చు

కోరుము. దీనిమీఁద నారోహించి దేవతలతో సమానుఁడవై యుండుము. నీకు మేలగుఁగాత ? నీవు కోరుకొన్న రెండువరములును నీకిచ్చి మేము కృతార్థులమైతిమి. మేమందఱమును వచ్చినత్రోవనే మరలఁ బోయెదము" అని చెప్పి బ్రహ్మ దేవతలతోఁగూడఁ దనలోకమునకుఁ బోయెను.

బ్రహ్మ మొదలగు దేవతలు వారివారి లోకములకుఁ బోయినతర్వాత నియమవంతుఁడైన యావైశ్రవణుఁడు తండ్రియున్న తపోవనమునకు వచ్చి చేతులు జోడించుకొని యిట్లనియె: "తండ్రీ! బ్రహ్మవలన నాకిష్టమైన వరములను పొందితిని గాని, యతఁడు నాకు నివసించుటకుఁ దగినస్థలమేర్పాటు చేయకపోయెను. కావున నేప్రాణికిని బాధకరము గాకుండ నుండెడి యొకానొక నివాసము నాకొఱకుఁ జూడుము." అని యిట్లు కుమారుఁడు చెప్పినమాటలు విని విశ్రవోబ్రహ్మ సంతోషించుచు నిట్లనియె: "వత్సా! చెప్పెదను వినుము. దక్షిణసముద్రతీరమునందుఁ ద్రికూటమను పేరుగల పర్వతము గలదు. దానిపైని దేవేంద్రుని యమరావతివలెనే విశ్వకర్మచే నిర్మింపఁబడి విశాలమైన లంకయను పేరుగల పట్టణ మొకటి యున్నది. అది మిక్కిలి రమణీయమైనది. అది మొదట రాక్షసులనిమిత్తము నిర్మింపఁబడినది. నీ వాలంకాపట్టణమునకుఁబోయి సుఖముగా నుండుము. ఆపట్టణము బంగారుప్రాకారములు పరిఘలు గలది. యంత్రములతోడను శస్త్రములతోడను గూడియున్నది. బంగారునఁ బొదివిన వైడూర్యములుగల తోరణములు గలది. అదియే మిక్కిలి చక్కని పట్టణము. పూర్వము విష్ణుమూర్తికి భయపడి రాక్షసు లాపట్టణమును విడిచి పాతాళలోకమునకుఁ బోయిరి. ఇప్పు డాపట్టణము జనశూన్యమైయున్నది. దాని కెవ్వఁడును ప్రభువు లేఁడు. కావున; నాయనా! నీ వాపట్టణములోఁ బ్రవేశించి సుఖముగా నుండుము. నీ కచ్చటివాసము నిర్దోషమైనది. అచ్చట నెవ్వరికిని నేవిధమైన బాధయు నుండదు." అని తండ్రిచెప్పినమాటలు విని వైశ్రవణుఁడు వెంటనే త్రికూటపర్వతముపైనున్న లంకాపట్టణమునకుఁ బోయి వేలకొలఁది నైరృతులు మొదలగు వారితోఁగూడ నందు నివసించెను. ఆతనిశాసనమువలన వారందఱును మిక్కిల సంతోషించుచు నందుండిరి. నైరృతిశ్రేష్ఠుఁడును ధర్మాత్ముఁడును నగు నావైశ్రవణుఁడు సముద్రమే యగడ్తగాఁగల యాలంకాపురములో

సుఖముగాఁ గాపురముండి యప్పుడప్పు డప్పుష్పకవిమానము నెక్కి వచ్చి తల్లిదండ్రులను జూచి పోవుచుండెడివాఁడు. ఇట్టు లాధనాధిపతియగు వైశ్రవణుఁడు దేవతలు, గంధర్వులు మొదలగువారిచే స్తుతిచేయఁబడు చున్నవాఁడును, అప్సరసలనృత్యములచేత నలంకరింపఁబడిన యాలయ ములు గలవాఁడును నై కిరణములచేత సూర్యుఁడు వెలుఁగుచున్నట్లు వెలుఁగుచుఁ దండ్రియొద్దకు వచ్చుచుఁ బోవుచు నుండెడివాఁడు.

## 4-వ సర్గము

### మాల్యవదాదుల చరిత్రము

శ్రీ అగస్త్యుఁడు చెప్పిన కథ విని పూర్వము "లంకలో రాక్షసు లెట్లు పుట్టిరి?" యని యాశ్చర్యపడి శిరస్సు కంపింపఁజేసి త్రేతాగ్నితో సమానమై వెలుఁగుచున్న దేహముగల యగస్త్యునివైపు మాటిమాటి కిని జూచుచుఁ జిఱునగవు మొగము నలంకరింప శ్రీరామచంద్రుఁ డిట్ల నియె: "మహాత్మా! పూర్వముకూడ నాలంకలో రాక్షసు లుండెడి వారని యిప్పుడు తాము సెలవిచ్చినసంగతి విన్నప్పటినుండియు నాకు మిక్కిలి యాశ్చర్యము గలుగుచున్నది. ఇదివఱకు రాక్షసులు పులస్త్య వంశములోఁ బుట్టినవా రనియే నేను వినియున్నాను. అంతకు ముందు కూఁడ నెందఱెందఱో రాక్షసు లున్నట్లు తా మిప్పుడు సెలవిచ్చితిరి. అటులేని యారాక్షసులు రావణుఁడు, కుంభకర్ణుఁడు, ప్రహస్తుఁడు, వికటుఁడు, రావణునికొడుకులు మొదలగువారికంటెను బలవంతులా? వారికి మూలపురుషుఁ డెవఁడు? వానిపే రేమి? వానిబల మెట్టిది? వారేమి యపరాధ మొనరించి రని విష్ణుమూర్తి వారి నచ్చటినుండి వెడలఁ గొట్టెను? ఈసంగతియంతయు విస్తరించి నాకుఁ జెప్పవలయును. సూర్యుఁడు చీఁకటిని బోఁగొట్టునట్లు తాము నాసందేహమును బోఁగొట్టుదురుగాక!" అని యిట్లడిగిన శ్రీరాముని వాక్యములు విని కొంచెము నవ్వుచు సంస్కారాలంకృతవాక్చాతుర్యధురీణుఁడగు నారామునితో నగస్త్యుఁ డిట్లనియె:

పద్మసంభవుఁ డగు బ్రహ్మ పూర్వ ముదకములను సృజించి వానినిఁ గాపాడుటకై జంతువులను గొన్నింటిని సృజించెను. ఆజంతువు లాఁకలి దప్పికలచేతను భయముచేతను పీడింపఁబడినవై తమ్ము సృజించిన బ్రహ్మ

యొద్దకు వచ్చి వినయముగా నిలువఁబడి "యేమిచేయుదుము?" అని యడిగి నవి. ఆమాట విని బ్రహ్మ "మీ రీయుదకములను బ్రయత్నపూర్వక ముగా రక్షించుచుండుఁ"డని నవ్వుచు ననియె. అందుఁ గొన్ని సత్వముల రక్షింతుమనియు, మఱికొన్ని జక్షింతుమనియుఁ జెప్పినవి. ఇట్లాఁకలి గొనియు నాఁకలిగొనకయు నున్న సత్వములు చెప్పినమాటలు విని భూత కర్త యగు బ్రహ్మ వారిని జూచి "మీలో రక్షింతుమన్నవారు రాక్షసు లును, జక్షింతుమన్నవారు యక్షులును" నగుదురుగాక యనియెను.

ఆసత్వములలో రాక్షసాధిపతులును, మధుకైటభులతో సమాను లును, శత్రుసంహారకులును నగు హేతి ప్రహేతి యను సిద్ధ అన్నదమ్ములు గలరు. అయ్యిద్దఱిలోఁ బ్రహేతి ధర్మాత్ముఁడై తపస్సు చేసికొనుటకుఁ బోయెను. హేతియనువాఁడు పెండ్లిచేసికొనుటకై మిక్కిలి ప్రయత్నించు చుండెను. మహామతి యగునాహేతి తానే ప్రయత్నించి తనకు యముని చెల్లెలు, భయమును గలిగించునదియు నగుభయ యను పేరుగలదానిని బెండ్లియాడెను. రాక్షసశ్రేష్ఠుఁడగు నాహేతి యామెయందు విద్యు త్కేశుఁ డనునొకకుమారుని గనియెను. హేతికొడుకగు నావిద్యుత్కే శుఁడు ప్రచండసూర్యునితో సమానమైన కాంతిగలవాఁడై నీటిలోని పద్మమువలె వృద్ధిని బొందుచుండెను. అతనికి యౌవనము రాఁగానే తండ్రి పెండ్లిచేయుటకుఁ బ్రయత్నించెను. అట్లు ప్రయత్నించి హేతి సంధ్యయనుదానికూఁతును సంధ్యాసమప్రభావము గలదియు నగు సాల కటంకట యనుపేరు గలదానిని దనకోడలుగా నెంచుకొని వరించెను. "ఇది యితర ల కెవ్వరికైనను నీయఁదగినదియే కదా!"యని యాలోచించి యాసంధ్య తనకూఁతును విద్యుత్కేశున కిచ్చినది. విద్యుత్కేశుఁడను రాక్షసుఁడు సంధ్యకూఁతుం బెండ్లియాడి యామెతోఁగూడి శచీదేవితో నింద్రుఁడు క్రీడించుచుండునట్లు క్రీడించుచుండెను. కొన్నాళ్లకు సంధ్యకూఁతురు సాలకటంకటయనునది సముద్రమువలన మేఘపంక్తివలె విద్యుత్కేశుని వలన గర్భమును ధరించినది. తర్వాత నామె గంగ కుమారుని గన్నయట్లు మందరపర్వతప్రాంతమున నొక కుమారుని గన్నది. ఆమె విద్యుత్కేశుని రతియందాసక్తురాలై పుట్టినబిడ్డ నచ్చటనే విడిచి వచ్చి మగనితోఁ గ్రీడించుచుండుటకుఁ గొడుకుసంగతియే మఱచిపోయినది. తల్లి విడిచిపెట్టి పోయినతరువాత మేఘగర్జనతో సమానమైన స్వరముగలవాఁడును శర

తొల్లిటి సూర్యునికాంతివంటి కాంతిగలవాఁడును నగు నాశిశువు పిడికిలి నోటియందుంచుకొని మెల్లఁగా నేడువ మొదలిడెను. అంతటఁ బార్వతీ పరమేశ్వరులు వృషభవాహనముపైఁ గూర్చుండి యాకాశమార్గమునఁ బోవుచు నాశిశువుయొక్క రోదనధ్వని వినిరి. వెంటనే దయపుట్టి వారిద్దఱును దగ్గఱగా వచ్చి యేడ్చుచున్న శిశువును జూచిరి. అక్షయుఁడును నవ్యయుఁడును నగు మహాదేవుఁడా రాక్షసశిశువును దల్లితో సమానమైన యీడుగలవానినిగాను, చావులేనివానినిగాను జేసి పార్వతియొక్క సంతోషముకొఱకుఁగా నాకాశమునందుఁ బోవఁదగిన యొకపట్టణము నతనికి నొసఁగెను. అప్పుడు పార్వతియును రాక్షసులకు సద్యోగర్భము సద్యఃప్రసూతి తత్క్షణమే వయఃప్రాప్తి తల్లితో సమానమైనయీడుగలిగి యుండుటను వరముగా నిచ్చినది. తరువాతను వరప్రాప్తిచే గర్వించియున్న యాసుకేశుఁడను రాక్షసుఁడు ప్రభువగు నీశ్వరునివలన నైశ్వర్యసంతుష్టుఁడై యాకాశమార్గమున సంచరింపఁదగిన పట్టణమును పొంది దేవేంద్రునివలె సుఖముగా విహరించుచుండెను.

## 5-వ సర్గము

### మాల్యవదాదుల వృత్తాంతము

శ్రీరామచంద్రా! ఇట్లు సుకేశుఁ డను రాక్షసుఁడు వరములను బొందియున్నవాఁడనియు, ధర్మాత్ముఁడనియుఁ దెలిసికొని విశ్వావసునితో సమానకాంతిగల గ్రామణి యనుపేరుగల గంధర్వుఁడు దేవవతి యను పేరుగల తనకూఁతును రెండవలక్ష్మివలె మూఁడులోకములయందును బ్రసిద్ధమైనదానిని రూపయౌవనములుగలదానిని, రాక్షసలక్ష్మియోయనఁ దెచ్చి యథావిధిగా నాసుకేశునకిచ్చి పెండ్లిచేసెను. వరములు పొంది మహైశ్వర్యసంపన్నుఁడై యున్న పెనిమిటి, తన కిష్టమైనవాఁడు దొరకుటచే నాదేవవతి యనుసుందరి ధనము దొరికిన బీదవానివలె సంతోషించినది. అంజనపర్వతమునుండి బయటకు వచ్చిన యేనుఁగుగున్న యాఁడేనుఁగును గూడి సంతోషించుచుండునట్లాసుకేశుఁడా దేవవతితోఁ గూడి మిక్కిలి సంతోషించుచుండెను. శ్రీరామా! ఆసుకేశుఁ డనురాక్షసుఁడా దేవవతి యనుసుందరియందుఁ ద్రేతాగ్నిహోత్రములతో సమానముగా వెలుంగుచున్న ముగ్గురు కుమారులను గనియెను. వారికి మాల్య

యొద్దకు వచ్చి వినయముగా నిలువఁబడి "యేమిచేయుదుము?" అని యడిగి నవి. ఆమాట విని బ్రహ్మ "మీ రీయుదకములను బ్రయత్నపూర్వకముగా రక్షించుచుండుఁ"డని నవ్వుచు ననియె. అందుఁ గొన్నిసత్త్వముల రక్షింతుమనియు, మఱికొన్ని జక్షింతుమనియుఁ జెప్పినవి. ఇట్లాఁకలిగొనియు నాఁకలిగొనకయు నున్నసత్త్వములు చెప్పినమాటలు విని భూతకర్త యగుబ్రహ్మ వానిని జూచి "మీలో రక్షింతుమన్నవారు రాక్షసులును, జక్షింతుమన్నవారు యక్షులును" నగుదురుగాక యనియెను.

ఆసత్త్వములలో రాక్షసాధిపతులును, మధుకైటభులతో సమానులును, శత్రుసంహారకులును నగుహేతి ప్రహేతి యనునిద్దఱన్నదమ్ములు గలరు. అయిద్దఱిలోఁ బ్రహేతి ధర్మాత్ముఁడై తపస్సు చేసికొనుటకుఁ బోయెను. హేతియనువాఁడు పెండ్లిచేసికొనుటకై మిక్కిలి ప్రయత్నించుచుండెను. మహామతి యగునాహేతి తానే ప్రయత్నించి తుదకు యముని చెల్లెలు, భయమును గలిగించునదియు నగుభయ యనుపేరుగలదానిని బెండ్లియాడెను. రాక్షసశ్రేష్ఠుఁడగు నాహేతి యామెయందు విద్యుత్కేశుఁ డనునొకకుమారుని గనియెను. హేతికొడుకగు నావిద్యుత్కేశుఁడు ప్రచండసూర్యునితో సమానమైన కాంతిగలవాఁడై నీటిలోని పద్మమువలె వృద్ధిని బొందుచుండెను. అతనికి యౌవనము రాఁగానే తండ్రి పెండ్లిచేయుటకుఁ బ్రయత్నించెను. అట్లు ప్రయత్నించి హేతి సంధ్యయనుదానికూఁతును సంధ్యాసమప్రభావము గలదియు నగు సాలకటంకట యనుపేరు గలదానిని దనకొడుకునకు వరించెను. "ఇది యితరుల కెవ్వరికైనను నీయఁదగినదియే కదా!"యని యాలోచించి యాసంధ్య తనకూఁతును విద్యుత్కేశున కిచ్చినది. విద్యుత్కేశుఁడనురాక్షసుఁడు సంధ్యకూఁతుం బెండ్లియాడి యామెతోఁగూడి శచీదేవితో నింద్రుఁడు క్రీడించుచుండునట్లు క్రీడించుచుండెను. కొన్నాళ్లకు సంధ్యకూఁతును సాలకటంకటయనునది సముద్రునివలన మేఘపంక్తివలె విద్యుత్కేశుని వలన గర్భమును ధరించినది. తర్వాత నామె గంగ కుమారుని గన్నయట్లు మందరపర్వతప్రాంతమున నొక కుమారుని గన్నది. ఆమె విద్యుత్కేశుని రతియందు దాసక్తురాలై పుట్టినబిడ్డ నచ్చటనే విడిచి వచ్చి మగనితోఁ గ్రీడించుచుఁ దుదకుఁ గొడుకుసంగతియే మఱచిపోయినది. తల్లి విడిచిపెట్టి పోయినతరువాత మేఘగర్జనతో సమానమైన స్వరముగలవాఁడును శర

త్కాలసూర్యునికాంతివంటి కాంతిగలవాఁడును నగు నాశిశువు పిడికిటి నోటియందుంచుకొని మెల్లఁగా నేడువ మొదలిడెను. అంతటఁ బార్వతీ పరమేశ్వరులు వృషభవాహనముపైఁ గూర్చుండి యాకాశమార్గమునఁ బోవుచు నాశిశువుయొక్క రోదనధ్వని వినిరి. వెంటనే దయపుట్టి వారిద్దఱును దగ్గఱగా వచ్చి యేడ్చుచున్న శిశువునుఁ జూచిరి. అక్షయుఁడును నవ్యయుఁడును నగు మహాదేవుఁడా రాక్షసశిశువును దల్లితో సమానమైన యీడుగలవానినిగాను, చావులేనివానినిగాను జేసి పార్వతియొక్క సంతోషముకొఱకుఁగా నాకాశముమీఁదను బోవఁదగిన యొకపట్టణమును నతనికి దయచేసెను. అప్పుడు పార్వతికూడ రాక్షసులకు సద్యోగర్భము సద్యఃప్రసూతి తత్ క్షణమే వయఃప్రాప్తి తల్లితో సమానమైనయీడుగలిగి యుండుట వరముగా నిచ్చినది. తరువాతను వరప్రాప్తిచే గర్వించియున్న యాసుకేశుఁడను రాక్షసుఁడు ప్రభువగు శివునివలన నైశ్వర్య వంతుఁడై యాకాశమార్గమున సంచరింపఁదగిన పట్టణమును పొంది దేవేంద్రునివలె సుఖముగా విహరించుచుండెను.

## ౫-వ సర్గము

### మాల్యవదాదుల వృత్తాంతము

శ్రీరామచంద్రా! ఇట్లు సుకేశుఁడను రాక్షసుఁడు వరములను బొందియున్నవాఁడనియు, ధర్మాత్ముఁడనియుఁ దెలిసికొని విశ్వావసునితో సమానకాంతిగల గ్రామణి యనుపేరుగల గంధర్వుఁడు దేవవతి యను పేరుగల తనకూఁతును రెండవలక్ష్మివలె మూఁడులోకములయందును బ్రసిద్ధమైనదానిని రూపయౌవనములుగలదానిని, రాక్షసలక్ష్మియోయనఁ దెచ్చి యథావిధిగా నాసుకేశునకిచ్చి పెండ్లిచేసెను. వరములు పొంది మహైశ్వర్యసంపన్నుఁడై యున్న పెనిమిటి, తన కిష్టమైనవాఁడు దొరకుటచే నాదేవవతి యనుసుందరి ధనము దొరికిన బీదవానివలె సంతోషించినది. అంజనపర్వతమునుండి బయటకు వచ్చిన యేనుఁగుగున్న యాఁడేనుఁగును గూడి సంతోషించుచుండునట్లాసుకేశుఁడా దేవవతితోఁ గూడి మిక్కిలి సంతోషించుచుండెను. శ్రీరామా! ఆసుకేశుఁడను రాక్షసుఁడా దేవవతి యనుసుందరియందుఁ ద్రేతాగ్నిహోత్రములతో సమానముగా వెలుఁగుచున్న ముగ్గురు కుమారులను గనియెను. వారికి మాల్య

వంతుఁ డనియు, సుమాలి యనియు, మాలి యనియుఁ బేరు పెట్టెను. వారు ముగ్గురును బలవంతులు. ఆరాక్షసుఁడు గన్న యాముగ్గురును త్రినేత్రునిబోలు రూపముగలవారై మూఁడులోకములవలెను, మూఁడగ్నులవలెను, మూఁడుమంత్రములవలెను, ఘోరమైన మూఁడురోగములవలెను నిర్భయులై, భయంకరులై, సమయమును గనిపెట్టి చికిత్స చేయకుండ నుపేక్షించిన రోగములవలె వృద్ధినొందుచుండిరి.

వారు తమతండ్రి యీశ్వరునివలన వరములు పొందినసంగతి దెలిసికొని ముగ్గురును మేరుపర్వతమునకుఁ దపస్సు చేసికొనుటకై పోయిరి. శ్రీరామా! ఇట్లు వారు తపస్సు చేసికొనుటకు నిశ్చయించుకొని ఘోరమయిన నియమముల నవలంబించి సమస్తభూతములకును భయము గలుగునట్టుగా ఘోరమైన తపస్సును జేయుచుండిరి. సత్యము ఆర్జవము, శమము మొదలగు గుణములతోఁ గూడినవియు నితరులచేఁ జేయ శక్యముగానివియు నగువారితపస్సులచే మూఁడులోకములవారికిని సంతాపము గలుగ మొదలిడెను. అప్పుడు చతుర్ముఖుఁడు విమాన మెక్కి వచ్చి "మీతపస్సులకు మెచ్చితిని మీకు వరముల నిచ్చెద" నని పలికెను. ఇంద్రాదిదేవతలతోఁ గూడి వర మిచ్చుటకు వచ్చిన బ్రహ్మను జూచి యా ముగ్గురును జేతులు జోడించుకొని గాలిచేఁ గదలుచున్న వృక్షములవలె నెదుట నిలువఁబడి యిట్లని విన్నవించిరి: "దేవా! మాతపస్సులచే నీకు సంతోషము గలిగి మాకు వరము లిచ్చుటకై వచ్చినచో మాయుద్దేశములు విన్నవించెదము వినుము. మే మెవ్వరిచేతను బరాజయము నొందనట్లును, సకలశత్రువులను సంహరించునట్లును, దీర్ఘాయుష్మంతులుగ నుండునట్లును, ప్రభవిష్ణులగునట్లును మాకు వరములు దయచేయవలయు" నని కోరఁగా బ్రాహ్మణులయందుఁ బ్రీతిగల యాబ్రహ్మ మీకోరినప్రకారమే వరముల నిచ్చితి నని చెప్పి సత్యలోకమునకుఁ బోయెను.

రామా! ఇట్లు వారు ముగ్గురును బ్రహ్మవలన వరములుపొంది యేవిధమయిన భయమును లేక మూఁడులోకములవారిని బాధింప మొదలిడిరి. వారిచే బాధింపఁబడుచున్న దేవతలు, ఋషులు, సిద్ధులు, సాధ్యులు, చారణులు మొదలగువారు నరకమునందలి జీవులవలె రక్షకుని గానలేకపోయిరి. తరువాత నాముగ్గురు రాక్షసులును శిల్పిశ్రేష్ఠుఁ

డగువిశ్వకర్మను బిలిపించి యిట్లనిరి: "ఓయీ విశ్వకర్మా! ఓజస్సుచేతను, తేజస్సుచేతను, బలముచేతను గొప్పవారనిపించుకొనుచున్న దేవతలకు గృహములు నిర్మించి యిచ్చినవాఁడవు నీవేయని తెలియవచ్చుచున్నది. కావున మాకుఁగూడ మంచుకొండమీఁదనుగాని మేరుపర్వతముపైఁ గాని మందరపర్వతమునందుఁగాని మహేశ్వరుని గృహముతో సమానముగా మనోహరమైన గృహమును సిద్ధముచేయుము." ఇట్లు చెప్పిన రాక్షసులమాటలు విని విశ్వకర్మ యిట్లనెను: "రాక్షసేశ్వరులారా! దక్షిణసముద్రతీరమునఁ ద్రికూటమనియు, సువేలమనియు రెండుపర్వత ములు గలవు. మేఘములతో సమానమైనదియు, పక్షులైనను చేరుటకు వీలుకానిదియు, ఉలులచేఁజెక్కి నలుమూలలు దీర్చఁబడినదియు నగు నా త్రికూటపర్వతముయొక్క మధ్యమశిఖరమునందు ముప్పది యోజనముల విస్తీర్ణమును, నూఱుయోజనముల పొడవును, బంగారుప్రాకారములచేఁ జుట్టఁబడినదియు, స్వర్ణతోరణములచే నావరింపఁబడినదియు నగు లంకా పట్టణమును రెండవస్వర్గపట్టణమువలెనే దేవేంద్రుని యాజ్ఞాప్రకారము నేను గట్టియుంచితిని. మీరా పట్టణమునకుఁబోయి నివాస మేర్పఱచు కొనుఁడు. ఇంద్రాదిదేవతలు స్వర్గపట్టణమందున్నట్లు మీరును జాలమంది రాక్షసులతోఁగూడి యాలంకాదుర్గములో నుండిరేని మిమ్మెవ్వరును వేఁజీచూడఁజాలరు.

ఇమ్మట నారాక్షసోత్తములు విశ్వకర్మ చెప్పినమాటలు విని చాల సంతోషించి వేలకొలఁది పరిజనులను వెంటఁబెట్టుకొని యాలంకాపుర ములోఁ బ్రవేశించిరి. దృఢమైన ప్రాకారములు పరిఖలు గలిగి బంగారు మయములైన గృహములు గలిగి యొప్పారుచున్న యాలంకాపురి వారి కమందమైన యానందమును గూర్చినది. ఇట్లుండఁగా నింతట నర్మదయను గంధర్వస్త్రీకి హ్రీ, శ్రీ, కీర్తులతో సమానమయిన కాంతిగల ముగ్గురు కూఁతుండ్రుండెడివారు. ఆమె తన ముగ్గురుకూఁతుండ్రను దెచ్చి పెద్ద వానికిఁ బెద్దకూఁతును, రెండవవానికి రెండవకూఁతును, మూఁడవవానికి మూఁడవకూఁతును నిచ్చి మఖానక్షత్రముతో గూడుకొనిన మంచి ముహూర్తమునందుఁ బెండ్లిచేసినది. సుకేశునికుమారులగు నామాల్య వంతుఁడు సుమాలియు మాలియు దేవత లచ్చరలతోవలె నీముగ్గురి తోడను నిచ్చకువచ్చినమచ్చున విహరించుచుండిరి. తరువాత మాల్య

వంతునిభార్యయగు సుందరి యను పేరుగల సుందరికి వజ్రముష్టి, విరూపాక్షుఁడు, దుర్ముఖుఁడు, సుప్తఘ్నుఁడు, యజ్ఞకోపుఁడు, మత్తుఁడు, ఉన్మత్తుఁడు నను నేడుగురుకొడుకులును, అనలయనుపేరుగల కూఁతురును బుట్టిరి. పున్నపుచందమామతో సమానమైన ముఖముగల సుమాలి పెండ్లముపేరు కేతుమతి. ఆమె వానికిఁ బ్రాణములకంటెను నధికప్రియురాలు. సుమాలివలన నాకేతుమతియందుఁ గలిగిన సంతానముపేర్లు చెప్పెద నాలింపుము- ప్రహస్తుఁడు, అకంపనుఁడు, వికటుఁడు, కాలకార్ముకుఁడు, ధూమ్రాక్షుఁడు, దండుఁడు, సుపార్శ్వుఁడు, సంహ్రాదె, ప్రఘసుండు, భాసకర్ణుఁడు నను కొడుకులును, రాక, పుష్పోత్కట, శుచిస్మిత యగు కైకసి, కుంభీనస యను కుమార్తెలును బుట్టిరి. మాలి యను రాక్షసునిభార్య పేరు వసుధ. ఆమె మిక్కిలి రూపసి. తామరరేకులవంటి కన్నులు గలది. స్వకీయగు యక్షసుతవలె నెంతయుఁ జక్కనిది. మాలి కాయువతియందుఁ బుట్టినసంతతిసంగతి చెప్పెదను వినుము. అనిలుఁడు, అనలుఁడు, హరుఁడు, సంపాతి యను నలుగురుకుమారులుమాత్రము పుట్టిరి. వీరే విభీషణుని నలుగురుమంత్రులును నైరి. ఇట్లా రాక్షసశ్రేష్ఠులు ముగ్గురును బుత్రులతోడను దక్కిన రాక్షసులతోడను గూడినవారై యింద్రాదిదేవతలను, ఋషులను, నాగులను, దానవులను బాధించుచుండిరి. వారు బాహుబలముచే గర్వించి యెవ్వరికిని లొంగక గాలివలె నెక్కడఁ జూచినను దామే యై రణభూమిలో శత్రువులను జయించుచు మృత్యువును గూడ లక్ష్యము సేయక సమస్త యజ్ఞములను నాశమునొందించుచు వరగర్వితులై తిరుగుచుండెడివారు.

## 6-వ సర్గము

### సురలు మునులు శివుని రాక్షసులఁ జంపవేఁడుట

శ్రీరామచంద్రా! ఈరీతిగా బాధింపఁబడినవారై దేవతలు, తపోధనులగు ఋషులును భయార్తులై దేవదేవుఁడును, మహేశ్వరుఁడును, జగత్తులను బుట్టించుచుఁ బెంచుచు నశింపఁజేయుచు నుండెడివాఁడును, పుట్టువు లేనివాఁడును, స్పష్టముగాని రూపము గలవాఁడును, సమస్త లోకములకును నాధారభూతుఁడును, అందఱచేతను ఆరాధింపఁదగినవాఁడును, పరమగురువును మన్మథుని సంహరించినవాఁడును, త్రిపురా

సురలను నశింపఁజేసినవాఁడును, మూఁడుకన్నులు గలవాఁడును అగు నీశ్వరుని శరణుచొచ్చి చేతులు జోడించుకొని భయముతో గద్గదస్వర మున నిట్లనిరి :

"సమస్తమైన ప్రజలకును అధ్యక్షుఁడవగు నోశంకరా! బ్రహ్మదేవుని వరములవలన గర్వించి శత్రుసంహారము చేయఁబూనిన సుకేశునికొడు కులు సమస్తప్రజను బాధించుచున్నారు. మాయాశ్రమములు మాయిండ్లు శూన్యముగాఁ జేసివైచిరి. స్వర్గమునుండి దేవతలను దరిమివైచి వారే దేవతలవలె స్వర్గములో విహరించుచున్నారు. మాల్యవంతుఁడు, మాలి, సుమాలియు నేనే విష్ణువను, నేనే రుద్రుఁడను, నేనే బ్రహ్మను, నేనే దేవేంద్రుఁడను, నేనే యముఁడను, నేనే వరుణుఁడను, నేనే చంద్రుఁ డను, నేనే సూర్యుఁడను అని మమ్ముల నందఱను బాధించుచున్నారు. వారెప్పుడు చూచినను యుద్ధసన్నద్ధులై కనుపట్టుచున్నారు. మఱియు వారియనుచరులును నట్లే బాధించుచున్నారు. దేవా! భయార్తులమగు మా కభయదానము దయచేయుము. భయంకరమైనశరీరము నవలంబించి దేవాదులను బాధించు నారాక్షసులను జంపుము." అని యిట్లు దేవతలు మొదలగువారు విన్నవింపఁగా నాయీశ్వరుఁడు సుకేశునియందలి పక్ష పాతముచే దేవతలతో నిట్లనియె :

" ఓదేవతలారా! మహర్షులారా! నేను వారిని జంపఁజాలను. మఱియు నారాక్షసులు నాచేఁ జచ్చువారును గారు. కాని వారిని జంపు నుపాయమును మీకుఁ జెప్పెదను. నాయాలోచనప్రకారముగా మీ రందఱును విష్ణుమూర్తిని శరణు పొందుఁడు. ప్రభువగు నాయన వారిని దప్పక చంపఁగలఁడు." అని యుపాయమును జెప్పఁగానే రాక్షసులభయ ముచేఁ బీడితులయినదేవత లందఱును జయజయశబ్దములచే నీశ్వరుని గొనియాడి విష్ణునిసమీపమునకుఁ బోయిరి. ఇట్లు పోయి శంఖచక్రగదా ధరుఁడగు నావిష్ణుదేవునికి నమస్కరించి తొట్రుపాటుపడుచు నారాక్షసు లనుగూర్చి యిట్లు విన్నవించిరి : " దేవా! త్రేతాగ్నిహోత్రములతో సమానులగు సుకేశునికొడుకులు ముగ్గురును బ్రహ్మవరముచే గర్వించి మాస్థానముల నాక్రమించికొనిరి. త్రికూటపర్వతపు శిఖరమునందు లంక యను పట్టణము గలదు. అది చొరశక్యముగానిది. ఆరాక్షసు లాలంక లో నుండి మమ్ములనందఱను బాధించుచున్నారు. మధుసూదనా! నీవు

మామేలుకొఱకా రాక్షసులను జంపుము. దిక్కులేని మేము నిన్ను
శరణు వొచ్చితిమి. నీవే మాకు దిక్కు. నీ చక్రముచే వారిశిరస్సులను
ఖండించి యముని కప్పగించుము. భయము గలిగినప్పు డభయమిచ్చువాఁడు
నీకంటె మాకు వేఱుగాలేఁడు. గర్వించి మమ్ములను బాధించుచున్న యా
దురాత్ములను సపరివారముగాఁ జంపి, సూర్యుఁడు మంచును మాయించు
నట్లు మాభయమును మాయింపుము".

ఈరీతిగా దేవతలందఱును విన్నవింపఁగావిని దేవదేవుఁడగు విష్ణు
మూర్తి శత్రువులను జంపెదనని దేవతల కభయమిచ్చి యిట్లనియె: "దేవ
తలారా! ఈశ్వరుఁ డిచ్చినవరముచే గర్వించి యున్న సుకేశుఁడను రాక్ష
సు నెఱుఁగుదును. వానికొడుకులు ముగ్గురినిగూడ నే నెఱుఁగుదును.
వారిలో మాల్యవంతుఁడు పెద్దవాఁడు. మర్యాద నతిక్రమించియున్న
యారాక్షసుల నందఱను నేను జంపెదను. నాకును గోపము వచ్చినది.
మీ రింక భయపడక యుండుఁడు." ప్రభవిష్ణుఁడగు విష్ణుఁ డీరీతిగాఁ
జెప్పఁగానే సంతోషించి దేవతలందఱును విష్ణుమూర్తిని గొనియాడుచుఁ
దమతమనివాసములకుఁ బోయిరి.

ఇచ్చట లంకలో మాల్యవంతుఁడు దేవతలప్రయత్నమునువిని వీరు
లగు తనతమ్ములతో నిట్లనియె: "తమ్ములారా! దేవతలును, ఋషులును
గలిసి మనచావును గోరుచు శివునిపాలికిఁ బోయి యిట్లు విన్నవించిరఁట:
'దేవా! శంకరా! సుకేశునితనయులు వరదానబలముచే గర్వించి మాటి
మాటికిని మమ్మును బాధించుచున్నారు. వారు మహాఘోరరూపులు. ఆ
రాక్షసులు చేయునల్లరి సహింపశక్యము గాకుండ నున్నది. ఆదురాత్ములకు
భయపడిమామాస్థానములను విడిచిపెట్టితిమి. కావున నో త్రినేత్రా! మా
మేలుకొఱకా రాక్షసులను జంపుము. శత్రువులను దహించుటలో నీవంటి
దేవుఁడు లేఁడు. కావున నారాక్షసుల నొక్కహుంకారముచే దహించుము'
అని యిట్లు దేవతలు మొఱ్ఱలిడఁగా నంధకసంహార మొనరించినశివుఁ
డాలకించి చేతులు శిరస్సు కంపింపఁజేయుచు వారితో నిట్లనెనఁట: 'దేవత
లారా! సుకేశునికొడుకులను నేను యుద్ధములోఁ జంపఁజాలను. ఎవ
రారాక్షసులను జంపఁగలరో వారిని జెప్పెదను. నాయాలోచన విని మీ
రాయనదగ్గఱకుఁ బొండు. విష్ణుమూర్తి వారిని జంపఁగలఁడు. కావున
మీ రాతనిపాలికిఁ బొండు' అని యాలోచనచెప్పిన శివునికి నమస్కరించి

విష్ణునియొద్దకుఁబోయి సర్వమును విన్నవించినారఁట! అతఁడును మనల నందఱను జంపెద నని వారికి నభయము నిచ్చెనఁట! భయభీతులగు దేవతలనిమిత్తమై మనలను జంపుటకు విష్ణుఁడు ప్రతిజ్ఞ పట్టియున్నాఁడఁట! కావున ముందుసంగతి యాలోచింపవలసియున్నది. అతఁడు హిరణ్యకశిపుఁడు మొదలైన రాక్షసులను జంపియున్నవాఁడు. నముచి, కాలనేమి, వీరసత్తముఁడగు సంహ్రాదుఁడు, మహామాయామహాంధకుఁడగు రాధేయుఁడు, యమళార్జునులు, హార్దిక్యుఁడు, శుంభుఁడు, నిశుంభుఁడు మొదలగువారును, మఱియుఁ బరాజయ మన నెట్టిదో యెఱుఁగనివారును, వందలకొలఁది యజ్ఞములు చేసినవారును, సర్వాస్త్రకుశలులును, శత్రుభయంకరులును, మహాబలవంతులును, మాయావులును అగు రాక్షసుల నెందఱనో యుద్ధములలోఁ జంపియున్నాఁడు. ఈసంగతియంతయు నాలోచించి యిప్పుడు మనము చేయవలసినదానిని జేయుట యుక్తము.

ఇట్లు చెప్పిన మాల్యవంతుని మాటలు విని మాలి సుమాలియు నశ్వినీదేవతలు దేవేంద్రునితో నన్నట్లుగా నిట్లనిరి: "మనము బాగుగాఁ జదువుకొంటిమి. దానములు చేసితిమి. యజ్ఞము లెన్నేని జేసితిమి. వలసినంత యైశ్వర్యమును బొంది పరిపాలించితిమి. నిరామయమగు నాయువును సంపాదించుకొంటిమి. తీర నెట్టి శక్యముగాని దేవసముద్రమును శస్త్రములతో నవగాహించితిమి. నిరాయుధులను శత్రువులను జయించితిమి. కనుక మనకు మృత్యువువలన భయములేదు. నారాయణుఁడు గాని, రుద్రుఁడు గాని, దేవేంద్రుఁడు గాని, యముఁడు గాని మనయెదుటికివచ్చి నిలువఁబడఁజాలరు. ఎప్పుడును మన కందఱకును భయపడుచునే యుందురు. రాక్షసేశ్వరా! విష్ణువకు మనమీఁద ద్వేషము గలుగుటకుఁ గారణ మొకింతయుఁ గానరాదు. దేవతలే మనపైని లేనిపోనిమాటలు చెప్పి విష్ణునిమనస్సును బాడుచేసియుందురు. కనుక మనమిప్పుడు సైన్యసమేతులమై బయలుదేఱి దేవతలనే హింసింతము. వారేకదా మనపైని విష్ణున కింత ద్వేషమును గలుగఁజేసినవారు."

బలవంతులగు నారాక్షసు లిట్లాలోచించుకొని తమయేర్పాటును జాటించి సైన్యసమేతులై జంభవృత్రబలాసురులవలె యుద్ధముచేయు తాత్పర్యముతో స్వర్గమువైపునకు బయలుదేఱిరి. రామా! వారు బయలుదేఱునపుడు గొప్పగొప్పరథములు, కొండలవంటి యేనుఁగులు,

గుఱ్ఱములు, గాడిదలు, వృషభములు, ఒంటెలు, శింశుమారములు, పాములు, మొసళ్లు, తాఁబేళ్లు, చేఁపలు, గరుత్మంతునితో సమానమైన పక్షులు, సింహములు, పెద్దపులులు, వరాహములు, సృమరమృగములు, చమరమృగములు మొదలగు వాహనములు సిద్ధపఱుచుకొని లంకా పట్టణమును విడిచి రాక్షసులందఱును బలగర్వితులై దేవలోకమును ముట్టడించుటకుఁ బ్రయాణమైరి. వారు ప్రయాణము కాఁగానే లంకకుఁ జేటు మూడుననని లంకలోనుండు భూతములన్నియుఁ భయమునుజూపుచుఁ గలఁతఁజెందియుండినవి. వేలకొలఁది లక్షలకొలఁది కోట్లకొలఁది రాక్షసులు తమతమవాహనము లెక్కి వేగముగాఁ బ్రయత్నపూర్వకముగా దేవలోకమునకుఁ బోవుచుండిరి. రాక్షసులతోడనే లంకలోని దైవతములన్నియుఁ దొలఁగిపోయినవి. కాలముచేఁ బ్రేరేపింపఁబడి భూతములు మిక్కిలి భయమును జూపింప మొదలిడినవి. రాక్షసులకు వినాశమును దెల్పుచు భూమియందును, అంతరిక్షమునందును భయంకరముగా నుత్పాతములు బయలుదేఱినవి. మేఘములు వేఁడివేఁడిరక్తమును, ఎముకలను వర్షింపమొదలిడినవి. సముద్రములు పొంగి చెలియలిగట్టు దాఁటినవి. పర్వతములు కదలఁజొచ్చినవి. జీవజంతువులు ఘోరమైన రూపములను ధరించి ప్రళయకాలపు మేఘములతో సమానమైనధ్వనితో మిక్కిలిగా నట్టహాసములుచేయుచు నక్కలు దారుణముగాఁ గూయ మొదలిడినవి. క్రమముగా భూతములువచ్చి పడుచున్నట్టు కనుపట్టుచున్నవి. గ్రద్దలు గుంపులు గూడి నోటినుండి యగ్నిహోత్రకణములనుమియుచు రాక్షసులమీఁదుగా నాకాశమునందుఁ గొఱకచ్చు త్రిప్పినట్లు తిరుగుచున్నవి. కపోతములు, రక్తపాదములనుపక్షులు, గోరవంకలు భయపడి పాఱిపోవుచున్నవి. కాకులు, పిల్లులు మొదలగునవి యేడ్చుచున్నవి.

బలగర్వితులగు రాక్షసులు మృత్యుపాశములచేఁ గట్టుపడి యున్నవార లగుటంజేసి యాయపశకునములను లక్ష్యము సేయక ముందఱకు పోవుచునే యున్నవారు గాని వెనుకకు మరలరైరి. యజ్ఞముల కగ్నిహోత్రములవలె మహాబలవంతులగు మాల్యవంతుఁడు, మాలి, సుమాలి యను ముగ్గురన్నదమ్ములును తమసైన్యమునకు ముందఱగా నడుచుచున్నారు. దేవతలందఱును బ్రహ్మదేవుని నాశ్రయించుకొని యున్నట్లు రాక్షసు లందఱును మాల్యవత్పర్వతమువంటి మాల్యవంతు నాశ్రయిం

చుకొని యుండిరి. మాలి సేనానాయకుడుగా నున్న యారాక్షససైన్య మంతయుఁ బ్రళయకాలపు మేఘమువలె గర్జించుచు జయమును బొందు నిచ్ఛతో స్వర్గలోకమునకుఁ బోవుచుండెను.

ఇట్లు రాక్షసు లందఱును యుద్ధోద్యోగు లయి బయలుదేఱి రన్న సంగతి దేవదూతవలన విని ప్రభువగు నారాయణుఁడు యుద్ధమువిష యమై సంకల్పించెను. అతఁ డప్పుడే యాయుధముల నన్నింటిని సిద్ధము చేసికొని వేయిమందిసూర్యు లుదయించినట్లు వెలుఁగుచున్న కవచముఁదొ డిగికొని, బాణములతో నిండియున్న యమ్ములపొదులు గట్టుకొని,పీతాం బరము బాగుగా సవరించుకొని శంఖము, చక్రము, ఖడ్గము, గద, శార్ఙ్గ మనుధనుస్సు చేతఁ బట్టుకొని మేరుపర్వతమువలెఁ బ్రకాశించు గరుత్మం తునిపైని గూర్చుండి రాక్షససంహారముకొఱకై అతివేగముగా బయలు దేఱెను. పచ్చనివస్త్రములను గట్టుకొని వర్షాకాలమేఘమువలెఁ బ్రకాశిం చుచు గరుత్మంతునిమీఁదను గూర్చుండి వచ్చుచున్న యావిష్ణుమూర్తి మేరుపర్వతశిఖరముపై మెఱపుతోఁ గూడిన వర్షాకాలమేఘమువలెఁ గనుపట్టుచుండెను. ఆయన సిద్ధులు, దేవతలు, ఋషులు, పన్నగులు, గంధర్వులు, యక్షులు మొదలగువారిచేఁ గొనియాడఁబడుచు సమస్తా యుధములను ధరించి దేవసైన్యమును గలిసికొనెను. ఆయన రాఁగానే యారాక్షససైన్యమంతయు గరుత్మంతుని ఱెక్కల గాలిచేత క్షోభ పెట్టఁబడిన బలముగలదియు, గిరగిరఁ దిరుగుచున్న జెండాలుగలదియు, చెల్లాచెదరై పోయిన యాయుధములు గలదియునై కదలుచున్న రాళ్లు గల కాటుకకొండవలెఁ జలించినది. తరువాతను రక్తముచేతను బూయఁ బడిన ఱెక్కలు గలిగి ప్రళయకాలపుటగ్నివలె మండుచున్న యాకార ములుగల బాణములచేతను వేలకొలఁది రాక్షసులు విష్ణుమూర్తినిజుట్టు వాఱుకొని వివిధాయుధములతోఁ గొట్ట మొదలిడిరి.

## 7-వ సర్గము

### రాక్షసులతోడి యుద్ధము

శ్రీరామచంద్రా! ఆరాక్షసులు గర్జించుచుఁ బర్వతముపైని మేఘ ములు వర్షించినట్లు విష్ణుమూర్తిపైని బాణవర్షము గురిపించిరి. నల్లని

దేహములుగల యారాక్షసులు బాణవర్షమును గురియుచు శ్యామల
మూర్తియగు విష్ణుమూర్తి నావరించి యున్నప్పు డతఁడు వర్షించుచున్న
మేఘములచే నావరింపఁబడిన కాటుకకొండవలెఁ బ్రకాశించుచుండెను.
విస్తృష్టమైన క్షేత్రమునందు మిడుతలదండులు వాలెను, కొండపైని దోమల
వాలెను, [illegible] చొరఁగ వాలెను, సముద్రములో మొసళ్లు
వాలెను, పిడుగులకంటెను గాలికంటెను మనస్సుకంటెను వేగముగల రాక్ష
సులధనుస్సునుండి బయలువేడిన బాణములు ప్రళయాంతమునందు లోక
ములవలెనే యావిష్ణునియందుఁ బ్రవేశించినవి. రథికులు రథములమీఁదను,
హస్తిపకులేనుఁగులమీఁదను, అశ్వికులు గుఱ్ఱముల మీఁద నుండియు, కాలి
బంటులంతరాళమున నిలిచియు నీరీతిగా రాక్షసులు కొండలవంటివారు,
శక్తులు, ఋష్టులు, తోమరములు మొదలగు నాయుధములచేఁ బ్రాణాయా
మములు ద్విజుని కూపిరి యాడనీయనట్లు విష్ణుమూర్తి కూపిరి యాడ
నీయకపోయిరి. ఈరీతిగా రాక్షసులచేతఁ జేపలచే సముద్రుఁడు గొట్టఁ
బడినట్లుగాఁ గొట్టఁబడి, ధర్షింప శక్యముకాని యావిష్ణుమూర్తి తనశార్ఙ్గ
మనుధనుస్సు నెక్కుపెట్టి రాక్షసులపై బాణవర్షము గురిపింప నారంభిం
చెను. పిడుగులవలె నమోఘమైన ముఖములుఁ గలిగి మనస్సుకంటెను వేగ
ముగల బాణముల నాకర్ణాంతము లాగి ప్రయోగించి విష్ణుమూర్తి వేల
కొలఁది రాక్షసులశిరస్సులను ఖండించెను. వర్షాకాలపు గాలి మేఘములఁ
బరువెత్తించినట్లు బాణవర్షముచే రాక్షసులను బరువులెత్తించి పురుషో
త్తముఁడగు విష్ణుమూర్తి పాంచజన్యమను పేరుగల శంఖమూఁదెను.
విష్ణుమూర్తి తనయావచ్ఛక్తిని వినియోగపఱచి యూఁదిన శంఖరాజము
భయంకరమైనధ్వని గలదై మూఁడులోకములను బీడించుచున్నట్లు
కనుపట్టినది. అడవిలో సింహము మదించినయేనుఁగులను దనధ్వని
చేతను భయపెట్టినట్లు, శంఖనాదము తనధ్వనిచేతను రాక్షసులను
భయపెట్టినది. ఆశంఖము చప్పుడు వినఁగానే బలముచెడి గుఱ్ఱ
ములు నిలువఁబడఁజాలకపోయినవి. ఏనుఁగులమద మణఁగిపోయినది.
వీరులు రథములనుండి క్రిందఁబడిపోయిరి. పిడుగులవలె నమోఘమైన
నోళ్లతో శార్ఙ్గమనుధనుస్సునుండి బయలుదేఱిన బాణము లారాక్ష
సులను ఛేదించుకొని పుంఖములతోఁ గూడ భూమిలోఁ దూఱిపోయి

నవి. విష్ణుమూర్తి ప్రయోగించిన బాణములచేఁ జంపఁబడి వజ్రము చేఁ గొట్టఁబడిన కొండలవలె రాక్షసులు భూమిమీఁదఁ బడిపోయిరి. విష్ణుమూర్తి చక్రముచే నఱకఁబడిన రాక్షసుల దేహములనుండి కొండల నుండి స్వర్ణధాతులవలె రక్తము స్రవింప మొదలిడినవి. శంఖరాజము యొక్క ధ్వనియు, శార్ఙ్గమను ధనస్సుయొక్క ధ్వనియు, వైష్ణవధ్వనియు రాక్షసులు చేయు ధ్వనిని మ్రింగివేయుచుండెను. మఱియు నా విష్ణు మూర్తి వదలుచున్న వారి శిరస్సులను, జెండాలను, బాణములను, ధనుస్సులను, రథములను, అక్షులు పొడుగుగల బాణములచేఁ దెగఁగొట్టి క్రిందఁ బడవైచుచున్నాఁడు. సూర్యునినుండి ఘోరమైనకిరణములు, సముద్రము నుండి తరఁగలు, పర్వతమునుండి నాగేంద్రములు, మేఘమునుండి వర్షధారలు బయలుదేఱినట్లు విష్ణుమూర్తి చేతిలోనున్న శార్ఙ్గమను ధనస్సునుండి బయలుదేఱుచున్న బాణములు వేగముగా వేలకొలఁది రాక్షసులను బరుగులెత్తించుచుండినవి. శరభమృగముతో సింహములవలెనే, సింహముతో నేనుఁగులవలెనే, యేనుఁగుతో వ్యాఘ్రములవలెనే, పెద్ద పులితోఁ జిఱుతజంతువులవలెనే, చిఱుతపులితోఁ గుక్కలవలెనే, కుక్కతోఁ బిల్లులవలెనే, పిల్లితోఁ బాములవలెనే, పాముతో నెలుకలవలెనే ప్రభవిష్ణుఁడగు విష్ణుమూర్తితో యుద్ధము సేయఁజాలక కొందఱు రాక్షసులు పాఱిపోవుచుండిరి. కొందఱు పాఱిపోయిరి. మఱికొందఱు భూమిమీఁదను బడిపోయిరి. ఈరీతిగా వేలకొలఁది రాక్షసులను జంపి మేఘమును దేవేంద్రుఁడు పూరించినట్లు విష్ణుమూర్తి శంఖమును పూరించినవాఁడాయెను. విష్ణుమూర్తి బాణముల దెబ్బలకును శంఖముయొక్క ధ్వనికిని భయపడి నిలువఁజాలక రాక్షసబలమంతయు లంకవైపు పారిపోవుచుండెను. విష్ణుమూర్తిచే దెబ్బలు దిని తనసైన్యము పాఱిపోవుచుండుట చూచి సుమాలి యనువాఁడు బాణములను వర్షించుచు విష్ణుమూర్తిని వారింప మొదలిడెను. తుదకు వాఁడు విష్ణుమూర్తిని బాణములచేతను మంచు సూర్యునిగప్పినట్టు గప్పెను. అది చూచి సత్వసంపన్నులగు రాక్షసులు మరల ధైర్యము నవలంబించిరి.

పిమ్మట నారాక్షసుఁడు బలముచే గర్వించి రాక్షసులకు జీవములు వచ్చునట్లు సింహనాదములు సేయుచు వచ్చి విష్ణుమూర్తి నెదుర్కొనెను.

ప్రేలాడుచున్న యాభరణములు గల తుండమును మీఁదికెత్తి జాడించు
నేనుఁగువలెను, మెఱుపులతోఁగూడిన మేఘమువలెను సంతోషముచే నా
రాక్షసుఁడు ధ్వని చేసెను. ఇట్లు సుమాలి అంకెలువైచుచుండఁగా వాని
రథసారథియొక్క శిరస్సును కుండలములచేఁ వెలుఁగొందుచున్నదానిని
విష్ణుమూర్తి తెగఁగొట్టెను. వానిగుఱ్ఱములు గిరగిరఁదిరుఁగ సాగినవి.
భ్రాంతములైన యాగుఱ్ఱములచేతను బలుతెఱఁగులుగాఁ బరువులెత్తుచున్న
యింద్రియములను గుఱ్ఱములచే ధైర్యము లేని మనుష్యుఁడు త్రిప్పఁబడు
చున్నట్లు సుమాలి త్రిప్పఁబడుచుండెను. అట్లు సుమాలి రథము గుఱ్ఱ
ములచేత నిటునటు నీడ్వఁబడుచుండఁగా, విష్ణుమూర్తిరథమున కడ్డముగా
ధనుర్బాణములను పట్టుకొని మాలి పరుగెత్తెను. బంగారుచే నలంకరింపఁ
బడి మాలిధనుస్సునుండి వెలువడినబాణములు హంసలు క్రౌంచపర్వత
మునఁ బ్రవేశించినట్లు విష్ణుమూర్తియందుఁ బ్రవేశించినవి. అంతట నావిష్ణు
మూర్తి మాలిప్రయోగించినబాణములచే వేలకొలఁది దెబ్బలు తిన్నవాఁ
డయ్యు మనోవ్యాధులచే జితేంద్రియుఁడు కలఁత నొందనియట్లు కలఁత
నొందకుండెను. పిమ్మట శత్రుసంహారకుఁడును భూతభావనుఁడునునగు
విష్ణుభగవానుఁడు ధనుష్టంకారమును గావించి మాలిపైని బాణవర్షము
వర్షించెను. వజ్రముతోడను మెఱుపులతోడను సమానమైన యాబాణ
ములు వానిశరీరమునకుఁ దగిలి పాము లమృతమును పీల్చినట్లు వాని
రక్తమును పీల్చివైచినవి. శంఖచక్రగదాధరుఁడగు నావిష్ణుమూర్తి మాలిని
విముఖునిగాఁ జేసి వానికిరీటమును, జెండాను, ధనుస్సును, గుఱ్ఱములను
క్రిందఁ బడఁగొట్టెను. రాక్షసోత్తముఁడగు నామాలి విరథుఁడయ్యును
గద పట్టుకొని యారథమునుండి కొండమీఁదినుండి సింగపుఁగొదమ
గంతినట్లు క్రిందికిఁగంతెను. అంతకుఁ డీశానుని గొట్టినట్లు, దేవేంద్రుఁడు
వజ్రముతోఁ గొండను గొట్టినట్లు మాలి తన గదచే గరుడుని నుదుటి
మీఁదఁ గొట్టెను. అంత మాలిచే గదతో లెస్సగాఁ గొట్టఁబడినవాఁడై
గరుత్మంతుఁ డపుడు విష్ణుమూర్తిని మోసికొనుచునే యుద్ధరంగమునుండి
పాఱిపోయెను. ఇట్లు మాలిచేతను గరుత్మంతునిచేతను విష్ణుమూర్తిఁ బరా
ఙ్ముఖుఁడుకాఁగానే సంతోషించుచున్న రాక్షసులలో నొకగొప్పశబ్దము
బయలుదేఱినది. ఇట్లు సింహనాదములు చేయుచున్న రాక్షసులసంగతి
కనిపెట్టి విష్ణుమూర్తి చాలఁ గోపించినవాఁడై యడ్డముగా నాగరుడునిపైఁ

గూర్చుండి పరాఙ్ముఖుఁడయ్యును, మాలిని జంపఁగోరినవాఁడై చక్రమును ప్రయోగించెను. సూర్యమండలమువలె వెలుఁగుచున్న యాచక్రము తనకాంతిచే నాకసమును వెలిగింపఁజేయుచు వచ్చి కాలచక్రముకైనే మాలియొక్క శిరస్సును గ్రిందఁబడవైచెను. చక్రముచే నఱకఁబడి భయంకరమైన యారాక్షసునిశిరము పూర్వము రాహుశిరస్సువలెనే రక్తముఁ గ్రక్కుచుఁ గ్రిందఁబడెను. తరువాత దేవత లందఱును జాల సంతోషించి తమయావచ్ఛక్తిని వినియోగించి సాధువాదములు గావించిరి.

ఇట్లు మాలి పడిపోవుట చూచి సుమాలియు మాల్యవంతుఁడును సైన్యముతోఁగూడ దుఃఖించుచు లంకలోనికిఁ బరువెత్తిపోయిరి. గరుడుఁడు కొంతతడవునకు నేదఁదేరి మరల నెప్పటియట్ల యుద్ధభూమికై ప్రవర్తి కుపితుఁడై తన తెక్కలగాలిచే రాక్షసులను పఱిమెను. చక్రముచే శిరస్సులు తెగఁగొట్టఁబడినవారును, గదచే నలుగఁగొట్టఁబడిన వక్షఃస్థలములు గలవారును, నాగలిచేఁ బీడింపఁబడిన మెడలుగలవారును, రోఁకళ్ళచే గుండగొట్టఁబడిన తలలుగలవారును, కత్తులచే నఱకఁబడినవారును, మఱియు బాణములచేఁ గొట్టఁబడినవారు నగురాక్షసులు శీఘ్రముగా నాకాశము నుండి సముద్రములోఁ బడిపోయిరి. నారాయణుఁడు శార్ఙ్గమను ధనుస్సు నుండి పిడుగులవంటి బాణములను వర్షించి రాక్షసులను విదళించెను. ఆరాక్షససైన్యము గొడుగులు తెగిపోయి, చేతిలోనియస్త్రములు జాఱిపోయి, విష్ణునిబాణములచే వేషములు పోయి, ప్రేగులు పైకి వచ్చి భయమును గలిగించు చంచలనేత్రములు గలిగి పిచ్చిపట్టినట్లు కనఁబట్టుచుండెను. సింహములచేఁ బీడింపఁబడిన యేనుఁగులవలె నావిష్ణుమూర్తిచేఁ బీడింపఁబడిన రాక్షసులు కేకలును వేగమును నొక్కమాఱుగాఁ జెలరేఁగెను. విష్ణుమూర్తి ప్రయోగించిన బాణములచే నివారింపఁబడియు తమబాణములను విడుచుచు గాలికిఁ జిక్కి చెదరిపోవు మేఘములవలె రాక్షసులు పాఱిపోవుచుండిరి. చక్రప్రహారములచే శిరస్సులు తెగియు, గదాప్రహారములచే నొడలు పొడిచూర్ణమై, కత్తివ్రేట్లచే తునకలుగాఁ జేయఁబడియు రాక్షసులు కొండలవలె నేలఁ గూలుచుండిరి. వ్రేలాడుచున్న మణిహారకుండలములుగలిగి నల్లనిమేఘములవలెఁ బ్రకాశించుచున్న యారాక్షసులు పట్టముగాఁ గ్రిందఁబడి యుద్ధప్రదేశమును కాటుకకొండలతోఁ గప్పినయొప్పునఁ జేసివైచిరి.

## 8-వ సర్గము

### రాక్షసులు లంకకు బాఱిపోవుట

పద్మనాభుఁడగు విష్ణుదేవుఁ డీరీతిగా వెనుకనుండి తరుముకొని వచ్చుచుండఁగాఁ జెలియలికట్ట నతిక్రమించి సముద్రుఁడు వచ్చినట్లు మాల్యవంతుఁడు యుద్ధమునకు వచ్చెను. కోపముచేఁ గన్నులెఱ్ఱఁబడఁగాఁ గిరీటము కంపించుచుండఁగా నామాల్యవంతుఁడనురాక్షసుఁ డావిష్ణుమూర్తిని బిలిచి యిట్లనియెను: "నారాయణా! అనాదిగా వచ్చుచున్న క్షత్త్రధర్మము నెఱుఁగకపోతివి. అందుచేతనే పామరునివలె యుద్ధముచేయక పాఱిపోవుచున్న మమ్ములను వెంటాడించి కొట్టుచున్నావు. రాక్షసుఁడు గాకుండ గుండెను నెవ్వఁడు పరాఙ్ముఖులను జంపుటయను మహాపాతకము నాచరించునో వాఁ డీదేహమును విడిచినతరువాతను బుణ్యాత్ములు పొందగిన స్వర్గమునుగూర్చి పోఁజాలఁడని కదా ప్రాజ్ఞులు చెప్పుచుందురు. ఓయీ శంఖచక్రగదాధరా! నీకంతగా యుద్ధము సేయవలెనను శ్రద్ధయే యున్నయెడల నిదిగో నేనున్నాను రమ్ము. నీబలము చూచెదను జూపింపుము." ఇట్లుచెప్పి మాల్యవంతమను పర్వతమువలె నిశ్చలముగా నెదుట నిలువఁబడియున్న మాల్యవంతుఁడను రాక్షసునిజూచి విష్ణుమూర్తి యిట్లనియెను: "ఓయీ రాక్షసోత్తమా! మీవలన భయపడిన దేవతలకు మిమ్ములను జంపెదనని యభయదాన మిచ్చితిని. దానిని నేను బరిపాలించుకొనుచున్నాను. నేను నాప్రాణములచేతను గూడ దేవతలకు మేలు చేయుచుందును. మీరు పాతాళలోకములో డాఁగినను మిమ్ములను జంపక మానను." ఇట్లు కోపించి యెఱ్ఱతామరరేకులం బోలినకన్నులుగల విష్ణుమూర్తి చెప్పుచుండఁగనే మాల్యవంతుఁడు కోపించి శక్తియను నాయుధముచే విష్ణుమూర్తి వక్షఃస్థలముమీఁదను గొట్టెను. గంటలమ్రోఁతతోఁ గూడినయాశక్తి మాల్యవంతుని బాహువుచే విడువఁబడి విష్ణుమూర్తివక్షఃస్థలముమీఁదఁబడినదై మేఘముమీఁదనున్న మెఱుపువలె వెలుఁగుచుండెను. శక్తిధరప్రియుండగు నావిష్ణుమూర్తి యంతట నాశక్తినే తీసి మాల్యవంతునిపైకి విసరెను. కుమారస్వామి చేతితోఁ విడువఁబడిన శక్తివలెనే విష్ణుమూర్తి విసరినయాశక్తి కాటుకకొండనుగూర్చిపోయిన యింద్రశక్తివలె నారాక్షసునిగూర్చి పోయినది. ముత్యాలహారములు

మొదలగువానిచేఁ బ్రకాశించుచున్న విశాలమైన యతని వక్షఃస్థలముపై నాశక్తి కొండశిఖరముపైని పిడుగుపడినట్లు పడినది. ఆశక్తిదెబ్బ తగులఁగానే మాల్యవంతుఁడు కవచము భిన్నము కాఁగా మూర్ఛవోయి చాలతడవునకు మరలఁ దెలివి దెచ్చుకొని కొండవలె నిశ్చలముగాఁ నిలువఁబడి యుండెను. తరువాతను మాల్యవంతుఁడు పెక్కు ముండ్లతో నిండియున్న యినుపశూలమును గిరగిరఁద్రిప్పి విష్ణుమూర్తి వక్షఃస్థలముపై గట్టిగాఁ గొట్టెను. మఱియు నట్టులే రణాసక్తుఁడగు నామాల్యవంతుఁడు విష్ణుమూర్తిని పిడికిలితోఁ గొట్టి యొక వింటిపెట్టుమేర వెనుకకుఁ దొలఁగిపోయెను. తరువాత నాకాశమునందు సాధువాదములతోఁ గూడిన మహాశబ్ద మొకటి బయలుదేఱినది. మాల్యవంతుఁడు విష్ణుమూర్తిని గొట్టుటయే కాక గరుత్మంతునిగూడఁ గొట్టెను. గరుత్మంతుఁడును గోపించి ఱెక్కలగాలిచేత బలవంతమగు వాయువు దూదిపింజె నెగురఁ గొట్టునట్టు లారాక్షసు నెగురఁగొట్టెను. తనయన్న గరుత్మంతుని ఱెక్కల గాలిచే నెగురఁగొట్టఁబడిపోవుట చూచి సుమాలి తనసైన్యముతోఁగూడ లంకకుఁ బాఱిపోయెను. గరుత్మంతుని ఱెక్కల గాలిచే బలవంతముగా నెగురఁగొట్టఁబడిన యామాల్యవంతుఁడును మరలఁ దనసైన్యమును గలిసికొని సిగ్గుపడుచు నెట్లో లంకకుఁబోయెను.

తామరతేకులవంటి కన్నులుగల శ్రీరామచంద్రా! విష్ణుమూర్తిచే నీవిధముగా ననేకపర్యాయములు యుద్ధములలోఁ గొట్టఁబడి మేటివీరు లెల్లఁజావఁగా, విష్ణుమూర్తితో నెదిరించి యుద్ధము సేయఁజాలక భయపడి లంకవిడిచి, చావఁగా మిగిలినవారు భార్యాపుత్రాదిపరివారముతోఁ బాతాళలోకమునకు నివాసార్థమై పోయిరి. రఘుకులశ్రేష్ఠుఁడవగు నోరామా! అట్లు పాతాళలోకమునకుఁ బోయి సాలకటంకటవంశమునఁబుట్టిన యారాక్షసులు సుమాలియనువాని నవలంబించి ప్రసిద్ధి కెక్కియుండెడివారు. నీచేఁ జంపఁబడిన రావణకుంభకర్ణాదులకంటెను మాల్యవంతుఁడు మొదలగు రాక్షసులు మిగుల బలవంతులు. దేవతలను బాధించు రాక్షసులను జంపువిషయమై శంఖచక్రగదాధరుఁడగు నారాయణునికంటె నితరులకు సాధ్యముగాదు. రామా! నీవు చతుర్బాహుఁడవును, సనాతనుఁడవును నగు నారాయణుఁడవే. రావణాదిరాక్షసుల సంహారముకొఱకు దశరథుని కుమారుఁడవై పుట్టితివి. శరణాగతవత్సలుఁడ

డగు నారాయణుఁడు పోయినధర్మములను మరల నిలుపుటకై, యాయా కాలములయందుఁ బ్రజలయున్నతికై, దుర్మార్గులను సంహరించుటకై పుట్టుచుండును. రాజేంద్రుఁడవగు రామచంద్రా! ఇపుడు నీకు రాక్షసుల జన్మప్రకారమంతయుఁ జెప్పితిని. ఇటుపైని రావణునియొక్కయు వాని సంతతియొక్కయు నిరుపమానమైన జన్మప్రభావాదికమును జెప్పెద నాల కింపుము. అట్లు విష్ణుమూర్తికి భయపడి సుమాలి మొదలగు రాక్షసులు పుత్రులు పౌత్రులు మొదలగు పరిజనులతోఁగూడి చిరకాలము పాతాళ లోకములో నివసించుచుండిరి. అటుపైని ధనేశ్వరుఁడు లంకలో నివ సించుచుండెను.

## 9-వ సర్గము

### రావణాదుల వృత్తాంతము

తరువాతను మఱికొంతకాలము గడచినవెనుక నల్లనిమేఘముతో సమానమైనవాఁడును, పుటముపై చిన బంగారుకుండలములు గలవాఁడును నగుసుమాలియను రాక్షసుఁడు చేతిలోఁ బద్మము లేకుండ నుండులక్ష్మి వలెఁ బ్రకాశించుచున్న తనకూఁతుం దీసికొని పాతాళలోకమునుండి వచ్చి భూలోకములో విహరించుచుండెను. అట్లు భూమిపైఁ దిరుగు చుండఁగా బుష్పకమను విమానమెక్కి పోవుచున్న ధనేశ్వరుఁ డారాక్ష సునికంటి కగపడెను. విశ్రవోబ్రహ్మను జూచుటకై పోవుచున్న దేవకుమా రునివంటి యాధనేశ్వరుని జూచి యాశ్చర్యపడుచు భూలోకమునుండి పాతాళలోకమునకుఁ బోయి, రాక్షసులలో బుద్ధిశాలి యగు నాసుమాలి "యేమిచేసిన మనకు శ్రేయము గలుగును? యెట్లు వృద్ధిలోనికి వత్తుము?" అని యాలోచించెను. తరువాత నతఁడు కైకసి యను తనకూఁతుం జూచి యిట్లనియె: "పుత్రీ! నీకు యౌవన మతిక్రమించుచున్నది. కావునఁ బెండ్లి చేయవలసియున్నది. నీవు నిరాకరింతు వేమో యను భయముచే వరు లెవ్వరును నిన్నుఁ గోరమానుకొనుచున్నారు. నీనిమిత్తమై మేమం దఱమును ధర్మాసక్తులము ప్రయాసపడుచున్నాము. పుత్రీ! నీవు సర్వ గుణములతోడను గూడినదానవు; రెండవలక్ష్మివలెఁ బ్రకాశించుచున్నావు. మానమును గాపాడుకొంద మనుకోరిక గలవారి కందఱకును గన్యా పితృత్వము దుఃఖకరమైనది గదా? తమకన్యక నెవ్వఁడు వరించునో తెలిసి

కొనుటకు వీలుగాదు. తల్లివంశమును, తండ్రివంశమును, పెనిమిటివంశమును గన్యక సర్వదా సంశయమునం దుంచియుండును. కావున నీవు మునివరుడును, శ్రేష్ఠుడును, బ్రహ్మావంశమునందుఁ బుట్టినవాడును, బులస్త్యబ్రహ్మకుమారుడును నగు విశ్రవసుని స్వయముగా వరించి సేవింపుము. పుత్రీ! తప్పకుండ నీకును నిటువంటి కొడుకులే పుట్టఁగలరు. తేజస్సుచేత సూర్యునితో సమానముగాఁ బ్రకాశించుచు ధనేశ్వరుఁ డెట్లున్నాఁడో చూచితివిగదా!" కైకసి తండ్రి చెప్పిన ఆమాటలు విని తండ్రియందలి గౌరవమువలన విశ్రవోబ్రహ్మ తపసుచేయుచోటకిఁ బోయి నిలువఁబడినది.

శ్రీరామా! ఇంతలో నాలవయగ్నిహోత్రమువలెఁ బ్రకాశించుచున్న పులస్త్యునికుమారుఁడు విశ్రవసుఁ డగ్నిహోత్రమును నుపాసించుచుండెను. అది సాయంకాలము. ఆకైకసి తండ్రియందలి గౌరవమువలన నట్టిదారుణమైన వేళనుగూర్చి విచారింపక యతనియెదుటఁ దలవంచుకొని పాదాంగుష్ఠముచే భూమిని వ్రాయుచు నిలువఁబడినది. ఆవిశ్రవసుఁడు పున్నమచంద్రునితో సమానమైన ముఖముగల యాకైకసిని దన తేజస్సుచే వెలుఁగుచున్నదానిని జూచి మిక్కిలి యుదారమైన యంతఃకరణము గలవాఁడై యిట్లనియె: "సుందరీ! నీ వెవనికూఁతురవు? ఎందుండి యిచ్చటికి వచ్చితివి? నీవు వచ్చినకార్య మేమి? ఏహేతువున వచ్చితివి? అంతయు నిజముగాఁ జెప్పుము" అని యతఁ డడుగఁగానే యాకన్యక చేతులు జోడించుకొని యిట్లనియె: "మునిచంద్రా! నావృత్తాంతమంతయుఁ దమతపఃప్రభావముచేతనే తెలిసికొనఁదగును. బ్రహ్మర్షిచంద్రా! నేను నాతండ్రియాజ్ఞ ననుసరించి వచ్చితిని. నాపేరు కైకసి. తక్కిన సంగతియంతయుఁ దామే తెలిసికొందురుగాక!" ఆమె చెప్పిన యామాట విని యాముని వెంటనే ధ్యానదృష్టితోఁ జూచి యిట్లనియె: "సుందరీ! నీమనస్సులోని సంకల్పమంతయుఁ దెలిసికొంటిని. నావలనఁ గుమారోత్పత్తిని గోరి వచ్చితివి." అనియిట్లు పలికి యాకైకసిని పెండ్లాడి విశ్రవసుఁ డామెతోఁ గ్రీడించి మఱలనామెకిట్లనెను: "దారుణమైన యిట్టివేళను నీవు నాయొద్దకు సంతానార్థినివై వచ్చితివి గనుక నీవు దారుణులును, దారుణమైన యాకారముగలవారును, దారుణమైన వంశమునం దిష్టము గలవారును, క్రూరకర్ములును నగు రాక్షసులను గనియెదవు." ఆమాటలు

వినఁగానే చింతించియామె నమస్కారపూర్వకంబుగా నిట్లనియె: "తపస్సంపన్నుఁడవును బ్రహ్మవిదుఁడవును నగు నీవలన నిట్టిబిడ్డలా నాకుఁబుట్టుట! అంతటి దురాచారులు నాకక్కఱలేదు. నాయందు దయయుంచి మంచి వానిని దయచేయుము." అని యనేకవిధముల బతిమాలఁగా మునిశ్రేష్ఠుఁడగు నావిశ్రవసుఁడు కైకసివంకఁ జూచి పూర్ణచంద్రుఁడు రోహిణితో నన్నవిధమున నిట్లనియె: "సుందరి! నీచిన్న కొడుకు నావంశమునకుఁ దగినవాఁడై ధర్మాత్ముఁడై యుండును."

శ్రీరామా! ఈరీతిగా విశ్రవోమునిచేఁ జెప్పఁబడినదియై యా కైకసీ యనుకన్నియ మఱికొంతకాలమునకుఁ జూచుట కసహ్యముగా నుండువాఁడును, రాక్షసరూపము గలవాఁడును, మిక్కిలి భయంకరమైనవాఁడును, పదితలలు గలవాఁడును, పెద్దకోఱలు గలవాఁడును, కాటుకకొండవంటి వాఁడును, ఎఱ్ఱని పెదవులు గలవాఁడును, ఇరువది బాహువులు గలవాఁడును, పెద్దనోళ్లు గలవాఁడును నగు కుమారుని గనెను. ఆతఁడు పుట్టినతోడనే యగ్నిజ్వాలలఁ గ్రక్కుచు నక్కలును గ్రవ్యాదములును మండలములు గట్టి యపసవ్యముగాఁ దిరుగ మొదలిడినవి. పర్జన్యుఁడు రక్తమును వర్షించెను. మేఘములు కడుఘోరముగ నుఱుము మొదలిడినవి. సూర్యునిప్రకాశము లేకపోయినది. ఆకాశము నుండి యుల్కలు రాలినవి. భూమి కంపించినది. దారుణముగా వాయువులు వీచినవి. అక్షోభ్యుఁడును నదులకుఁ బతియు నగు సముద్రుఁడు క్షోభింప మొదలిడెను. తరువాత బ్రహ్మదేవునితో సమానుఁడగు తండ్రి విశ్రవసుఁడు పదితలలుగలవాఁడై పుట్టెను గనుక వానికి దశగ్రీవుఁడని నామకరణము చేసెను. అతఁడు పుట్టిన తరువాత మహాబలశాలి యగు కుంభకర్ణుఁడు పుట్టెను. అతనిప్రమాణముకంటె నెక్కువప్రమాణముగల జంతువు మఱియుండఁబోదు. తరువాత వికృతమైన ముఖము గల శూర్పణఖయుఁ, దరువాతను ధర్మాత్ముఁడగు విభీషణుఁడును పుట్టిరి. కైకసిసంతతిలో నతఁడే కడసారి బిడ్డఁడు. సత్వశాలి యగు నావిభీషణుఁడు పుట్టఁగానే పుష్పవర్షము గురిసినది. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోఁగినవి. మఱియు దేవతలు సాధువాదములు పల్కిరి. మహాబలవంతులగు నారావణకుంభకర్ణులిద్దఱును లోకములకు దిగులు పుట్టించుచు నామహారణ్యములోనే వృద్ధిపొందుచుండిరి. అందుఁ గుంభకర్ణుఁడు*

మదించినవాఁడై ధర్మవత్సలు లగు మహాఋషులను మూఁడులోకముల వారిని మ్రింగుచు నిత్యమును సంతుష్టినొందక సంచరించుచుండెను. ధర్మాత్ముఁడగు విభీషణుఁడుమాత్రము ధర్మమార్గమునం దాసక్తుఁడై స్వాధ్యాయతత్పరత్వముచే నియమముగా నాహారమును భుజించుచు, నింద్రియములను స్వాధీనమున నుంచుకొనియుండెను.

ఇట్లుండఁగా నొకానొకనాఁడు స్వయంప్రకాశమానుఁడును వైశ్రవణుఁడును నగుధనేశ్వరుఁడు పుష్పక మనువిమాన మెక్కి తండ్రిని జూచుటకు వచ్చెను. అట్లు వచ్చి తన దివ్యతేజముచేత జాజ్వల్యమానుఁడై యున్న యాకుబేరునిఁ జూచి సహింపఁజాలక కైకసి తనపెద్ద కుమారుఁ డగురావణునితో నిట్లనియె: "నాయనా! చూచితివి గదా మీయన్న వైశ్రవణుఁ డెంత తేజశ్శాలియై ప్రకాశించుచున్నవాఁడో! ఒకతండ్రిబిడ్డ లందఱును సమానముగా నుండవలసి యుండఁగా, నీవు కుబేరునివలె నుండక దివ్యవైభవము లేనివాఁడవై యుంటివి. అమితబలశాలివగు నోదశగ్రీవా! నాకడుపునఁ బుట్టిన నీవు వైశ్రవణునితో సమానముగా నుండుటకుఁ దగినట్లు ప్రయత్నింపుము." అను తల్లిమాటలు విని ప్రతాపశాలి యగు దశగ్రీవుఁడు మిగుల రోషము నొందినవాఁడై వెంటనే తల్లియెదుటఁ బ్రతిజ్ఞఁజేసెను: "తల్లీ! నేను నిజముగాఁ జెప్పుచున్నాను వినుము. నేను నాసవతియన్నతో సమానుఁడనో, వానికంటె నధికుఁడనో యగుదును. నీమనస్సునందలి సంతాపమును మానుము" అని యాకోపము చేతనే తమ్ముఁడగు కుంభకర్ణునితోఁగూడ దుష్కరకార్యమును జేయఁగోరినవాఁడై తపస్సు చేయ సంకల్పించెను. తపస్సుచేతను గోరినకోరికలను బొందెద నని సంకల్పించుకొని యాత్మసిద్ధికై శుభకరమైన గోకర్ణాశ్రమమునకుఁ బోయెను. అట్లు తమ్ములతోఁ గూడ నచ్చటకుఁబోయి భయంకరమైన పరాక్రమముగల యాదశగ్రీవుఁడు నిరుపమానముగాఁ దపస్సు చేసి బ్రహ్మను సంతోషపఱిచెను. విభుఁడగు నాబ్రహ్మయు సంతోషించి జయమును గలిగించువరముల నిచ్చెను.

## 10-వ సర్గము

ఇట్లగస్త్యమహాముని చెప్పఁగా విని శ్రీరామచంద్రుఁ డిట్లనియె: "అగస్త్యభగవానులవారూ! మహాబలవంతు లగు నాయన్నదమ్ము

లావనములో నేరీతిగా నెట్టితపస్సు చేసిరి." అని యడుగఁగా నగస్త్యుఁడు సంతుష్టాంతరంగుఁడై యున్న శ్రీరామచంద్రునితో నిట్లనియె: "రామా! అట్లు గోకర్ణమునకుఁ బోయి వారు ముగ్గురును నాయాయి ధర్మవిధుల నవలంబించిరి. కుంభకర్ణుఁడు నియతముగా ధర్మమార్గమునం దుండి గ్రీష్మకాలమునఁ బంచాగ్నిమధ్యమునను, వర్షాకాలమున వీరాసనస్థుఁడై మేఘోదకములచేఁ దడియుచును, హేమంతకాలమున జలములో నుండియుఁ దపస్సు చేయ మొదలిడెను. ఇట్లు ధర్మము విషయమై ప్రయత్నించుచు మంచిమార్గమునందు నిష్ఠగల యాకుంభకర్ణునకుఁ బదివేలసంవత్సరము లతిక్రమించినవి. ధర్మాత్ముఁడగు విభీషణుఁడు నిత్యమును శుచియును ధర్మాసక్తుఁడును నై యేకపాదముతో నిలువఁబడి యైదువేల సంవత్సరములు తపస్సు చేసెను. అతనితపోనియమము పూర్ణము కాఁగానే యాకసమునం దచ్చర లాడిరి. పుష్పవర్షము గురిసినది. దేవతలు క్షోభపడిరి. అతఁడు మఱి యైదువేలసంవత్సరములు చేతులు మీఁది కెత్తి సూర్యుని జూచుచు స్వాధ్యాయమునందు నియమింపఁబడిన మనస్సు గలవాఁడై తపస్సు చేసెను. ఇట్లు నియతాత్ముఁడై స్వర్గలోకములోని నందనవనములో నున్నట్టుండి తపస్సు చేయుచున్న విభీషణునకును బదివేలసంవత్సరము లతిక్రమించినవి. రావణుఁడును నిరాహారుఁడై పదివేలసంవత్సరములు తపస్సు చేసెను. వేయేసిసంవత్సరములు పూర్తి కాఁగానే యొక్కొక్కశిరస్సుఁ గోసి యగ్నికుండమునందు వేల్చుచుండెను. ఇట్లు తొమ్మిదివేల సంవత్సరములు గడచినవి. తొమ్మిదిశిరస్సు లగ్నిహోత్రునిపాలయినవి. మరల నొకవేయిసంవత్సరములు ఘోరమైన తపస్సుచేసి పదియవశిరస్సును గూడఁ గోసి హోమము చేయుటకు సిద్ధుఁడై యుండఁగా, నంతట నచ్చటకు బ్రహ్మదేవుఁడు వచ్చెను. ఇట్లు దేవతలతోఁ గూడ వచ్చి సంతోషించుచు: "దశగ్రీవా! నీవు చేసినతపస్సునకుఁ జాల సంతోషించితిని. ధర్మజ్ఞా! నీ కిష్టమైన వరమును శీఘ్రముగాఁ గోరుకొనుము. నీవు పడినపరిశ్రమ వ్యర్థముగాకుండ నీకోరికను బూర్తి చేసెద"ననియె. అది విని దశగ్రీవుఁడు చాలసంతోషించి యాయనకు సాష్టాంగనమస్కారము చేసి హర్షముచే గద్గదస్వరము గలుగఁగా నిట్లనియె: "పితామహా! నిత్యమును బ్రాణులకు మరణముకంటె భయంకరమైనది లేదు. మృత్యువుతో సమానమైన శత్రువు ప్రాణికోటికి లేదు. నేను జావు లేకుండ వరము కోరుకొనుచు

న్నాను" అని చెప్పఁగానే విని బ్రహ్మదేవుఁడు దశకంఠునితో నిట్లనియె: "నాయనా! చావులేకుండ వరమిచ్చుటకు వీలు పడదు. కావున మఱియొకవరమును గోరుకొనుము" అని లోకకర్త యగు బ్రహ్మ చెప్పఁగానే విని దశగ్రీవుఁడు చేతులు జోడించుకొని యెదుట నిలువఁబడి యిట్లనియె: "అట్లైన పితామహా! నాకు సుపర్ణులు, నాగులు, యక్షులు, దైత్యులు, దానవులు, రాక్షసులు, దేవతలు మొదలగువారివలనఁ జావులేకుండ వరమిమ్ము. మఱి తక్కిన ప్రాణులవలన నాకెంతమాత్రమును భయము లేదు. మనుష్యులు మొదలగు ప్రాణులు నాకుఁ దృణప్రాయులేకదా?" అని చెప్పఁగా ధర్మాత్ముఁడగు బ్రహ్మ దేవతలతోఁ గూడ "నోయీ రాక్షసశ్రేష్ఠుఁడా! నీవు కోరిన యట్లే వర మిచ్చితి" నని చెప్పి, మరల నిట్లనియె: "రావణా! నీవడుగక పోయినను నీవు చేసినతపస్సునకు నేను సంతోషించితిని గనుక నీకిం నొక్కవర మిచ్చుచున్నా నంగీకరింపుము. నీవు పూర్వ మగ్నిలో హోమము చేసిన నీతొమ్మిదిశిరస్సులును మరల నెప్పటియట్లుండును. మఱియు నింకొకవర మిచ్చుచున్నాను పుచ్చుకొమ్ము. నీవు మనస్సులో నేరూపము ధరింపవలయు నని తలంచెదవో యట్టిరూపము గలుగును. నావర మమోఘమైనది." అని బ్రహ్మదేవుఁడు వర మియ్యఁగానే యగ్నిహోత్రమునందు హోమము చేయఁబడిన దశగ్రీవుని శిరస్సులన్నియు నెప్పటియట్ల మొలచినవి.

శ్రీరామా! దశగ్రీవున కీప్రకారముగా వరముల నిచ్చి లోకకర్త యగు పితామహుఁడు విభీషణునియొద్దకు వచ్చి యిట్లనియె: "వత్సా! విభీషణా! నీధర్మబుద్ధికి నేను జాల సంతోషించితిని. ధర్మాత్మా! సువ్రతా! నీయిష్టమైన వరము గోరుకొనుము." అని చెప్పఁగానే నిత్యమును గిరణములచే జంద్రుఁడువలెనే, మంచిగుణములచే నావరింపఁబడిన ధర్మాత్ముఁడగు విభీషణుఁడు చేతులుజోడించుకొని యిట్లనియె: "పితామహా! నేను గృతార్థుండనయితిని. లోకగురుఁడ వగు నీవు సంతోషించి స్వయముగా నాకు వర మియ్య వచ్చితివి. సువ్రతా! నాకుఁ గావలసినవరము చెప్పెదను వినుము. ఎట్టియాపదలు తటస్థించి యున్నను నామన స్సెప్పుడును ధర్మమునందే యాసక్తమయి యుండవలయును. ఉపదేశ మక్కరలేకుండఁగనే నాకు బ్రహ్మాస్త్రము స్ఫురించుఁగాక! ఏయేయాశ్రమములయందు నా కేయేబుద్ధి గలుగుచుండునో యదిధర్మిష్ఠమై యుండుఁగాక. నే నాయా

ధర్మములను బరిపాలించుకొనుచు నుండునుగాక! పరమౌదార్యమైన యంతఃకరణములుగల యోదేవా! ఇదియే నాకిష్టమైన వరము. ధర్మమునందాసక్తులగువారికి మూఁడులోకములయందును దుర్లభమైనది లేదని కదా పెద్దలు చెప్పుచుందురు." అను విభీషణునిమాటలు విని సంతోషించి యతనితో బ్రహ్మ యిట్లనియె: "వత్సా? నీవు ధర్మిష్ఠుఁడవు గనుక నీవు కోరినయట్టులే యగును. అంతశ్శత్రులను నశింపఁజేసికొనియున్న యోవత్సా! రాక్షసయోనియందు జన్మించినను నీ కధర్మమునందు బుద్ధి లేదు గనుక నీకుఁ జావు లేకుండ వరమిచ్చుచున్నాను" అని చెప్పి కుంభకర్ణునకు వర మియ్య వచ్చిన బ్రహ్మదేవునితోఁ జేతులు జోడించుకొని దేవత లిట్లని విన్నవించిరి.

"దేవా! కుంభకర్ణునకు వర మీయవలదు. ఈదుర్మార్గుఁ డేరీతిగా లోకములకు హింస గలుగఁజేయుచున్నాఁడో నీవెఱుంగనిదిగాదుగదా! వీఁడు నందన వనములో విహరించుచుండఁగా నేడుగు రప్సరస్త్రీలను భక్షించెను. దేవేంద్రుని యనుచరులను బదిమందిని మ్రింగెను. వీఁడుకబళించిన మునులకును ఋషులకును లెక్కయే లేదు. వరములు పొందక ముందే వీఁడిట్టి ఘోరకృత్యము గావించుచున్నాఁడు.ఇఁక వీనికివరప్రాప్తి గూడఁగలిగిన చో మూఁడులోకములను భక్షించుట కభ్యంతరముండునా? అమిత ప్రభావశాలి వగు నోదేవా! ఇప్పుడు వీనికి వరమనుమిషచేమోహమును గలిగింపుము. అట్లు చేసితివేని మూఁడు లోకములకును క్షేమము గలుగును. వానిపొగరు నణఁగును."అని యిట్లు దేవతలు విన్నవింపఁగానే పద్మసంభవుఁ డగు బ్రహ్మ సరస్వతిని స్మరించెను. వెంటనే సరస్వతీదేవి ప్రత్యక్షమై చేతులు జోడించుకొని ప్రక్కను నిలువఁబడి యిట్లనియె: "దేవా! ఇదిగో వచ్చితిని. ఏమి సెలవిచ్చినను జేయుటకు సిద్ధురాలనై యున్నాను"అని విన్నవించు సరస్వతినిజూచి బ్రహ్మ యిట్లనియె: "వాణీ! నీవీదేవతలకోరికప్రకార మీకుంభకర్ణునిముఖమునం బ్రవేశింపుము"అని చెప్పఁగానే యామె వానిముఖమునఁ బ్రవేశించినది. అప్పుడు కుంభకర్ణునిఁజూచి బ్రహ్మ యిట్లనియె: "మహాబాహుఁడ వగు నోకుంభకర్ణా! నీకిష్టమైన వరము గోరుకొనుము"అని చెప్పఁగానే కుంభకర్ణుఁ డిట్లనియె: "దేవదేవా! అనేకసంవత్సరములు నిద్రపోవలయు నని నాకుఁ గోరిక యున్నది. ఇదియే నాకిష్టమైనవరము" అని యడుగఁగానే యట్లే

యగుఁగావుత మనిచెప్పి దేవతలతోఁగూడ బ్రహ్మ యంతర్ధానమాయెను. సరస్వతీదేవియు వెంటనే ఆరాక్షసుని విడిచి పోయినది. ఇట్లు బ్రహ్మాదిదేవతలు నభస్థలమునుగూర్చి పోఁగానే సరస్వతిచే విడువఁబడి వాఁడు తెలివి దెచ్చుకొనెను. అప్పు డాదుష్టాత్ముఁడు దుఃఖించుచు నిట్లని యాలోచింప మొదలిడెను: "అకటా! నాముఖమునుండి యిటువంటిమాట యేటికి వచ్చినది? అన్నా! బ్రహ్మతోఁగూడి వచ్చినదేవత లేదో మాయ పన్ని నన్ను మోసపుచ్చియుండునని తలంచెదను. ఏమిచేయుదును? సమయ మతిక్రమించినది. మోసగింపఁబడితిని" అని వగచెను. ఇట్లు ముగ్గురన్నదమ్ములును దీప్తతేజస్కులై తపస్సు చేసి వరములను బొంది యచ్చటినుండి శ్లేష్మాతకవనమునుగూర్చి పోయి యచ్చట వారు సుఖముగా నుండిరి.

## 11-వ సర్గము

### రావణుని లంకాప్రవేశము

శ్రీరామా! ఇట్లు మనుమలు ముగ్గురును తపస్సు చేసి వరములను బొంది యున్నా రన్న సంగతి తెలిసికొని సుమాలి భయమును విడిచి పాతాళలోకమునుండి పరిచరులతోఁగూడ బయలుదేరెను. మారీచుఁడు, ప్రహస్తుఁడు, విరూపాక్షుఁడు, మహోదరుఁడు నను సుమాలిమంత్రులును మిక్కిలి యాటోపముగలవారై యతనితోఁగూడ బయలుదేరిరి. సుమాలి యిట్లు రాక్షసశ్రేష్ఠులగు మంత్రులతోఁ గూడి దశగ్రీవుని గలిసికొని వానిని కౌఁగిలించుకొని యిట్లనియె: "వత్సా! దైవవశమునఁ గోరిన కోరిక నెఱవేఱినది. ముల్లోకములకును జ్యేష్ఠుఁడగు బ్రహ్మదేవుని వలన నుత్తమమయిన వరములను బొందితివి. మేమేకారణమువలన లంకాపట్టణమును విడిచి పాతాళమునకుఁ బోయితిమో ఆవిష్ణువువలని భయము పోయినది. మహాబాహూ! నీవలన మాకాభయము తీఱినది. మే మెన్నో మాఱులు వానికి భయపడి పరివారముతోఁగూడఁ బాతాళలోకమునకుఁ బాఱిపోతిమి. ఈలంకాపట్టణము ముందు మాదే. ఇది రాక్షసులు నివసించుటకుఁ దగియున్నది. బుద్ధిశాలి యగు నీసవతి యన్న ధనేశ్వరుఁడు దీని నాక్రమించుకొని యున్నాఁడు. మహాబాహూ! ఒకవేళ నీకు ననువగునేని మంచిమాట లాడి కాని, లంచ మిచ్చి కాని, బలాత్కారము చేసి కాని మరల నీలంకను బుచ్చుకొనుము. అంతియే

చాలును. నాయనా! నీవే లంక కధిపతి వగుదువు. సందేహింపకుము. ఇట్లు చేసితివేని దుఃఖసముద్రములో మునిఁగియున్న రాక్షసవంశము నుద్ధరించినవాఁడ వగుదువు. మహాబలుఁడ వగు నీవే మాకందఱకును ప్రభువ వగుదువు" అని చెప్పిన మాతామహునిమాటలు విని దశగ్రీవుఁ డిట్లనియె: "తాతా! ధనేశ్వరుఁడగు కుబేరుఁడు మాకు గురువు. నీవిట్లు చెప్పవచ్చునా?" అని దశగ్రీవునిచే నిరాకరింపఁబడి సుమాలి యతని యభిప్రాయమును దెలిసికొని యేమియు ననక యూరకుండెను. మఱి యొకప్పుడు రావణుఁడొక్కఁడును గూర్చుండి యుండఁగాఁ బ్రహస్తుఁడు వినయముగా నెదుట నిలువఁబడి యుక్తియుక్తముగా నిట్లనియె:

"మహాబాహుఁడవగు దశగ్రీవా! నీకీరీతిగాఁ బలుకఁదగునా? శూరులకు సౌభ్రాత్రము (అన్నదమ్ములస్నేహము) లేదు. ఇందులకుఁ గారణము చెప్పెదను వినుము. అదితియు, దితియుఁ గలిపికోలుతనమున నుండెడి యక్కసెల్లెండ్రు. పరమ రూపశాలినులగు నాయిద్దఱును గశ్యపబ్రహ్మకు భార్యలైరి. అదితి మూఁడులోకములకును బ్రభువులగు దేవతలను గన్నది. దితి రాక్షసులను గన్నది. ధర్మజ్ఞా! యీ లంకా పట్టణము రాక్షసులది. మఱియు వనములతోడను, సముద్రముతోడను, పర్వతముల తోడను గూడియున్న యీభూమి నంతయు వారు ప్రభువులై యనుభవించుచుండిరి. ప్రభవిష్ణుఁడగు విష్ణు వారాక్షసులను యుద్ధములోఁగొట్టి యవ్యయ మగు నీలోకత్రయమును దేవతలయధీనము చేసెను. ఒక్కనీవే విపరీతముగా నడువవలసినదని మేము చెప్పుట గాదు. ఇదివఱ కీవిపర్యయమును సురాసుర లాచరించియే యున్నారు. కనుక నేను జెప్పినట్లు చేయుము" అని యిట్లు ప్రహస్తుఁడు చెప్పఁగానే దశగ్రీవుఁడు సంతుష్టాంతరంగుఁడై కొంచెమునే పాలోచించి మంచిదే యనెను. బలశాలియగు నాదశగ్రీవుఁ డాసంతోషముతో నారాక్షసు లందఱతోడను గూడి యానాఁడు వనమునకు బయలుదేఱెను. ఆదశగ్రీవుఁడు త్రికూటపర్వతమునం దుండి మాటలయందు నేర్పరియగు ప్రహస్తునిఁబిలిచి "ప్రహస్తా! నీవు శీఘ్రముగాఁ బోయి, రాజా! యీలంక మహాత్ములగు రాక్షసులది. సౌమ్యా! నీవు దీని నాక్రమించుకొని యున్నావు. అనఘా! నీ కిది తగదు. అతులపరాక్రమశాలి వగు నన్నా! నీవు నామాట విని వెంటనే యీలంకాపట్టణమును రాక్షసుల కిచ్చితివేని నాముద్దు చెల్లించిన

వాఁడవగుదువు, మఱియు ధర్మమును బాలించినవాఁడవును నగుదువు"అని సామపూర్వకముగా నేను జెప్పుచుంటి నని కుబేరునితోఁ జెప్పుమని యతనియొద్దకు దూతనుగాఁబంపెను. వాఁడును ధనేశ్వరునిచేత సురక్షితమయిన లంకకుఁ బోయి యాచార్యవంతుఁడయిన కుబేరునితో నిట్లనియె: అందఱు శస్త్రధారులలోను శ్రేష్ఠుఁడవును, మహాబాహుఁడవును, సువ్రతుండవును నగుధనేశ్వరా! నీతమ్ముఁడగు దశగ్రీవుఁడు పంపఁగా వచ్చితిని. సర్వశాస్త్రవిశారదుఁడవును మహాప్రాజ్ఞుఁడవునునగు నోధనేశ్వరా! దశాననుఁడు సెప్పుమన్న మాటలు చెప్పెద నాలకింపుము: «విశాలాక్షా! యీ లంకాపురి పూర్వము భీమపరాక్రములగు సుమాలి ప్రముఖులచే ననుభవింపఁబడుచుండెడిదఁట! కావున నోవిశ్రవస్తనూజా! ఇట్లు విన్నవింపఁబడుచున్నావు. సామపూర్వకముగా నిన్ను యాచించుచున్నాఁడు గనుక వానికీలంకాపట్టణమిమ్ము"అని ప్రహస్తుఁడు చెప్పినమాటలువిని వాక్యవిశారదుఁడగు వైశ్రవణుఁడు ప్రహస్తునితో నిట్లనియె:

"నాకు తండ్రి రాక్షసశూన్యమైన యీలంకాపట్టణము నిచ్చియున్నాఁడు. నే నీలంకలో దానమానాదిగుణముల నవలంబించి యక్షులతోఁ గూడియున్నాను. నారాజ్యము, నాపట్టణము, నాయైశ్వర్యము మొదలైన దంతయు నీదే. నీ వీరాజ్యమును నిష్కంటకముగా ననుభవింపుము. నీకును నాకును విభాగమెందులకు? నీవును నేనును నొక్కతండ్రి బిడ్డలము." అని దశగ్రీవునితో నేను జెప్పు మన్నట్లు చెప్పుము. అని ప్రహస్తునితోఁ జెప్పి ధనాధ్యక్షుఁడు వెంటనే పుష్పక మెక్కి తండ్రి యొద్దకుఁ బోయి నమస్కరించి రావణుని యభిమతము నంతయు నిట్లు చెప్పెను. తండ్రీ! నాతమ్ముఁ డగు దశగ్రీవుఁడు నాయొద్దకు దూతను బంపియున్నాఁడు. పూర్వము రాక్షసులకుఁగాపురమైన యీలంకను తన కిమ్మని వర్తమానము పంపెను. సువ్రతా! యిప్పుడు నే నేమిచేయవలసి యుండునో యానతీయవలయును. ఇట్లు కుమారుఁ డగు కుబేరుఁడు విన్నవించినమాటలు విని మునిశ్రేష్ఠుఁడగు విశ్రవసుఁడు చేతులు జోడించుకొని యెదుట నిలువఁబడియున్న కుమారునితో నిట్లనియె: «నాయనా! నేను జెప్పెడిమాటలను వినుము. మహాబాహుఁడగు దశగ్రీవుఁ డిది వఱకే నాకడఁజెప్పి యున్నాఁడు. మాటిమాటికిని జెప్పుట విని యాదుర్మార్గుని నేను ధిక్కరించితిని. కుపితుఁడనై ధర్మమును, న్యాయమును,

మర్యాదను ధ్వంసముచేయుచున్నావు. అని యంటిని. నాయనా! మేలుగలిగించునదియు ధర్మమును దప్పనదియు నగు నామాట వినుము. ఆదుర్మార్గునకు వరములు దొరకుటచే నొడలు దెలియక యున్నాఁడు. వానికి మాన్యామాన్యవిచారమే లేదు. వాఁడు నాశాపమువలనను దారుణమైన ప్రకృతిగలవాఁడై యున్నాఁడు. కావున నోమహాబాహూ! నీవు శీఘ్రముగాఁ గైలాసపర్వతమునకుఁ బోయి యచ్చటఁ గాపుర ముండుము. నీవు పరివారముతోఁగూడ లంకను విడిచిపెట్టుము. అచ్చట నదులలో నుత్తమనదియగు మందాకిని ప్రవహించుచుండును. ఆనదిలో సూర్యసంకాశములయిన బంగారు తామరపువ్వులు వికసించియుండును. మఱియు నానదిలోఁ బరిమళయుక్తములగు కుముదములు, ఉత్పలములు మొదలగుపుష్పము లెప్పుడును వికసించియుండును. ఆపర్వతముపైని దేవతలు, గంధర్వులు, అప్సరస్త్రీలు, ఉరగులు, కిన్నరులు మొదలగువా రెప్పుడును విహరించుచు రమించుచుందురు. పుత్రా! నీకారాక్షసునితో వైరము తగదు. వాఁడు ప్రకృతము బ్రహ్మవలన వరములు పొందియున్న వాఁడు.” అనియిట్లు తండ్రి చెప్పఁగానే యాయనయందలి గౌరవము వలన భార్యతోడను, బుత్రులతోడను, మంత్రులతోడను, వాహనముల తోడను, ధనముతోడను సపరివారముగాఁ గైలాసమునకుఁ బోయెను.

ఇటుఁ బ్రహస్తుఁడు రావణునియొద్దకుఁబోయి సంతోషించుచు మంత్రులతోడను తమ్ములతోడను గూడుకొనియున్న మహాత్ముఁడగు రావణునితో నిట్లనియె: “రావణా! ఆలంకాపట్టణము శూన్యముగా నున్నది. కుబేరుఁడు దానిని విడిచిపోయెను. మాతోఁగూడ నీ వందుఁ బ్రవేశించి స్వధర్మమును పరిపాలింపుము.” అని యిట్లు ప్రహస్తుఁడు చెప్పఁగానే మహాబలుఁడగు దశగ్రీవుఁడు తమ్ములతోడను సైన్యముతోడను గూడి లంకాపట్టణములోఁ బ్రవేశించెను. కుబేరునిచేత విడువఁబడినదియు వేలుపాటుచేయఁబడిన మహాపథములు గలదియు నగు నాలంకాపట్టణములో దేవత లమరావతిలో దేవేంద్రు నభిషిక్తుని చేసినచందమున వెంటనే యభిషిక్తునిఁ జేయఁగా నందుఁ గాపురముండి రాక్షసులను బరిపాలించుచుండెను. నీలమేఘములతో సమానులగురాక్షసులతో మిక్కిలి నిండి నిబిడీకృతమై యాలంకాపురియుఁ బ్రకాశించుచుండెను. ఇచ్చటఁ గుబేరుఁడును దండ్రియొక్క వాక్యములయందలి గౌరవమువలనఁ జంద్రుని

వలె నిర్మలమైన కైలాసపర్వతమునందు విరాజిల్లునదియు, బాగుగా నలంకృతములైన దివ్యభవనములతోఁ నిండినదియు నగు నలకాపురములోఁ బ్రవేశించి దేవేంద్రుఁ డమరావతినివలెఁ బరిపాలించుచు సుఖముగా నుండెను.

## 12-వ సర్గము

### రావణాదుల పెండ్లి

శ్రీరామచంద్రా! దశగ్రీవుఁ డీరీతిగా లంకలో నభిషిక్తుఁడై తమ్మునితోఁగూడి చెల్లెలిపెండ్లివిషయమై యాలోచింప మొదలిడెను. ఇట్లాలోచించి చెల్లెలగు శూర్పణఖను దానవశ్రేష్ఠుఁడును, కాలకేయవంశములోఁ బుట్టినవాఁడును నగు విద్యుజ్జిహ్వున కిచ్చి పెండ్లిచేసెను. తరువాత నతఁ డొకనాఁడు వేఁటకుఁ బోయి యావనములో దితికొడుకు మయుఁడు కూఁతురును దానును నుండఁగాఁ జూచి, "ఓయీ! నీ వెవ్వఁడవు? ఒక్కరుఁడవును నిర్మానుష్యమృగమైన యీవనమునం దీమృగాక్షితో నెందుల కున్నావు?" అని యడుగఁగా, నారావణాసురునితో మయుఁ డిట్లనియె: "అయ్యా! నాసంగతి యంతయుఁ జెప్పెద నాలకింపుము. హేమ యనునచ్చర యొకతె యుండెడిది. దానిని నీవును వినియే యుందువు. దేవేంద్రునకు శచీదేవినింబలె నాకు దానిని దేవత లిచ్చిరి. నాయనా! నేను దానియం దాసక్తుఁడనై యైదువందలసంవత్సరములుంటిని. అది యిప్పటికిఁ బదునాలుగుసంవత్సరములకు ముందు దైవతకార్యముచేతఁ బోయినది. నే నాహేమకొఱకు మాయచేతను వజ్రవైదూర్యాదిరత్నములచే విచిత్రమైన బంగారువికారమగు పట్టణ మొకటి నిర్మించితిని. నేను దానివియోగముచేత దీనుఁడ నయి యాపట్టణమునందే మిక్కిలి దుఃఖించుచు నివసించుచుంటిని. ఆపట్టణమునుండి దీనిం దీసికొని యీవనమునకు వచ్చితిని. ఇది నాకూఁతురు. ఆహేమాసుందరిగర్భమునుండి పుట్టినది. దీనికిఁ దగినవరుని వెదకుటకై దీనితోఁ గూడ బయలుదేఱితిని. నాయనా! మానమును మర్యాదను గాపాడుకొంచమను కోరిక గలవారికిఁ గన్యాపితృత్వము దుఃఖకరముగదా! కన్య రెండువంశములను నిత్యమును సంశయమం దుంచి యుండును గదా! నా కాహేమయను భార్యయం దిద్దఱుకొడుకులు గూడఁ బుట్టిరి. పెద్దవానిపేరు మాయావి. రెండవ

వానిపేరు దుందుభి. నీవడిగితివి గనుక నావృత్తాంతమంతయుఁ జెప్పితిని. నాయనా! నీ వెవరో నే నెట్లు తెలిసికోఁగలను?" అని యామయుఁ డడుగఁగా, వినయముతో నారావణుఁడిట్లనియె: "నేను బులస్త్యబ్రహ్మకుమారుఁడు మూఁడవబ్రహ్మయగు విశ్రవోమునికి సుతుఁడను. నాపేరు దశగ్రీవుఁడు." అని యిట్లు తనవృత్తాంతమును రావణుఁడు చెప్పఁగానే విని రావణుని మహర్షితనయునిగాఁ దెలిసికొని మయుఁడు చాలసంతోషించి యతనికిఁ దన కూఁతు నిచ్చుట కిష్టపడెను. వెంటనే యచ్చటనే యామయుఁడు తనకూఁతుకరము నతనికరముచే గ్రహింపఁజేసి యపుడు నవ్వుచు రాక్షసేంద్రుఁడగు నారావణునితో నిట్లనియె: "రాక్షసరాజా! ఇది నాకూఁతురు. హేమగర్భమునుండి పుట్టినది. కన్యక. దీనిపేరు మందోదరి. దీనిని భార్యగా గ్రహింపవలయును.''

శ్రీరామా! ఇట్లు మయుఁడు ప్రార్థింపఁగానే "మంచిది" యని రావణుఁ డంగీకరించెను. అచ్చటనే యగ్నిని బ్రజ్వలింపఁజేసి యగ్ని సాక్షిగాఁ బాణిగ్రహణమహోత్సవము జరిగించెను. ఆమయుఁడు తపోధనునివలన శాపవృత్తాంతము విన్నవాఁడై యతనిది బ్రహ్మవంశ మని తెలిసికొనియే తనకూఁతు నిచ్చి పెండ్లిచేసెను. మఱియు నమోఘమును అత్యద్భుతమును నగుతనశక్తిని గూడ నిచ్చెను. ఆశక్తి నాతఁడు మిక్కిలి తపస్సు చేసి సంపాదించెను. దానిచేతనే రావణుఁడు మనలక్ష్మణుని గొట్టినవాఁడు. లంకేశ్వరుఁడగు రావణుఁ డీరీతిగా భార్యను స్వీకరించి యామెతోఁగూడ లంకకుఁ బోయి తమ్ములపెండ్లిసంగతి యాలోచించెను. వైరోచనుని మనుమరాలు వజ్రజ్వాల యను దానిని బెద్దతమ్ముఁ డగు కుంభకర్ణునకు భార్యనుగా నేర్పాటు చేసెను. మహాత్ముఁడును, గంధర్వరాజును నగు శైలూషుఁడను నతనికూఁతును సరమ యనుదానిని విభీషణునకుఁ బెండ్లి చేసెను. ఆధర్మాత్మునకుఁ దగిన ధర్మజ్ఞురాలే భార్యగా దొరకినది. రామా! ఆమె మానసమను సరస్సుయొక్క యొడ్డునఁ బుట్టినది. ఆమానససరస్సు వర్షఋతువుననే వృద్ధి పొందినది. ఆకన్నియతల్లి "సరో మా వర్ధయస్వ = సరోవరమా వృద్ధిని బొందకుము" అని స్నేహవశమున నాక్రందించినది. అక్కతమున నామెకు సరమ యని పేరు గలిగినది. ఈరీతిగా ముగ్గురును వివాహములు చేసికొని, గంధర్వులు నందనవనములోఁ గ్రీడించునట్లు లంకలోఁ దమతమభార్యలతోఁ గ్రీడించుచుండిరి.

ఇట్లుండఁగా రావణుని భార్య మండోదరి మేఘనాదుని గన్నది. రామా! వాఁడే సుమా మాయావులచేతను నింద్రజిత్తని చెప్పఁబడుచుండెడి వాఁడు. ఆరావణునికొడుకు పుట్టినతోడనే యురుములవలె నేడ్చెను. ఆరోదనముతో లంకాపట్టణ మంతయు జడ మయిపోయినది. అందుచేతను తండ్రి వానికి మేఘనాదుఁ డని నామకరణము చేసెను. రామా! ఆశిశువు రావణుని యంతఃపురములో నుత్తమస్త్రీలచే రక్షింపఁబడుచుఁ గట్టెలచేఁ గప్పఁబడిన యగ్నివలె వృద్ధి నొందుచుండెను. ఆశిశువువలన రావణునకును మండోదరికిని గలిగినసంతోష మింతింతయని చెప్ప వలనుగాదు. అపత్యస్నేహ మట్టిది గదా!

## 13-వ సర్గము

### కుబేరుని సౌభ్రాత్రము

పిమ్మట మఱికొన్నాళ్లకు బ్రహ్మచేతను వరముగా నియ్యఁబడిన నిద్రాదేవి రూపమును ధరించివచ్చి యాకుంభకర్ణు నావహించినది. అప్పుడు సభలోఁ గూర్చుండియున్న యన్నతోఁ గుంభకర్ణుఁ డిట్లనియె: "అన్నా! నన్ను నిద్ర బాధించుచున్నది. కావున నేను బరుండుటకుఁ దగినయి ల్లేర్పాటు చేయవలయును." అను కుంభకర్ణునిమాటలు విని రావణుఁడు వెంటనే శిల్పుల కాజ్ఞాపించెను. ఇట్లు రాక్షసరాజుచే నాజ్ఞాపింపఁబడినవారై యాశిల్పులు విశ్వకర్మవలెనే, యోజనము విస్తీర్ణమును నంతకు రెండురెట్లు పొడవును గలిగి శుభ్రమయినదియుఁ జూడఁదగినదియు నేవిధమయిన బాధయు లేనిదియు స్ఫాటిక స్తంభములచేతను బంగారు చిత్రములచేతను బ్రకాశించునదియు వైడూర్యమణులచేఁ జేయంబడిన సోపానములు గలదియుఁ జిఱుగంటలతో నలంకరింపఁబడినదియు దంతపుఁ దోరణములచేఁ బొందిక చేయఁబడినదియు వజ్రములచేతను స్ఫటికముల చేతను గట్టఁబడిన యరుగులు గలదియు మనస్సును హరింపఁదగినదియు సమస్తవిధములచేతను సుఖకరమైనదియుఁ బవిత్రమైన మేరుపర్వతపు గుహావలె నుండునదియు నగు నొకయింటిని సిద్ధము చేసిరి. ఆయింటిలో మహాబలుఁడగు కుంభకర్ణుఁడు నిద్రాధీనుఁడై యనేకములగు వేలసంవత్సరములు నిద్రపోయెను. ఇట్లు తమ్ముఁడగు కుంభకర్ణుఁడు నిద్రావశంవదుఁడై యుండఁగా దశాననుఁడు దేవతలను, ఋషులను, యక్షులను,

గంధర్వులను నిరంకుశముగా బాధింప మొదలిడెను. నందనవనము మొదలగు దివ్యోద్యానములకుఁ బోయి మిక్కిలి కోపించి వానిని విఱిచివైచెను. నదులను గజరాజు కలఁచివైచినట్లు కలఁచివైచుచుఁ గ్రీడించుచు చెట్లను గాలివలెఁ జెల్లగిల్లఁజేయుచు నగములను వజ్రమువలెఁ గొట్టుచు ధ్వంసముచేయుచుండెను.

అప్పుడు ధర్మజ్ఞుఁడును ధనేశ్వరుఁడును నగువైశ్రవణుఁడు దశగ్రీవుఁ డట్టివ్యాపారముగలవాఁడయి యుండుటను దెలిసికొని తనవంశమున కనురూపమయిన వృత్తములను సంస్మరించి తనసౌభ్రాత్రమును జూపించుటకై దశగ్రీవునకు హితము బోధింప నెంచి లంకలోనికి దూతను బంపెను. ఆదూత లంకకుఁ బోయి ముందుగా విభీషణునిఁ గలిసికొనెను. ఆవిభీషణుఁడు ధర్మముగా నాదూతను గౌరవించి వచ్చిన కార్య మడిగెను. మఱియు నన్నయగు కుబేరునియొక్కయు జ్ఞాతులయొక్కయు కుశలము నడిగెను. తరువాత సభలోఁ గూర్చుండియున్న దశగ్రీవుని దర్శనము చేయించెను. ఆదూత సభలోఁ దనతేజస్సుచే దేదీప్యమానుఁడై యున్న రాక్షసరాజును రావణునిజూచి గౌరవపూర్వకముగా జయస్తుతులు చేసి ముహూర్తకాలమూరక కూరుచుండెను. సభలో వరాస్తరణశోభితమైన యుత్తమపర్యంకమునందుఁ గూర్చుండి యున్న రావణునిజూచి దూత యిట్లనియె.

మహావీరుఁడవగు నోరాక్షసేంద్రా! మీవంశమునకును నడవడికిని సదృశముగా మీయన్నయగు కుబేరుఁడు నీకుఁజెప్పుమని చెప్పిపంపిన మాటలు మనవిచేయుచున్నాను; చిత్తగింపుము. "తమ్ముఁడా! ఇంతవఱకుఁ జరిత్రను సంగ్రహించితివి చాలును. ఇటుపయిని వీలగునేని సాధుమార్గమునం దుండుట మంచిది. నీవు నందనవనమును బాడుచేసితివి. నేను గన్నులారఁ జూచితిని. ఋషులను జంపితి వని నేను వినియుంటిని. రాజా! నీవలన దుఃఖపడుచుండు దేవతలు ప్రతిక్రియకై చేయునేర్పాట్లు నేను వినియుంటిని. రాక్షసాధిపా! నీవనేకపర్యాయములు నన్ను నిరాకరించితివి. నీయందుఁ బ్రీతిగల బంధువులయెడ బాలభావమున నపరాధివయితివి. నేను రుద్రసంబంధమైన వ్రతము నవలంబించి నియమముతో నియమింపఁబడిన యింద్రియములు గలవాఁడనై ధర్మము నుపాసించుచుండుటకుఁగా హిమవత్పర్వతము మీఁదికిఁ బోయియుంటిని. అచ్చట

నేను పార్వతితోఁ గూడియున్న యీశ్వరుని జూచితిని. హఠాత్తుగా నాయెడమకన్ను దేవియందుఁ బ్రసరించినది. "ఈమె యెవరు చెప్పుమా యింతసుందరమూర్తి?" యని చూచితిని గాని, మఱియొక దురుద్దేశముతోఁ జూచినవాఁడను గాను. ఆమె నిరుపమానమైన రూపమును ధరించిన పుణ్యప్రాణి. ఆదేవి తన దివ్యమయిన ప్రభావముచేత నాయెడమకంటిని దహించినది. దీపము ధూళి పడి ధ్వంసమయినట్లు కంటిలోనిపాప పింగళవర్ణమైపోయినది. తరువాత నే నచ్చటనుండి విస్తీర్ణమగు నాకొండ యొక్క మఱియొకతటమునకుఁ బోయి యెనిమిదివందలసంవత్సరములు మహావ్రత మవలంబించితిని. నానియమము పూర్తికాఁగానే యీశ్వరుఁడు సంతోషించి "నాయనా! నీవు దేవిరూపమును జూచుటవలన నీకన్ను పింగళవర్ణమును బొందెనది. ఇపుడు నీవు చేసినతపస్సునకు నేను సంతోషించితిని. ఈవ్రతమును వెనుక నే నవలంబించితిని. ఇపుడు నీవు చేయఁగలిగితివి. ఇటువంటివ్రతము పూర్తి చేయఁదగువాఁ డింకనొకరుఁ డుండఁబోఁడు. దుష్కరమగు నీవ్రతమును నేనే మొట్టమొదటఁ గని పట్టితిని. కనుక నిటుపయిని నాతోఁ జెల్మి చేసి యుండుము. తపస్సుచేతను జయమును పొందిన నీవు నాకు స్నేహితుఁడవై యుండుము. దేవి నీయెడమకన్ను తనదివ్యప్రభావముచేత దహించినది గనుక నీకిటుపయిని శాశ్వతముగా నేకాక్షిపింగళుఁ డనుపేరు లోకములయందుఁ బ్రసిద్ధమగును." అని సంతోషపూర్వకముగా నీశ్వరుఁ డనెను. ఈరీతిగా నా దేవదేవునితో సఖ్యమును సంపాదించుకొని యాయన యాజ్ఞవలన నింటికి వచ్చి నీవు చేయుపాపపుఁబను లన్నియు వింటిని. కావున నాయనా! వంశమునకు నిందను గలిగించు నిష్ఠురధర్మసంబంధము నుండి మనస్సును మరలించుకొమ్ము. ఋషులు దేవతలు మొదలగువా రందఱును నేకమయి నీచావున కుపాయ మాలోచించుచున్నట్టు వినవచ్చినది.

ఇట్లు కుబేరునిమాటలుగా దూత చెప్పఁగా విని, దశగ్రీవుఁడు కోపించి కన్ను లెఱ్ఱఁజేసికొని హస్తములను జఱచి పండ్లు పటపటకొఱికి "యోరీ దూతా! నీవుపేలినమాటలయర్థముఁ దెలిసికొంటిని. నీవు నుండవు; నిన్నుఁబంపిన యానాభ్రాతయునుండఁడు. ధనేశ్వరుఁడు నాకు బోధించునది హితమునుగాదు. మూఢా! శివునితోఁ జెలిమిని నాకు వినిపించితివి. ఆమాట యేమాత్రమును మన్నింపఁదగినది కాదు. దూతా! యింత

వఱకును జ్యేష్ఠుఁడు గురుసమానుఁ డని యాలోచించి చంపఁగూడదని మన్నించి యున్నాను. ఇపుడు నీవు చెప్పిన యాతని మాటలు విన్న పిదప నేను నాబాహుబలము నాశ్రయించి మూఁడులోకములను జయింప నిశ్చయించితిని. ఒక్కయాతని కారణమున నలుగురులోకపాలకులను జంపి మృత్యువున కప్పగించెదను" అని చెప్పి రావణుఁడు వెంటనే యాదూతను గత్తితో నఱక్కివైచి వానిశరీరమును దుర్మార్గులగు రాక్షసులను దినుఁ డని యాజ్ఞాపించెను. తరువాతఁ బ్రయాణ మంగళాశీర్వాదములనుబడసినవాఁడై రథమెక్కి మూఁడులోకములను జయించుకోరికతో బయలుదేఱి ముందుగాఁ గుబేరునిమీఁదికిఁ బోయెను.

## 14-వ సర్గము

### రావణుఁ డన్నపై దాడి వెడలుట

తరువాత నారావణుఁడు బలగర్వితులును యుద్ధమునందుఁ గోరికగలవారును నగు మహోదరుఁడు ప్రహస్తుఁడు మారీచుఁడు శుకుఁడు సారణుఁడు ధూమ్రాక్షుఁడు నను నాలుగురుమంత్రులతోడను గూడినవాఁడై, కోపమువలన లోకములను దహించువానివలె బయలుదేఱి పట్టణములను నదులను కొండలను వనములను ఉపవనములను దాఁటి ముహూర్తకాలములోఁ గైలాసపర్వతమును జేరెను. ఆకొండ మీఁదను యుద్ధసన్నద్ధుఁడై మంత్రులతోఁగూడి కూర్చుండియున్న రావణుని జూచి వాని యెదుట నిలువఁబడఁ జాలక యక్షులు వీఁడు తమరాజగు కుబేరునకుఁ దమ్ముఁడన్న సంగతి దెలిసికొని కుబేరుఁ డున్న చోటికిఁ బోయి రావణునివ్యాపారమంతయుఁ గుబేరునితో విన్నవించిరి. వెంటనే కుబేరుఁడు తనవారిని యుద్ధమునకుఁ బొండని సెలవిచ్చెను. ఇట్లను జ్ఞాతులై సంతోషించుచు యక్షులు యుద్ధమునకు సన్నద్ధు లయిరి. తరువాతను నైరృతరాజగు కుబేరునిసైన్యము పొంగుచున్న సముద్రమువలె సంక్షోభించినదై పర్వతమును సంచలింపఁజేయునా యని తోఁచినది. తరువాతను యక్షులకును రాక్షసులకును సంకులముగా యుద్ధము జరిగినది. రావణునిమంత్రులు చాలఁ బీడింపఁబడిరి. రావణుఁ డట్టియక్షసైన్యమును జూచి విశేషముగా హర్షనాదములు చేయుచుఁ గోపముతోఁ నెదురుకొనెను. ఘోరవిక్రములగు నారావణునిమంత్రు లొక్కఁ,

డొక్కఁడు వేయేసిమంది యక్షులతో యుద్ధము చేసిరి. తరువాతను గదలచేతను, ముసలములచేతను, కత్తులచేతను, శక్తులచేతను, తోమరములచేతను కొట్టఁబడుచునే రావణుఁ డాయక్షసైన్యములోఁ బ్రవేశించెను. ఇట్లు ప్రవేశించి యూపిరి తిరుగకుండఁ గొట్టఁబడుచు వర్షించు మేఘములవలె బాణములను విడుచునాయకులచే నరికట్టఁబడెను. ఎంత వర్షించినను పర్వతము చలింపనట్లు యక్షు లెంతగాఁ గొట్టుచున్నను రావణుఁడు వ్యథపడఁడాయెను. తరువాత దుర్మార్గుఁడగు నారావణుఁడు కాలదండమువంటి గద పట్టుకొని యక్షసైన్యమును యమునియింటికిఁ బంప మొదలిడెను. ఆరావణుఁ డెండుకట్టెలను ఎండుగడ్డిని వాయు ప్రేరితుఁడైన యగ్ని దహించినట్లు యక్షసైన్యమును దహించెను. మహోదరుఁడు శుకుఁడు మొదలగు రావణునిమంత్రులు చావఁగా మిగిలియున్న యక్షసైన్యమును గాలి మేఘములను బరువెత్తించినట్లు పరువెత్తించిరి. కొందఱు యక్షులు చచ్చియు నలిగియు నాయుద్ధభూమిలోనే పడిపోయిరి. మఱికొందఱు తీక్ష్ణములయిన తమదంతములచేఁ బెదవులను గఱచుకొనుచుఁబడిపోయిరి. మఱికొందఱు మిక్కిలి యలసి యొకరి నొకరు గౌఁగిలించుకొని చేతులలోనుండి జాఱిపోయిన యస్త్రముల నెఱుంగక పడిపోయిరి. మఱికొందఱు నీటివేగముచేఁ గూలెడు నదులఁదరులవలెఁ గూలిపోయిరి. చచ్చి స్వర్గమునకుఁ బోవువారిచేతను భూమిపై యుద్ధము చేయువారిచేతను యుద్ధమునుజూచు ఋషులు మొదలగువారిచేతను ఆకసమున నెచ్చటఁజూచినను వెలపిలేకుండనున్నది. మహాబలులగు యక్షులు భగ్నులై రన్నసంగతి విని కుబేరుఁడు మరల మఱికొందఱు యక్షులను యుద్ధమునకుఁ బంపెను. శ్రీరామా! ఇంతలో సంయోధకంటకుఁ డను పేరుగల యక్షుఁడు విస్తారమైన బల వాహనములు గలవాఁడయి వచ్చి విష్ణుమూర్తివలెనే చక్రముచే మారీచునిఁ గొట్టెను. ఆదెబ్బచే వాఁడు పుణ్యము క్షీణించినవాఁడు స్వర్గమునుండి పడినవిధమున నాకొండమీఁది నుండి క్రిందఁబడెను. ఇట్లు క్రిందఁబడి కొంతసేపటికిఁ దెలివిఁ దెచ్చుకొని లేచి యామారీచుఁడు కొంచెముసేపు విశ్రమించి వచ్చి యాయక్షునితో యుద్ధము సేయఁగా, నిలువఁబడఁజాలక యాయక్షుఁడు పారిపోయెను. తరువాతను బంగారుచేఁ జిత్రింపఁబడినదియు వైదూర్యమాణిక్యములచేఁ బొదుగఁబడినదియు ద్వారపాలకులకు హద్దుగా నేరుపాటు చేయఁ

బడినదియు నగు తోరణము నొద్దకు రావణుఁడు రాఁగా, సూర్యభానుఁ డనుపేరుగలయక్షుఁ డాద్వారమునొద్దనుండువాఁడు రావణుని లోపలకుఁ బోకుండ నడ్డెను. ఇట్లాద్వారపాలుఁ డడ్డుచున్నను నిలువక రావణుఁడు లోపలఁ బ్రవేశించుచుండుట చూచి యాయక్షుఁడు తోరణమును బెల్లగించి దానిచేత నారావణుని గొట్టెను. అప్పు డాదెబ్బ తిని రావణుఁడు రక్తము గ్రక్కుచు గైరికాదిధాతువులను స్రవించు కొండవలెఁ బ్రకాశించెను. అట్లు కొండశిఖరమువంటి తోరణముచేతఁ గొట్టఁబడియు బ్రహ్మ యిచ్చినవరము ప్రభావమువలన వీరుఁడగు రావణుఁడు చావక, మరలఁ దా నాతోరణముతోనే పట్టి యాయక్షుని గొట్టఁగా వాఁడు భస్మీకృతశరీరుఁడై కానరాకపోయెను. తరువాత నాయక్షు లందఱును రావణునిపరాక్రమమును జూచి నిలువలేక భీతులై తమయాయుధముల నాయుద్ధభూమిలోనే విడిచిపెట్టి శాంతమును బొందినవారై తెల్లఁబోయిన మొగములు గలవారై పాఱిపోయి నదులలోను కొండలగుహలలోను బ్రవేశించిరి.

## 15-వ సర్గము

### యక్షరాక్షసుల యుద్ధము

తరువాత యుద్ధమునుండి వేలకొలఁది యక్షులు పాఱిపోయి రన్న సంగతి విని కుబేరుఁడు మహాయక్షుఁ డగు మాణిభద్రుని జూచి యిట్లనియె: "ఓయీ యక్షశ్రేష్ఠుఁడా! దుర్వృత్తిగలవాఁడును, పాపాత్ముఁడును నగు రావణుని జంపుము. యుద్ధవిశారదులును మహావీరులును నగు యక్షులకు దిక్కుగమ్ము." అని యిట్లు చెప్పఁగానే మహాబాహుఁడును సుదుర్జయుఁడును నగు మాణిభద్రుఁడు నాలుగువేలమంది యక్షులతోఁ గూడినవాఁడై రాక్షసులతో యుద్ధముచేయ మొదలిడెను. ఆయక్షులప్పుడు గదలు, ముసలములు, ప్రాసములు, శక్తులు, తోమరములు, ముద్గరములు మొద లయినయాయుధములతోఁ గొట్టుచున్నవారై రాక్షసులను బరుగెత్తించిరి. మఱియు వారు వేగలవలె లఘుగతిగలవారై దొమ్మియుద్ధము చేయుచుండిరి. మిమ్ములను బ్రాణములతో విడువ మని గట్టిగాఁ గేకలువైచి చెప్పుచుండిరి. తరువాతను గంధర్వులతోఁ గూడినదేవతలు బ్రహ్మవాదులగు మునులు మొదలగువా రాద్భ

మ్మియుద్ధము చూచి మిక్కిలి విస్మయమును బొందెను. అప్పుడు ప్రహస్తుఁ డొక్కఁడె వేయి యక్షులను జంపెను. మహోదరుఁ డను రాక్షసుఁ డింకొక లక్షమందిని జంపెను. మఱియు మారీచుఁ డనువాఁడు కోపించి రెప్ప పాటులో నిగత రెండులక్షలమంది యక్షులను జంపెను. అమాయకు లగు యక్షులు చేయు యుద్ధ మెక్కడ? మహామాయాయుద్ధపండితు లగు రాక్షసులు చేయు యుద్ధ మెక్కడ? పురుషవ్యాఘ్రుఁ డవగు శ్రీరామ చంద్రా! కావున యుద్ధములో రాక్షసు లధికు లయిపోయిరి. అప్పుడు ధూమ్రాక్షుఁడు కోపముతో వచ్చి మాణిభద్రుని గుండెలమీఁద ముసలముతోఁ గొట్టెను; గాని యతఁ డాదెబ్బకుఁ గంపించినవాఁడు గాఁడు. తరువాతను మాణిభద్రుఁడు గదను గిరగిరఁ ద్రిప్పి ధూమ్రా క్షుని నెత్తిమీఁదఁ గొట్టఁగా, వాఁడు వికలేంద్రియుఁడై యాదెబ్బతోనే క్రిందఁ బడిపోయెను. అట్లు దెబ్బతిని రక్తము గాఱుచుండఁగా ధూమ్రా క్షుఁడు క్రిందఁబడిపోవుట చూచి రావణుఁడు మాణిభద్రునిమీఁదికిఁ బరుగెత్తెను. యక్షశ్రేష్ఠుఁ డగు మాణిభద్రుఁడు కోపించి తనమీఁదికి వచ్చుచున్న రావణుని మూఁడు శక్తులతోఁ గొట్టెను. అట్లు దెబ్బలు దిని రావణుఁడు మాణిభద్రునికిరీటముమీఁదఁ గొట్టెను. వాఁడు కొట్టిన యాదెబ్బచేత నతనికిరీటము ప్రక్కకుఁ దిరిగిపోయినది; యుద్ధము చేయు చున్న యామాణిభద్రుఁ డించుకయేనియును గంపమునొందక నిలువఁ బడెను. అదిమొదలాయక్షుఁడు పార్శ్వమౌళి యని ప్రసిద్ధి నొందెను. ఆయక్షుఁడు విముఖుఁడు కాఁగానే యాపర్వతముమీఁద గొప్ప కలకల ధ్వని పుట్టినది.

తరువాతను శుక్రుఁడు ప్రోష్ఠపదుఁడు ననుమంత్రులతోడను, పద్మశంఖనిధుల యధిదేవతలతోడను గూడియున్నవాఁడై గద పట్టుకొని కుబేరుఁడు దూరమునుండి చూచెను. అంత నాకుబేరుఁడు శాపవశమున గౌరవముపోయియున్న తమ్ముని రావణుని జూచి బుద్ధిమంతుఁడు గనుక బ్రహ్మవంశమునకుఁ దగినట్లుగా నిట్లనియె: "ఓరి దుర్మతీ! నే నెంత వారించినను నామాటలు లక్ష్యము సేయకుండ నుంటివి. తరువాతను నీవు దీనికిఁ దగినఫలమునుబొంది నరకములో నున్నప్పుడు దెలిసికొందువు గాక! ఏదుర్బుద్ధి యజ్ఞానమువలన విషము ద్రావి తెలిసికొనఁజాలఁడో, వాఁడు దానిపరిణామమువలన దానిఫలము ననుభవించి తెలిసికొనును.

నీవు దుష్కార్యముల నాచరించుచు నీయజ్ఞానమును దెలిసికొనలేకున్న కారణమున నీకు దేవత లెట్టిమేలును దలంపరు. ఎవఁడు తల్లినిగాని, తండ్రినిగాని, యాచార్యునిగాని యవమానించునో వాఁడు దానికిఁ దగినఫలమును యమునియింటికి వెళ్లినప్పుడు తప్పక పొందును. ఎవఁడు మూర్ఖుఁడై యశాశ్వతమైన శరీరముండఁగనే తపస్సు చేయకుండునో వాఁడు చచ్చినవెనుకఁ దనకుఁ దటస్థించిన యధమగతికిఁ బశ్చాత్తాపమును బొందకపోఁడు. ధర్మమార్గమున సంచరించువానికి రాజ్యము, ధనము, సౌఖ్యము మొదలగునవి చేకూఱును. అధర్మమార్గమున సంచరించు వానికి దుఃఖముతప్ప వేఱొండులేదు. కావున సుఖాదులకై సదా ధర్మ మాచరించవలయును. పాపపుఁబనులుచేయరాదు. పాపమునకు దుఃఖము దక్క వేఱుఫలము రాదు. ఆదుఃఖమును దానే యనుభవించితీఱును. కావున మూఢుఁడు తనహానికొఱకే పాపము నార్జించుకొనును. బుద్ధి హీనుఁడగు నేపురుషునకును దనంతటనే శుభమతి గలుగఁబోదు. తానెట్టి కర్మము నాచరించునో యట్టిఫలమునే యనుభవించును. లోకములోని పుణ్యాత్ములు పుణ్యకర్మములచేతనే దానికి ఫలముగా మంచిబుద్ధిని, రూప మును, బలమును, ధనమును, పుత్రులను, మహత్త్వమును బొందుచుం దురు. నీబుద్ధి యిట్టిదుర్మార్గములో నున్నది గనుక నీవు తప్పక నరకమునకుఁ బోదువు. నీవు మొత్తముమీఁద దుర్మార్గులలోనే చేర్పఁదగినవాఁడ వని నిర్ణయించుకొంటిని. కావున నీతో మాటలాడుటగూడఁ దగదు."

కుబేరుఁ డిట్లు చెప్పఁగానే మారీచుఁడు మొదలగు రావణుని మంత్రులందఱును విముఖులై పాఱిపోయిరి. తరువాతను దశగ్రీవుఁడు మహాత్ముఁడగు నాకుబేరునిచే గదతో నెత్తిమీఁదఁ గొట్టఁబడెనుగాని నిలువఁబడినచోటునుండి కదలలేదు. తరువాతను రామా! వారిద్దఱును బరస్పరముగ గొట్టుకొనుచు వికలేంద్రియులునుగాలేదు; అలసతనుబొంద లేదు; పట్టుదల మొదలే విడువరైరి. అప్పుడు కుబేరుఁడు రావణునిపై నాగ్నేయాస్త్రమును బ్రయోగించెను. రాక్షసేంద్రుఁడగు రావణుఁడు వా రుణాస్త్రముతో దానిని వారించెను. తరువాతను రావణుఁడు రాక్షస మాయ నవలంబించి వందలకొలఁది వేలకొలఁది రూపములఁ జూపించెను. దశాననుఁ డొకప్పుడు పెద్దపులివలెను, వరాహమువలెను, జీమూతము వలెను, మఱొకప్పుడు పర్వతమువలెను, సముద్రమువలెను, వేఱొకప్పుడు

చెట్టువలెను, యక్షునివలెను, రాక్షసునివలెను నగపడుచుండెను. ఈరీతిగా బహురూపములు మాత్రమే యగపడుచుండెడివి కాని రావణుఁడు మాత్ర మగపడుట లేదు. తరువాత నావసానమునందు, రామా! గొప్పయస్త్రమును బట్టుకొనియు, గొప్ప గదను గిరగిరఁద్రిప్పియు నాకుబేరుని నెత్తిమీఁదను గొట్టెను. ఈరీతిగా నాకుబేరుఁడు రావణునిచేతఁ గొట్టఁబడి వికలేంద్రియుఁడై రక్తముచేఁ దడిసినవాఁడై మొదలునఱకిన యశోకవృక్షమువలె భూమిపైఁ బడిపోయెను.

తరువాతను బద్మాదినిధుల కధిదేవతలువచ్చి యాకుబేరుని నందన వనమునకుఁ గొనిపోయి యచ్చట నతని నోదార్చుచుండిరి. ఇచ్చట రాక్షసేంద్రుఁడగు రావణుఁడు కుబేరుని జయించి సంతుష్టాంతరంగుఁడై యతనిని జయించినందులకుఁ జిహ్నముగా నతనిపుష్పకవిమానము నపహరించెను. బంగారు స్తంభములు గలదియు, వైడూర్యమణులచేఁ గట్టఁబడిన తోరణములు గలదియు, ముత్యములజాలకములచే నలంకరింపఁబడినదియు, కోరినకోరికల నెల్ల నిచ్చునదియు, మనోవేగముగలదియు, కామగమనము గలదియు, కామరూపముగలదియు, ఆకసమునఁ బోవఁదగినదియు, మణులచేతను బంగారుచేతను నిర్మింపఁబడిన సోపానములు గలదియు, పుటమువేసిన బంగారుతోఁ జేయఁబడిన యరుగులుగలదియు, దేవతలను మోయునదియు, క్షయమును బొందింప శక్యము గానిదియు, నెల్లప్పుడును జూపులకును మనస్సునకును సుఖమును గలిగించునదియు, మిక్కిలి యాశ్చర్యమును గలిగించునదియు, ననేకచిత్రవిచిత్రములైన రచనలు గలదియు, బ్రహ్మదేవునిచే నిర్మింపఁబడినదియు, సర్వకామములతోడను నిర్మింపఁబడినదియు, మనోహరమైనదియు, నిరుపమానమైనదియు నంత శీతమును నంతయుష్ణమును గాక సర్వఋతువులయందును సుఖకరముగా నుండునదియు,శుభకరమైనదియుఁ,దనపరాక్రమము చేజయించి స్వాధీనము చేసికోఁబడినదియు నగు నాపుష్పకవిమానమెక్కి దర్పోద్రేకముచే దుర్మతి యగు నారావణుఁడు మూఁడులోకములను జయించినట్లు తలంచుచుఁ గుబేరుని జయించి కైలాసమునుండి దిగెను. ప్రతాపవంతుఁడును విమలములైన కిరీటములును హారములును గలవాఁడును నగు నారావణుఁడు తన తేజస్సుచేత విపులమైన జయమును బొంది, గొప్పది యగు నావిమానము పైనుండి వేదికయందలి యగ్నివలె వెలుఁగుచుండెను.

## 16-వ సర్గము

### రావణుఁడు కైలాసమెత్తుట

రామా! ఇట్లు రాక్షసాధిపతియగు రావణుఁ డన్నయగు కుబేరుని జయించి కుమారస్వామి పుట్టినస్థలమగు శరవణమునకుఁ బోయెను. అట్లు పోయి కిరణములసమూహముచే నావరింపఁబడి రెండవసూర్యునివలె వెలుఁగుచున్న బంగారువికార మైన గొప్పరెల్లువనమును జూచెను. ఆతఁడు రమ్యమయిన వనములుగల యొకానొక పర్వతము నెక్కి యక్కడనుండి పుష్పకవిమానము నిలువఁబడిపోవుట చూచెను. అట్లు కదలక నిలువఁబడిపోవుట చూచి "కామగమనముగల యీవిమాన మెందులకు నిలువఁబడిపోయినది? అని తనమంత్రులతో నాలోచించెను. ఈవిమానము నాయిష్టప్రకారముగా నెందులకుఁ బోకుండనున్నది? ఈపర్వతము మీఁద నెవ్వఁడయినను నుండి యిట్లు చేయుచున్నాఁడా?" అని రావణుఁ డనుచుండఁగా బుద్ధిమంతుఁడగు మారీచుఁడు లేచి యిట్లనియె: "రాజా! ఈపుష్పక మిచ్చటినుండి కదలకయుండుటకుఁ గారణ మేదియో యుండఁబోలును. ఇది కుబేరునివాహనముగాని యితరులది గాదు. ఒకవేళ నతనిని దక్కఁ దక్కినవారిని మోయదేమో? కావుననే కుబేరుఁడు లేకుండుటచే నిది చలనము మాని నిలువఁబడిపోయినది." అని యిట్లు మారీచుఁడు చెప్పుచుండఁగానే కరాళుఁడును, కృష్ణపింగళుఁడును, వామనుఁడును, వికటుఁడును, ముండియు, వంగిన భుజములు గలవాఁడును, బలవంతుఁడును, శివభగవానుని పార్శ్వచరుఁడునగు నంది వచ్చి రావణునితో నిశ్శంకముగా నిట్లనియె: "దశగ్రీవా! ఇక్కడనుండి మరలిపొమ్ము. ఈపర్వతముపైని శంకరుఁడు క్రీడించుచున్నవాఁడు. సుపర్ణులు, నాగులు, యక్షులు, దేవతలు, గంధర్వులు మొదలగు నేభూతములకును నీపర్వత మగమ్యముగఁ జేయఁబడినది. ఓరిదుర్బుద్ధీ! నీవిచ్చటనుండి మరలిపోకుందువేని వినాశమును బొందఁగలవు."

అనియిట్లు చెప్పిన నందిమాటలు విని కోపమువలనఁ గదలుచున్న కుండలములు గలవాఁడై కన్ను లెఱ్ఱఁజేసికొని పుష్పకవిమానము నుండి దిగి, యారావణుఁడు "ఎవఁ డాశంకరుఁడు" అని వెంటనే కొండయడుగునకు వచ్చెను. వచ్చి యచ్చట శివునికి సమీపముగానే యున్న నందిని

జూచెను. ఆనంది జాజ్వల్యమానుఁడై చేతితో శూలము పట్టుకొని రెండవశంకరునివలె నుండెను. ఆరాక్షసుఁడు వానరముఖుఁడగు నానంది నవమానపఱిచి నీటితో నిండియున్న మేఘము గర్జించినట్లు పెద్దనవ్వు నవ్వెను. శంకరభగవానుని యపరశరీరమగు నానందిభగవానుఁడు కోపించి యచ్చట నిలువఁబడియున్న రాక్షసుని రావణునిఁ జూచి యిట్లనియె: "దశాననా! వానరరూపుఁడనగు నన్నవమానించి పిడుగుపాటుతో సమానముగఁ జప్పుడగునట్లు నవ్వితివి; కనుక నాతో సమానమైన రూపముగల వారును, మద్వీర్యముతో సమానమైన వీర్యముగలవారును, యుద్ధోన్మత్తులును, బలోద్రిక్తులును, పడగొండలవంటివారును, నఖములు దంష్ట్రలును ఆయుధములుగాఁ గలవారును, క్రూరులును, వాయువేగమనోవేగములు గలవారును నగు వానరులు నీకులమును నిన్నును జంపుట కొఱకుఁ బుట్టఁగలరు. వారు ప్రబలమైన నీగర్వమును, నీయాటోపమును బోఁగొట్టుదురు. మఱియు నిన్ను మంత్రులతోడను బుత్రాదులతోడను యుద్ధములోఁ జంపఁగలరు. నిశాచరా! నేనే నిన్నిప్పుడు చంపఁగలను గాని చంపఁదగినవాఁడవు గావు. ఇదివఱకు నీవు చేసిన చెడుకర్మముల చేతనే చచ్చియున్నావు." మహాత్ముఁడును స్వయంప్రకాశమానుఁడును నగు నంది యిట్లు చెప్పుచుండఁగా దేవదుందుభులు మ్రోఁగినవి. అంత రిక్షమునుండి పుష్పవర్షము గురిసినది. మహాబలుఁడగు నారావణుఁడు నంది చెప్పినమాటలు లక్ష్యముసేయకయే పర్వతముదగ్గఱకుఁ బోయి యిట్లనియె: "గోపతీ! నేను బోవుచుండఁగా నాపుష్పకముయొక్క గమన మాఁగిపోయినది గావున నే నిపు డీపర్వతమునే పెల్లగించెదను. నీయేలిక యగు భవుఁ డేప్రభావముచేత రాజువలె నిత్యమును క్రీడించుచుండెనో తెలిసికోవలసియున్నది. అతనికి భయంకరుఁడనగు నేను వచ్చియున్నానని తెలిసియుండలేదు గాఁబోలును!" రామా! ఇట్లు చెప్పి రావణుఁడు తనబాహువులను క్రిందికిఁ జొనిపి యాపర్వతమును మీఁది కెత్తమొదలిడెను. అప్పు డప్పర్వతము కంపించినది. పర్వతచలనమువలన దానిపైనున్న ప్రమథులు పార్వతియుఁ గంపమునొందిరి. పార్వతి భయపడి వెంటనే మగనిఁ గౌఁగిలించుకొన్నది. తరువాతను దేవదేవుఁడగు శివుఁడు సంగతిని దెలిసికొని తనపాదాంగుష్ఠముచేత నాపర్వతమును లీలగాఁ గ్రిందికి నొక్కెను. ఆనొక్కుటవలనఁ గొండక్రిందను బడియున్న

రావణునియిరువదిచేతులును గానుగలోఁ బెట్టినచెఱకుగడలవలె నలిగి పోయినవి. అచ్చట నిలువఁబడి చూచుచున్న రావణునిమంత్రు లాశ్చర్య మును బొందిరి. రావణుఁడు కోపముచేతను భుజములబాధచేతను మూఁడులోకములును గంపమునొందునట్లు వెంటనే మొఱ్ఱపెట్టుటకు మొద లిడెను. మానవు లాశబ్దముచే భీతినొందినవారై ప్రళయము దాపురిం చినదని తలఁచిరి. అప్పుడు దేవేంద్రుఁడు మొదలైనదేవతలు తమస్థాన ములనుండి చలనమును బొందిరి; సముద్రములు క్షోభించినవి. పర్వత ములు కదలినవి. యక్షులు, విద్యాధరులు, సిద్ధులు మొదలగువా రిది యేమని యాకులపాటొందిరి. తరువాత నతనిమంత్రు లిట్లు మొఱ్ఱపెట్టు చున్న రావణుని జూచి యిట్లనిరి: "రాక్షసరాజా! నీలకంఠుఁడును, ఉమాపతియు నగుమహాదేవుని స్తుతించి సంతోషపెట్టుము. ఇపు డతనిని విడిచి వేఱు దిక్కు గనుపడదు. నమ్రుఁడవై స్తుతించుచు నతనినే శరణు పొందుము. దయాళుఁడగు శంకరుఁడు నీయం దనుగ్రహాము గలవాఁ డగును." ఇట్లు మంత్రులు చెప్పఁగానే యారావణుఁడు నమస్కారపూర్వ కముగా సామములచేతను, వివిధములైన స్తోత్రములచేతను వృషభధ్వజుఁ డగు శివుని స్తుతించెను. ఇట్లు స్తుతిచేయుచు నేడుచుచు నుండఁగాఁ నొక్కవేయిసంవత్సరములు గడచినవి.

శ్రీరామా! తరువాతను గొండశిఖరముపైనున్న శివుఁ డాతని స్తుతులకు సంతోషించి పాదాంగుష్ఠమును దీసివైచి రావణునితో నిట్ల నియె: "దశాననా! నీపరాక్రమమునకును, నీశౌండీర్యమునకును నీ స్తుతికిని నేను జాల సంతోషించితిని. కొండక్రిందను బడి నీచేతులు నలుగుచున్నప్పుడు నీచే విడువఁబడినధ్వని మూఁడులోకములను భయము పాలుచేసి పరుగులెత్తించినది; కనుక నీ విటుపైని రావణుఁడవని పేరు పడయఁగలవు. ఇటుపైని దేవతలు, మనుష్యులు, యక్షులు, మఱియు నితరులు లోకరావణుఁడవగు నిన్ను రావణుఁ డనియే వ్యవహరించు చుందురు. పౌలస్త్యా! ఇటుపైని నీయిష్టమైనదారిని బొమ్ము. నేను నీకనుజ్ఞ యిచ్చితిని." ఇట్లు శివుఁడు చెప్పినమాటలువిని యాయనతో రావణుఁ డిట్లనియె: మహాదేవా! నీవు నావిషయమై సంతోషించితివేని యాచించు చున్న నాకు వరమిమ్ము. నే నిదివఱకే దేవగంధర్వాదులచేఁ జావులేకుండ వరమును బొందియుంటిని. మనుష్యులను నేను లెక్కసేయను. పాపము!

వారు స్వల్పులు కదా! దేవా! వారు నన్నేమిచేయఁగలరు? త్రిపురాంతకా! నేను బ్రహ్మవలన దీర్ఘమైన యాయువును బొందియే యున్నాను. బ్రహ్మయిచ్చిన యాయువులోఁ బోయినభాగమును, శస్త్రమును నిన్నుఁ గోరుచున్నాను. అవి నాయందు దనుగ్రహించి నాకు దయచేయుము. రావణుఁ డిట్లు కోరఁగానే యాశంకరుఁడు చంద్రహాసమను పేరుగల ఖడ్గమును, ఆయుశ్శేషమును వానికిచ్చి మరల వానితో నిట్లనియె: "రావణా! నీ వెప్పుడును దీని నవమానింపకుము. ఎప్పుడు నీవు దీని నవమానింతువో, అప్పుడే యిది నిస్సంశయముగా నాయొద్దకు వచ్చి చేరును." ఇట్లు శివునిచే రావణుఁడని నామకరణము చేయఁబడి యాయనకు నమస్కరించి వెంటనే పుష్పకవిమాన మెక్కెను. రామా! తరువాతను రావణుఁడు మహావీర్యసంపన్నులగు రాజులను బాధించుచు భూమితలమున నిటునటుఁ దిరుగుచుండెను. తేజశ్శాలులును శూరులును నగుకొందఱు క్షత్రియులును యుద్ధదుర్మదులై వానియాజ్ఞను మన్నింపక సపరివారముగా నశించిపోయిరి. మఱికొందఱు బుద్ధిమంతులు వీఁడు జయింపదగినవాఁడుగాఁడని నిశ్చయించుకొని యోడితిమని చెప్పి బలగర్వితుఁడగు నతనికి లొంగియుండిరి.

## 17-వ సర్గము

### వేదవతి వృత్తాంతము

శ్రీరామచంద్రా! పిమ్మట మహాబాహుఁడగు రావణుఁడు భూమియందుఁ దిరుగుచు హిమవత్పర్వతప్రాంతమునకు వచ్చెను. అచ్చట నొక కన్యక ఋషులమాదిరిగాఁ గృష్ణాజినజటావల్కలముల ధరించి దేవకన్యకవలె జాజ్వల్యమానురాలై యతని కగపడినది. రూపవంతురాలును మహావ్రతపరాయణురాలును నగు నాకన్యను జూచి కామమోహపరీతాత్ముఁడై యారావణుఁడు నవ్వుచు నిట్లనియె: "సుందరీ! నీవేల యీలేలను యౌవనమునకు విరుద్ధమైన యీవ్రతము నవలంబించియున్నావు? నీరూపమున కీతపస్సు చేయుట యెంతమాత్రమును యుక్తముగాదు. భీరూ! నీరూపము నిరుపమానమైనది. మఱియు మనుష్యులకుఁ గామోన్మాదమును గలిగించునది. కనుక నిటువంటిరూపమును దపస్సునం దుంచుట తగదని నేను నిశ్చయించితిని. వరవర్ణినీ! నీ వెవనికుమారితవు? బింబోష్ఠీ!

నీపతి యెవరు? అహాహా! నీవంటి మచ్చెకంటిని బెండ్లియాడిన పురుషు నికి గదా యదృష్టము! నీ వెందుల కీలాగు శ్రమపడుచున్నావో నాకుఁ జెప్పుము." అనునతనిమాటలు విని యశస్వినియగు నాకన్యక యథార్థముగా నతని కతిథిసత్కారాదు లొనరించి యిట్లనియె: "బృహస్పతి కుమారుఁడును, బుద్ధిచే బృహస్పతితో సమానుండును, శ్రీమంతుండును, అమితప్రభావంతుఁడును నగు కుశధ్వజుఁడను బ్రహ్మర్షి యుండెడివాఁడు. నిత్యమును వేదాభ్యాసమును జేయుచుండు నామహాత్ముని కుమారితను. నే నతనికి వాఙ్మయి యగు కన్యను. నాపేరు వేదవతి యందురు. దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు మొదలగువారు వచ్చి మాతండ్రిని నన్నుఁ దమకు భార్యగా నిమ్మని యడుగుచుండెడివారు. రాక్షసశ్రేష్ఠా! యెంద రెన్ని విధములుగా వచ్చి యడిగినను నన్ను వారి కెవ్వరికిని మాతండ్రి యీయ కనెను. ఆ ట్లీయ కనుటకుఁ గారణము చెప్పెద నాలకింపుము. సురేశ్వరుఁడును త్రిలోకీపతియునగు విష్ణుభగవానుని జామాతనుగాఁ జేసికొనవలయునని మాతండ్రి సంకల్పించుకొనెను. కావుననే న న్నితరుల కీయ నంగీకరింపకుండెను. ఆసంగతి తెలిసికొని బలదర్పితుఁడును రాక్షసరాజును నగు దంభుఁడు కోపించి రాత్రి పరుండి నిదురపోవుచుండఁగా వచ్చి మాతండ్రిని జంపిపోయెను. తరువాతను దీనురాలగు నాతల్లి మాతండ్రిమృతశరీరమును గౌఁగిలించుకొని యగ్నిలోఁ బ్రవేశించినది. తరువాతను నేను మాతండ్రియొక్క సత్యమైన మనోరథమును బూర్తిచేయుద మనుసంకల్పము గలదాననై నారాయణుని మనస్సుచే భర్తనుగాఁ జింతించుచు నిట్లు తపస్సుచేయుచున్నాను. రాక్షసపుంగవా! నావృత్తాంతమంతయుఁ జెప్పితిని. నారాయణుఁడు నాపెనిమిటి కాని యాపురుషోత్తమునికంటె నితరుఁడు గాఁడు. నారాయణుని వరించు కొఱకై యీఘోరమైననియమము నవలంబించియున్నాను. పౌలస్త్యనందనా! రావణా! నిన్ను నేను దెలిసికొంటిని. నీవు పొమ్ము. నేను దపస్సుచేతను మూఁడులోకములయందు జరుగువృత్తాంతమును దెలిసికొనఁగలను" అను నావేదవతిమాటలు విని సుమహావ్రతురాలగు నా కన్యను జూచి మన్మథబాణములకు వశంవదుఁడై విమానమునుండి దిగి యామెతో మరల నిట్లనియె:

సుశ్రోణీ! నీవు గర్వించినట్లు కనుపట్టుచున్నావు. కావుననే నీ

బుద్ధి యీరీతిగా నున్నది. మృగశాబాక్షీ! తపస్సు మొదలగు పుణ్య
సంపాదనము వృద్ధులకు శోభించును. సర్వగుణసంపన్నురాలవగు నీ
వీరీతిగాఁ బలుకవచ్చునా? త్రైలోక్యసుందరీ! భీరూ! వ్యర్థముగా నీ
యౌవనము పోవుచున్నది. సుందరీ! నేను లంకాధిపతిని. నాపేరు
దశగ్రీవుఁ డందురు. అట్టినాకు భార్యవై సుఖముగా సమస్తభోగముల
ననుభవింపుము. ఎవనిని నీవు మాటిమాటికిని విష్ణుఁ డనుచున్నావో
వాఁ డెవఁడు? ఏపాటివాఁడు? వానికి నాపాటిపరాక్రమము గలదా?
నావలెఁ దపస్సు చేసియున్నాఁడా? నే ననుభవించుచున్న భోగములు
వాని కున్నవా? నాయంతటి బలవంతుఁడా? కావున నీవు కోరు
కొన్నవాఁ డేవిధముగాఁ జూచినను నాతో సమానుఁడు గాఁడు." ఇట్లు
రావణుఁడు చెప్పినమాటలు విని యా వేదవతి యిట్లనియె: "రాక్షస
రాజా! మూఁడులోకములకుఁ బ్రభువును, సర్వలోకములవారిచేతను
నమస్కరింపఁబడుచుండువాఁడును నగు విష్ణుమూర్తినిగూర్చి నీ విట్లనఁ
గూడదు. నీవుదక్కఁ దక్కినవాఁ డెవఁడును నేమాత్రము బుద్ధియుండి
నను విష్ణుమూర్తి నిట్లవమానింపఁడు." ఇట్లు వేదవతి యనఁగానే యా
నిశాచరుఁడు రావణుఁడు తన చేతులతో నామెజుట్టు పట్టుకొనెను. తన
వాతను వేదవతి కోపించినదై తనహస్తముచేతను దలవెంట్రుకలు ఛేదించి
నది. ఆమె చేయియే కత్తియై తలవెంట్రుకలను గోసివైచినది. మఱియు
నామె కోపముచే జాజ్వల్యమానురాలైనదివోలె, రావణుని దహించు
చున్నదివోలె మరణమునకు సంసిద్ధురాలై యెదుట నగ్ని బ్రజ్వలింపఁ
జేసి వానితో నిట్లన్నది: "అనార్యా! నీచే నవమానింపఁబడినయీనాకు
జీవిత మక్కఱలేదు. రాక్షసా! కావున నీవు చూచుచుండఁగానే యీ
యగ్నిహోత్రములోఁ బ్రవేశించెదను. నే నీవనములోఁ దపస్సుచేసి
కొనుచుండఁగా వచ్చి, పాపాత్మా! నన్ను నవమానించితివి గనుక నీ వధ
నిమిత్తమై నేను మరలఁ బుట్టితీఱెదను. పాపనిశ్చయుండగు పురుషుని స్త్రీ
చంపఁజాలదు. నిన్ను శపించినచో వ్యర్థముగా నాతపస్సు పోవును. ఒక
వేళ నేను జేసినసుకృత మేదేని యున్నచో నయోనిజను బతివ్రతనుగా
నావిర్భవించి ధర్మియనునతనికిఁ గుమారిత నగుదును." ఇట్లు రావణు
నితోఁ జెప్పి వెంటనే మండుచున్న యగ్నిహోత్రములోఁ బ్రవేశించినది.
అపు డాకాశమునుండి పుష్పవర్షము గురిసినది. పద్మసమప్రభయగు

నామె మరలఁ బద్మములోఁ బుట్టి యతనికే దొరకినది. పద్మగర్భముతో సమానమైన కాంతిగల యాకన్యను దీసికొని తనయింటికిఁ బోయి మంత్రికిఁ జూపించెను. లక్షణజ్ఞుఁడైన యామంత్రి యాకన్యను బాగుగాఁ బరీక్షించి యిది నీయింట నుండినచో నీవధకొఱ కగునని చెప్పెను. ఆ మాట వినఁగానే రావణుఁ డాకన్యను సముద్రములో విడిచెను. ఆకన్య క్రమముగా భూమిని బొంది యజ్ఞభూమిలో నాఁగటిచాలులో జనకరాజునకు దొరకినది.) ఆకన్యయే జనకమహారాజునింటఁ గన్నబిడ్డవలెనే పెరిఁగి నీకు భార్యయైనది. నీవేకదా సనాతనుఁడవగు విష్ణుఁడవు. పూర్వము కోపమును గలిగించిన రావణుఁ డను శత్రువును కొండవంటి వానిని మనుష్యదుర్లభమగు నీబలము నాశ్రయించి యామెయే చంపినది. ఆమహాభాగ్యురాలు మనుష్యలోకములో నీరీతిగా మరలఁ బుట్టినది. నాఁగటితో దున్నఁబడిన యజ్ఞభూమియందు వేదికయందలి యగ్నిశిఖవలె నామె పుట్టినది. పూర్వము కృతయుగములో వేదవతి యను పేరుతో నుండెడిది. త్రేతాయుగమున నారాక్షసుని జంపునిమిత్తమై మైథిలవంశమున మహాత్ముఁడగు జనకమహారాజుకూఁతు రని పేరుపొందినది. సీత యనఁగా నాఁగటిచాలు. దానియందు బుట్టినది గనుక నామె నందఱును సీత యని పిలుచుచుండువారు.

## 18-వ సర్గము

### రావణుఁడు మరుత్తుని యజ్ఞవాటమునకుఁ బోవుట

శ్రీరామా! వేదవతి యిట్లు హుతాశనప్రవేశము కాఁగా రావణుఁడు పుష్పకమెక్కి భూమిపైఁ దిరుగుచుండెను. తరువాతను మరుత్తుఁ డనురాజు దేవతలతోఁగూడి యజ్ఞము చేయుచుండఁగా రావణుఁడు చూచెను. బ్రహ్మర్షియు బృహస్పతికి సోదరుఁడును ధర్మజ్ఞుఁడును నగు సంవర్తుఁడు దేవతలందఱతోడఁ గూడి యజ్ఞము చేయించుచుండెను. దేవత లారావణుని జూచి వీఁడు వరదానమువలన దుర్జయుఁడని తెలిసికొని, వానిని జూడఁజాలనంతగా భయపడి తిర్యగ్జంతువుల యాకారము నవలంబించిరి. ఇంద్రుఁడు నెమిలియు, యముఁడు కాకియు, కుబేరుఁడు తొండయు, వరుణుఁడు హంసయు, మఱికొందఱు దేవతలు మఱికొన్ని జంతువులుగాను నైరి. తరువాతను రావణుఁ డశుచి యగు కుక్కవలె

యజ్ఞవాటమునఁ బ్రవేశించెను. మరుత్తును జూచి యారావణుఁడు "యుద్ధమైనను జేయుము; లేదేని యోడితినని యేనిఁ జెప్పు"మనెను. తన వాతఁడు మరుత్తమహారాజు "నీవెవ్వఁడ"వని యడుగఁగా నవ్వి రావణుఁ డిట్లనియెను: "రాజా! నీయకుతూహలభావమునకు; అనఁగా నన్నుఁ జూచియు నాశ్చర్యము లేకుండుటకు, భయము లేకుండుటకు, ఆదరము లేకుండుటకు నేను జాల సంతోషించితిని. నేను కుబేరునితమ్ముఁడను, నాపేరు రావణుఁడు నన్నెఱుఁగఁ జాలకుండ నున్నావుగా! ఈమూఁడు లోకములయందును నాబల మెఱుఁగనివాఁ డున్నాఁడా? వేయేల? నాయన్నను జయించి యీవిమాన మపహరించినవాఁడను." అని వాని మాటలు విని తరువాత నామరుత్తమహారాజు రావణునితో నిట్లనియె:

తండ్రితో సమానుఁడగు నన్నను జయించిన నీవు మహాధన్యుఁ డవు. మూఁడులోకములయందును నీవంటి శ్లాఘింపఁదగినపురుషుఁడు లేఁడు. అధర్మసహితమైనపని శ్లాఘింపఁదగినది గాదు. అది యుత్తమలోక ములను గూర్చునదియుఁ గాదు. అన్నను జయించుటకంటె దుర్మార్గపుఁబని యుండునే? అట్టినిందితమైనపని చేసియు మెచ్చుకొనుచున్నావుగా! నీవు పూర్వమం దేమిధర్మము నాచరించి వరమును బొందితివో కాని యిపుడు నీవు చెప్పుకొనుచున్నసంగతి నే నిదివఱకు విని యుండలేదు. దుర్మతీ! *ఉండుండుము. నాయెదుటినుండి బ్రదికి పోఁజాలవు. ఇపుడే నిన్ను వాఁడిబాణములతోఁ జంపి యమునియింటికిఁ బంపెదను." అని చెప్పి యారాజు ధనుర్బాణములను గ్రహించి యుద్ధమునకు బయలు దేఱెను. అపుడు సంవర్తుఁ డడ్డముగా వచ్చి స్నేహమును సూచించు నట్లుగా నారాజుతో నిట్లనియె: రాజా! నీవు నామాట వినఁదలంచితి వేని వినుము. ఇపుడు వీనితో యుద్ధము మంచిది గాదు. ఈమహేశ్వర యజ్ఞము పూర్తిగానిచో వంశమును దహించును. యజ్ఞదీక్షితుఁ డెట్లు యుద్ధము చేయఁదగును? మఱియు యజ్ఞదీక్షితునికిఁ గోపము దగునా? అదిగాక యుద్ధములో జయమే కలుగుననునిశ్చయ మెక్కడ? ఈరాక్ష సుఁడా దుర్జయుఁడు." ఇట్లు గురువగు సంవర్తుఁడు చెప్పిన మాటలు విని యామరుత్తుఁడు యుద్ధవ్యాపారము మానుకొని శరచాపములు విడిచి మరలి యజ్ఞముచేసికొనుట కుద్యుక్తుఁడాయెను. తరువాత నతఁడే యోడి పోయె నని తలఁచి రావణునిమంత్రియగు శుకుఁడు, రావణుఁడే జయించె

నని చాటించి సంతోషముగాఁ బెద్దకేకలువైచెను. రావణుఁ డాయజ్ఞవాటములోనున్న ఋషులను భక్షించి వారిరక్తముచేఁ దృప్తి పొంది యచ్చట నుండి మఱియొకచోటునకుఁ బోయెను. ఇట్లు రావణుఁడు వెడలిపోయిన తరువాత నింద్రాదిదేవతలు తమతమ నిజరూపములను బొంది యాయా జంతువులను బిలిచి యిట్లనిరి :

అపు డింద్రుఁడు నల్లనిపించెముగల నెమలిని జూచి సంతోషముతో నిట్లనియె : "ధర్మజ్ఞా ! సంతోషించితిని. నాయీ వేయికన్నులును నీపించముపై నుండును. కావున నీకుఁ బాములవలన భయము లేదు. నేను వర్షించునపుడు ప్రీతిలక్షణమైన సంతోషమును బొందఁగలవు." ఈరీతిగా నింద్రుఁడు నెమలికి వరమిచ్చెను. రామా ! పూర్వము నెమిళ్ళకుఁ బించెములు నల్లగా నుండెడివి. ఇంద్రునివలన వరమును బొంది నెమిళ్ళన్నియు విచిత్రవర్ణములు గలవైనవి. అపుడు యముఁడు ప్రాగ్వంశము నం దున్నకాకిని జూచి యిట్లనియె : పక్షీ ! నేను నీవిషయమున సంతోషించితిని. నాసంతోషమునకు సూచకముగా నేను జెప్పునది వినుము. నేను వివిధరోగములచేఁ బ్రాణులను బీడించుచుండునట్లు నిన్నుఁ బీడింపను. ఇది నాసంతోషమునకు సూచకము. ఓవిహంగమా! నావరమువలన నీకు మృత్యువువలన భయము లేదు. నిన్ను మనుష్యులు చంపునందాఁక బ్రతికియుండఁగలవు. ఆఁకలితోఁ బీడింపఁబడుచు నాలోకములో నున్నపితరులు నీవు భుజించినచో వారు బంధువులతోఁగూడ దృప్తిని బొందుదురు." తరువాతను వరుణదేవుఁడు గంగాజలవిహారి యగు హంసను జూచి యిట్లనియె : "ఓపక్షిరాజా ! ప్రేమతోఁగూడిన నామాటను వినుము : సౌమ్యా ! నీశరీరకాంతి చంద్రబింబముతో సమానమై మనోహరముగా నుండును. మఱియు శుద్ధమైన నురుగుతో సమానముగా నున్నతమై యుండఁగలదు. నాశరీరమగు జలమును బొంది నిత్యమును మనోహరముగా నుండఁగలవు. నిరుపమానమైన సంతోషమును గూడఁ బొందఁగలవు. ఇదియే నీయందు నాకుఁ గలిగినప్రేమకు లక్షణము." రామా ! పూర్వము హంసలు నీలవర్ణము పాండురవర్ణము గలవియై యుండెడివి. మఱియు వానిరెక్కలు నీలవర్ణముచేత నగ్రదేశమునందుఁ గూడియుండెడివి. ఉదరప్రదేశములు బాలతృణాగ్రముతో సమానమైన కాంతిగలిగి నిర్మలముగా నుండెడివి. తరువాతను గుబేరుఁడు కొండ

మీఁదనుండు తొండను జూచి యిట్లనియె: "ఓకృకలాసమా! నేను నీయందుఁ జాలప్రేమగలవాఁడ నయితిని. నీకు బంగరువంటి కాంతి గలుగునట్లును, నీ వెప్పుడుచూచినను ద్రవ్యముతోఁ గూడి యుండు నట్లును వర మిచ్చితిని. నాప్రేమకు సూచకముగా నిదిగో బంగారువర్ణము నీకుఁ గలుగును." ఆయజ్ఞోత్సవమునందు దేవత లీరీతిగా వరము లిచ్చి యారాజుతోఁగూడఁ దమలోకములకుఁ బోయిరి.

## 19-వ సర్గము

### రావణుఁ డనరణ్యుని జంపుట

తరువాతను రాక్షసాధిపతియగు నారావణుఁడు మరుత్తమహారాజును జయించి యుద్ధము చేయుదమనుకోరికతో రాజులుండు పట్టణములకు బయలుదేఱెను. మహేంద్రవరుణోపములగు రాజులయొద్దకుఁ బోయి 'నాతో యుద్ధము చేయుటకు రండ'ని పిలిచెను. 'యుద్ధము చేయఁ జాలరేని 'యోడితి'మనియైనను జెప్పుఁడనెను. 'ఇదియే నానిశ్చయ' మనెను. 'ఈరెంటిలో నేదిచేయకయున్నను మిమ్ములను వధించువాఁడను' గా'ననెను. తరువాత భయములేనివారును, ప్రాజ్ఞులును, ధర్మనిశ్చయులును, మహాబలులును నగురాజు లన్యోన్యము నాలోచించుకొని శత్రువగు రావణుని వరబలము దెలిసికొని యోడితి మని చెప్పిరి. దుష్యంతుఁడు, సురథుఁడు, గాధి, గయుఁడు, పురూరవసుఁడు మొదలగురాజులందఱును నోడిపోయితి మని యొప్పికొనిరి. తరువాత రాక్షసాధిపతి యగు రావణుఁడు దేవేంద్రుఁ డమరావతిని బాలించుచుండున ట్లనరణ్యమహారాజుచేఁ బాలింపఁబడుచున్న యయోధ్యకు వచ్చి పురుషశార్దూలమును, బలమున నింద్రసముఁడును నగు నాయనరణ్యమహారాజునొద్ద కేగి యిట్లనియె: "రాజా! నాతో యుద్ధమైనను జేయుము; లేదేని, యోడితి ననియైనను జెప్పుము. ఇది నాయాజ్ఞ" ఇట్లనినపాపాత్ముని మాటలు విని యయోధ్యాధిపతి యగు నాయనరణ్యమహారాజు కోపించి వానితో నిట్లనియె: "ఓయీ, రాక్షసరాజా! రమ్ము. నాతో ద్వంద్వయుద్ధము చేయుదువు. ఇదిగో నేను సిద్ధముగానున్నాఁడను. నీవును సిద్ధుఁడవుగమ్ము."

రామా! తరువాత నంతకుముందుగనే యీసంగతియంతయుఁ దెలిసికొనియుండుటచే నాయనరణ్యమహారాజుయొక్క సైన్యము

మిక్కిలి యుక్కుటతో రాక్షసవధనిమిత్తమై బయలుదేఱినది. ఆసైన్యము యొక్క లెక్క వక్కాణించెద వినుము: పదివేలయేనుఁగులు, ఒకనియుతము గుఱ్ఱములు, పెక్కువేలు రథములు, పదాతులును. ఈచతురంగబలము భూమిని గప్పివైచుచున్నట్లు బయలుదేఱినది. యుద్ధవిశారదుఁడవగు నోశ్రీరామా! తరువాతను రావణునకు ననరణ్యమహారాజునకును ఘోరమైన యుద్ధము జరిగినది. ఆమహారాజుసైన్యమంతయు రావణునిబలముతో నెదుర్కొని యగ్నిలో వేల్వఁబడిన యాజ్యాదిహవిస్సువలెనే పేరులేకుండ భస్మమైనది. మఱియు నాసైన్యము నిరుపమానపరాక్రమము నవలంబించి చిరకాలము యుద్ధము చేసి మండిపడుచున్న యారావణసైన్యముచు సమీపించి, తుద కల్పావశేష మయిపోయినది. వేయేల? సంకులమై యాసైన్యమంతయు మండుచుండు నగ్నిహోత్రములో మిడుతల సమూహామువలెఁ బడిపోయినది. అప్పు డనరణ్యమహారాజు తనసైన్యమంతయు వందలకొలఁది యడవియేఱ్లు సముద్రములోఁ గలిసి పేరులేకుండఁ బోయినట్లు పోవుచుండుట చూచి మిక్కిలి కోపించి, యింద్రధనుస్సుతో సమానమైనధనుస్సు పట్టుకొని రావణు నెదుర్కొనెను. రావణునిమంత్రులు మారీచుఁడు, శుకుఁడు, సారణుఁడు, ప్రహస్తుఁడు మొదలగువా రనరణ్యునిచేఁ గొట్టఁబడి మృగములవలెఁ బాఱిపోయిరి. అప్పు డిక్ష్వాకుకులనందనుండగు నాయనరణ్యమహారాజు రాక్షసరాజగు రావణునినెత్తిమీఁద నెనిమిదివందలబాణములచేఁ గొట్టెను. ఇట్లెన్ని బాణములు పడినను వాని నేమియుఁ జేయఁ జాలకపోయినవి. కొండపైనిఁ బడి వర్షధార లేమి చేయఁగలవు? అపుడు రావణుఁడు మిగులఁ గోపించినవాఁడై తనయరచేతితో నామహారాజునెత్తిమీఁద నొకచఱపు చఱచెను. వెంటనే యాదెబ్బకుఁ దాళఁజాలక యనరణ్యుఁడు రథమునుండి క్రిందఁబడెను. ఇట్లు పడి శిథిలమైన యవయవములుగలవాఁడై కంపము నొందుచు నరణ్యములోఁ బిడుగుపడి దగ్ధమైన చెట్టువలెఁ బడిపోయియుండెను. అపుడు రావణుఁడు నవ్వుచు నాయనతో నిట్లనియె: "రాజా! నాతో యుద్ధము చేసినందుకుఁ దగినఫలము దొరకినది గదా! నాతో ద్వంద్వయుద్ధము చేయువాఁడు మూఁడులోకములయందును లేఁడని నేను మొదటనే చెప్పితిని. భోగాసక్తుఁడవై యుండుకతన నాబలపరాక్రమములు వినియుండలేదు గాఁ

బోలుదు!' రావణుఁ డిట్లుపలుకఁగా మందప్రాణుఁడగు రాజర్షియిట్లనియె: ఇపు డేమిచేయుటకును వీలుగాకపోయినది. కాలము దురతిక్రమమైనది. ఆత్మప్రశంసాపరాయణుఁడవగు నో రావణా! నీచే నేను జయింపఁబడుట లేదు. నన్నుఁ గాలము జయించినది. కారణమాత్రము నీవైతివి. ఇంత మాత్రముచే నన్ను జయించితి నని సంతోషపడకుము. కాని యిపుడు నాప్రాణము పోవుటకు సిద్ధముగా నున్నది. ఏమిచేయుటకును శక్యము గాదు. నీతో యుద్ధముచేయుచుండఁగా నేను విముఖుఁడను గాలేదు. నీవు నన్నన్నమాట యిక్ష్వాకువంశపురాజులకు నవమానకరమైనది గనుక, నే నిప్పు డొక్కమాట చెప్పుచున్నాను. నేను దానములు చేసిన వాఁడనైతినేని, నాచేసినహోమములచే దేవతలు సంప్రీతులైరేని, మఱియు నేనేమాత్రమైనను బుణ్యము చేసితినేని, నేను ప్రజలను ధర్మమార్గమునఁ బాలించినవాఁడ నయితినేని నే నన్నమాట యథార్థమగుఁ గాక! మహాత్ములగు నిక్ష్వాకుకులవంశమందు దశరథమహారాజునకుఁ గుమారుఁడై రాముఁడనువాఁడు పుట్టఁగలఁడు. అతఁడు నీప్రాణములను హరింపఁగలఁడు. ఇట్లా యనరణ్యమహారాజు శాపమీయఁగానే మేఘము వలె నుదగ్రమైన దేవదుందుభి మ్రోగినది; అంతరిక్షమునుండి పుష్పవర్షము గురిసినది. రాజేంద్రా! శ్రీరామా! తరువాత నామహారాజు స్వర్గమునకుఁ బోయెను. ఆరా జట్లు స్వర్గతుఁడు కాఁగానే యచ్చటినుండి రావణుఁడు వేఱొకచోటునకుఁ బోయెను.

## 20-వ సర్గము

### నారద రావణసమాగమము

ఇట్లు రావణుఁడు భూమియందుఁ దిరుగుచు మనుష్యులను భయము నొందించుచు నాకాశమార్గమునఁ బోవుచుమునిపుంగవుని నారదుని జూచెను. నిశాచరుఁడగు దశాననుఁడా నారదమహామునికి నమస్కరించి కుశలమడిగి యాగమనప్రయోజనము నడిగెను. మహాతేజశ్శాలియు, దేవర్షియు, అమితప్రభగలవాఁడును నగు నారదుఁడు మేఘపృష్ఠమునం దుండియే పుష్పకవిమానముపైనున్న రావణునితో నిట్లనియె : రాక్షసాధిపతీ! సౌమ్యా! విశ్రవస్తనూజా! ఊర్జితములును, నీవంశమునకుఁ దగినవియు నగు నీపరాక్రమాదులకుఁ జాలసంతోషించితిని. విష్ణునిచేతనైన

రాక్షసఘాతముల చేతను, గంధర్వోరగధర్షణముల చేతను, నీవు చేసినయుద్ధముల చేతను నేను మిక్కిలి సంతోషించితిని. అయినను నేను గొంచెము చెప్పవలయునని యనుకొనుచున్నాను. వినఁదలఁచితివేని సావధానముగా విందువుగాక! విని తరువాతను నీకుఁ దోఁచినతీరునఁ జేయునది. నాయనా! రావణా! దేవతలచేఁగూడ వధ్యుఁడవు గాని నీవు వ్యర్థముగా మృత్యువశంవదులైన మనుష్యుల నేటికిఁ జంపెదవు? నిష్కారణముగా నీవు మనుష్యులను జంపకుము. తమకు శ్రేయస్సెట్లుకలుగునో తెలిసికొనఁజాలనివారును, గొప్పగొప్ప వ్యసనములతోఁ గూడియున్నవారును, ముదిమితోడను వందలకొలఁది రోగములతోడను గూడియున్నవారును నగు నిట్టిమనుష్యుల నెవ్వఁడైనను జంపఁజూచునా? మఱియు నానావిధయనిష్టములతోఁ గూడి యుండువారితో యుద్ధము చేయుటకు బుద్ధిగలవాఁడెవ్వఁడైనను బ్రయత్నించునా? ఆఁకలిదప్పులచే వ్యాకులపడుచుండువారును, దైవవంచితులును నగు మనుష్యులను నీవు నశింపఁజేయకుము. మహాబాహుఁడవగు నో రాక్షసరాజా! నూచితివిగదా! మనుష్యలోకమెట్లున్నదో! మూఢమై విచిత్రార్థమై యెటు చూచినను గతి యగపడకయున్నది. ఒకానొకచోట సంతోషించుచుండు జనులు నృత్యగీతవాద్యాదులతో సంతోషముగాఁ గాలము గడపుకొనుచున్నారు. మఱియొకచోటున నెత్తి నోరు మొత్తుకొనుచు సంతతము కన్నులనీరు కాల్వలుగట్టి ప్రవహించుచుండఁగా నార్తులై యేడుచుచున్నారు. తలిదండ్రులయు, దారపుత్రాదులయు స్నేహపాశములచేఁ గట్టువడి యీమనుష్యలోకములోనిజనులు మోహితులై యెందులకును బనికిరాక తమతమక్లేశముల నెఱుంగలేకుండ నున్నారు. మోహముచేతనే చచ్చినట్లున్న యీమనుష్యులను గష్టపెట్టినంతమాత్రమున నీకేమిలాభము? నిస్సంశయముగా నీవు మనుష్యలోకమును జయించినవాఁడవే యైతివి. ఈ మనుష్యలోకములోనివా రందఱును దప్పక యెప్పటికైనను యముని యింటికి వెళ్లితీఱవలసినవారే. కావున నో రావణా! నీకు శక్తియున్న దేని యముని నిగ్రహింపుము. అతని నొక్కనిని జయించితివేని సమస్తలోకములను జయించినవాఁడవే యగుదువు." అనియిట్లు చెప్పఁగా విని లంకాధిపతి యగు రావణుఁడు తన తేజస్సుచే వెలుఁగుచున్న నారదుని జూచి నవ్వుచు నమస్కారపూర్వకముగా నిట్లనియె :

యుద్ధప్రియుఁడవగు దేవగంధర్వులవిహారము గలవాఁడవగు నగు “బ్రహ్మర్షివర్యా! నారదా! నేను పాతాళలోకమును జయించుకొనుటకు వెళ్లఁదలంచుకొనియున్నాను. తరువాతను మూఁడులోకములను జయించి నాకులను నాగులను స్వాధీనము చేసికొని, రసాలయమగు సముద్రమును మథించి యమృతమును సంపాదింపవలయునని ప్రయత్నములో నున్నాను” అని యిట్లు చెప్పిన రావణునిమాటలు విని నారదుఁ డిట్లనియె : “రావణా! ఇపుడు నీవు మఱియొకదారి నెక్కడికిఁ బోయెదవు? ఇదేకదా యగమ్యమైన ప్రేతరాజుండుపట్టణమునకుఁ బోవుదారి. ఇట్లే పొమ్ము.” అనుమాటలు విని రావణుఁడు శరత్కాలమేఘమువంటి నవ్వు నవ్వి యతనితో నిట్లనియె: “మునివర్యా! మంచిమాట చెప్పితివి. చాల సంతోషమును గలిగించితివి. కావుననే నేనిపుడు యముని జంపుటకే యుద్యుక్తుఁడ నయితిని. సూర్యునికొడుకైన యాయముఁడు రాజగు దక్షిణ దిక్కునకిదె యీమార్గముననే పోవుచున్నాను. నేనొకసారి కోపించి యుద్ధమును గోరినవాఁడనై నలుగురులోకపాలురను జయించితెద నని ప్రతిజ్ఞ పట్టియున్నాఁడను. కనుక ముందుగా నిపుడే ప్రేతరాజగు యముని పట్టణమునకే పోయెదను. వాఁడు సమస్తప్రాణులకును గష్టమును గలిగించుచున్నాఁడు గనుక వానిని మృత్యువున కప్పగించివచ్చెదను” అని చెప్పి నారదునకు నమస్కరించి, సంతోషముగా మంత్రులతోఁ గూడి దక్షిణదిక్కునకు బయలుదేఱెను.

మహాతేజశ్శాలియుఁ బొగలేని యగ్నివలె వెలుఁగుచున్న వాఁడును నగు నారదుఁడు ముహూర్తకాలము ధ్యానముపట్టి యిట్లాలోచింపఁ దొడఁగెను: ఆయువు క్షీణము కాఁగానే చరాచరప్రపంచముతోఁగూడిన మూఁడులోకములను నంతమొందించు నంతకున కంత మెట్లు కాఁగలదు? ఎవఁడు స్వదత్తములకు స్వకృతములకు సాక్షియై పొగలేని యగ్నిపగిది వెలుఁగుచుండునో, మఱియు లబ్ధసంజ్ఞములగు లోకముల నేమహాత్ముఁడు జయింపఁగలఁడో, యెవనికి భయపడి మూఁడులోకములవారును నిత్యము బరువులెత్తుచుందురో, యటువంటి యమునిదగ్గఱ కీరాక్షసుఁ డెట్లు స్వయముగాఁ బోఁగలఁడు? మఱియు సుకృతదుష్కృతములను గూర్చి యెవఁడు ధాతయు విధాతయునై మూఁడులోకములను జయించి తన యధీనమునం దుంచుకొనెనో, అట్టియముని నీరావణుఁ డెట్లు జయింపఁ

గలఁడు? లేక మఱియొక యేర్పాటును చేసికొనునా? నాకుఁ జాలఁ గుతూహలము గలుగుచున్నది. ఇప్పుడే యమపట్టణమునుగూర్చి వెళ్లెదను. యముఁడును రావణుఁడును నెట్లు యుద్ధము చేయుదురో చూడవలసి యున్నది.

## 21-వ సర్గము

### యమ రావణుల యుద్ధము

శ్రీరామచంద్రా! బ్రాహ్మణశ్రేష్ఠుఁ డగునారదుఁ డిట్లాలోచించుకొని యీవృత్తాంత మంతయుఁ జెప్పుటకయి యతివేగముగా యముని యింటికిఁ బోయెను. ఇట్లు పోయి యగ్నిని బురస్కరించుకొని యేప్రాణి నేవిధముగా నిగ్రహింపవలయునో, యేప్రాణి నెట్లుగా ననుగ్రహింపవలయునో యాయాయిసంగతు లాలోచించుచున్న యమునిఁ జూచెను. ఆయముఁడును వచ్చియున్న నారదభగవానుని జూచి యర్ఘ్యపాద్యాదులచే సత్కరించి సుఖాసనాసీనుం జేసి యిట్లనియె: "నారదమహర్షీ! తమకు క్షేమమే కదా! ధర్మమునకు నాశము లేదుగదా! దేవగంధర్వసేవితులరగు తమయొక్క రాకకుఁ బ్రయోజనమేమి?" అనుయమునిమాటలు విని నారదుఁ డిట్లనియె: "ధర్మరాజా! నావచ్చినకార్యము చెప్పెదను. అది విని నీవు దానికిఁ దగినప్రతిక్రియ చేయుము. ప్రేతరాజా! దశగ్రీవుఁ డనుపేరుగల రాక్షసుఁడు జయింపశక్యముగాని నిన్నుఁ దనపరాక్రమముచే జయించి స్వాధీనము చేసికొనఁ దలంపుగలవాఁడై వచ్చుచున్నాఁడు. ఈసంగతి నీతోఁ జెప్పవలయు ననియే ప్రభూ! నేనతివేగముగా వచ్చితిని. ఇప్పుడు నీదండమనునాయుధమునకు నేమికానున్నదోకదా!" అని యిట్లుచెప్పుచుండఁగానే యుదయించినసూర్యునివలె వెలుఁగుచు వచ్చుచున్నయారాక్షసుని పుష్పకవిమానము దూరమునుండి యగపడినది. ఆరావణుఁడుమహాబలవంతుఁడు. తన పుష్పకవిమానముయొక్క కాంతిచేత నాప్రదేశమునందలి చీఁకటి నంతయుఁ బోఁగొట్టుచు నతివేగముగా సమీపించెను.

ఇట్లు సమీపించి మహాబాహుఁడగు నారావణుఁ డచ్చటచ్చటఁ దమచేసినసుకృతదుష్కృతఫలము ననుభవించుచున్న ప్రాణులను జూచెను మఱియు ఘోరరూపులును, ఉగ్రులును నగు యమకింకరులచే బాధింపఁ

బడుచుండువారును, కష్టములపాలు చేయఁబడుచున్నవారును, హాహా కారము చేయుచున్నవారును, తీవ్రముగా క్రూరమైన శబ్దమును జేయు చున్నవారును, పురుగులచే భక్షింపఁబడుచున్నవారును, కుక్కలచేఁ గఱపింపఁబడుచున్నవారును, భయమును గలిగించునదియుఁ జెవులకుఁ గాల్చిన యినుపసూదులవలెఁ దగులుచున్నదియు నగు వాక్యములను బలుకుచుండువారును, నెత్తురు నీటితో నిండిన వైతరణీనదిలో నీఁదింపఁ బడుచున్నవారును, మలమలమాడుచుండు నిసుకదిబ్బలమీఁద మాటి మాటికిని బడవైచి తపింపఁజేయఁబడుచున్నవారును, అసిపత్రవనములో నుండి యీడ్వఁబడుచుండువారును, రౌరవము, ఉప్పునది, క్షురధారలు మొదలగు నరకములలోఁబడి యాఁకలిదప్పులచే మలమలమాఁడుచుఁ బ్రాణులకు జలమైనను దయచేయుఁడని గొంతెండిపోయి యతిదీన ముగా యాచించువారును, శవాకారముగా నున్నవారును, కృశించిన వారును, దీనులును, వివర్ణులును, విరియఁబాఱిన జుట్టు గలవారును, మల పంకాదులను ధరించినవారును, రూక్షులును, ఇటునటుఁ బరుగులెత్తు చున్నవారును నగు ప్రాణులను మార్గమునందు వేలకొలఁదిగను లక్షల కొలఁదిగను జూచెను. మఱియుఁ గొందఱను మంచిమంచి గృహముల యందు నృత్యగీతవాద్యాదివినోదములచేఁ దమచేసిన సుకృతమునకు ఫలముగా సంతోషించుచుండువారిని జూచెను. గోదానములు చేసిన వారు గోరసమును, అన్నదానము చేసినవారన్నమును, గృహదానములు చేసినవారు గృహములను, దమదుచేసిన సుకృతవిశేషమునకు ఫలముగా ననుభవించువారును, మణులచేతను బంగారుచేతను ముత్తెములహార ములచేతను నుత్తమస్త్రీలచేతను నలంకరింపఁబడినవారును, ధార్మికులును, దమతమతేజస్సులచే వెలుఁగుచున్నవారును నగు ప్రాణులనుగూడఁ జూచెను. ఇట్లు చూచి రాక్షసాధిపతియు, మహాబాహుఁడును నగు నారావణుఁడు తనపరాక్రమముచేత బలాత్కారముగాఁ దమదుష్కృత ములచే బాధపడుచున్న ప్రాణులయందు దయగలిగి విడుదలచేయించెను. రావణునిచే విడిపింపఁబడిన యాప్రాణులు ముహూర్తమాత్రము తలఁచు కొని, తలంపుగాఁ దటస్థించిన సుఖము ననుభవించిరి.

ఇట్లు గొప్పవాఁడగు రావణునిచేతను బ్రేతములు విడువఁబడిన వగు చుండఁగా నాప్రేతములకావలివాండ్రు మిక్కిలి కోపించి రావణు నెదు

గొనిరి. తరువాతను నాలుగుదిక్కులనుండియు హాలహాలాశబ్దము బయలు దేఱినవి. యమకింకరులు మహాశూరులు కోపించి యిటునటుఁ బరుగు లెత్తుచు వేలకొలఁదిగా గుమిగూడి ప్రాసములు, పరిఘములు,శూలములు, ముసలములు, శక్తులు, తోమరములు మొదలగు నాయుధములను రావణునిపుష్పకవిమానమునిండ వర్షించిరి. మఱియు వాండ్రు తేనెటీఁగలవలె బయలుదేఱినవారై యాపుష్పకమునందలి యాసనములను, ఘంటపములను, ప్రాసాదములను, వేదికలను, తోరణములను విఱిచివైచిరి. ఇట్లెంతగా విఱుగఁగొట్టఁబడుచున్నను పుష్పకవిమానము దేవతలకు వాహనమగుటచే యుద్ధములో బ్రహ్మతేజముచే నక్షయమై యెప్పటివలెనే యుండెను. ఆమహాత్ముని సేన గొప్పదియు లెక్క లేనిదియు నయి యున్నవి. భయంకరముగాయుద్ధమునకు వచ్చినశూరులు వందలును వేలును నయిరి. తరువాత వృక్షములచేతను, కొండలచేతను, వందలకొలఁది ప్రాసాద్యాయుధములచేతను యమునిమంత్రులు తమతమబలముకొలఁదిని కోరికకొలఁదిని యుద్ధము చేసిరి. రావణుఁడును యుద్ధముచేయ మొదలిడెను. ఆరావణుని మంత్రులు సర్వవిధము లయినయాయుధములచేతను గొట్టఁబడి నెత్తురుచేఁ దడుపఁబడిన దేహములు గలవారై గొప్ప యుద్ధము చేసిరి. ఒకరి సైన్యము నొకరు మిక్కిలి తీవ్రముగా నానావిధములైన యాయుధముల చేతను గొట్టుచుండిరి. ఇట్లుండఁగా యముని యోధులు రావణునిమంత్రులను గొట్టుట మాని శూలములను వర్షించుచు రావణునిమీఁదికిఁ బరువెత్తిరి. యమదూతల యాయుధములచే బాగుగాఁగొట్టఁబడినవాఁడై నెత్తురుచేఁ దడిసినదేహముగలిగి సర్వావయవములును శిథిలముకాఁగా రావణుఁడు పుష్పకముమీఁదను పూచినమోదుగుచెట్టువలె నగపడెను. అట్లు విమానముమీఁద నుండియే యారావణుఁడు శూలములు, గదలు, ప్రాసములు, శక్తులు, తోమరములు, బాణములు, పరిఘములు, ముసలములు, రాళ్లు, చెట్లు మొదలగువాని నస్త్రబలము నవలంబించి యమదూతలపై వర్షించెను. అట్లతిదారుణముగా వర్షించుచున్న చెట్లయొక్కయు, రాళ్లయొక్కయు, శస్త్రములయొక్కయు వర్షము భూమిమీఁద నిలువఁబడి యుద్ధముచేయుచున్న యమదూతలపై నిబడినది. వాండ్రును వానినన్నింటిని ఛేదించి వానియస్త్రమును వ్యర్థముగాఁజేసి వందలకొలఁదిని వేలకొలఁదిని గుంపులు గూడి ఘోరస్వరూపుఁడగు నారావణు నొక్కనిని

కొట్టమొదలిడిరి. మఱియు యమదూతలు మేఘములు కొండ నావరించి వర్షము గురిసినట్లు రావణు నావరించి భిండివాలములు శూలములు మొదలగు నాయుధములను వర్షించి యూపిరి తిరుగకుండఁ జేసిరి. అంతట రావణుఁడు కోపించి కవచము తీసివైచి నెత్తుటిచేఁ దడిసి యున్న వాఁడై పుష్పకము నుండి దిగి భూమిమీఁదను నిలువఁబడెను. తరువాత ధనుర్బాణములు చేఁబూని యుద్ధ మారంభించెను. మహాస్త్రమాత్రమునఁ దెలివి దెచ్చుకొని జాగరూకుఁడై యంతకునివలె కోపించి పాశుపతమను దివ్యాస్త్రమును ధనుస్సునఁగూర్చి "నిలువఁబడుఁడు, నిలువఁబడుఁడు" అని వారిని హెచ్చరించుచు ధనుస్సు నాకర్ణాంత మాకర్షించి త్రిపురములపై శంకరునివలె నాయస్త్రమును వారిపై విడిచెను. అట్లు రావణునిచే విడువఁబడిన యస్త్రముయొక్కరూపము విధూమజ్వాలామండలమై వేసవిలో వనమును దహించు దావాగ్ని వలె నయ్యెను. జ్వాలలఁ గ్రక్కుచున్న యాపాశుపతాస్త్రము యుద్ధములోఁ గ్రవ్యాదములచే ననుసరింపఁబడుచున్నదై యచ్చట నున్న పొదలను, చెట్లను భస్మముచేసి నలువైపులను వ్యాపించినది. ఆయమునిసైనికులు దానితేజస్సుచే దవాగ్నిచేఁ గాల్పఁబడినచెట్లవలెఁ గాల్పఁబడిరి. తరువాత భయంకరమయిన పరాక్రమముగల రావణుఁడు మంత్రులతోఁగూడ భూమియంతయుఁ గంపించులాగున పెద్దకేకవైచెను.

## 22-వ సర్గము

### యమ రావణుల యుద్ధము

శ్రీరామా! అప్పుడు ప్రభువగు యముఁడాధ్వని విని తనబలము క్షీణించినట్లును, రావణుఁడు జయమును బొందినట్లును దెలిసికొనెను. తనసైనికులు హతు లయినట్లు తలఁచి కోపముచే నెఱ్ఱఁబడిన కన్నులుగల వాఁడై వేగముగా రథము సిద్ధముచేసి తీసికొనిరమ్మని సారథి కాజ్ఞాపించెను. సారథియు నపుడే దివ్యమైన గొప్పరథమును సిద్ధముచేసి తెచ్చెను. మహాతేజశ్శాలియగు యముఁడారథముమీఁదను గూరుచుండి యుద్ధమునకు బైలుదేఱెను. మూఁడులోకములను సంహరించు మృత్యువు పాశముద్గరములను ధరించి యాతనిముందు నిలువఁబడెను. కాలదండము మూర్తిమంతమయి రథముమీఁద యమునిప్రక్కనుండెను. అది

యమునియాయుధము. దివ్యమైనది. దానితేజస్సు మండుచుండు నగ్ని హోత్రునితో సమానమైనది. మఱియుఁ దత్పార్శ్వములందు ఛిద్రము లేని కాలపాశములుండినవి. అగ్నిస్పర్శముతో సమానస్పర్శముగల ముద్గరమను నాయుధము మూర్తిమంతమయి నిలిచియుండెను. అపుడు మూఁడులోకములును సంక్షోభించినవి. దేవతలు కంపించిరి. కోపించిన యమునిఁజూచి సర్వలోకములును భయమును బొందినవి. తరువాత సూతుఁడు రక్తవర్ణములగు గుఱ్ఱములను దొందరగాఁ దోలుచు భయంకరముగాఁ గేకలువైచుచు రాక్షసరాజున్న చోటికిఁ బోయెను. ఆగుఱ్ఱములు ముహూర్తమాత్రమున మనోవేగముతోఁ బరువెత్తి యుద్ధము జరుగుచున్నస్థలమునకు యమునిఁ దెచ్చినవి. మృత్యుదేవత మొదలగు వారితోఁగూడి వికారముగా నుండిన యారథమును జూచి రావణుని మంత్రులు చాలవేగముగాఁ బరుగులెత్తమొదలిడిరి వారు చులకనయిన మనస్సులుగలవారగుటచేఁ దెలివి దప్పి భయముచేఁ బీడితులై "మేము యుద్ధము చేయఁజాల" మని చెప్పుచు నలుదిక్కులకును బాఱిపోయిరి. ఆరావణుఁడుమాత్రము లోకములకు భయమును గలిగించునటువంటిరథమును జూచి, క్షోభమునుగాని భయమునుగాని పొందినవాఁడు కాఁడయ్యెను.

అప్పు డాయముఁడు మిక్కిలి కోపించినవాఁడై రావణుని సమీపించి శక్తులను తోమరములను బ్రయోగించి వానిమర్మస్థానములను నొప్పించెను. మఱికొంత సేపటికి రావణుఁడు స్వస్థుఁడై కొండమీఁదను మేఘము వర్షించునట్టు బాణవర్షమును వర్షించెను. తరువాతను యముఁడు ప్రయోగించిన బాణాదులచేత వక్షఃస్థలమునందు దెబ్బలు దగులుటచేత శల్యపీడితుఁ డయిన యారావణుఁడు ప్రతిక్రియచేయుటకు శక్తుఁడు కాకపోయెను. ఈరీతిగా శత్రుసంహారకుఁ డగుయముఁడు నానావిధములయిన యాయుధములను బ్రయోగించుచు నేడురాత్రులు యుద్ధముచేసి శత్రువగు రావణుని విముఖునిఁగాఁగాని, విజితునిఁగాఁ గాని చేయఁజాలకపోయెను. యుద్ధమునుండి మరలక జయమును గోరుచున్నట్టి యాయమరాక్షసులకు దొమ్మియుద్ధము జరిగినది. తరువాతను దేవతలు, గంధర్వులు, సిద్ధులు, పరమఋషులు, బ్రహ్మదేవునిఁ బురస్కరించుకొని యాయుద్ధభూమికి వచ్చిరి. రాక్షసశ్రేష్ఠుఁ డగురావణుఁడును,

ప్రేతరాజగు యముఁడును యుద్ధము చేయుచుండఁగా లోకమునకుఁ బ్రళయము తటస్థించినట్లగపడినది. అప్పుడు రావణుఁడును నింద్రధనుస్సు వంటితనధనుస్సు నెక్కుపెట్టి బాణముల వర్షించుచు నాకాశమును నిరవకాశము సేసెను. మఱియు మృత్యువును నాలుగు బాణములచేతను, సారథి నేడుబాణములచేతను, యముని వందలకొలఁది వేలకొలఁది బాణములచేతను శీఘ్రముగా మర్మస్థానములయందుఁ గొట్టెను. తరువాతఁ గోపించియున్నయమునిముఖమునుండి నిట్టూర్పులతోఁ గూడిన కోపాగ్నిహోత్రము పొగతోఁ గూడిన యగ్నివలె బయటికి వచ్చినది. తరువాతను దేవదానవులసమక్షమునందుఁ గలిగినయీయాశ్చర్యమును జూచి మిక్కిలి యాటోపముగలవారై మృత్యువును యముఁడును సంతోషించుచుండిరి. అప్పుడు మృత్యువు మిక్కిలి కోపించి యమునితో నిట్లనియె: ధర్మరాజా! నన్ను యుద్ధమునకుఁ బంపుము. నే నీపాపాత్ముఁడగు రాక్షసుని జంపెదను. ఈరాక్షసు నిప్పుడే లేకుండఁజేసెదను. ఇది నైసర్గికమయిన మర్యాద.

శ్రీమంతులగు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, నముచి, శంబరాసురుఁడు, విసంధి, ధూమకేతువు, బలి, దంభుఁడు, దైత్యులకు మహారాజగు వృత్రాసురుఁడు, బాణాసురుఁడు, రాజర్షులు, శాస్త్రవిదులు, గంధర్వులు, ఉరగులు, పన్నగులు, దైత్యులు, యక్షులు, అచ్చరలు వారు వీరు నన నేల? యుగాంతమునప్పుడు సముద్రములతోడను, కొండలతోడను, నదులతోడను, వనములతోడను గూడిన యీభూమియు నాశము పొందుచుండఁగా నేను జూచితిని. మఱియు నెందఱో దురాసదు లగుబలవంతులు నశించిపోఁగా నేను జూచియుంటిని. ఈరాక్షసుఁడనఁగా నేపాటివాఁడు? సకల ధర్మములు దెలిసిన యోయముఁడా! ఇంకను నన్ను యుద్ధమునకుఁ బంపవైతివేమి? వీనిని జంపెదను. ఎంత బలవంతుఁడైనను నాదృష్టిపథమును బొందినవాఁడు తిరిగి పోఁగా నేను జూచియెఱుఁగను. ఇది నాబల మనుకొనవలదు. ఇది నాస్వభావసిద్ధమైన పద్ధతి. నేను జూచితినేని ముహూర్తకాలమైనను వీఁడు బ్రదుకజాలఁడు. అని యిట్లు మృత్యువు చెప్పినమాటలు విని ప్రతాపశాలి యగు యముఁడిట్లనియె: "నీవూరక చూచుచుండుము. నేనే యీరాక్షసాధముని జంపెదను" అనిచెప్పి, తరువాతను గోపముచేఁ గన్ను లెఱ్ఱబడఁగాఁ బ్రభు

వగుయముఁడు తనయమోఘమగు కాలదండమును పట్టి యెత్తెను. మఱియు దేనిపార్శ్వము లయందు సకల కాలపాశములును బ్రతిష్ఠితములై యుండెనో, చిచ్చుఅపిడుగువలె ముద్గరము మూర్తిమంతమై నిలువఁబడియుండెనో, దేనిని జూడఁగానే ప్రాణులప్రాణములుపోవుట కెంత మాత్రమును నభ్యంతరముండదో, యట్టిదానిని ముట్టినప్పుడుగాని ప్రయోగించినప్పుడుగాని జరుగుసంగతి చెప్పనే యక్కఱలేదు. అటువంటి కాలదండము బలవంతుఁడగువానిచేత స్పృశింపఁబడినదై జ్వాలలఁ గ్రక్కుచు రాక్షసుని దహించునదివలె నగపడుచుండెను. తరువాత నా యుద్ధభూమిలో నున్నవారందఱును భయపడి పాఱిపోయిరి. యముఁ డిట్లు కాలదండమును బట్టియుండుట చూచి దేవతలును భయపడిరి. ఆ కాలదండముతో రావణుని గొట్టుటకు సిద్ధపడుచుండఁగా, బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై యామమునితో నిట్లనియె: 'మహాబాహుఁడవగు నోధర్మరాజా! వలదు వలదు; కాలదండమును బ్రయోగింపవలదు. నీవీ కాలదండముచేత రావణుని జంపఁజాలవు. దేవశ్రేష్ఠుఁడ వగు నోయముఁడా! నేను వీనికి వర మిచ్చియున్నాను. నే నిచ్చినవరమును నీ వనృతముగాఁ జేయుటకుఁ దగవు. నామాటను అసత్యముగాఁ జేయఁదలఁచినవాఁడు దేవతయైనను సరియే మనుష్యుఁడైనను సరియే మూఁడులోకములను అనృతముగాఁ జేసినవాఁడే యగును. సంశయ మక్కఱలేదు. అదిగాక నీవు కోపించి యీకాలదండమును బ్రయోగించితివేని, యిది శత్రువులను మిత్రులను సంహరింపకమానదు. రౌద్రమైన యీకాలదండము మూఁడు లోకములకును భయంకరమైనది; ఇది యమోఘము. ప్రాణిమాత్రమును సంహరించుటకు దీని కధికారము గలదు. మృత్యుపురస్సరముగా నే నీ కాలదండమును పూర్వమందు సృజించితి. కావున దీనిని రావణునిపైఁ బ్రయోగింపకుము. ఇది పడినయెడల నెవ్వఁడును నిమిషమాత్రమైనను బ్రదుకఁజాలఁడు. ఒకవేళ నీవు నామాట లక్ష్యపెట్టక దీనిని వీనిమీఁదఁ బ్రయోగించినప్పుడు, రాక్షసుఁడు చచ్చినను జావకున్నను నామాట వ్యర్థమగును. కనుకఁ బ్రయోగించుటకు సిద్ధముచేసి యుంచిన కాలదండమును మరలింపుము. నీవు లోకములక్షేమమును గోరువాఁడవేని నామాటను యథార్థముగాఁ జేయుము." ఇట్లు బ్రహ్మదేవుఁడు చెప్పఁగానే ధర్మాత్ముఁ డగుయముఁ డిట్లనియె: "స్వామీ! ఇదిగోఁ దమయాజ్ఞాప్రకారముగాఁ

గాలదండమును మరలించితిని. నీవు మాయందఱకును యజమానుఁడవు గదా! కాని యిప్పుడు వరపురస్కృతుఁడగు వీనిని జంపుటకు వీలుగాదేని యిఁక నిక్కడనుండి నే నేమిచేయవలయును? కావున నిదిగో నిపుడే యీ రాక్షసునిదర్శనపథమునుండి యంతర్ధానమైపోయెదను” అనిచెప్పి రథము తోఁగూడ నచటనే యంతర్ధానమైపోయెను. రావణుఁడాయముని జయించి నట్లే తననామధేయమును వినిపించి పుష్పకవిమానముమీఁదఁ గూర్చుండి యమపురమునుండి పోయెను. ఆయముఁడు బ్రహ్మమొదలగు దేవతలతో స్వర్గమునకుఁ బోయెను. ఇది యంతయుఁ జూచి నారదమహాముని చాల సంతోషించెను.

## 23వ సర్గము

### రావణుఁడు వరుణలోకమునకుఁ బోవుట

దేవతాశ్రేష్ఠుఁడగు యముని జయించి తరువాత రావణుఁడు తనయుద్ధమును గొనియాడుచుఁ దనసహాయులను జూచెను. వారు రక్తముచేఁ దడిసిన యంగములు గలవాఁడును, ఆయుధములచే శిథిలముగాఁ జేయఁబడినవాఁడును నగురావణునిజూచి మిగుల నాశ్చర్యమును బొందిరి. తరువాత మారీచుఁడు మొదలగువారందఱును జయజయధ్వనులచేతఁ రావణునిఁబొగడి రావణునిచేత నోదార్పఁబడినవారై పుష్పక మెక్కిరి. తరువాత రావణుఁడు పాతాళలోకమునకుఁ బోవ నుద్యుక్తుఁడై దైత్యులచేతను, ఉరగులచేతను గూడి యున్నదియు వరుణదేవునిచేతఁ బరిపాలితమును నగుసముద్రములోఁ బ్రవేశించెను. ఆరావణుఁ డట్లు పాతాళమునందలి భోగవతీపురములోఁ బ్రవేశించి, వాసుకిచే రక్షింపఁ బడుచున్న నాగులను స్వాధీనముచేసికొని సంతోషించుచు నక్కడనుండి మణిమతి యనుపేరుగల పట్టణమునకుఁ బోయెను. అచ్చట వరగర్వితులగు నివాతకవచులనురాక్షసులు గలరు. వారిని సమీపించి యుద్ధమునకు రండని పిలిచెను. బలవంతులును పరాక్రమశాలురును నగువారందఱును నానావిధము లయిన యాయుధములను బట్టుకొని యుద్ధదుర్మదులయి సంతోషించుచు నెదురుకొనిరి. తరువాత శూలములతోడను, త్రిశూలములతోడను, కులిశములతోడను, పట్టిసములతోడను, కత్తులతోడను, పరశ్వధములతోడను రాక్షసులు దానవులు పరస్పరము యుద్ధము చేయ మొదలిడిరి. ఇట్లు వారి కొక్కసంవత్సరము యుద్ధము జరిగినది. అందిరు

తెగల వారికిని జయముగాని పరాజయముగాని కనుపించలేదు. అప్పుడు త్రిలోకగతియు నవ్యయుఁడును నగు బ్రహ్మదేవుఁడు విమాన మెక్కి యచ్చటికి వేగముగా వచ్చి నివాతకవచాదులను యుద్ధమునుండి వారించి కోపయుక్తుఁడై సర్వమును దెలిసినవాఁడుగనుక నిట్లనియె: "రాక్షసులారా! ఈరావణుఁడు సురాసురులచేతను జయింపఁదగినవాఁడుగాఁడు. మీరును నట్లే దేవదానవులచే జయింపఁదగినవారు గారు. కావున మీరు రావణునితో స్నేహము చేసికొనుఁడు. స్నేహితులగు మీకు సర్వార్థములును విభక్తములు గాకుండ నుండునుగాక! ఇందు సందియ మొందకుఁడు." అనిచెప్పి వారికిని రావణునకును అగ్నిసాక్షికముగా స్నేహము చేయించి బ్రహ్మదేవుఁడు సంతోషించుచు సత్యలోకమునకుఁ బోయెను. రావణుఁడు యథాన్యాయముగా నచ్చట నొక్కసంవత్సరము వఱకును నివసించినవాఁడై తనపట్టణములో నున్నట్టుగానే యమంద మైన యానందమును బొందుచుండెను. ఇట్లచ్చట వారితో స్నేహముగా నుండి నివాతకవచుల వలన తొంబదితొమ్మిది మాయలు నేర్చుకొనెను. తరువాత వరుణదేవునిపట్టణమును వెదకుచు నారసాతలములో సంచరించుచుండెను. తరువాతఁ గాలకేయు లనురాక్షసులు కాపురమున్న యశ్మనగరమును గూర్చి పోయి, యచ్చట బలవంతులగు కాలకేయులను జంపెను. మఱియు శూర్పణఖయొక్క భర్తయగు విద్యుజ్జిహ్వుని గత్తితో నఱికెను. వాఁడు మిక్కిలి బలగర్వితుఁడు. అట్టిబావమఱదిని యుద్ధములో మెఱపుఁదీఁగవంటి తననాలుక సాచి రాక్షసులను నాకివైచుచున్న వానిని వధించి, మిగిలినరాక్షసులను నాలుగు వందలమందిని ముహూర్తకాలములోఁ జంపెను.

తరువాత శరత్కాలమేఘమునవలెను, వెండికొండవలెను బ్రకాశించుచున్న వరుణునిమందిరమును రాక్షసరాజైన రావణుఁడు చూచెను. అచ్చటఁ బాలువర్షించుచున్న కామధేనువును జూచెను. ఆకామధేనువు పొదుగునుండి స్రవించుచున్న క్షీరముచేతనే పాలసముద్రము ప్రవర్తించినది. దానినుండి చల్లనికిరణములు గల చంద్రుఁడు పుట్టెను. మఱియు నాకామధేనువు శివునకు వాహనమైన నందిని గన్నది. నురుగు దిని జీవించు పరమఋషు లాసముద్రము నాశ్రయించియుందురు. స్వధను భుజించువారికి స్వధయు, దేవతల కమృతమును నాసముద్రమునుండియే

పుట్టినవి. ఆకామధేనువునే మనుష్యులు సురభి యని చెప్పుచుందురు. కృత్తిపరమాద్భుతనిధాన మగు కామధేనువునకుఁ బ్రదక్షిణము చేసి యనేకవిధసైన్యముచే రక్షింపఁబడుచు మహాభయంకరముగా నున్న వరుణునిపట్టణములోఁ బ్రవేశించెను. అది జలధారలతో నిండి యున్నది. శరత్కాలమేఘములవలెఁ బ్రకాశించుచున్నది. అందు నిత్యమును సంతోషించుచుండు వరుణుని మందిరమునుజూచెను. తరువాత యుద్ధములో వరుణునిసేనాధ్యక్షులనుగొట్టి వారిచేదెబ్బలుదిని, తరువాత 'రావణుఁడు యుద్ధమునకు వచ్చియున్నాఁడనియు రావణునితో యుద్ధమొనరుజేయుము లేదేని చేతులు జోడించుకొని యోడితి నని నైనను జెప్పుము. నీకు భయము లేదు. అని మీరాజుతోఁ జెప్పి రం'డని యోధులతోఁ జెప్పిపంపెను. ఇంతలో మహాత్ముఁడగు వరుణునికొడుకులు మనుమలు తమ సేనాధ్యక్షులగు గోపుష్కరులతోఁగూడఁ గోపించినవారై తమతమ సైన్యములతోఁ గూడుకొనినవారయి, కామగమనము గలవియు నుదయించిన సూర్యునివలెఁ బ్రకాశించునవియు నగు రథములపై నెక్కి బయలుదేఱిరి. తరువాత వరుణునివారికిని రావణునికిని దారుణమును రోమహర్షణమును నగు యుద్ధము జరిగినది. మహాబలపరాక్రమములు గల రావణునిమంత్రులచే క్షణకాలములో వరుణునిబలమంతయుఁ బడఁగొట్టఁబడినది. వరుణపుత్రులు తమసైన్యము యుద్ధములోఁ బడిపోవుట చూచి బాణములచేఁ బీడింపఁబడి యుద్ధము చాలించి మరలిరి. ఇట్లు మహీతలమందున్నవారై వారు పుష్పకవిమానముపై నున్న రావణుని జూచి కామగమనము గల రథములతోఁగూడ శీఘ్రముగా నాకాశమార్గమునఁ బ్రవేశించిరి. తరువాత వారు సమానమైన స్థానమును బ్రవేశింపఁగానే దేవదానవులవలెనే యిరుతెగలవారికిని దొమ్మిగా నాకాశయుద్ధము జరిగినది. తరువాత వారు యుద్ధములో నగ్నిజ్వాలలతో సమానములగు బాణములను బ్రయోగించి రావణుని విముఖుని గాఁజేసి సంతోషసూచకముగా వివిధములయిన ధ్వనులు గలుగునట్లుగా నార్చిరి. తరువాతను రావణుఁడు విముఖుఁడై యుండుటను జూచి మహోదరుఁడను రాక్షసుఁడు కోపించి మృత్యుభయము విడిచి యుద్ధము గోరి వచ్చెను. వాఁడు వరుణపుత్రులరథములను, కామగమనముగలిగి వాయువుకంటెవేగముగాఁ బోఁగల గుఱ్ఱములను, సారథులను గదతోఁ

గొట్టి క్రిందఁ బడఁజేసెను. ఇట్లు వరుణపుత్త్రుల యోధులనందఱను జంపి వారిని విరథులనుగాఁ జేసి పెద్ద అంకెవేసెను. ఇట్లు మహోదరునిచేఁ దమబలమంతయు నేలఁ గలుపఁబడుట చూచి వరుణునికొడుకులు రథములను విడిచి తమప్రభావమువలన భయములేకుండ నాకాశమునందు నిలిచిరి. తరువాత ధనుస్సులను సిద్ధముచేసి మహోదరుని భేదించి యతికోపముతో రావణుని వెంటఁబడిరి. మేఘములు కొండమీఁద వర్షించినటుల, మిక్కిలి దారుణములును పిడుగులతో సమానములును నగు బాణములను రావణునిపైని వర్షించి మిక్కిలి పీడించిరి. తరువాత రావణుఁడుకోపించి ప్రళయాగ్నివలె బయలుదేఱి మహాభయంకరము లగు బాణములను వర్షించి వారి మర్మస్థానములనుగొట్టి బాధించెను. పదాతులగు వరుణపుత్త్రు లాబాణవర్షముచేతనే మిక్కిలి వ్యాకులపడుచుండఁగా రావణుఁడు విచిత్రములగు భల్లములను, ముసలములను, పట్టసములను, శక్తులను, శతఘ్నులను, తోమరములను వారిపైని విడిచెను. వారట్లు దెబ్బలు తిన్నవారై యఱువదిసంవత్సరములయేనుఁగులు బురదలోఁ జొచ్చి పీడింపఁబడుచున్నట్లు పీడితులై పడిపోయిరి. ఇట్లున్న వరుణపుత్త్రులను జూచి రావణుఁడు సంతోషించుచు వర్షకాలపు మేఘములుఱిమినట్లు పెద్దఅంకెవైచెను. మఱియు నారావణుఁడు మహానాదము చేసి వరుణపుత్త్రులను గొట్టుచుండెను. ఇట్లు మేఘములు వర్షించినట్లు బాణాదులను వర్షించి బాధించుచుండఁగా వరుణపుత్త్రులు విముఖులయి భూమిమీఁద పడిపోయిరి. చావఁగా మిగిలియున్న పరిచారకులు వారిని శీఘ్రముగా నింటికిఁ దీసికొనిపోయిరి. తరువాత రావణుఁడు వరుణునితోఁ జెప్పుఁడని వరుణపరిచరులతోఁ జెప్పఁగా, దారుణుఁడగు మంత్రి ప్రహస్తుఁ డనువాఁడు రావణునితో నిట్లనియె: "మహారాజా! వరుణుఁడు సంగీతము వినుటకై బ్రహ్మలోకమునకుఁ బోయియున్నాఁడు. రాజింటలేనప్పుడు నీపరిశ్రమమంతయు వ్యర్థము. ఇంటిదగ్గఱ నున్న వరుణపుత్త్రులు వచ్చి నీతో యుద్ధముచేసి పరాజయమును బొందిరి గదా! ఇఁక నెవరితో యుద్ధము చేయుదువు?" అని చెప్పఁగానే సంతోషించి రావణుఁడు తనపేరు చాటించి, యట్టహాసములుచేయుచు సింహనాదములు చేయుచు వరుణనగరమునుండి మరలి వచ్చినత్రోవనే పుష్పకవిమానముపై లంకకు బయలు దేఱెను.

# ఇక్కడనుండి ప్రక్షిప్తసర్గములు

## 1-వ సర్గము

### రావణుఁడు బలిని జూచుట

ఇట్లు వరుణునిపురమునుండి రావణుఁడు హాస్యధ్వనులు చేయుచు బయలుదేఱి హాస్యముచేత గద్గదస్వరముపడి మాటలాడుచున్న మహోదరునితోఁ గూడి మరల నశ్మనగరమునకు వచ్చి యుద్ధదుర్మదుఁడై విహరించుచుండెను. ఇట్లు విహరించుచు రావణుఁ డచ్చట వైడూర్యతోరణములతోఁగూడినదియు, ముత్యాలజాలకములతో నలంకరింపఁబడినదియు, బంగారుస్తంభములచే సాంద్రమైనదియు, నెచ్చటఁ జూచినను తిన్నెలుగలదియు, వజ్రములచేతను స్ఫటికములతోడను గట్టఁబడిన సోపానములు గలదియు, చిఱుగంటలతోఁ గూడినదియు, పలువిధములైన యాసనములు గలదియు, దేవేంద్రునిమందిరముచందమున నందమైనదియు నగు నొకానొకదివ్యమందిరమును జూచెను. ప్రతాపవంతుఁడగు నాదశగ్రీవుఁ డాయింటిని జూచి "మేరుమందరములతో సమానమైన యీచక్కనియిల్లెవరిదో తెలిసికొని రమ్ము" అని ప్రహస్తునితోఁ జెప్పఁగా, నతఁడు వెంటనే బయలుదేఱి యాయింటిలోఁ బ్రవేశించి యాతొలిద్వారమునం దెవ్వరును లేకుండుట చూచి రెండవకక్ష్యలోనికి వెళ్లెను. ఇట్లు కక్ష్యాంతరము లేడు దాఁటి యచ్చట నొకజ్వాలను జూచెను. అచ్చట నొకదివ్యపురుషుని జూచెను. ఆయన వీనిని జూచినవెంటనే సంతోషించి యొక్కమారు నవ్వెను. ప్రహస్తుఁ డాతఁడు నవ్వుట చూచి పులకాంకితగాత్రుఁడైపోయెను. ఆపురుషుఁడు జ్వాలామధ్యమున హేమమాలియై మోహమును గలిగించుచు సూర్యునివలెనే తేఱిచూచుటకు సాధ్యపడక రెండవ యమునివలెఁ గనుపడెను. అచ్చటి వృత్తాంతమంతయుఁ జూచి తొందరపడుచుఁ బ్రహస్తుఁ డచ్చటినుండి బయలుదేఱి రావణునియొద్దకు వచ్చి చెప్పెను. ఆమాట వినఁగానే రామా! రావణుఁడు వెంటనే పుష్పకమునుండి దిగి కాటుకకొండవలెఁ జూపట్టుచు నాదివ్యమందిరములోఁ బ్రవేశింపఁదలంచి యటుపోవఁగా, నెదుటఁ జంద్రమాళియు వపుష్మంతుఁడునగు పురుషుఁ డగపడెను. అతఁడు చూచుటకు భయంకరుఁడై జ్వాలాజిహ్వుఁడై ద్వార మావరించియుండెను. ఎఱ్ఱనికన్నులు, తెల్లనిమొగము, దొండ

పండువంటి పెదవి, ఊర్ధ్వరోమములు, మహాభయంకరమైన ముక్కు, శంఖమువంటి కంఠము, పెనుదౌడలు, గూఢమైన గడ్డము మీసములు, అణఁగియున్న యెముకలు, పెద్దపెద్దకోఱలు గలిగి చూడఁగానే గగుర్పాటును గలిగించుచున్న పురుషుని, అతనిచేతిలోనున్న లోహముద్గరమును, అతఁడు ద్వారమున కడ్డుగా నిలిచియుండుటయుఁ జూడఁగానే రావణుని శరీరమంతయు నొక్కమాఱుగాఁ బులకరించినది. వానిహృదయము చలించినది. ఒడలు వడవడవడఁకుచున్నది. రామా! రావణుఁ డపశకునములనుగూడఁజూచి యాలోచింపఁదొడఁగెను. ఇట్లాలోచించుచుండఁగా నాపురుషుఁడే యిట్లనియె: "రాక్షసుఁడా! నీవు దేనిని జింతించుచున్నావో వేగముగాఁ జెప్పుము. నీకు భయములేదు. నీయిచ్ఛకువచ్చినమచ్చునసే చెప్పుము" అని యడుగఁగా, "నేను యుద్ధభిక్షకై వచ్చితి" ననెను. అతఁడును సంతోషించి "మంచిది. యుద్ధభిక్ష యిచ్చెద"నని చెప్పి మరల నిట్లనియె: "రావణా! నీవు నాతో యుద్ధము చేయుదువా? బలితో యుద్ధము చేయుదువా? ముం దాసంగతి చెప్పు"మని యనఁగానే మరల రావణునకు శరీరమంతయుఁ బులకరించినది. కొంతసేపునకు ధైర్యము దెచ్చుకొని యిట్లనియె: "పలుకునేర్పుగల యోమహాత్మా! యీయింటిలో నెవ్వ రున్నారో చెప్పుము. వానితోడనే యుద్ధముచేసెదను. లేకున్న నీయిష్టముచొప్పునఁ జేసెదను" అనఁగానే "దానవేంద్రుఁడగు బలిచక్రవర్తి లోపల నున్నాఁ"డని బదులు చెప్పి మఱియు నిట్లనియె: "రావణా! బలిచక్రవర్తి మిక్కిలి యుదారమైన యంతఃకరణము గలవాఁడు, మహాశూరుఁడు, సత్యమైన పరాక్రమము గలవాఁడు, మహావీరుఁడు, అనేకములగు మంచిగుణములు గలవాఁడు, వేయేల? పాశహస్తుఁడగు నంతకునివంటివాఁడు, ఉదయించిన సూర్యునివలెఁ దేజశ్శాలి; యుద్ధమునుండి యెన్నఁడును మరలినవాఁడు గాఁడు, పట్టుదల గలవాఁడు, జయింప వీలులేనివాఁడు, గుణసముద్రుఁడు, జయించువాఁడు మఱియు మధురములగు మాటలాడువాఁడు, గురువులయందును విప్రులయందును భక్తిగలవాఁడు, సంవిభాగము గలవాఁడు, కాలము నెదురుచూచువాఁడు, మహాసత్త్వసంపన్నుఁడు, సత్యవచనుఁడు, చల్లగాఁ జూడఁదగినవాఁడు. అట్టి సర్వగుణోపేతుఁడగు శూరుఁడును నిత్యమును స్వాధ్యాయమునం దాసక్తుఁడును నై యుండును. అతఁడే గర్జించువాఁడును,

వర్షించువాఁడును. అతఁడే వీచుచుండును, జ్వలించుచుండును, తపించుచుండును. అతఁడు దేవతలకుఁగాని, రాక్షసులకుఁగాని, భూతములకుఁగాని, పన్నగులకుఁగాని, మహర్షులకుఁగాని భయంపడువాఁడు గాఁడు. అట్టివానితో నేల యుద్ధము చేయఁబోయెదవు? రాక్షసేశ్వరా! అంతగా నీవు బలిచక్రవర్తితో యుద్ధము చేయ నిశ్చయించితివేని వేగముగా లోపలకుఁబోయి యామహాత్మునితో యుద్ధము చేయుము. ఎవరు వల దన్నారు ?" ఇట్లాపురుషుఁడు చెప్పఁగానే లోపలకుఁబోయి రావణుఁడు బలిని జూచెను. అతఁడును వీనిని జూచి యట్టహాసము చేసెను. ఆదానవ శ్రేష్ఠుఁ డగుబలి సూర్యునివలెఁ దేజరిల్లుచుండెడువాఁడు విశ్వరూపియై వెంటనే రావణుని బట్టుకొని తొడమీఁద గూర్చుండఁబెట్టుకొని, 'నాయనా! రావణా! నీ వేమిపని కలిగి వచ్చితివో చెప్పుము. నీకోరిక నెఱవేర్చి పంపెదను' అని యడుగఁగానే, రావణుం డతనితో నిట్లనియె: "మహా భాగా! నావచ్చినకార్యము మఱియేమియును లేదు. నిన్నుఁ బూర్వము విష్ణుమూర్తి మాయచేసి బద్ధునిగాఁ జేసెనని వినియుంటిని. కావుననే నిన్ను విడిపించుటకు శక్తిగలవాఁడను గనుక వచ్చితిని. నిన్ను విడిపించి పోయెదను. సంశయపడకుము" అని యనఁగానే యతఁడు నవ్వి రావణునితో నిట్లనియె.

"రావణా! అటులేని వినుము చెప్పెదను. ఇప్పుడు నీకు ద్వారము దగ్గఱ యగపడిన పురుషుఁడు నిత్యమును నచ్చటనే యుండును. అతనిచే రాక్షసశ్రేష్ఠులు మఱియుఁ గొందఱు బలవంతులు పూర్వులు పూర్వతరులు పూర్వతములు స్వాధీనపఱుచుకోఁబడిరి. అతఁడే యిట్లు నన్నుఁ గట్టి పడవైచినవాఁడు. విధి దాఁటరానిదిగదా! రావణా! ఆమహాపురుషుని నెవరు వంచింపఁగలవారు? వేయేల? ఆద్వారమునొద్ద నున్న పురుషుఁడు సర్వభూతములను సంహరించువాఁడు. అతఁడే చేయువాఁడును, జేయించువాఁడును, ధాతయు, భువనముల కీశ్వరుఁడును నని యెఱుఁగుము. కాలత్రయమునకును సాక్షిగా నుండు నాయనను నీవు గావు, నేను గాను, బ్రహ్మాదులుగూడఁ దెలిసికొనఁజాలరు. అతఁడే కలిరూపుఁడు, కాలరూపుఁడు, సర్వభూతాపహారకుఁడు, లోకత్రయమునకుఁ గర్త, భర్త, సృజించువాఁడు, సంహరించువాఁడును. అతని కాద్యంతములు లేవు. అతఁడే మాటిమాటికిని లీలగా జగములను బుట్టించుచుఁ బెంచుచు

సంహరించుచు నుండును. ఆమహేశ్వరుఁడే కరణము, కారణము, కర్తయు నై యుండును. అతఁడు చేసినయజ్ఞములకును దానములకును హోమాది క్రియలకును ఫల మిచ్చువాఁడు. ఆలోకేశుఁడు సర్వమును సృజించువాఁడును రక్షించువాఁడును. ఇందులకు సందియపడ నక్కఱలేదు. వేయేల? నాయనా! ఇట్టి మహాభూతస్వరూపుఁ డగుపురుషుఁ డింకొకఁ డెందును నుండఁబోఁడని యెఱుంగుము. పౌలస్త్య! నేను నీవు మనపూర్వులు మొదలగువారందఱును నీమహాత్మునిచేఁ బశువులు త్రాడునఁ గట్టఁబడినట్లు గట్టఁబడియున్నాము. మఱియు వృత్రాసురుఁడు, అనలుఁడు, దనువు, శుంభుఁడు, నిశుంభుఁడు, శృంభుఁడు, కాలనేమి, ప్రహ్లాదుఁడు, వైరోచనుఁ డగుబలి, కాలకేయులు, తారకుఁడు, ముచుకుందుఁడు, వివర్ధనుఁడు, హిరణ్యాక్షుఁడు, మధుఁడు, కైటభుఁడు, ధూముఁడు, శంబరుఁడు, యమళార్జునులు, కంసుఁడు, శుకుఁడు, కూటుఁడు, మృదువు మొదలగు వీరందఱును అగ్నివలెనే తపించువారును, సూర్యునివలెనే వెలుంగుచుండువారును, గాలివలె వీచుచుండువారును, మేఘునివలె వర్షించుచుండువారును నై యుండెడివారు. అందఱును యజ్ఞములు చేసినవారు. అందఱును గొప్పతపస్సు చేసినవారు. అందఱును మహాత్ములు. మఱియు నందఱును యోగనిష్ఠులు. అందఱును మహైశ్వర్యములను సంపాదించి యఖండమైనభోగముల ననుభవించినవారు. అందఱును దానములు చేసిరి; యజ్ఞములు చేసిరి; వేదముల జదువుకొనిరి; ప్రజలను బాగుగాఁ బరిపాలించిరి; తమపక్షమువారిని బాగుగా రక్షించిరి; శత్రువులను సంహరించిరి; మూఁడులోకములయందును వారికి యుద్ధములో సమానులు లేరు. వారు మహాశూరులు; మంచిమంచివంశములయందుఁ బుట్టినవారు; సమస్తశస్త్రాస్త్రములను దెలిసికొన్నవారు. వారికిఁ దెలియని విద్యలే లేవు. యుద్ధములలో నుండి వారు మరలియెఱుఁగరు. ఆమహాత్ములందఱును దేవరాజ్యముల గోరినవారలే; యుద్ధములో వేలకొలఁదిమాఱులు దేవతలను జయించినవారు; దేవతల కప్రియము నాచరించుటయందు సామర్థ్యము గలవారు; స్వపక్షమును బరిపాలించుటకు శక్తిగలవారు; మిక్కిలి మదించినవారు; భోగాసక్తులు; బాలసూర్యునితో సమానమైన తేజస్సుగలవారు నగు నిట్టివారికందఱికి నీశ్వరుఁడైన విష్ణు వితఁడు; నశింపఁజేయు నుపాయము నెఱింగిన హరి యితఁడు. అప్పుడప్పుడు సంహారము

చేయ నెంచి ప్రాదుర్భవించి యాపని కాఁగానే తనయొప్పటిరూపము నవ
లంబించియుండును. ఈరీతిగా నీమహాత్మునిచేత మహాత్ములగు దానవ
శ్రేష్ఠులు నాశమును బొందింపఁబడిరి. మఱియు నతఁడు యుద్ధములలో
ధర్షింపశక్యముగాని రాజులనుగూడఁ బరాజయమునుబొందించి కృతాంత
బలచోదితులయినవారి నందఱను నశింపఁజేసియున్నాఁడు."

ఇట్లు చెప్పి మరల నాబలిచక్రవర్తి రావణునితో నిట్లనియె:
"సరియేకాని, నాయనా రావణా! ఆమండుచున్న యగ్నివలెనున్న కుండ
లము పట్టుకొని నావద్దకు రమ్ము. తరువాత నే నవ్యయమగు ముక్తికార
ణమును జెప్పెదను. నేను జెప్పినట్లు కుండలము దెమ్ము. ఆలస్యము
చేయకుము" అని బలిచెప్పఁగానే యామాట విని మహాబలుఁడగు రావ
ణుఁడు నవ్వుచు గొప్పదగు దివ్యమైన యాచక్రమున్నచోటికిఁ బోయి
రామా! బలదర్పితుఁడైన యారావణుఁ డద్దానిని విలాసముగాఁ బెల్ల
గింపఁబోయెను. కాని దానినిఁ గదలుపఁజాలకపోయెను. ఎంత ప్రయత్నించి
నను అది గదలినదే కాదు. సిగ్గుపడిపోయెను. మరల మరలఁ గదలించి
చూచెను. లాభము లేకపోయినది. తుదకు దానే భూమిమీఁదఁ బడి
పోయెను. మొదలునఱికిన మ్రానువలెఁ బడిపోయి నెత్తురు గ్రక్కుకొనెను.
ఇంతలో రాక్షసునిమంత్రులాపుష్పకమునుండి యాహాకారముచేయఁగా
నాచప్పుడు వినవచ్చినది. తరువాత రావణుఁడు గొంతసేపటికిఁ దెలివితెచ్చు
కొని లేచి సిగ్గుపడి శిరస్సు వంచుకొని యుండుట చూచి బలి యిట్లనియె:
"రాక్షసశ్రేష్ఠా! ఇటు రమ్ము. నేను జెప్పుమాట వినుము. ఇప్పుడు నీవెత్తఁ
బోయి యెత్తఁజాలక పోయిన యది మణివిభూషితమైన యీకుండలము
మాపూర్వుఁడగు హిరణ్యకశిపుఁడు చెవినిదాల్చినది. బాగుగాఁజూడుము.
ఇది యొక్కటి యిచ్చటఁ బడినది. మహాబలా! రెండవకుండలము మఱి
యొకచోఁ గొండచఱియమీఁదఁ బడినది. అతఁడు యుద్ధము చేయుచుం
డఁగాఁ గిరీటము చేవిసమీపమున భూమిమీఁదఁ బడిపోయినది. ఆహిరణ్య
కశిపుఁడు మాపూర్వపితామహుఁడు. అతనికి మృత్యువు లేదు; యముఁడు
లేఁడు. రోగములు లేవు. అతనికిఁ బగటియందుగాని రాత్రియందుగాని
యుభయసంధ్యలయందు గాని మరణము లేదు. పచ్చిదానిచేతను గాని
యెండినదానిచేతనుగాని యేవిధమైన యాయుధముచేతనుగాని యస్త్ర
విశేషములచేతనుగాని మరణము లేదు. అతఁడు తన కుమారుఁడగు ప్రహ్లా

దనితో నతిదారుణమైన వాదమును బెట్టుకొనెను. ఇట్లు వాదము జరుగుచుండగనే లోకభయంకరుఁడగు నాదివ్యపురుషుఁడు సర్వమును భగవంతునిగాఁ జూచుచున్న మహాభక్తుఁడగు ప్రహ్లాదునిమాట యథార్థము చేయుటకై యప్పుడు నరసింహరూపముతో స్తంభమునుండి బయటికివచ్చి, యచ్చటియల్లరియంతయుఁజూచి బాహువులు సాఁచి యాహిరణ్యకశిపుని బట్టుకొని గోళ్లతో నతని హృదయముఁజీల్చి యమునియింటికిఁ బంపించెను. అటువంటి మహానుభావుఁ డగు నాభగవంతుఁడే నాద్వారము నొద్ద ద్వారపాలకుఁడై యున్నాఁడు. ఆవాసుదేవుఁడు నిరంజనుఁడు. ఆదేవాధిపుని యొక్క యథార్థము నేను జెప్పెద నాలకింపుము. నీహృదయము భక్తిభావముతోఁ గూడియుండునట్లు చేసికొని యాకర్ణింపుము. ఇపు డా ద్వారముకడ నున్న పురుషుఁడు వేలకొలఁది యింద్రులను, అయుతముల కొలఁది దేవతలను, వందలకొలఁది సప్తఋషులను దనయధీనము చేసికొని యున్నాఁడు” అని యిట్లు చెప్పినబలిమాటలు విని రావణుఁ డిట్లనియె.

నేను పాశహస్తుఁడును, మహాజ్వాలాపరీతుఁడును, ఊర్ధ్వరోముఁడును, భయంకరుఁడును, ప్రేతములకు రాజునగుయముని మృత్యువుతోఁ గూడఁజూచితిని. మఱియు నాయముఁడు మెఱుపుఁదీఁగవంటినాలుకయు, పెద్దపెద్దదంష్ట్రలు, సర్పములవంటియు వృశ్చికములవంటియు రోమములు, ఎఱ్ఱనికన్నులు, భయంకరమయిన వేగము గలిగి సర్వజంతువులకును భయంకరుఁడై సూర్యునివలెఁ దేఱిమూడఁజాలనివాఁడు ; యుద్ధములలో మరలనివాఁడు; పాపాత్ములను శిక్షించువాఁడునుగదా! నే నట్టివానిని యుద్ధములో జయించితిని. నాకు వానితో యుద్ధము చేయునపుడు భయముగాని పీడగాని కలుగలేదు. ఇప్పుడు నీవు చెప్పుచున్నవానిని మాత్రము నేనెన్నఁడును విని యుండలేదు. కాఁబట్టి యతనిసంగతి చెప్పవలయు నని యడుగఁగా బలి యిట్లనియె. “నాయనా! ఇతఁడే మూఁడులోకములను బుట్టించువాఁడు. ఇతఁడే హరియు నారాయణుఁడు నగుప్రభువు. ఇతఁడు కపిలుఁడు, అనంతుఁడు, విష్ణువు, నారసింహుఁడు, మహాద్యుతిశాలి. మఱియు సత్యమునకుఁ జోటు, తేజశ్శాలి, పాశహస్తుఁడు, భయంకరుఁడు, ద్వాదశసూర్యులతో సమానమైన కాంతి గలవాఁడు, పురాణపురుషోత్తముఁడు, నీలమేఘమువంటి కాంతికల వాఁడు,సురలందఱకును నాయకుఁడు, దేవతలలో నుత్తముఁడు. మఱియు

జ్వాలామాలి. మహాబాహుఁడు, యోగి, భక్తజనులకు మేలుచేయు
వాఁడు. ఇతఁడే లోకములను ధరించువాఁడును, సృజించువాఁడును,
కాలరూపుఁడై సంహరించువాఁడునునై యుండును. చక్రాయుధధారి
యగునితఁడే యజ్ఞములు, యజ్ఞములుచేయువాఁడునునై యుండును.
ఇతఁడే సర్వదేవమయుఁడును, సర్వభూతమయుఁడు నని చెప్పఁబడిన
వాఁడు. ఇంతయేల యితఁడే సర్వలోకమయుఁడు, సర్వజ్ఞానమయుఁడును
సర్వరూపియు మహారూపియు బలదేవుఁడు మహాభుజుఁడు వీరహంత
యు. మూఁడులోకములకును గురువును, అవ్యయుఁడును ననియిట్లు
ముముక్షులగు మునులందఱును జెప్పుచుందురు. ఈపురుషుని దెలిసి
కొన్నవారికిఁ బాపములతో సంబంధ ముండఁబోదు. అతనిని స్మరించినను
అతనినిగుఱించి యజ్ఞాదులు చేసినను సర్వకామములును నెఱవేఱు
చుండును." అని యిట్లు చెప్పినబలి మాటలు విని కోపముచే నెఱ్ఱఁబడిన
కన్నులుగలవాఁడై యాయుధములు పట్టుకొని మహాబలశాలి యగు
రావణుఁ డక్కడనుండి బయలుదేఱెను. అటువంటిరావణుని జూచి
ముసల మనునాయుధము చేతితోఁ బట్టుకొని ద్వారమునొద్దనున్న
యాభగవంతుఁడు బ్రహ్మకు మేలుచేయు తలంపుగలవాఁడయి "ఈపాపా
త్ముని నేనిపుడు చంపను." అని నిశ్చయించుకొని విశ్వరూపుఁడు గనుక
నాయన యచ్చటనే యంతర్ధానము నొందెను. ఎంతప్రయత్నించినను
మఱి యాపురుషుఁడు రావణునకుఁ గనుపడలేదు.

## 2-వ సర్గము

రావణుఁడు సూర్యలోకమునకుఁ బోవుట

తరువాత నాలోచించుకొని రావణుఁడు సూర్యలోకమునకుఁ
బోయెను. అచ్చట మేరుపర్వతశిఖరముపై నారాత్రి నివసించి సూర్యుని
గుఱ్ఱములవేగమును మనోవేగమును గలదియు, దివ్యమును విహార
ప్రదేశమును నగు నాకసమున నున్నదియు నగు పుష్పకమెక్కి బయలు
దేఱి సర్వతేజోమయుఁడును, స్వయంప్రకాశమానుఁడును, శుభమయిన
యాకృతిగలవాఁడును, మంచిబంగారుభుజకీర్తులచేతను రక్తాంబరముల
చేతను నలంకరింపఁబడినవాఁడును, శుభంకరము లగుకుండలములచే
వెలుఁగుచున్న ముఖముగలవాఁడును, రక్తమాలావిభూషితుఁడును,

కేయూరాదులగు నాభరణములుగలవాఁడును, రక్తచందనముచేఁ బూయఁబడిన దేహము గలవాఁడును; వేయికిరణములచే సుజ్వలుఁడై యొప్పువాఁడును, ఏడుగుఱ్ఱములచేఁ బూన్పఁబడినరథముపైఁ గూర్చుండి యున్నవాఁడును, ఆదిమధ్యాంతములు లేనివాఁడును, సమస్తలోకములకు సాక్షిభూతుఁడును, ప్రభువును నగు సూర్యభగవానునిఁ జూచెను. ఇట్లు చూచి యారావణుఁడు సూర్యునితేజస్సుయొక్క బలముచేఁ బీడితుఁడై యున్న ప్రహస్తునితో నిట్లనియె: "ప్రహస్తా! నీవు పోయి యతనితో నాయాజ్ఞను వినిపింపుము. రావణుఁడు నీతో యుద్ధము చేయఁదలంచి వచ్చియున్నాఁడని వినిపింపుము. ఇష్టమున్నచో యుద్ధము చేయుము; లేదేని యోడితినని నైనను జెప్పుము. రెండింటిలోను నేదేని యొకపక్షమవలంబింపుమనుము" అని రావణుఁడు చెప్పఁగానే యాప్రహస్తుఁడు సూర్యునియొద్దకుఁబోయి పింగళుండును దండియు నను సూర్యుని ద్వారపాలకులను జూచి, వారితో రావణుని నిశ్చయమంతయుఁ జెప్పి యూరక యుండెను. ద్వారపాలకులలో నొకఁడగు దండి లోపలకుఁబోయి యావృత్తాంతమంతయు సూర్యునితోఁ జెప్పెను. దండి యనువాఁడు చెప్పిన సంగతియంతయు విని బుద్ధిపూర్వకముగా సూర్యుఁ డిట్లనియె: "దండీ! నీవు వెళ్లి రావణునినైనను జయింపుము; లేదేని యోడితి ననియయినను జెప్పుము. ఇపుడు నీబుద్ధికిఁ దోఁచినట్లు చెప్పుము. నేను కాలహరణమును సహింపఁజాలను" అని యిట్లు సూర్యుఁడు చెప్పఁగానే యామాటలువిని పోయి దండి రావణునితోఁ జెప్పెను. రావణుఁ డామాటలు విని సూర్యుని జయించితినని చాటించి యచ్చటినుండి బయలుదేఱిపోయెను.

## 3-వ సర్గము

### రావణుని చంద్రలోకప్రయాణము

తరువాత శ్రీరామా! బాగుగా నాలోచించుకొని రావణుఁడు చంద్రలోకమునకుఁ బోయెను. అచ్చట మేరుపర్వతముయొక్క రమ్యమైన శిఖరముపై నాఁటిరాత్రి నివసించెను. అప్పుడు దివ్యమాలికలు ధరించి దివ్యగంధ మలందుకొని యచ్చరలు సేవించుచుండఁగా నొకఁడు రథముపైఁగూర్చుండి పోవుచుండెను. అతఁడు రతిశ్రాంతుఁడై యచ్చరల దేహములచేఁ జుంబింపఁబడినవాఁ డగుచున్నవాఁడై విబోధమును గను

చుండెను. అటువంటివానిని జూచి రావణుఁడు కౌతూహలముతోఁ గూడినవాఁడై యచ్చటనే పర్వతుఁడను పేరుగల మునినొకనిని జూచెను. రావణుఁ డామునివర్యుని జూచి యిట్లనియె: "ఋషివర్యా! నీకు స్వాగతము. దైవవశమునఁ దటస్థించితివి. అచ్చరలచే సేవింపఁబడుచు రథ మెక్కి పోవుచున్న యీపురుషుఁ డెవఁడు? వానికి సిగ్గున్నట్టు కనుపట్టదు. వానికి భయము గూడ లేనట్టున్నది." అని రావణుఁ డనఁగా విని పర్వతుఁ డిట్లనియె. 'మహామతి వగువత్సా! యథార్థ మయిన సంగతి చెప్పెదను. ఇతఁడు లోకముల నన్నింటిని జయించి బ్రహ్మను సంతోషింపఁజేసినవాఁడు. ఇతఁడు మోక్షమునకుఁ బోవుచున్నాఁడు. అది యుత్తమమయిన సుఖమును గలిగించుస్థానము. నీవు పరాక్రమముచేతను లోకములను జయించి నట్లే, యితఁడును దనతపస్సుచే నన్నిలోకములను జయించినవాఁడు. ఇతఁడు పుణ్యాత్ముఁడు. వత్సా! యితఁడు సోమరసము త్రాగి పోవుచున్నాఁడు. ఇందులో సందియము లేదు. రాక్షసశార్దూలా! నీవును శూరుఁడవు: సత్యవ్రతుఁడవు. నీవంటి బలవంతు లిటువంటి బ్రహ్మచారులపైఁ గోపింపరు.' అని యిట్లాపర్వతముని చెప్పుచుండఁగానే మహాకారము గలిగి తేజశ్శాలి యగు నొక రథికుఁడు గానవచ్చెను. అతఁడు మఱియు గీతవాద్యవినోదములఁ దగిలియుండెను. వానినిజూచి రావణుఁడిట్లనియె: దేవర్షీ! కిన్నరులు పాడుచుండఁగా నచ్చరలాడుచుండఁగా శోభాయమానుఁడైనమహాద్యుతి యగు నీపురుషుఁడెచ్చటికిఁ బోవుచున్నాఁడు? అని రావణుఁడడుగఁగాఁ బర్వతుఁడిట్లనియె: రావణా! ఇతఁడు మహాశూరుఁడు. యుద్ధములోఁ జయించువాఁడు. స్వామికార్యమునకయి జీవితమును త్యజించినవాఁడు. ఇతఁడు యుద్ధములోఁ సైన్యముతోఁ గూడిన మహావీరుల ననేకులను జంపి తాను జచ్చెను. ఇతఁడు యుద్ధములలో మరలనివాఁడు. ఇతఁడు యుద్ధము చేయుచుండఁగా నాయుధముచే నితని శరీరము శిథిలముగాఁ జేయఁబడినది. ఇతఁడిపుడు దేవేంద్రుని యింటి కతిథిగాఁ బోవుచున్నాఁడు. కాదేని తనయిచ్ఛకు వచ్చినచోటికిఁ బోవఁగలఁడు. ఈనరసత్తముని కిన్నరాదులు నృత్తగీతాదులచే సేవించుచుందురు. ఆమాటలు విని మరల నొకసూర్యునివంటి తేజస్సుగల పురుషునిజూచి 'వీఁ డెవఁ'డని పర్వతు నడుగఁగాఁ బర్వతుఁ డిట్లనియె: "రావణా! బంగారువికారమయిన రథముపైని గూర్చుండి యప్సరోగణముచే సేవింపఁ

బడుచుఁ బూర్ణచంద్రునితో సమానమయిన ముఖముగలవాఁ డయి కనుపడుచున్న యీపురుషుఁడు సువర్ణమును దానము చేసినమహాత్ముఁడు. కావుననే విచిత్రములయిన యాభరణములును వస్త్రములును గలవాఁడై యున్నాఁడు. ఇతఁడు శీఘ్రగామియగు విమానమెక్కి పోవుచున్నాఁడు" అని చెప్పినపర్వతునిమాటలు విని రావణుఁడు మరలఁ బర్వతునితో నిట్లనియె: "మునీశ్వరా! ఈపోవుచున్నరాజు లెవరు? వీరిలో నెవ రైనను నాకు యుద్ధభిక్ష యీయఁగలవా రున్నారా? పర్వతమునీ! వేగము చెప్పుము. ధర్మజ్ఞా! నీవు నాకుఁ దండ్రివంటివాఁడవు." అని యడుగఁగాఁ బర్వతుఁ డిట్లనియె. "రావణా! వీరు స్వర్గమును గోరి పోవుచున్నారు. వీరుయుద్ధము చేయువారు గారు. కావలసినచో నీతో యుద్ధముచేయఁదగినవానిని నేనుజెప్పెదను వినుము. భూలోకమున మాంధాత యనురాజొకఁడు గలఁడు. అతఁడు విచిత్రాంబరభూష ణుఁడు. సప్తద్వీపము లేలువాఁడు. చాల గొప్పవాఁడు. అతనిదగ్గఱకుఁ బోయితివేని నీకు యుద్ధశ్రద్ధ తీఱఁగలదు." అని పర్వతుఁడు చెప్పఁగా విని రావణుఁ డిట్లనియె. "పర్వతమునీ! నీవు చెప్పిన మాంధాతృమహారా జెచ్చోనుండును? నిజముగాఁజెప్పుము; నేనిప్పుడే వానితో యుద్ధముచేయఁ బోయెదను." అను రావణునిమాటలు విని పర్వతుఁ డిట్లనియె. రావణా! మాంధాత యనురాజు యువనాశ్వుని కుమారుఁడు; రాజశ్రేష్ఠుఁడు. అ తఁడు తనబలముచేత సప్తద్వీపములను జయించి స్వర్గమునకుఁ బోవ నున్నాఁడు. అని చెప్పఁగానే మహాబాహుఁ డగు నారావణుఁడు బ్రహ్మ యిచ్చినవరములచే గర్వించి యయోధ్యాధిపతియు, వీరుఁడును, రాజశ్రేష్ఠుఁడును సప్తద్వీపములకుఁ బ్రభువును రథమెక్కి పోవుచున్నవాఁడును బంగారు వికారమై విచిత్రమై ప్రకాశించుచుండు మహాహారముచే వెలుఁగుచు దివ్యమైనగంధ మలందుకొని దివ్యమాలాలంకృతుఁడై రూపముచేతను జాజ్వల్యమానుఁడైనవాఁడును నగు మాంధాతను జూచి "నాకు యుద్ధ భిక్ష యిమ్ము. లేదేని యోడితినని నైనను జెప్పుము" అని యనుచున్న రావణుని జూచి నవ్వుచు మాంధాత యిట్లనియె: "రావణా! నీకుఁ బ్రాణములమీఁద నాశ లేకయున్నచో నాతో యుద్ధమునకు రమ్ము" అను మాంధాతమాటలు విని రావణుఁ డిట్లనియె: "ఓరీ! యీరావణుఁడు వరుణునకుఁగాని, కుబేరునకుఁగాని, యమునకుఁగాని భయపడి యెఱుఁ

గఁడే. ఇఁక మనుష్యమాత్రుఁడవగు నీవు భయపడు ననుకొంటివటరా!" అని యతనితోఁజెప్పి రావణుఁడు కోపమువలన వానిని దహించువానివలె యుద్ధదుర్మదు లగు రాక్షసుల కాజ్ఞాపించెను. దురాత్ముఁడగు రావణుని యొక్క మంత్రులు కోపించినవారై బాణవర్షమును వర్షించిరి. తరువాత నామహాబలవంతుఁడగు మాంధాత కోపించి యజిహ్మగము లగుకంకపత్రములు గలబాణములచే ప్రహస్తుఁడు, శుకుఁడు, సారణుఁడు, మహోదరుఁడు, విరూపాక్షుఁడు, మారీచుఁడు, అకంపనుఁడు మొదలగువారిని గట్టిగాఁ గొట్టెను. తరువాత ప్రహస్తుఁడు రాజుమీఁద బాణవర్షము వర్షించెను. ఆరాజు తనదగ్గఱకు రాకుండఁగనే యాబాణములను త్రోవలోనే ఖండించెను. మఱియు నతఁడు ప్రయోగించిన భుశుండులచేతను, భల్లములచేతను, భిండివాలములచేతను, తోమరములచేతను గొట్టఁబడి రాక్షసులు మండుచున్న యగ్ని నెదుర్కొనిన మిడుతలదండువలె మాఁడిపోవుచుండిరి. మరల నారాజు కోపించి యైదుబాణములచేత నారావణునిఁ గొట్టెను. మఱియు నామహారాజు తోమరములు మొదలగువానిచేతఁ బూర్వము కుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించినట్లు రావణుని భేదింప మొదలిడెను. తరువాత వజ్రాయుధమువంటి ముద్గరమును గిరగిరఁద్రిప్పి యతివేగముగా రాక్షసునిరథముపైఁ బడునట్లుగా విసరెను. అది వచ్చి పిడుగుపడినవడువున రావణునిమీఁదను బడినది. దానిపాటుచే రావణుఁడు ఘూర్ణితుఁడై యింద్రధ్వజమువలెఁబడిపోయెను. అప్పు డారాజు చాలసంతోషించినవాఁడై హర్షముతోఁ గూడినబలము గలిగి ప్రకాశించెను. వేయేల? ఆతఁడు చంద్రునియొక్క సమస్తకిరణములతోడను స్పృశింపఁబడిన సముద్రమువలెఁ బొంగియుండెను. తరువాత రాక్షససైన్యమంతయుఁ దెలివితప్పిపడియున్న రావణునిఁజుట్టు వారుకొనియుండిరి. కొంతసేపటికిఁ దెలివితెచ్చుకొని లంకేశ్వరుఁడును లోకరావణుఁడును నగురావణుఁడు మాంధాతశరీరమును బీడింప మొదలిడెను. మహాబలుఁడగురావణుఁ డతనిరథమును గుఱ్ఱములతోఁగూడఁ బాడుచేసెను. అట్లు విరథుఁడై మరల వెంటనే పెల్లుగ మ్రోయుగంటలతోఁ గూడికొనిన శక్తిని బూని బలపూర్వకముగా రావణునిమీఁదికి విసరెను. ఇట్లు మాంధాతచే విసరఁబడి యర్కజ్వాలవలెను, అగ్నిశిఖవలెను వెలుఁగుచు వచ్చుచున్న యాశక్తిని రావణుఁడు శూలముచేతను వారించి యగ్ని మిడుతనుదహించి

నట్లు దానిని దహించెను. తరువాత నా రావణుఁడు తనకు యముఁ డిచ్చిన యస్త్రమును దీసి యతివేగముగా మాంధాతపైని బ్రయోగించెను. అతఁడు దానిచేఁ గొట్టఁబడినవాఁడై మూర్ఛిల్లెను. అట్లు మూర్ఛపోయిన మాంధాతను జూచి రాక్షసులు సంతోషించిరి; సింహనాదములు చేసిరి. తరువాత ముహూర్తకాలములోనే తెలివి దెచ్చుకొని శత్రువులగు రాక్షసులచేత గౌరవింపఁబడుచున్న శత్రువుగు రావణునిఁజూచి కోపించిన వాఁడై దురాధర్షుఁడును చంద్రసూర్యులతో సమాన మైనకాంతిగలవాఁడును నగు మాంధాత గొప్పదియగు బాణవర్షముచేత రాక్షసబలము నంతను బీడించెను. తరువాత ధనుష్టంకారముచేతను, బాణవర్షముచేతను, సైన్యమంతయు సముద్రమువలె కల్లకల్లోలమైనది. అప్పుడు నరులకును రాక్షసులకును దొమ్మిగా యుద్ధము జరిగినది. నరశ్రేష్ఠుఁడగు మాంధాతయు రాక్షసశ్రేష్ఠుఁడగు రావణుఁడును గోపావేశముగలవారై ధనుస్సులు గత్తులు పట్టుకొని యుద్ధము చేసిరి. మాంధాత రావణుని, రావణుఁడు మాంధాతను మిక్కిలిగా బాణవర్షము వర్షించి పీడింపఁజొచ్చిరి. ఇట్లు పరస్పరమును సంక్షోభము గలిగి ప్రహారములచేతను శిథిలమైన యవయవములు గలవారై యుండిరి. అప్పుడు రావణుఁడు రాజుపైని రౌద్రాస్త్రమును బ్రయోగించెను. ఆమాంధాత యాగ్నేయాస్త్రమును బ్రయోగించి దానిని వారించెను. మరల రావణుఁడు గాంధర్వాస్త్రమును బ్రయోగించెను. మాంధాత వారుణాస్త్రమును బ్రయోగించి దానిని వారించెను. రావణుఁ డప్పుడు సర్వభూతములకును భయావహమైన బ్రహ్మాస్త్రమును బ్రయోగించుటకును,మాంధాత దివ్యమగు పాశుపతాస్త్రమును బ్రయోగించుటకును సిద్ధముగా నుండిరి. ఆరెండస్త్రములును మహాఘోరమైనవి. మూఁడులోకములకును భయమును గలిగించునవి. అప్పు డా రెండస్త్రములను జూచి చరాచర ప్రపంచమంతయు భయపడినది. పాశుపతము రుద్రుని వరదానమువలనఁ బొందఁబడినది. దేవతలు, నాగులు కంపము నొంది యిఁకఁ బ్రళయము దప్పదని నిశ్చయించుకొనిరి. ఇట్లుండఁగాఁ బులస్త్యుఁడును, గాలవుఁడును ధ్యానముచేత నీసంగతియంతయుఁ దెలిసికొని యుద్ధముచేయుచోటికి వచ్చి మాంధాతను వారించిరి. రావణునియొద్దకును వచ్చి మంచిమాటలాడి మానిపించిరి. తరువాత నారావణమాంధాత

సిద్ధులును శాంతించిరి. ఇట్లామునీశ్వరులు వారియిద్దఱకును స్నేహము గలుగఁజేసి వచ్చినదారినే పోయిరి.

## ౪.వ సర్గము

### బ్రహ్మసందర్శనము

ఆమునులు సిద్ధులును నట్లు పోఁగానే రాక్షసాధిపుఁడగు రావణుఁడు పుష్పక మెక్కి పదివేల యోజనముల దూరముగల మొదటివాయుమార్గము నతిక్రమించెను. అచ్చటనే స్వర్గస్థులగు పరమహంసలు సద్గుణాన్వితులయి యుందురు. అటు పయిని రెండవవాయుపథము నతిక్రమించెను. అదియును బదివేల యోజనముల పరిమాణము గలిగియుండెను. అచ్చట మేఘము లన్నియు నుండును. ఆమేఘములు మూఁడువిధములు. నిత్యమును నచ్చట నాశ్రయించి యుండును. అవి యాగ్నేయము లనియు, పక్షజములనియు, బ్రాహ్మము లనియు మూఁడువిధములుగాఁ జేరొందినవి. తరువాత నారావణుఁ డచ్చటినుండి బయలుదేఱి మూఁడవవాయు మార్గమునకుఁ బోయెను. అచ్చట నిత్యమును మనస్స్థిరులగు సిద్ధులు చారణులును నుందురు. అదిగడచి పదివేల యోజనముల దూరము పోఁగా నచ్చట నాలవవాయుమార్గ మగపడినది. అచ్చట నిత్యమును వినాయకులతోఁగూడి భూతములు నివసించుచుండును. అచ్చటినుండి పదివేలయోజనముల దూరముఁ గడచి యయిదవవాయుమండలమును జూచెను. అచ్చట గంగయుఁ గుముదాదులగు నాగులును నివసించుచుం దురు. మఱియు నాచోటను గంగలో నివసించి యేనుఁగులు నానావిధ ముల బుణ్యమును సంపాదించుకొనుచుఁ దమ తొండములచే జలబిందు వులను విడుచుచుండును. శ్రీరామా! ఆయేనుఁగులతొండములనుండి జాఱి వాయువుచేతను లోలితమయి యచ్చటిపొదలలోఁ బడి జలము మంచగుచుండును. అచ్చటినుండి బయలుదేఱి పదివేలయోజనముల దూరమునందున్న యాఱవవాయుమండలమును జూచెను. అచ్చోటున గరుడుఁడు తనజ్ఞాతులచేతను, బంధువులచేతను సత్కరింపఁబడుచు నిత్య మునునుండును. మఱియు నచ్చటినుండి యట్లే పదివేలయోజనములదూర, మతిక్రమించి సప్తమమైనవాయుమండలమునఁ బ్రవేశించెను. అందున్న సప్త ఋషులను జూచి యచ్చటినుండి మరలఁ బదివేలయోజనములదారి గడచి

గంగ ప్రవహించుచున్న యెనిమిదవ వాయుమార్గమును జూచెను. అచ్చటి గంగ కాకాశగంగ యనిపేరు. అది యాదిత్యపథమునం దున్నది. దానిని వాయువు ధరించుచుండును. దానివేగము చప్పుడును నింతింతయనిచెప్ప శక్యముగాదు. ఆటుపై నుండుచోటు సంగతి చెప్పెదను వినుము. అచ్చటనే చంద్రుఁడుండును. అచ్చటినుండి యెనుబదివేలయోజనము లతిక్రమింపఁగా నచ్చట గ్రహములతోడను, నక్షత్రములతోడను గూడి చంద్రుఁడుండును. ఆచంద్రునిమండలమునుండి యసంఖ్యము లగుకిరణములు లోకములను ప్రకాశింపఁజేయుచుండును. ఆకిరణములు సర్వజంతువులకును సుఖమును గలిగించును. ఇట్లు తనలోకమునకు వచ్చియున్న రావణునిజూచి చంద్రుఁడు శీతాగ్నిచే దహించువాఁడుపోలె నగపడెను. రావణునిమంత్రు లాశీతాగ్నికిఁ దాళఁజాలక భయపీడితులై యుండఁగా నపుడు ప్రహస్తుఁడు జయశబ్దపూర్వకముగా రావణునితో నిట్లనియె: "రాజా! మేమందఱమును శీతముచే బాధింపఁబడిపోవుచున్నాము. మన మింక నిచ్చటినుండి మరలిపోవుదము. చంద్రునికిరణముల ప్రభావముచేత రాక్షసులకు భయము గలిగినది. ఈశీతాంశుఁడు తనకాంతిచేతను దహనస్వరూపుఁడుగా నగపడుచున్నాఁడు" అని చెప్పిన ప్రహస్తునిమాటలువిని రావణుఁడు కోపముతోఁ గూడినవాఁడై ధనుస్సున నారిని సారించి యొక్కమాఱు ధనుష్టంకారముచేసి బాణములతో నతనిని బీడించెను. అపుడు బ్రహ్మదేవుఁడు త్వరగాఁ జంద్రలోకమునకు వచ్చి రావణునితో నిట్లనియె: "దశగ్రీవా! మహాబాహూ! నీవు మావిశ్రవసుని కుమారుఁడవు. నా మాట వినుము. నీవు చాలమంచివాఁడవు. చంద్రుని నిష్కారణముగాఁ బీడింపక యింక నీపాటి కిచ్చటినుండి మరలి పొమ్ము. ఇతఁడు లోకమునకు హితము చేయువాఁడు. ద్విజరాజు మహాకాంతిగలవాఁడు. నేను నీకుఁ బ్రాణములకు హానిగలుగునపు డభయమును సమకూర్చు మంత్ర మొకటి యుపదేశించెదను. నాయనా! ఆమంత్రమును జపము చేసినవారికి మృత్యుభయము లేదు" అని యిట్లు బ్రహ్మచెప్పఁగావిని చేతులు జోడించి రావణుఁ డిట్లనియె.

"దేవా! నీవు నన్నుఁ జూచి సంతోషించితివేని నే ననుగ్రహింపఁ దగినవాఁడనుగా నగపడితినేని నీయిష్టప్రకారముగానే యామంత్రరాజమును బ్రసాదింపుము. నీయనుగ్రహమువలన నేను దానిని జపము చేసి

కోరుచు సర్వదేవతలవలన నిర్భయముంగ నైనను చేయుము. మరియు సర్వా సురులవలనను దానవులవలనను పక్షుల వలనగాని నరులవలనను నీ దయ వలన నాకు భయములేదు" అని చెప్పుకొనగా విని బ్రహ్మ సంతోషించి యిట్లనెను; "రావణా! నీవు ప్రాణములకు హాని యేర్పడినప్పుడే తప్ప నీకెప్పుడును ప్రయోగింపరాదు. ఈశుభమంత్రము ననుసూత్రము పట్టు కొని జపము చేయవలయును. రావణా! ఇది జపముచేయనిచో సిద్ధించు నదిగాదు. ఇదిగో చెప్పుచున్నాను వినుము. దీని ప్రభావము నీకిప్పుడే ప్రత్యక్షమగును. నీవు యుద్ధములలో జయమును బొందుదువు.

"దేవదేవేశా! నీకు నమస్కారము. సురాసురనమస్కృతా! నీకు నమస్కారము. భూతభవ్యమహాదేవా! హరా! పింగళలోచనా! వ్యాఘ్రాజినధారీ! నీవు బాలుడవు. వృద్ధరూపుడవు. దేవా! నీ వారణేయుడవు, త్రైలోక్యప్రభువవు, ఈశ్వరుడవు నగుచున్నావు. నీవు హరుడవు, హరితనేమివి, యుగాంతమునందు దహించు నగ్నివి నగుచున్నావు. గణేశుడు, లోకశంభువు, లోకపాలుడు, మహాభుజుడు, మహాదేవుడు, మహాశూలి, మహాదంష్ట్రుడు, కాలుడు, కాలరూపుడు, నీలగ్రీవుడు, మహోదరుడు, వేదాంగుడు, వేదమయుడు, పశుపతి, అవ్యయుడు, శూలధరుడు, శూలకేతుడు, నేత, గోప్త, హరి, శివుడు, జటి, ముండి, శిఖండి, లగుడి, మహాయశుడు, భూతేశ్వరుడు, గణాధ్యక్షుడు, సర్వాత్మ, సర్వభావనుడు, సర్వదుడు, సర్వహారియు, స్రష్ట, గురువు, కమండలుధరుడు, దేవుడు, పినాకి, ధూర్జటియు, మాననీయుడు, బ్రహ్మణీయుడు, ఓంకారుడు, సామవేదగుడు, మృత్యువు,-మృత్యుదూతయు, పారియాత్రుడు, సువ్రతుడు, బ్రహ్మచారి, గృహి, యోగి, వీణాపణవ తూణవంతుడు, అమరుడు, దర్శనీయుడు, బాలసూర్యసమప్రభుడు, శ్మశానచారి, భగవానుడు, ఉమాపతి, అరిందముడు, భగనేత్రాపహర్త, పూషదంతనిపాతనుడు, జ్వరహర్త, పాశహస్తుడు, ప్రళయుడు, కాలుడు, ఉల్కాముఖుడు, అగ్నికేతుడు, మునిదీప్తుడు, విశాంపతి, ఉన్మాదమోహనకరుడు, సమర్థుడు, త్రిదశోత్తముడు, వామనుడు, వామదేవుడు, ప్రాగ్దక్షిణ్యుండనునామముగలవాడు, భిక్షువు, భిక్షురూపి, త్రిజటి, జటిలుండు, చక్రహస్తుడు, ప్రతిష్టంభి, చమూస్తంభనుండు, ఋతువు, ఋతుకరుడు, కాలుడు, మధువు, మధురలోచనుడు,

వానస్పత్యుఁడు, శ్రీకరుఁడు, నిత్యమును ఆశ్రితపూజితుఁడు, జగద్ధాత, కర్త, పురుషుఁడు, శాశ్వతుఁడు, అజుఁడు, ధర్మాధ్యక్షుఁడు, విరూపాక్షుఁడు, త్రివర్త్మ, భూతభావనుఁడు, త్రినేత్రుఁడు, బహునేత్రుఁడు, సూర్యాయుతసమప్రభుఁడు, దేవదేవుఁడు, అభిదేవుఁడు, చంద్రాంకితజటుఁడు, నర్తకుఁడు, లాసకుఁడు, పూర్ణేందుసదృశాననుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, శరణ్యుఁడు, సర్వదేవమయుఁడు, సర్వభూతనివాసుఁడు, సర్వబంధవిమోచకుఁడు, మోహనుఁడు, వంచకుఁడు, సర్వధారి, నరోత్తముఁడు, పుష్పదంతుఁడు, విభాగుఁడు, ముఖ్యుఁడు, సర్వహరుఁడు, హరిశ్మశ్రువు, ధనుర్ధారి, భీముఁడు, భీమపరాక్రముఁడు, భక్తాభీష్టప్రదుఁడు, స్థాణువు, పరమాత్మ, సనాతనుఁడు నని యీరీతిగా నాచేఁ జెప్పఁబడిన యీపుణ్యమైన శివనామాష్టోత్తరశతమును దప్పక జపముచేయుము. దశగ్రీవా! అట్లు జపము చేసితివేని శత్రువినాశమును గలిగించును. ఇట్లు కమలాసనుఁడా రావణునకు వరమిచ్చి తన బ్రహ్మలోకమునకుఁ బోయెను. దురాత్ముండగు రావణుఁడు బ్రహ్మవలన వరమును బొంది యక్కడినుండి మరలి సంతోషముగా మఱియొకవైపునకుఁ బోయెను. అట్లు పోవుచుఁ ద్రోవలోఁ గనుపడిన రాజులయు, ఋషులయు, గంధర్వులయుఁ గన్యకల నపహరించుకొని పోయెను.

## ౫-వ సర్గము

### రావణునకు దివ్యపురుషుఁ డగపడుట

ఇట్లు బయలుదేఱి లంకలోఁ బ్రవేశించి కొంతకాల మచ్చట నుండి మఱియొకప్పు డిట్లు బయలుదేఱి మంత్రులతోఁ గూడఁ బశ్చిమసముద్రతీరమునకుఁ బోయెను. అచ్చటనుండఁగా నొకద్వీపమునందుఁ బావకప్రభగలవాఁడును, పుటము వేసిన బంగారువంటిచాయగలవాఁడును, నేకాకియు నగుపురుషుఁ డగపడెను. అతఁడు యుగాంతమందలి యగ్నితో సమముగాఁ గనుపడెను. మఱియు నతఁడు గ్రహములకు సూర్యుఁడువలెనే దేవతలందఱకును బ్రభువు. శరభములలో సింహమువలెను, ఏనుఁగులలో నైరావతమువలెను, పర్వతములలో మేరువువలెను, వృక్షములలోఁ బారిజాతవృక్షమువలెను, కుండమధ్యమునం దగ్నివలెను నుండి ప్రకాశించువాఁడును, వివిధములగు ధ్వనులు గలుగునట్టుగా గర్జించుచున్నవాఁడును

లంబహస్తుఁడును, భయంకరుఁడును, దంష్ట్రిలుండును, వికటుఁడును, కంబుగ్రీవుఁడును, మహారాజసుఁడును, మందరాకమువంటి యుదర ప్రదేశము గలవాఁడును, పింగాక్షుఁడును, కైలాసశిఖరోపముఁడును, పద్మములవంటి పాదతలములు గలవాఁడును, భీముఁడును, ఎఱ్ఱనిపద్మమువంటి ముఖము గలవాఁడును, మహాశరీరుఁడును, మహానాదము చేయువాఁడును, మనస్సు తోడను గాలితోడను సమమైన వేగముగలవాఁడును, భయంకరముగాఁ గట్టఁబడిన యంబులపాదులుగలవాఁడును, కూర్పఁబడిన చామరములుగల వాఁడును, జ్వాలామాలాపరిక్షిప్తుఁడును, కింకిణీకృతనిస్వనుండును, బంగారుపద్మములమాల వక్షఃప్రదేశమునందు వ్రేలుచున్న వాఁడును, ఋగ్వేదమువలె శోభించుచున్న వాఁడును, పద్మమాలావిభూషితుఁడును, బంగారు కొండతో సమానముగా నున్న వాఁడును నగు పురుషుని జూచి కాటుక కొండవంటియాకారముగల రావణుఁడు నాతో యుద్ధము చేయుదువు రమ్మనియెను. మఱియు శూల శక్త్యృష్టిపట్టసము లను నాయుధములు పట్టుకొని మంత్రులు దానును గట్టిగా గర్జించెను. పెద్దపులిచేత సింహమువలెను, శలభముచేత ఏనుఁగువలెను, మేఁకచేత మేరువు వలెను, నదీవేగముచేత సముద్రుఁడువలెను కంపింపఁజేయుటకు వీలు గాని యాపురుషుఁడు రావణుని జూచి యిట్లనియె: "రావణా ! నీకుఁగల యుద్ధశ్రద్ధను నాశము చేసెదను రమ్ము. దుర్మతీ !"అని యనుచుండఁగానే సర్వలోకభయావహమగు నేవేగము రావణునకుఁ గలదో అటువంటివేగములు వేలకొలఁదిగ వచ్చి యాపురుషు నాశ్రయించినవి. అతనిదృష్టి గ్రహమాలవలె నత్యద్భుతమై యగపడినది. అతఁడు దంతములను పటపటమని కొఱుకుచుండఁగా యంత్రమువలె నతిభయంకరమైనచప్పుడు గలిగినది. మఱియు నతనిధర్మము తపస్సు జగత్సిద్ధికి హేతువులు ; అవి యతనియూరుప్రదేశముల నాశ్రయించియుండినవి. మన్మథుఁ డతని గుహ్యేంద్రియము నాశ్రయించియుండెను. విశ్వేదేవత లతనికటిప్రదేశమును,మరుత్తు లతనిశీర్షప్రదేశమును,అష్టవసువులు నతనిమధ్యదేశమును, సముద్రము లుదరదేశమును నాశ్రయించికొనియుండెను. దిక్కు లన్నియుఁ బార్శ్వములం దుండెను. సర్వసంధులయందును మారుతము లుండినవి. పితరు లతనిపృష్ఠభాగము నాశ్రయించియుండిరి. పితామహుఁ డతనిహృదయమం దున్నాఁడు. పవిత్రములైన గోదానములు, భూదాన

ములు, సువర్ణనాభములు మొదలగునవి యతనిరోమకూపముల నాశ్రయించియున్నవి. హిమవత్పర్వతము, హేమకూటము, మందరము, మేరువు ననుపర్వతము లతని నాశ్రయించి యస్థిభూతములైయున్నవి. భూమి యతనివక్షస్థలముగాను, ఆకాశ మతనిశరీరముగాను నున్నవి. రెండుసంధ్యలును శరీరసంధియం దున్నవి. మేహనమందు మేఘము లున్నవి. ధాత విధాత యతనికి బాహువులుగాను, భగుఁడు పూష కరములుగాను ఉండిరి. ఐరావతుఁడు, విశాలాక్షుఁడు, శేషుఁడు, వాసుకి, కంబళుఁడు, అశ్వతరుఁడు, కర్కోటకుఁడు, ధనంజయుఁడు, ఘోరమయిన విషముగల యాతక్షకుఁడు అనునాగు లతనిగోళ్ల నాశ్రయించి విషమను వీర్యమును విడుచుచున్నారు. అగ్ని యతనికి ముఖమైయున్నాఁడు. స్కంధములు రుద్రులచేత నధిష్ఠింపఁబడియున్నవి. దంతములయందు మాసములు, దంష్ట్రలయందు ఋతువులు, నాసికములయందుఁ గుహువు అమావాస్యయు, తచ్ఛిద్రములయందు వాయువులు నాశ్రయించి యున్నవి. సరస్వతీదేవి యతనిగ్రీవాప్రదేశమం దున్నది. అశ్వినీదేవత లతని చెవులుగాను. సూర్యచంద్రులు కన్నులుగాను నున్నారు. మఱియు వేదాంగములు యజ్ఞములు నానారూపములైన మంచిమంచివృత్తములు వాక్యములు తేజస్సు సిద్ధి తపస్సులు మొదలగున వన్నియు నరరూపముతోనున్న యాపురుషునియం దున్నది.

అటువంటిపురుషుఁడు మెల్లఁగాఁ బిడికిలి పట్టి లీలఁగాఁ జేయియెత్తి కొట్టఁగానే రావణుఁడు క్రింపఁబడి మూర్ఛపోయెను. రాక్షసుఁడు పడిపోవుట చూచి మిగిలినరాక్షసులను బరుగులెత్తునటులఁజేసి ఋగ్వేదప్రతిముఁడును పద్మమాలావిభూషితుఁడును నడచుచున్న కొండవంటియాకారము గలవాఁడును నగుపురుషుఁడు పాతాళలోకములోఁ బ్రవేశించెను. తరువాత రావణుఁడు లేచి స్వయముగా మంత్రులను బిలిచి "యో మంత్రులారా! యిప్పటిపురుషుఁ డెచ్చటికిఁ బాఱిపోయినాఁడో వేగముగాఁ జెప్పుఁడు" అని యడుగఁగానే యామంత్రు లిట్లనిరి: "దేవా! దేవదానవగర్వభంజనుఁడగు నాపురుషుఁ డీబిలములోఁ బ్రవేశించుచుండఁగాఁ జూచితిమి" అనుమంత్రులమాటలు విని గరుత్మంతుఁడు పామును బట్టినట్లు కత్తి చేతితోఁబట్టుకొని దుర్మతియగు రావణుఁడు వేగముగా నాబిలద్వారములోఁ బ్రవేశించెను. అట్లు లోపలకుఁబోయి యచ్చట నల్లని

దేహములు గలవారును, కేయూరములను ధరించినవారును, హారము
లును, రక్తమాల్యములు రక్తగంధము గలవారును, ఉంగరములు హార
ములు మొదలగు నలంకారములచే నలంకరింపఁబడినవారును నగు పురు
షులను జూచెను. మఱియు నచ్చట మూఁడుకోట్లుమహాత్ములు నృత్యము
చేయుచుఁ గనుపడిరి. వారందఱును నిత్యోత్సవులు నిష్ఠయులు విమలులు
పావకజ్వాలలతో సమానులు నైయున్నారు. ఇట్లు వారు క్రీడించుచుం
డఁగా భీమపరాక్రముఁడగు రావణుఁడు చూచి ద్వారమునొద్ద నిలువఁ
బడి యాశ్చర్యపడుచుండెను. మొదటఁ దనకుఁ గనుపడిన పురుషునివలెనే
యచ్చట నున్నవా రందఱును నొక్కకాంతి గలిగి యొక్కమాదిరి బల
వంతులై యగపడిరి. చతుర్భుజులు, మహోత్సాహులు నగు వారలంద
ఱను జూచి రావణుఁడు పులకాంకితగాత్రుఁడాయెను. బ్రహ్మచే నీయఁ
బడిన వరములుగల యారావణుఁ డచ్చటనుండి మరలి సర్పశయ్యపైఁ
బవ్వళించియున్న యొకానొకదివ్యపురుషునిజూచెను. మిక్కిలి విలువగలిగి
తెల్లగాఁ బ్రకాశించుచుఁ గౌస్తుభమాణిక్య మతనివక్షస్థలమునం దగపడి
నది. అతఁడు పాపరాపాన్పుపై నగ్ని ముసుఁగు వైచుకొని నిదురపోవు
చుండెను. మఱియు నతఁడు దివ్యగంధ మలందుకొని దివ్యమాల్యములు
ధరించి దివ్యములైన యాభరణములచే నలంకృతుఁడై దివ్యమయిన వస్త్ర
ములు గట్టుకొనియుండెను. అతనిపార్శ్వమునందుఁ ద్రిలోకసుందరియు,
పతివ్రతయు నగుస్త్రీయొకతె వింజామరపట్టుకొని వీచుచుండెను. ఆమెయే
లక్ష్మి. ఆమె చేతిలోఁ బద్మము పట్టుకొని జాజ్వల్యమానురాలై యగ
పడినది.

చారుహాసినియగు నాలక్ష్మిని జూచి రావణుఁడు పట్టుకొనుటకుఁగా
నామెకూర్చుండియున్న సింహాసనమువంకకు దృష్టిసారించి చూచెను,
దుర్మతియగు నారావణుఁడు మంత్రులనందఱను బయట విడిచివచ్చియు
న్నాఁడు. అప్పుడు మన్మథవశంవదుఁడై యామెను బట్టుకొనుటకుఁ జేతులు
చాఁపఁబోయెను. ఇట్లు కాలచోదితుండై నిదురించుచున్న పామును బట్టు
కొనఁబోవునట్లు లక్ష్మీదేవిని బట్టుకొను ప్రయత్నములో రావణుఁడుండుట
చూచి యగ్ని ముసుఁగు వైచికొని నిదురపోవుచున్న పురుషుఁడు హఠా
త్తుగా ముసుఁగు తొలఁగించి యారావణునివైపు చూచి గట్టిగా నవ్వెను.
అప్పుడు లోకరావణుఁడగు రావణుఁ డతని తేజస్సుచేతఁ దపింపఁజేయఁ

బడినవాఁడై యాపాతాళమునందే దీర్ఘమగు ఘ్రాణవాయువుచే మొదలు నఱకఁబడిన చెట్టువలె భూమిమీఁదను బడిపోయెను. రావణుఁ డట్లు పడి పోవుట చూచి యాపురుషుఁ డిట్లనియె : "రాక్షసశ్రేష్ఠా! లెమ్ము లెమ్ము. నీకిప్పుడు మృత్యుసమయము గాదు. నీవు బ్రహ్మయిచ్చినవరమువలన నిప్ప టికి బ్రతికియుండుము. బ్రహ్మవాక్య మన్యథా చేయఁదగినది గాదు. రావణా! నీయిచ్ఛకు వచ్చినమచ్చునఁ బొమ్ము. నీకిచ్చట మరణము లేదు" అని యిట్లు చెప్పుచుండఁగానే ముహూర్తకాలములో రావణునకుఁ దెలివివచ్చినది. వెంటనే రావణుఁడు మహాత్ముఁడగు నాపురుషుని జూచి భయంపడెను. దేవకంటకుఁడగు రావణుఁడు పురుషుఁడు చెప్పినమాటలు స్మరించుకొని మేనంతయు గగుర్పాటు చెందుచుండఁగా నామహామునిని జూచి యిట్లనియె.

"శౌర్యసంపన్నుఁడవును యుగాంతాగ్నితో సమానుఁడవును నగు నీవెవరు ? సర్వదేహములయందును సుస్థితుఁడవై యున్న దేవుఁడవా? చెప్పుము" అని యిట్లు రావణుఁ డడుగఁగా నాదేవుఁడు నవ్వుచు మేఘ గంభీరమైనమాటలతో నిట్లనియె. "దశగ్రీవా! నీవు నాచేత శీఘ్రముగాఁ జంపఁదగినవాఁడవు గావా?" అనఁగానే రావణుఁడు చేతులు జోడించు కొని యిట్లనియె : "దేవా ! నేను బ్రహ్మదయవలన మృత్యువునకుఁ జిక్కువాఁడను గాను. నాతో సమానుఁ డిదివఱకుఁ బుట్టియుండ లేదు ; ముందు పుట్టఁబోఁడు. త్రిలోకములయందును బ్రహ్మవరమును వ్యర్థము గాఁ జేయువాఁ డుండఁబోఁడుగదా ! ఆవిషయమై పరిహారము లేదు. ప్రయత్నించినను లాభము లేదు. మూఁడులోకములయందును బ్రహ్మవర మును వృథగాఁ జేయువానిని జూచి యెఱుఁగను. ఒకవేళ నాకు నీవలన మృత్యువు గలుగునేమో కాని యితరులవలన నెంతమాత్రమును గలు గదు. నీచేత నాకు మరణము గలుగుటకంటెఁ గీర్తికరమును గొనియాడఁ దగినదియుఁ గలదా?" అని యిట్లు చెప్పుచుండఁగా నాదేవదేవుని శరీ రమునందు భీమవిక్రముఁడగు రావణునకు మూఁడులోకములును నగపడి నవి. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, మరుత్తులు, అశ్వినీదేవతలు, సిద్ధులు, పితరులు, యముఁడు, కుబేరుఁడు, సముద్రములు, కొండలు, నదులు, విద్యలు, వేదములు, అగ్నిహోత్రత్రయము, గ్రహములు, తారాగణము, ఆకాశము, సాధ్యులు. గంధర్వులు, చారణులు, మహ

షులు, వేదవిదులు, గరుడులు, పాములు, ఇంకను మిగిలిన దేవతలు, రాక్ష
సులు వారు వీరును నని విభజించి చెప్పనేల ? చరాచర ప్రపంచమంతయును
నిదురించుచున్న యాపరమపురుషుని యవయవములయందు సూక్ష్మరూప
మునఁ గనుపట్టినది. ఇంతవఱకును విని శ్రీరామచంద్రుఁ డగస్త్యభగవా
నుని జూచి యిట్లనియె.

"అగస్త్యమహర్షీ! ద్వీపమునందు రావణున కగపడిన పురుషుఁ
డెవరు ? ఆమూఁడుకోట్లమంది యెవరు ? లోపలఁ బండుకొని యున్న
పురుషుఁ డెవరు?" అని యిట్లడిగిన శ్రీరామునివాక్యములు విని యగస్త్యుఁ
డిట్లనియె : రామా ! నీవడిగినసంగతియంతయుఁ జెప్పెదను వినుము. ఆ
ద్వీపమునం దతనికిఁ గనుపడిన యతఁడు దేవదేవుఁడును సనాతనుఁడును
నగు కపిలభగవానుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అతఁడే నారాయణుఁడు,
శంఖచక్రగదాధరుఁడగు దేవుఁడు, భూతముల సృజించువాఁడు, పోషించు
వాఁడు, సంహరించువాఁడు నగు దేవుఁడు. అతని కాదిమధ్యాంతములు
లేవు. అతఁడు విష్ణువు, సర్వమునకుఁ గారణము, శాశ్వతుఁడు, అవ్య
యుఁడు నని చెప్పఁబడుచున్నాఁడు. మఱియు నచ్చట నృత్యము చేయు
చున్నవారు దేవతలు. వా రతనితో సమానమైన తేజస్సు, ప్రతాపము
గలవారు. పాపనిశ్చయుఁడగు నారావణుని, మహాత్ముఁడగు నాకపిలుఁ
డంతకోపదృష్టితోఁ జూడలేదు. కావుననే వెంటనే భస్మము గాలేదు.
కాని కొండనుబోలిన యాతఁడు భిన్నగాత్రుఁడై చెట్టువలె నేలఁగూలెను.
అతఁడు కొండీఁడు రహస్యమును భేదించునట్లు శల్యములవంటి మాటల
చేత భేదించెను. తరువాత రావణుఁడు చాలఁగాలమునకుఁ దెలివొం
దినవాఁడై లేచి తేజస్సంతయు క్షీణముకాఁగాఁ దనమంత్రు లున్నచోటికి
వచ్చిచేరెను. అచ్చటినుండి మంత్రులతోఁగూడి తిన్నఁగా లంకకుఁ
బోయెను.ఇట్లగస్త్యుఁడు చెప్పినసంగతియంతయువిని శ్రీరాముఁడాశ్చర్య
పడెను. మఱియు రామునిసన్నిధిని గౌరవింపఁబడుచున్న వానరులు రాక్ష
సులును జాల నాశ్చర్యమే యనిరి. అప్పుడు శ్రీరామునిప్రక్కనున్న విభీ
షణుఁ డిట్లనియె : "దేవా ! ఇప్పుడు చిరకాలముక్రిందట జరిగిన సంగతి
యంతయు మిక్కిలి యాశ్చర్యముగా స్మరణమునకు వచ్చినది."

తరువాత నగస్త్యుఁడు "రామా ! చెప్పవలసినసంగతి యంతయుఁ
జెప్పితిని. నిన్నుఁ జూచితిమి. నీచే గౌరవింపఁబడితిమి. ఇఁకను నీయొద్ద

సనుజ్ఞను పొంది మామాయాశ్రమములకుఁ బోయెదము" అని చెప్పిన యగస్త్యునిమాటలు విని యానందమును గలిగించువారిలో శ్రేష్ఠుఁడగు రాముఁడు సంతోషించెను.

ప్రక్షిప్తసర్గములు సమాప్తము.

## 24-వ సర్గము

### రావణుఁడు పరస్త్రీల నపహరించుట

ఇట్లు వరుణనగరమునుండి సంతోషించుచు లంకకుఁ బయనమైన దురాత్ముఁడగు రావణుఁడు దారిలో రాజులయు, ఋషులయు, దేవతలయు, గంధర్వులయు కన్యకల నపహరించెను. మఱియు నారావణుఁడు సుందరి యగు కన్నియగాని యన్నులమిన్నగాని యగపడినచోఁ దద్బంధుజనులను జంపి దానిని దనవిమానముమీఁద నరికట్టుచుండును. ఈరీతిగాఁ బన్నగకన్యలను, రాక్షసకన్యలను, అసురకన్యలను, మనుష్యకన్యలను, యక్షకన్యలను, దానవకన్యలను దెచ్చి విమానముమీఁద బంధించెను. వారందఱును సమముగా దుఃఖమువలన శోకాగ్నిభయమువలనఁ గలిగిన వేఁడికన్నీటిని విడిచిరి. రావణునిభయమువలనను బంధువియోగమువలనను గలిగిన దుఃఖమువలనను అమంగళమైన కన్నీటిని విడుచు నా సర్వాంగసుందరులచేతను నదులచే సముద్రమువలె నాతనివిమానము నిండెను. మఱియు నాగంధర్వకన్యకలు, మహర్షికన్యకలు, దైత్యదానవకన్యకలు వందలకొలఁదిగ నావిమానమునందుండి యేడువ మొదలిడిరి. దీర్ఘమైన శిరోజములుగలవారును, సుందరమైన యవయవములు గలవారును, పూర్ణచంద్రునితో సమానమైన ముఖములు గలవారును, బలసినస్తనములుగలవారును, వజ్రవేదిమధ్యసమమైన నడుములుగలవారును, బండికుండలతో సమానమైన పిఱుఁదులు గలవారును, దేవతాస్త్రీలను బోలినవారును, పుటమువేసినబంగారుతో సమానమైన శరీరకాంతి గలవారును అగుస్త్రీలు దుఃఖముచేతను భయముచేతను వ్యాకులమయిన యింద్రియములు గలవారై యావిమానముమీఁదనుండి యేడుచుచుండఁగా, నాస్త్రీలనిట్టూర్పువాయువులచే నావిమానము మిక్కిలి కుములుచున్న యగ్నిహోత్రము గల యగ్నికుండమువలెఁ బ్రకాశించుచున్నది. శోకాకులచిత్తలై రావణునియధీనమున నున్న యాస్త్రీలు దీనములయిన

ముఖములు కన్నులు గలిగి, సింహావశేమునసున్న యాఁడుతేళ్లవలెఁ గాన వచ్చిరి. అందులో నొకతె "వీఁడు నన్ను భక్షించును గాఁబోలు"ననియు, మఱియొకతె "వీఁడు నన్నుఁ జంపును గాఁబోలు"ననియు నాలోచింప మొదలిడిరి. ఈరీతిగాఁ దల్లిదండ్రులను, భర్తలను, సోదరులను, బంధువులను దలంచుకొని దుఃఖశోకసమావిష్టలై గుంపుగాఁగూడి యేడుచు చుండిరి.

"అక్కటా! నన్ను విడిచి నాకుమారుఁ డెట్లు బ్రతుకఁగలఁడు? అయ్యో! మాయమ్మ నన్ను విడిచి యెట్లుండఁగలదు? కట్టా! నాముద్దు తమ్ముఁ డేమైపోవునోకదా? అహాహా! నాతండ్రి నన్నుఁ దలఁచుకొని యెంతగా నేడుచుచున్నాఁడో? దైవమా! ఏమిచేయుదును? నాభర్త నన్నుగుఱించి యెంతవిగులుపడియుండునో? మృత్యువా! ప్రతిమాలు కొనుచున్నాను. నాయందు దయయుంచి నన్నుఁ గొనిపొమ్ము. నేనీ దుఃఖమును భరింపఁజాలను. క్రిందటిజన్మములో నేనెట్టిపాపము చేసితినో కదా!" ఈరీతిగా దుఃఖించుచు నందఱుస్త్రీలును దుఃఖసముద్రములో మునిఁగియుండిరి. ఇట్లు దుఃఖించుచు నాస్త్రీలందఱును నొక్కచోఁ గూడి యీరీతిగాఁ బలవింపమొదలిడిరి: "ఇఁక నీదుఃఖముయొక్క యంతమును జూడము గాఁబోలును! ఓహో! మనుష్యలోక మెంతనింద్యమయినది! ఇంతకంటె నధముఁ డొకఁ డుండునా? ఉదయించినసూర్యుఁడు నక్షత్రములను నశింపఁజేయునట్లీదుర్మార్గుఁడు బలవంతుఁడై దుర్బలులైన మాభర్తలను నశింపఁజేసినాఁడు. ఓహో! బలవంతుఁడగు నీనీచునివధ కేదియు నుపాయము గానరాకుండ నున్నది. కట్టా! ఈచెట్టరక్కసుఁ డెట్టికట్టిఁడివృత్తి నవలంబించియున్నాఁడు? తన్నుఁ దాను నిందించుకొనఁడేమి? భగవంతుఁ డీదుర్మార్గునికిఁ దగినబలమునే యిచ్చియున్నాఁడు? పరస్త్రీలను బలవంతముగాఁ దీసికొని వచ్చుట వీనికిఁ దగదు. ఏమిచెప్పుమా! ఈనీచుని మనస్సు పరస్త్రీలయందు రమించుచున్నది? దీనింబట్టి యోజింపఁగాఁ దుదకు వీఁడు పరస్త్రీహరణమహాపాతకముచేతనే చచ్చువాఁడుగా నగపడుచున్నాఁడు." ఇట్లు పతివ్రతలగు నాస్త్రీలు మాటలాడుకొనుచుండఁగానే దేవదుందుభులు మ్రోఁగినవి. ఆకాశమునుండి పుష్పవర్షము గురిసినది. ఎప్పుడీస్త్రీలందఱును శపించిరో అప్పుడే తేజస్సు తగ్గిపోయినవానివలె రావణుఁడు కాంతిహీనుఁడైపోయెను. ఈరీతిగా నాసుందరుల

యేడుపులనుచునే రాక్షసులచేఁ బూజింపఁబడుచు రావణుఁడు లంకలోఁ బ్రవేశించెను.

రావణుఁ డింటికి రాఁగానే యింతలో ఘోరాకారము గలదియు, కామరూపిణియు నగు రావణుని చెల్లెలు శూర్పణఖ వచ్చి యేడుచుచు నన్న పాదములమీఁదఁ బడినది. అట్లు పడియున్న చెల్లెలిని లేవఁదీసి యోదార్చుచు "అమ్మాయీ! నీవేదో చెప్పఁబోవువానివలె నగపడు చున్నావు. శీఘ్రముగాఁ జెప్పుము" అని రావణుఁ డడుగఁగా శూర్పణఖ యిట్లనియె: "అన్నా! ఇఁక నేమున్నది. నన్ను విధవను జేసివైచితివి. నీవు బలవంతుఁడవైనందుకు ఫలము నాకిట్లు సంప్రాప్తమైనది. నీవు మహాబల వంతులగు పదునాలుగువేల కాలకేయులను జంపితివే, వారిలో ప్రాణ ములకంటెను బ్రియమైన నాభర్తగూడ నున్నాఁడు. నాయనా! నీవతనిని గూడఁ జంపితివి. నీవన్నవు గావు. అన్నరూపముగా నున్న మహాశత్రు వవు. నీవే నాకొంప యీలాగున ముంచివైచితివి. నీవలన నేనిఁకవైధవ్య దుఃఖము ననుభవింపవలసివచ్చినది. ఎంతయుద్ధములోనైనను బావమఱఁ దిని గాపాడుకోనక్కఱలేదా? అయ్యో! అన్నా! స్వయముగా నా మగనిని జంపియు సిగ్గుపడకుండ నున్నావేమి?" అని యిట్లు చెల్లెలేడు చుచుఁ జెప్పినమాటలన్నియు విని యామెను మంచిమాటలచే నోదార్చి రావణుఁ డిట్లనియె.

అమ్మాయీ! ఎందుల కేడిచెదవు? ఇఁక నెంతయేడిచినను లాభము లేదు. మించినకార్యమున కేమిచేయవచ్చును? నీవెందులకును భయపడ నక్కఱలేదు. నీకేవిధమైనలోపమును గలుగకుండ దానమానప్రసాదము లచే నీకు సంతోషమును గలుగఁజేయుచుందును. యుద్ధమదముచే నొడ లెఱుంగక మతిపోయి జయమునే ప్రధానముగాఁ గోరుచు బాణములను జిమ్మి తనవారిని బరాయివారిని దెలిసికోఁజాలక పోయితిని. నేను మా బావమఱఁదిసంగతి యెఱుంగనైతిని. కావుననే నీకీవైధవ్యదుఃఖమును గలి గించితిని. మించినదాని కెంతచింతించినను లాభము లేదుగదా? ఇఁక ముందు సంగతి యాలోచించుకొందము. నీవిటుపైని మిగుల నైశ్వర్యవంతుఁడైన మనఖరాసురునియొద్ద నుండుము. పదునాలుగువేలమంది రాక్షసులకుఁ బ్రభువగు ఖరుఁడు నీకేవిధమైనలోపమును లేకుండ గారవించుచుండును. అతఁడు మహాబలుఁడు. అతఁడును మనకుఁ బినతల్లికుమారుఁడేకాని లాఁతి

వాఁడు కాఁడు. అతఁడు నీయాజ్ఞను శిరసావహించి నీచెప్పుఁజేఁతలలో నుండును. అతఁడును శీఘ్రముగా దండకారణ్యమునకు రక్షణార్థమై పోవలసియేయున్నది. అతనికి దూషణుఁడు బలాధ్యక్షుఁడై యుండఁ గలఁడు. వారందఱును నీమాటను జాలగౌరవింతురు. అతఁడు కామరూపులగు రాక్షసులకుఁ బ్రభువుగదా!" అనియిట్లుచెప్పి చెల్లెలి నోదార్చి మహాబలవంతులగు పదునాలుగువేలమంది రాక్షసులను బయలుదేరఁజేసి యామె నతనివశము చేసెను. ఖరాసురుఁడును ఘోరాకారులగు రాక్షసులతోఁగూడి యేవిధమయిన భయమును నెఱుంగక దండకారణ్యములోనికి వచ్చెను. ఇట్లు వచ్చి యచ్చట నిష్కంటకముగా రాజ్య మేలుచుండెను. ఆశూర్పణఖయు ఖరాసురునియొద్దనే సుఖముగా నుండెను.

## 25-వ సర్గము

### రావణుఁడు మధురాక్షసుని మన్నించుట

ఈరీతిగా రావణుఁడు ఘోరమైన దండకారణ్యమును బినతల్లి కుమారుఁడైన ఖరునకు స్వాధీనముచేసి చెల్లెలి నోదార్చి సంతోషముతో నెమ్మది నుండెను. ఇట్లుండి యొకనాఁడు నికుంభిల యను పేరు గల లంకోద్యానము చూచుటకుఁ బరిజనులతో నందుఁ బ్రవేశించెను. అచ్చట వందల కొలఁది యూపములతోడను, సౌమ్యమగు చైత్యములచేతను శోభితమునునయి జరుగుచున్న యజ్ఞమును జూచెను. ఆయజ్ఞశాలలోఁ గృష్ణాజినము ధరించినవాఁడును, కమండలువుచేతను కుశములచేతను ప్రకాశించుచున్నవాఁడును, శత్రుసంహారకుఁడును నగు కుమారు నింద్రజిత్తును చూచెను. చూచి సమీపించి చేతులతో వానిఁగౌఁగిలించుకొని "వత్సా! నీవిక్కడ నేమిచేయుచున్నావో యథార్థముగాఁ జెప్పు"మని యడుగఁగా, రాక్షసశ్రేష్ఠుండగు రావణునితో ద్విజశ్రేష్ఠుఁడును, మహాతపశ్శాలియు నగు శుక్రాచార్యుఁ డిట్లనియె: "రాజా! నీవడిగిన సంగతియంతయు నేను జెప్పెదను వినుము. నీకుమారుఁడు బహువిస్తారములయిన యేడుయజ్ఞములను బొందియున్నవాఁడు. అగ్నిష్టోమము, అశ్వమేధము, బహుసువర్ణకములుగల రాజసూయము, గోమేధము, వైష్ణవము నను నవియేకాక మనుష్యదుర్లభమగు మాహేశ్వరయజ్ఞము ప్రవర్తించిన దగుచుండఁగా సాక్షాత్తుగాఁ బశుపతివచ్చి నీకుమారునకు వరముల నిచ్చెను.

దివ్యమును, కామగమనము గలదియు నంతరిక్షమునందు సంచరింపఁదగి దదియు నగు రథమును, అంతటను జీఁకటిని గలిగించుటకుఁ దగిన తమోగుణ ప్రధానమైన మాయనుగూడఁ బొందియున్నాఁడు. రాక్షసేశ్వరా! ఈమాయయుద్ధములలోఁ బ్రయోగింపఁబడినచో సురాసురులైనను దెలిసికోఁజాలరు. మఱియు సువర్ణమయమగు ధనుస్సును, బాణపూర్ణములయిన యక్షయతూణీరములను, శత్రువులను దప్పక చంపఁజాలిన దృఢమయిన యస్త్రమును, మఱియు ననేకములను శివభగవానునివలన వరరూపముగాఁ బొందియున్నాఁడు. ఇఁక నీయజ్ఞము సమాప్తము కాఁగానే నిన్నుఁజూడ దలఁచుచున్నాఁడు" అను గురునిమాటలు విని రావణుఁ డిట్లనియె: "మీరు చేసినపని యెంతమాత్రమును బాగుగా నుండలేదు. ద్రవ్యములన్నియుఁబాడుచేసి యింద్రుఁడు మొదలయిన శత్రువులను బూజించితిరి. చాలు నిప్పటికైనదేమో యయినది. ఇఁక నీపుణ్యము చాలును. నాయనా! మేఘనాథుఁడా! రమ్ము. ఇంటికిఁ బోవుదము" అనిచెప్పి రావణుఁడు కుమారుఁడు విభీషణుఁడు మొదలగువారితోఁబోయి, కనుల నీరుగార్చుచున్న స్త్రీలనందఱను పుష్పకవిమానమునుండి దింపెను. లక్షణవతులును రత్నభూతములును నగు నా దేవదానవరక్షఃకన్యకలయెడ రావణునికిఁగల బుద్ధిని దెలిసికొని ధర్మాత్ముఁడగు విభీషణుఁ డిట్లనియె.

"అన్నా! నీవు కీర్తిని, ధనమును, వంశమును నశింపఁజేయఁజాలిన యిటువంటి సమాచారములచేత జ్ఞానుల ధర్షణమును దెలిసి స్వేచ్ఛగా సంచరించుచున్నావు. జ్ఞాతుల నందఱను బీడించి నీవు వారిస్త్రీలను జెఱదెచ్చితివి. రాజా! నిన్ను లక్ష్యము సేయక మధు వనువాఁడు కుంభీనసను హరించియున్నాఁడు" అను విభీషణునిమాటలు విని రావణుఁ డిట్లనియె. "విభీషణా! నీవు చెప్పినది నాకుఁ దెలియరాకుండ నున్నది. సంగతియేమి? ఇప్పుడు నీవు మధువనునామ ముచ్చరించితివి గదా! వాఁ డెవఁడు? అని యడుగఁగాఁ జాలఁ గోపించి విభీషణుఁ డన్నతో నిట్లని విన్నవించెను. "అన్నా! నీవు చేసినపాపమునకు వెంటనే ఫలము సంప్రాప్తించినది. చెప్పెదను వినుము. మనమాతామహుఁడైనసుమాలి నెఱుఁగుదువుగదా! అతనికిఁ బెద్దయన్న మాల్యవంతుఁ డనఁగా విఖ్యాతుఁడైనవాఁడు, వృద్ధు, ప్రాజ్ఞుఁడు నగు నొకరాక్షసుఁడు గలఁడు. అతఁడు మనతల్లికిఁ బెదతండ్రి. మనకుఁ బెద్దమాతామహుఁడగును. అతనికుమారితకుమారిత కుంభీనస

యనునది గలదు. అది మనపినతల్లి కొమార్తె. అనల యనునామె దానిఁ గన్నది. మనకు ధర్మమునుబట్టి చూడఁగాఁ జెల్లెలే యగును. రాజా! ఇపుడు తెలిసినదిగదా! దానిని బలవంతుఁ డగుమధు వను రాక్షసుఁడు హరించెను. నీకుమారుఁడు మేఘనాథుఁడు యజ్ఞము చేసికొనుచున్నాఁడు. నేను జలములో మునిఁగి తపస్సుచేసికొనుచున్నాను. కుంభకర్ణుఁడు నిద్ర పోవుచున్నాఁడు. అటువంటిసమయమున వచ్చి యామధురాక్షసుఁడు రాక్షసశ్రేష్ఠులగు మంత్రులను జంపి నీయంతఃపురములో రక్షింపఁబడి యున్నప్పటికిని దాని నపహరించెను. ఆసంగతి తరువాత వినియు మేము వానిని జంపఁబోలేదు. ఎప్పుడైనను కన్య యొకని కీయఁదగినదియే కదా! అని యూరక యుంటిమి. దుర్మతి వగురావణా! ఇది నీవు చేసిన చెడు కర్మమునకు ఫలము గాక మఱియేమనుకొంటివి? ఇహమందుఁ జేసినపాప మునకు ఫల మిహమందే కలిగినది. ఈసంగతి జ్ఞప్తియందుంచుకొనుము” ఇట్లని చెప్పిన విభీషణునిమాటలు విని రాక్షసేంద్రుఁ డగురావణుఁడు తన దురాచరణమునకుఁ దానే యవమానితుఁడై, మఱుగుచున్న జలము గల సముద్రమువలెనే తప్తుఁడై కోపము దెచ్చుకొని కన్నులెఱ్ఱఁజేసికొని యిట్లనియె.

“నాకు శీఘ్రముగా రథమును సిద్ధము చేయుఁడు. శూరులందఱును సిద్ధులై బయలుదేఱుదురుగాక! నిద్రించుచున్న మాతమ్ముని గుంభకర్ణుని మేల్కొలుపుఁడు. ఇంకను ముఖ్యులగు రాక్షసులుగూడ బయలుదేఱుఁడు. మీరందఱును వాహనము లారోహించుఁడు. నానా విధము లైనయాయుధములను బట్టుకొనుఁడు. నావంటి రావణునకుఁగూడ భయంపడని యామధురాక్షసుని జంపి యచ్చటినుండి బయలుదేఱి యుద్ధముకొఱకు స్నేహితులు మొదలగువారితోఁగూడి స్వర్గలోకమునకుఁ బోయెదను” అని రావణుఁ డాజ్ఞాపించినతోడనే శ్రేష్ఠములైన నాలుగక్షౌహిణీసహస్రములు నానావిధములయిన యాయుధములను ధరించి యుద్ధమును గోరుచు సిద్ధమైయున్నది. ఈసైన్యమునంతయు వెనుకనుండి నడిపించుచు నింద్రజిత్తు ముందఱ నడుచుచుండెను. మధ్యను రావణుఁడును, వెనుకను గుంభకర్ణుండును నడచుచున్నారు. ధర్మాత్ముఁడగు విభీషణుఁడు తపస్సు చేసికొనుచు లంకలోనే యుండిపోయెను. మిగిలినవారందఱును యుద్ధము చేయు కుతూహలముతో రావణుని వెంటనే పోయిరి.

రాక్షససైనికులు ఖరములు, ఉష్ట్రములు, గుఱ్ఱములు, శింశుమారములు, మహాసర్పములు మొదలగు వాహనము లెక్కి యాకాశమంతటను వ్యాపించి నడచిరి. అదివఱకు దేవతలపై నసూయ గల రాక్షసులును దమపగ దీర్చుకొందమని డెందమునఁ దలంచి వందలకొలంది వేలకొలంది రావణుఁడు యుద్ధమునకుఁ బోవుచుండుట చూచి వెనుకనుండి వారును బయలుదేఱిరి. ఇట్లు బయలుదేఱి రావణుఁడు తిన్నఁగా మధుపురములోఁ బ్రవేశించెను, గాని మధురాక్షసుఁడుమాత్ర మగపడలేదు. పినతల్లికూఁతు రగుకుంభీనస యన్న రాక విని భీతితో నెదురుగావచ్చి వినయముతోఁ జేతు లు జోడించుకొని సాష్టాంగదండప్రణామము చేసినది. రావణుఁడు మంచి మాటలాడి భయపడవలదని యోదార్చెను. మఱియు నీకేమిగావలయు నని యడిగెను. "అన్నా! నాయందు నీకు నిజముగా దయయున్నచో నీ బావమఱఁదినిమాత్రము చంపక కాపాడుము. వైధవ్యదుఃఖమును భరింపఁజాలను. కులస్త్రీల కీవైధవ్యదుఃఖముకంటెను దుస్సహమైనదుఃఖ ముండునా? వేయేల? అన్నా! అన్నిభయములకన్నను వైధవ్య మను భయము మిక్కిలి గొప్పది. ఇట్టిది మఱొక్కటి లేదని నమ్ముము. రాజేంద్రా! సత్యవాక్యుఁడవు కమ్ము. అన్నా! చేతులు జోడించుకొని నిన్ను యాచించుచున్నాను. నాపసపుకుంకుమములకు లోపము గలుగనీయకు. ఇదిగాక రాజా! నీవు ముందుగా భయపడవలదని యభయదానముగూడ దయచేసితివి" అని దీనదీనముగా బ్రతిమాలుచున్న చెల్లెలినిజూచి సంతో షించి యిట్లనియె: "అమ్మాయీ! ఇపుడు నీభర్త యెచ్చట నున్నాఁడో నాకుఁ జెప్పుము. అతనిని జంపను. అతనితోఁగూడి దేవలోకమునకు యుద్ధార్థము పోయెదను. నీయందలిప్రేమచేతను దయచేతను నీమగనిని జంపుదుద్దేశము వదలితిని" అని యన్నయగు రావణుఁడు చెప్పఁగానే యాకుంభీనస చాలసంతోషించి యింట నిదురపోవుచున్న మగనిని మే ల్కొలిపి సంతోషపూర్వకముగా నిట్లనియె: "మహాబలశాలి యగు మా యన్న దశగ్రీవుఁడు వచ్చియున్నాఁడు. అతఁడు దేవతలను జయించుటకై స్వర్గమునకుఁ బోవుచు నిన్ను సహాయము గోరుచున్నాఁడు. రాక్షసా! నీవును నీబంధువులును మాయన్నసహాయముగావెళ్లుట మంచికార్యము. అటువంటివానిస్నేహము మనకన్నివిధములుగాను సంపాదింపఁదగినది గదా!" అని భార్యచెప్పినమాటలువిని మధు వను రాక్షసుఁడు వల్లెయని

యంగీకరించి యథావిధిగా వచ్చి రావణుని సందర్శించెను. అర్ఘ్యపాద్యా
దులతో రావణునిఁ బూజించెను. ఇట్లు బావమఱఁది యగు మధురాక్షసు
నిచే గౌరవింపఁబడి యొకరాత్రిమాత్ర మచ్చటనుండి మఱునాఁడు ప్రయా
ణోద్యుక్తుఁడాయెను. అక్కడనుండి బయలుదేఱి వైశ్రవణుఁ డుండు
కైలాసమునొద్దకు వచ్చి యచ్చటఁ దనదండునంతయు నిలిపెను.

## 26-వ సర్గము

### రావణుఁడు రంభను బట్టుకొనుట

ఆరావణుఁ డచ్చట సాయంకాలమగుటచేఁ దానును సైన్యమును
నివసించుట కేర్పాటుచేసెను. అంతటఁ గైలాసపర్వతముతో సమానకాంతి
గల చంద్రుఁడుదయించెను. నానాప్రహరణాయుధములగు నతనిమహాసైన్య
మంతయు నిదురించెను. మహాబలుండగు రావణుండు కొండమీఁదను
గూర్చుండి చంద్రకిరణములచే శోభితమగుచున్న గుణాతిశయములను
జూచుచుండెను. కర్ణికారవనములచేతను, కదంబవృక్షములచేతను, విక
సించిన బంగారువన్నె పద్మములు గల మందాకినీజలములచేతను, చంపకా
శోకమందారపున్నాగవృక్షములచేతను, చూతపాటల లోధ్ర ప్రియంగు
కేతకార్జున తగర నారికేళ ప్రియాలుపనస తమాలారగ్వధ వకులాదులగు
వృక్షములచేతను మిక్కిలి ప్రకాశించుచున్న యొకవనాంతరమునందు
మదనార్తులగు కిన్నరులు రక్తులై మధురకంఠములుగలవారై మనస్సులకు
సంతోషమును గలిగించున ట్లందఱును గలసి గానము చేయుచుండిరి.
మదించి కన్నులెఱ్ఱఁబడిన విద్యాధరులు స్త్రీలతోఁగూడి యొడలు మఱచి
క్రీడించుచు సంతోషించుచుండిరి. కుబేరునిమందిరమున గానము చేయు
చున్న యచ్చరలమధురస్వరమైన గానధ్వని ఘంటానాదమువలె వినవచ్చు
చుండెను. గాలికిఁ గదలు వృక్షములు పుష్పములను వర్షించుచు మధు
మాధవగంధులై యాపర్వతమును బరిమళింపఁ జేయుచున్నవో యనున
ట్లున్నవి. మకరందముతోను, పుష్పపరాగముతోనుగూడిన పుష్కలమైన
పరిమళమును సంగ్రహించుకొని సుఖకరమైన మందమారుతము రావణు
నకుఁ గామోద్రేకమును గలిగించుచు వీచుచుండెను. వారిగానముచేతను,
పుష్పముల సమృద్ధిచేతను, మందమారుతముచేతను, కైలాసముగుణముల
చేతను, రాత్రి కడచనినకొలఁదిని బ్రకాశించు చంద్రునిచేతను రావణుఁడు

కామవశంవదుఁడై నిట్టూర్పులు విడిచివిడిచి చంద్రుని జూచుచుండెను. ఈలోపున నచ్చటకు దివ్యాభరణభూషితురాలై యచ్చరలందఱిలోను శ్రేష్ఠురాలైనరంభ దివ్యపుష్పము లలంకరించుకొని, దివ్యచందనమలందుకొని, జుట్టునిండ మందారపుష్పములు చుట్టుకొని, సురతోత్సవకృతారంభయుఁ బూర్ణచంద్రనిభాననయుఁ జక్షుర్మనోహరమును బలసినదియు మొల నూలిచే నలంకృతమును నుత్తమమును రతిని వృద్ధినొందించునదియు నగు కటిపురోభాగముచే మందగమనము గలదియు, నాఱుబుతువులయందలి క్రొంబూవులచేఁ జేయఁబడిన యలంకారములు ధరించినదియు నై కాంతి శ్రీద్యుతికీర్తులచే రెండవలక్ష్మివలెఁ బ్రకాశించుచు వర్షాకాలపు మేఘము వంటి నల్లనివస్త్రము ముసుఁగువైచికొని సైన్యముమధ్యనుండి పోవుచు రావణునిచేఁ జూడఁబడినది. ఆసుందరిమోము పున్నమచందమామ తోడను, ఆపూఁబోఁడి కనుబొమలు పూవింటివానిచాపమువలెను, ఆ నారీమణితొడ లేనుఁగుతొండములవలెను, ఆహల్లకగంధికరములు పల్లవ కోమలములునునై ప్రకాశించుచున్నవి. అట్టిరంభ పోవుచుండఁగా కామవంశవదుఁడైన రావణుఁడు లేచి చేతితో నామెచేయి పట్టుకొని, యది సిగ్గుపడుచుండఁగా నవ్వుచు నిట్లనియె: "వరారోహా! నీవిపు డెచ్చటికిఁ బోవుచున్నావు? ఎవనియొక్కభోగసిద్ధిని నీవు స్వయముగాఁ గోరుచు న్నావు? ఎవనికిపు డభ్యుదయకాలము తటస్థించినది? నిన్ననుభవించు పుణ్యాత్ముఁడెవఁడు? పద్మోత్పలసుగంధియై యమృతరసమును దిరస్కరించు నీయధరామృతమును బానముచేసి తృప్తినొందు నదృష్టముగల పురుషుఁ డెవ్వఁడు? నిండుచంద్రునిఁబోలినదియు, నొచ్చెములేని కలువలంబోలిన కన్నులుగలదియు నగు నీమోము నమృతము, నమృతము నింద్రునివలె నెవ్వఁడు గ్రోలఁగలఁడు? భీరూ! నిరంతరములును, పీనములును, శుభం కరములును స్వర్ణకుంభసదృశములును నగు నీయీకుచము లెవ్వని యుర స్థలమును స్పృశించును? సువర్ణచక్రసమానమును, స్వర్ణదామచితమును, గొప్పదియు, సద్రూపియు నగు నీజఘనచక్రముపై నారోహించు నదృష్ట మిప్పుడెవ్వనికిఁ బండియున్నది? సుందరీ! నాకంటె నెక్కువవాఁ డెవఁ డున్నాఁడు? దేవేంద్రుఁడా? విష్ణుఁడా? అశ్వినీదేవతలా? నన్నతిక్ర మించిపోవుట నీకెంతయు మంచిపని కాదుసుమా! పృథుశ్రోణీ! నీ వీ శిలాతలముపై నధిష్ఠించి కొంచెముసేపు విశ్రమింపుము. మూఁడులోక

ములయందును నెవిధమునఁ జూచినను నన్ను మించినవాఁడు లేఁడనియే నమ్ముము. అట్టిదశాననుఁడు నిన్నుఁ జేతులు జోడించి బ్రతిమాలుకొనుచున్నాఁడు. మూఁడులోకములకును భర్తను, విధాతను నగునన్ననుగ్రహింపుము" అని యిట్లు రావణుఁడు చెప్పినమాటలు విని కంపించుచుఁ జేతులు జోడించుకొని రంభ యిట్లనియె: "నావిషయమై యనుగ్రహముంచఁదగును. ఈరీతిగా నన్ననఁదగదు. నీవు నాకు గురుసమానుఁడవు గదా! ఇతరులవలన నాకేవిధమైనబాధయేని గలిగినప్పుడు నీవు రక్షింపవలసియుండఁదగినవాఁడవు. నేను యథార్థముగాఁ జెప్పుచున్నాను. నేను నీకు ధర్మమునుబట్టి కోడలను" అని శిరస్సువంచుకొని నిలుచఁబడి, తన్నుఁజూచి భయకంపితురాలై పులకరించియున్న రంభనుజూచి రావణుఁ డిట్లనియె.

"సుందరీ! నీవు నాకుమారునికి భార్యవైనప్పుడుగదా నాకుఁ గోడలి వగుట" అని యనఁగానే, "అవును" అని రంభ యిట్లు బదులు చెప్పెను. "రాక్షసపుంగవా! ధర్మమునుబట్టి నేను నీకుమారునిభార్యను. నీయన్న యగు వైశ్రవణునకుఁ బ్రాణములకంటెను బ్రియుఁడయినకుమారుఁడును, మూఁడులోకములయందును బేరుపడినవాఁడును నగు నలకూబరుఁ డను నతఁడు గలఁడు గదా! అతఁడు ధర్మమునుబట్టి బ్రాహ్మణుఁడును, పరాక్రమమునుబట్టి క్షత్రియుఁడును, కోపించినచో నగ్నియు, శాంతిచే భూమికి సమానుఁడును నని యెంచఁదగును. లోకపాలసుతుండగు నాతనియొద్దకే కృతసంకేతనై యిట్లలంకరించుకొని పోవుచున్నాను. అతనియెడఁ దక్కఁ దక్కినవారియెడ నాహృదయము దగులమునొందదు. అరిందమా! ఆ సత్యముచేత నన్ను విడువవలయును. ఆధర్మాత్ముఁడు బలాటపడుచు నాకై యెదురుచూచుచుండును. కుమారుని యాయుబలాటమున కభ్యంతరము కలిగింపకుము. నన్ను విడువుము. రాక్షసపుంగవా! సజ్జనులాచరించు మార్గమునఁబొమ్ము. నీవు నాకు మాననీయుఁడవు. నేను నీకుఁ బాలనీయను" అని యిట్లు రంభ చెప్పినమాటలు విని రావణుఁ డిట్లనియె.

"సుందరీ! నీవు నాకుఁ గోడల నంటివి. అది పతివ్రతలలోఁ గాని తక్కినవారిలోఁ గాదు. ఇది దేవలోకములోఁ జిరకాలమునుండి జరుగుచున్న మరియాద. అప్సరసలకుఁ బతి యనఁగా నొకఁడు లేఁడు. మఱియు నేకస్త్రీపరిగ్రహమును లేదు" అని యిట్లు బదులు చెప్పి యారావణుఁడు

రంభను పట్టుకొని కామపరతంత్రుఁడై గ్రామ్యధర్మమున కుపక్రమించెను. తరువాత వానిచేతులనుండి తప్పించుకొని భ్రష్టమాల్యాభరణయై గజేంద్రము చేఁగలఁచి వేయఁబడిన నదివలె వ్యాకులతఁ జెందెను. ఇట్లు లులితాలకకేశాంతయు; కరవేపితపల్లవయు నగు రంభ పవనావధూతయు కుసుమశాలినియు నగు లతవలె శోభాహీనురాలై కంపించుచు, సిగ్గుపడుచు, భయంపడుచు, చేతులు జోడించికొని నలకూబరునిదగ్గరకుఁబోయి యతని పాదములమీఁదను బడినది. మహాత్ముఁడగు నలకూబరుఁ డట్టియవస్థతోఁ గూడియున్న రంభను జూచి "సుందరీ! ఇది యేమి? నాపాదములపైఁ బడితివి?" అని యడిగెను. రంభ నిట్టూర్పులు విడుచుచుఁ దనకు జరిగినసంగతి సందర్భములన్నియు నిట్లు చెప్ప మొదలిడినది.

"దేవా! ఏమని చెప్పఁగలను? ఇదిగో దశగ్రీవుఁడు స్వర్గమునకుఁ బోవుచు నీప్రాంతమున రాత్రి సైన్యముతోఁగూడ విడిసియున్నాఁడు. నీ దగ్గఱకు వచ్చుచుండఁగా నన్నాదుర్మార్గుఁడు దారిలోఁ జూచెను. అడ్డముగా వచ్చి చేయి పట్టుకొని నీవెవనిదానవని యడిగెను. ఉన్నసంగతి యంతయు యథార్థముగాఁ జెప్పితిని. కామమోహితుఁడగు నామూర్ఖుఁ డెంతచెప్పినను వినఁడాయెను. 'దేవా! నేను నీకుఁ గోడలను నన్ను విడిచిపెట్టుము' అని యెంత బ్రతిమాలినను నామాటలు పెడచెవులఁబెట్టి బలాత్కరించెను. సువ్రతా! దైవవశమునఁ గలిగిన నాయీయపరాధమును మన్నింపుము. ఆఁడుది పురుషునితో సమానమైన బలముగలది కాదు గదా!" అని యిట్లు రంభ చెప్పిన దీనదీనము లగు పలుకులు విని నలకూబరుఁడు ధ్యానించి యిది నిజమని తెలిసికొని ముహూర్తమాత్రము కోపము చేఁ గను లెఱ్ఱఁజేసికొని చేతితో నీరు పట్టుకొని యథావిధిగా నాజల ముపస్పృశించి రావణు నిట్లు దారుణముగా శపించెను. "సుందరీ! నీ విష్టపడకుండ నుండఁగా వాఁడు నిన్ను బలాత్కరించినవాఁడు గనుక నిటుపైని గామించనికామినిని ముట్టఁడు. కామార్తుఁడై యొకవేళఁ గోరికలేనిదానిని బలాత్కరించినచో వెంటనే వాని తల వేయిశకలములగును." అని యిట్లు నలకూబరుఁడు శపింపఁగానే దేవదుందుభులు మ్రోఁగినవి. ఆకాశమునుండి పుష్పవర్షము గురిసినది. బ్రహ్మ మొదలగు దేవతలందఱును సంతోషించిరి. లోకముయొక్క గతినంతయును రావణునిమరణమును దెలిసికొని ఋషులు పితరులు చాల సంతోషించిరి. రావణుఁ డాతఁడిచ్చినశాపపుసంగతి తెలిసి

కొని యది మొదలుగా నిష్టపడని కాంతను బలాత్కరింపమానుకొనెను. ఆరావణునిచేఁ జెఱపట్టికొనిపోఁబడిన పతివ్రతలగు స్త్రీలు నలకూబరుఁ డిచ్చిన మనఃప్రియమైన శాపమును విని పరమసంతోషమును బొందిరి.

## 27-వ సర్గము

### స్వర్గముపై రావణునిదండయాత్ర

తరువాత రావణుఁడు కైలాసమతిక్రమించి యింద్రలోకమునకుఁ బోయెను. వానిసైన్యము నాలుగువైపులనుండియు వచ్చుచుండఁగా సముద్రము మథించునప్పటివలెఁ జప్పుడు దేవలోకమునందు వ్యాపించినది. రావణుఁడు వచ్చెనని వినఁగానే యింద్రుఁడు సింహాసనముపైనుండి యదరిపడి లేచి యచ్చటికి వచ్చియున్న దేవతలతో నిట్లనియె: "వసువులు, రుద్రులు, విశ్వేదేవతలు, సాధ్యులు, మరుద్గణములు మొదలగు దేవతలారా! మీరందఱును రావణునితో యుద్ధము చేయుటకు సిద్ధముగా నుండుఁడు. వాఁడు మహాదుర్దాన్తుఁడు" అని దేవేంద్రుఁడు చెప్పఁగానే యుద్ధములలో నింద్రునితో సములగు దేవతలు యుద్ధము చేయుటకు, శ్రద్ధగలవారై సిద్ధముగా నుండిరి. ఇంద్రుఁడు రావణుఁ డన్న భయము గలవాఁడై దీనత్వముగా విష్ణునియొద్దకుఁబోయి యిట్లనియె: "విష్ణూ! మహాబలపరాక్రమములుగలరావణుఁడు యుద్ధమునకు వచ్చియున్నాఁడు. ఇపుడు నేనేమిచేయఁగలను? వాఁడు వరములచేత బలవంతుఁడై యున్నవాఁడు. మఱియొక కారణము గాదు. బ్రహ్మ చెప్పిన మాటను సత్యము చేయక తప్పదు. ఇదివఱలో నీబలము నాశ్రయించి నముచి, వృత్రాసురుఁడు, బలి, నరకాసురుఁడు, శంబరుఁడు మొదలగు రాక్షసులు నాచే జయింపఁబడిరి. ఇప్పుడును నీవల్లే సాయపడవలయును. మధుసూదనా! మూఁడులోకములయందును నీకంటె మాకెవ్వరు దిక్కున్నారు? నారాయణుఁడవు, శ్రీమంతుఁడవు, పద్మనాభుఁడవు, సనాతనుఁడవును నీవేకదా! నీచేతనే యీలోకములు స్థాపింపఁబడినవి. నీవే నన్నిశక్రపదమం దుంచితివి. ముల్లోకములను నీవే సృజించితివి. యుగాంతమందు మరల నీలోనే యీలోకములు ప్రవేశించగలవు. ఇపుడు నేనేమిచేయవలయునో నీవే చెప్పుము. ప్రభూ! నీవు చక్రసహాయుఁడవై రావణునితో యుద్ధము చేయుదువా?" అనియిట్లు దేవేంద్రుఁడనఁగానే విష్ణుఁడిట్లనియె: "ఇంద్రా!

నీవిపుడు భయపడ నక్కఱలేదు. నేను జెప్పునది వినుము. సురాసురులచే నీసురాత్ముఁడు జయింప శక్యుఁడుగాఁడు. మనమిపు డెంత ప్రయత్నించినను వాఁడు వరదానముచే దుర్జయుఁడే యగును. ఏవిధముగానైనను బలగర్వితుఁడగువాఁడు చాల గొప్పపని చేయకమానఁడు. అందును బలవంతుఁడగు పుత్రునితోఁగూడి వచ్చియున్నవాఁడు. జయింపఁజాలమని నాకుఁ దెలిసియేయున్నది. సురేశ్వరా! నన్నువచ్చి యుద్ధముచేయుమంటివి. వానితో నేనిపుడు యుద్ధము చేయను. విష్ణుఁడు యుద్ధములో శత్రువును జంపకుండ మరలువాఁడు గాఁడు. అయినను వాఁడు వరదానము కలిమిని దుర్జయుఁడైయున్నవాఁడు గనుక నిపుడు మనకోరిక నెఱవేఱునది కాదు. శతక్రతూ! నేనిపుడు నీతోఁ బ్రతిజ్ఞ చెప్పుచున్నాను. నేనే వీని మృత్యువునకుఁ గారణమగుదును. వానిని బుత్రమిత్రాదులతోఁ గాలముగూడినపుడు చంపి, దేవతలు మొదలగువారిని సంతోషపఱిచెదను. దేవరాజా! యథార్థమైనసంగతియంతయుఁ జెప్పితిని. ఇప్పటికి నీవే భయపడక దేవతలందఱతోడనుగూడి వానితో యుద్ధము చేయుము."

తరువాత రుద్రులు, ఆదిత్యులు, వసువులు, మరుద్గణములు, అశ్వినీదేవతలు మొదలగువారందఱును యుద్ధసన్నద్ధులై పట్టణమునుండి బయలుదేఱి వేగముగా రాక్షసులమీఁదికిఁ బోయిరి. ఇంతలోఁ దెల్లవాఱఁగానే ప్రకృష్టయుద్ధశాలియగు రావణునిసైన్యముయొక్క కోలాహలమంతటను వ్యాపించినది. మహాబలులగు నారాక్షసు లొకరి నొకరు చూచుకొని సంతోషపూర్వకముగా యుద్ధాభిముఖులై బయలుదేఱిరి. రణరంగమునం దారాక్షససైన్యమును జూడఁగానే దేవసైన్యము సంక్షోభమును బొందినది. తరువాత దేవతలకును రాక్షసులకును నానాయుధములతోడ దొమ్మియుద్ధము ప్రారంభమైనది. ఈలోపల ఘోరదర్శనులగు రావణునిమంత్రులు యుద్ధమునకు సిద్ధపడిరి. మారీచుఁడు, ప్రహస్తుఁడు, మహాపార్శ్వుఁడు, మహోదరుఁడు, అకంపనుఁడు, నికుంభుఁడు, శుకుఁడు, సారణుఁడు, సంహ్లాదుఁడు, ధూమకేతువు, మహాదంష్ట్రుఁడు, ఘటోదరుఁడు, జంబుమాలి, మహాహ్రాదుఁడు, విరూపాక్షుఁడు, సుప్తఘ్నుఁడు, యజ్ఞకోపుఁడు, దుర్ముఖుఁడు, దూషణుఁడు, ఖరుఁడు, త్రిశిరసుఁడు, కరవీరాక్షుఁడు, సూర్యశత్రువు, మహాకాయుఁడు, అతికాయుఁడు, దేవాంతకుఁడు, నరాంతకుఁడు మొదలగు రాక్షసులతోఁగూడి మహాబల

శాలియగు రావణునితాత సుమాలి యనువాఁడు దేవసైన్యములోఁ బ్రవేశించి వాఁడిగల నానావిధములైన యాయుధములతో వాయుప్ర జలధరములనువలె దేవతలను ధ్వంసముచేయ మొదలిడెను. రామా! రాక్షసులచే దెబ్బలు తినఁజాలక దేవసైన్యము సింహమునకు భయపడిన మృగములవలె నాలుగువైపులకును బాఱిపోయిరి.

ఆటువంటిసమయమున శూరుఁడగు నెనిమిదవవసువు సావిత్రుఁడను నతఁడు యుద్ధభూమిలోఁ బ్రవేశించెను. అతఁడు నానావిధములైన యాయుధములు ధరించియున్న సైన్యముతోఁగూడి సంతోషించుచు సింహము క్షుద్రమృగములను భయపఱచినట్లు శత్రుసైన్యమును భయపఱచుచుండెను. మఱియు మహాబలులగు త్వష్ట, పూష యనునాదిత్యులిద్దఱును కవచములను ధరించి నిర్భయముగా సైన్యసమేతులై యుద్ధభూమిలోఁ బ్రవేశించిరి. తరువాత దేవతలకును రాక్షసులకును యుద్ధము తటస్థించినది. ఆరాక్షసు లనేకయుద్ధములలో మరలకుండఁ గీర్తిని సంపాదించియున్నవారు. తరువాత రాక్షసులందఱును యుద్ధభూమిలో నున్న దేవతలను వేలకొలఁదిగ ఘోరములైన యాయుధములతోఁ గొట్టిరి. దేవతలును మహాబలపరాక్రమములు గలవారు గనుక మంచిమంచి శస్త్రాస్త్రములను బ్రయోగించి చాలమందిరాక్షసులను యమునియింటికిఁ బంపించిరి. రామా! ఇంతలో సుమాలి యనురాక్షసుఁడు మిక్కిలికోపించి దేవసైన్యముపైకి నానావిధములైన యాయుధములతోడను వచ్చి పడెను. వాయువు మేఘముల నెగురఁగొట్టినట్లు దేవసైన్యము నెగురఁగొట్టెను. ఆ దేవతలు సుమాలియొక్క బాణవర్షముచేతను దారుణములగు శూలాద్యాయుధప్రహారములచేతను బీడింపఁబడినవారై పాఱిపో మొదలిడిరి. ఇట్లు సుమాలితో యుద్ధము చేయఁజాలక దేవతలు పాఱిపోవుచుండుట చూచి సావిత్రుఁ డనుపేరుగల యెనిమిదవవసువు మిగులఁ గోపించి తన సైన్యముచే నావరింపఁబడినవాఁడై కొట్టుచున్న సుమాలిని దనపరాక్రమముచేతను వారించెను. తరువాత వారిద్దఱును రోమహర్షణముగా మహాయుద్ధము జరిగినది.

యుద్ధములలో మరలనివారే వారిద్దఱును. తరువాత సావిత్రుఁడు మహాబాణములు ప్రయోగించి క్షణమాత్రములో నాసుమాలియొక్క పన్నగము లెక్కముగాఁగల రథమును బడగొట్టెను. ఇట్లు

వసువు వందలకొలఁదిగ బాణములను బ్రయోగించి రథమును బాడుచేసి వానిని జంపు తలంపుతో గద పట్టుకొనెను. ఇట్లు దీప్తాగ్రయుఁ గాల దండోపమయునగు గదనుబట్టి యాసుమాలి నెత్తిమీఁదను గొట్టెను. ఆ గద వానినెత్తిమీఁదను గొప్పయుల్క పడుచున్నట్లును, ఇంద్రునిచే విడువఁబడిన పిడుగువలెఁ బడినది. ఆరాక్షసుఁ డాగదాఘాతముచే నెముకలు విఱిగి నేలఁగూలెను. శిరస్సు పగిలిపోయినది. మాంసము చెల్లాచెదరై పోయినది. వేయేల? గదపడఁగానే యాయుద్ధభూమిలోనే భస్మమైపోయినవాఁడాయెను. ఇట్లు సుమాలి పడిపోవుటచూచి రాక్షసు లందఱును మొఱ్ఱలుపెట్టుచు గుంపులుగుంపులుగాఁ బాఱిపోయిరి. వసువు వారిని వెంటఁ దఱుముచునే యుండెను. రాక్షసులలో నొక్కఁ డైనను యుద్ధభూమిలో నిలువఁజాలఁడయ్యెను.

## 28-వ సర్గము

### దేవదానవయుద్ధము

ఇట్లు వసువుచేత సుమాలి కొట్టఁబడి భస్మముపాలగుటయుఁ, దమసైన్యము దేవతలచేఁ బీడితమై పాఱిపోవుటయుఁజూచి బలవంతుఁ డగు రావణునికొడు కింద్రజిత్తు యుద్ధభూమిలో నిలువఁబడి రాక్షసు లను మరలించెను. అగ్నివర్ణము కామగమనము గల రథమెక్కి యా మహారథుఁడగు మేఘనాదుఁడు వనముల నగ్ని కాలుచునట్లు కాల్చుచు దేవసైన్యమును వెంటాడించెను. అనేకాయుధములు బ్రయోగించుచు యుద్ధభూమిలోఁ బ్రవేశించిన మేఘనాదుని జూడఁగానే దేవతలు భయ పడి నాలుగువైపులకుఁ బాఱిపో మొదలిడిరికాని యొక్కరుఁడైనను వాని కభిముఖముగా నిలువఁజాలకపోయెను. అపు డింద్రుఁడు దేవతలను మర లించు తలంపున నిట్లనియె: "దేవతలారా! భయపడకుఁడు. పాఱిపోకుఁడు. మరలి రండు; యుద్ధము చేయుదము. ఇదిగో నాకుమారుఁ డపరాజి తుఁడు జయంతుఁడు, మనకు సాయము వచ్చుచున్నాఁడు" అని యింద్రుఁడు చెప్పుచుండఁగానే, జయంతుఁ డను పేరుగల యింద్రుని కొడుకు మిక్కిలి యద్భుతమును గలిగించు రథమెక్కి యుద్ధమునకు వచ్చెను. తరువాత దేవతలందఱును జయంతుని జుట్టువాఱుకొని మేఘ నాదు నెదుర్కొని కొట్ట మొదలుపెట్టిరి. అపుడు వారికిని వారికిని దేవ

రాక్షససదృశమైన యుద్ధము జరిగినది. తరువాత మేఘనాదుఁడు మాతలి
కొడుకును జయంతునకు సారథియు నగు గోముఖునిపైని కనకభూషణము
లగు బాణములను వర్షించెను. జయంతుఁడు మేఘనాదునిసారథిని గొట్టెను.
మేఘనాదుఁడు జయంతునిగొట్టెను. మఱియు బలవంతుఁడగు మేఘ
నాదుఁడు కోపపూర్ణుఁడై కన్నులెఱ్ఱఁజేసి జయంతుని బాణవర్షముచే
ముంచివైచెను. అటుపైని, వాఁడిధారలుగల నానాయుధములను శతఘ్ను
లను, ముసలములను, గదలను, కొండశిఖరములను వేలకొలఁదిగ దైవత
సైన్యముపైనఁ బ్రయోగించెను. అపుడు లోకములన్నియు భయంపడినవి.
ఎక్కడఁజూచినను జిమ్మచీఁకటి బలిసిపోయినది. ఇట్లు మేఘనాదుఁడు దేవ
సైన్యమును గొట్టుచుండఁగా దైవతసైన్యము జయంతుఁడునుగూడ బహు
విధములుగా నవస్థతను బొంది శరజీవితమును నింపించుకొనిరి. దేవత
లెవరో రాక్షసులెవరో తెలియరాకపోయినది. అచ్చటచ్చటఁ జెదరిపోయి
నాలుగువైపులకును బాఱిపోవుట తటస్థించినది. అట్టిసమయమున దేవతలు
దేవతలను, రాక్షసులు రాక్షసులను గొట్టుకో మొదలిడిరి. మఱికొందఱు
చీఁకటిచే నేమియుఁ జేయఁజాలక పాఱిపోయిరి.

ఇంతలో వీరుఁడును, వీర్యవంతుఁడును, దైత్యేంద్రుఁడును నగు
పులోముఁ డనువాఁడు వచ్చి జయంతుని తీసికొనిపోయెను. అతఁడు తన
దౌహిత్రుఁడగు జయంతు నెత్తుకొని సముద్రములోఁ జొచ్చెను. ఆపులో
ముఁడు జయంతునికి మాతామహుఁడు; శచీదేవికిఁ దండ్రి. అపుడు దేవ
తలు జయంతునివృత్తాంతము తెలియక చచ్చిపోయెనేమో యని చాల
భయపడిరి. కొందఱు దేవతలు పాఱిపోయిరి. అపుడు మేఘనాదుఁడు
మిక్కిలి కోపించి తనసైన్యముతోఁగూడి మహానాదములు చేయుచు దేవ
తలను వెంటాడించెను. అపుడు దేవేంద్రుఁడుకొడు కగుపడకుండుటయు
సైన్యము పాఱిపోవుచుండుటయుఁజూచి రథము తెమ్మని మాతలికి నియో
గించెను. దివ్యమును మహాభయంకరమును నగు నారథము సిద్ధముగనే
యుండెను. మాతలి యామహావేగము గల రథమును దెచ్చెను. తరు
వాత మెఱుపులుగలిగి మహాబలవంతములయిన మేఘము లారథమునకుఁ
గట్టఁబడినవి. ఆమేఘములు ముందరనుండి వాయువుచేఁ గదలుచు
మిక్కిలి ధ్వనిచేసినవి. ఆరథముమీఁదఁ గూర్చుండి గంధర్వులు నానా
విధములయిన వాద్యములు వాయించిరి. దేవేంద్రుఁడు యుద్ధమునకు

బయలుదేఱఁగానే యచ్చరలాడిరి. దేవేంద్రుఁడు, రుద్రులు, వసువులు, ఆదిత్యులు, సాధ్యులు, మరుద్గణములు నానావిధాయుధములను ధరించి చుట్టుబలసివచ్చుచుండఁగా యుద్ధమునకు బయలుదేఱెను. ఇట్లు దేవరాజు బయలుదేఱునపుడు గాలి పరుషముగా వీచినది. సూర్యుఁడు తేజశ్శూన్యుఁడాయెను. ఉల్కలు రాలినవి.

ఇంతలో వీరుఁడును ప్రతాపవంతుఁడును నగు రావణుఁడు విశ్వకర్మచే నిర్మింపఁబడిన రథమునెక్కి బయలుదేఱెను. రోమహర్షణమును గలిగించుచు గొప్పగొప్పపడగలు గల పాములచే నారథము వేష్టింపఁబడియున్నది. వానినిట్టూర్పులగాలిచే యుద్ధరంగము జ్వాలామాలాపరీతమయినట్టున్నది. మఱియు రాక్షసులెందఱో ఆరథమును జుట్టువాఱుకొని నడచుచుండిరి. ఇట్లు సన్నద్ధుఁడై రావణుఁ డింద్రునిపైకి వెడలెను. తన కొడుకును వారించి తానే యుద్ధోన్ముఖుఁడాయెను. మేఘనాదుఁడును యుద్ధము చాలించి కొంతవడి విశ్రమించుచుండెను. తరువాత దేవతలకును రాక్షసులకును యుద్ధము ప్రారంభమైనది. మేఘములు వర్షమును వర్షించినట్లుభయసైన్యములవారును బాణములు వర్షించుకొనుచున్నారు. అపుడు దుష్టాత్ముఁడును నానాయుధధరుఁడును నగు కుంభకర్ణుఁ డెవరితో యుద్ధము చేయుచున్నాఁడో యెవ్వరికిని దెలియరాకుండెను. దంతముల చేతను భుజములచేతను పాదములచేతను శక్తులు, తోమరములు, బాణములు అవి యివి యన నేల? చేతికి దొరికినదానితో నెల్లదేవతలనుగొట్ట మొదలుపెట్టిరి. తరువాత మహాఘోరస్వరూపులగు రుద్రులువచ్చి కలసి రావణునితో యుద్ధము చేసిరి. చాలవఱకుఁ గుంభకర్ణుని గొట్టిరి. వారియాయుధములచే బాగుగాఁ గొట్టఁబడి రక్తమును స్రవించు నాకుంభకర్ణుఁడు మెఱుపులతోడను, ఉఱుములతోడను గూడి వర్షించు మేఘము వలెఁ జూపట్టెను.

తరువాత నారాక్షససైన్యము మరుద్గణములతో యుద్ధముచేసి నానాయుధములచేతను గొట్టఁబడి పాఱిపోయెను. కొందఱు కొట్టఁబడిరి; కొందఱు నఱకఁబడిరి. కొందఱు క్రిందఁబడి దొరలుచుండిరి. మఱికొందఱు వాహనములమీఁదనే పడిపోయియుండిరి. ఇఁకఁ గొందఱు రథములను, ఏనుఁగులను, గాడిదలను, లొట్టియలను, పాములను, గుఱ్ఱములను, శింశుమారములను, వరాహములను బాహువులచే నాలింగించుకొని

యట్లే యుండిపోయెను. మొత్తమునకు జాలమంది రాక్షసులు దేవతలచే
జంపఁబడిరి. అప్పటివారి యుద్ధభూమి చిత్తరువు వ్రాసినరీతిని గనుపడ్డది.
చచ్చిపడిన రాక్షసులరక్తము నదులై ప్రవహించినది. రాబందులును,
గ్రద్దలు మొదలగునవి నిండియున్నవి. శస్త్రము లారక్తనదిలో గ్రాహముల
వలె నొప్పుచున్నవి. ఇంతలో రావణుఁడు కోపించి దేవతలచే గొట్టఁబడిన
తనసైన్యముపాటు చూచి యాదేవతాసైన్యములోనికి సముద్రములోనికి
గ్రాహము చొఱఁబడినతెఱఁగునఁ జొఱఁబడి దేవతలను గొట్టుచుం
డిన్నఁగా దేవేంద్రునివంకకుఁ బోయెను. ఇంద్రుఁడును మహాధనుస్సు
చేతఁబట్టుకొని ధనుష్టంకారముచేయుచు యుద్ధమున కభిముఖుఁడాయెను.
అతనిధనుష్టంకారమువలనఁ బదిదిక్కులును బ్రతిధ్వని నిచ్చుచున్నవి. అట్టి
ధనుస్సెక్కుపెట్టి రావణునినెత్తిమీఁదఁ బావకునితోను, సూర్యునితోను
సమానములగు బాణములను బ్రయోగించెను. రావణుఁడును నట్టె నిలు
వఁబడి యింద్రునిపైన నసంఖ్యములగు బాణములను వర్షించుచుండెను.
ఇట్లాయిద్దఱును ఘోరముగా యుద్ధముచేయుచుండఁగా నంతటను జీకటి
కమ్మిపోయియుండుటచే నెవ్వరికి నేదియు నగపడకపోయినది.

## 29-వ సర్గము

ఇట్లు చీఁకటి క్రమ్మియుండఁగా నాదేవతలు రాక్షసులును బలో
న్మత్తులై యొకరినొకరు గొట్టుకొనుచు యుద్ధముచేసిరి. తరువాత దేవ
సైన్యము రాక్షససైన్యములోఁ బదియవవంతుమాత్రముంచి తక్కినసైన్య
మును యమునియింటికిఁ బంపెను. అట్టిచీఁకటియుద్ధములో నొకరి నొకరు
తెలియఁజాలక పరస్పరము యుద్ధము చేయుచుండిరి. అట్టిసమయమున
నింద్రుఁడు రావణుఁడు మేఘనాదుఁడును మాత్రమే మోహమును బొంద
రైరి. రావణుఁడు క్షణమాత్రములోఁ దనసైన్యమంతయు నశించిపోవుట
చూచి చాలఁ గోపించి మహానాదము చేసెను. కోప మాఁపుకోఁజాలక
రథముపైనున్న సారథితో నిట్లనియె: "సారథీ! శత్రుసైన్యముయొక్క
మధ్యప్రదేశమునకు రథము నడుపుము. ఇపుడే యీదైవతసైన్యమునంతను
మహాఘోరములగు శస్త్రాస్త్రములను బ్రయోగించి యమునియింటికిఁ
బంపించెదను. నేను దేవేంద్రుని కుబేరుని వరుణుని దేవతలను జంపి, తరు
వాత నిశ్శత్రుఁడనై యందఱకును బైఁగా నుండెదను. నీవు దుఃఖింప

కుము. నా కథమును వేగముగా నడపుము. ఇపుడు మనమున్నది నందన వనప్రదేశము. నన్ను నుదయపర్వతమునొద్దకుఁ దీసికొనిపొమ్ము" అనియిట్లు రావణుఁడు చెప్పిన మాటలు విని సారథి మనోవేగము గల గుఱ్ఱములను శత్రుమధ్యమునుండి నడపించెను. అప్పుడు దేవేంద్రుఁడు రావణుని యభిప్రాయమును దెలిసికొని రథముమీఁదనుండి దేవతలతో నిట్లనియె.

"దేవతలారా! నాకుఁ దోఁచినమాటలు చెప్పెదను వినుఁడు. రావణుని బ్రతికియుండఁగానే పట్టుకొనుఁడు. బలవంతుఁడగు వీఁడు సైన్యములతోఁగూడ వాయువేగముగల రథమెక్కి పర్వమునందుఁ బ్రవృద్ధతరంగ శాలి యగు సముద్రమువలెఁ వచ్చుచున్నాఁడు. వరదాన ప్రభావమువలన నిపుడు వీనిని జంపఁజాలము. కావున మీరు సావధానముగా నుండుఁడు. వీనిని బట్టుకొందము. ఏరీతిగా బలాసురుని నిరోధించి మూఁడులోకములను నేననుభవించుచుంటినో, యట్లే యీపాపాత్ముని నిరోధము నాకిష్టమగుచున్నది. తరువాత దేవేంద్రుఁడు రావణుని విడిచి యితరస్థానమును బొంది యుద్ధములో రాక్షసులను భయపఱచుచు యుద్ధము చేసెను. రావణుఁ డడ్డులేకుండ నుత్తరమునుండియు దేవేంద్రుఁడు దక్షిణమునుండియుఁ బ్రవేశించిరి. పిదప నారావణుఁడు యోజనశతము ప్రవేశించి దేవసైన్యమునంతను బాణవర్షముతో ముంచివైచెను. అపు డింద్రుఁడు తన సైన్యమునశించుటచూచి బెదరులేనివాఁడై రావణుని నావరించి మరలింపఁజేసెను. రావణుఁ డట్లడ్డఁబడుటచూచి "ఆహా! చచ్చితిమి" అని దానవులు రాక్షసులు కేకలు వైచిరి. పిదప మేఘనాదుఁడు కోపించి రథమెక్కి దారుణమగు సైన్యములోఁ బ్రవేశించెను. తనకుఁ బూర్వము శివుఁ డిచ్చిన మహామాయ నవలంబించి యాసైన్యమును బరుగులెత్తించెను. మఱియు వాఁడు దేవతలను విడిచి యింద్రునిమీఁదికిఁ బరుగెత్తెను. ఇంద్రుఁ డాతని రాక నెఱుఁగఁడాయెను. అంత నింద్రుఁడు, దిక్పాలకులు, రుద్రులు, వసువులు, ఆదిత్యులు మున్నగు సకల సురనికరములు తోడరా రావణు నెదిరించి ముట్టడించి, పలుమాఱుఁ గలఁతపెట్టెను. మఱియు వానియరదము మీఁది కుఱికి, సారథిని గుఱ్ఱములనుజంపి తేరిపైనున్న రావణునిఁ గదురయమున నొడిసి పట్టుకొని గొప్ప సింహనాదము చేసెను. రావణుఁడు పట్టువడుటగాంచి దేవతలెల్లరుఁ బెనుబొబ్బలిడిరి. ఇట్లు పట్టికొని రావణుని యింద్రుఁడు స్వర్గమునకుఁ గొనిపోవుచుండెను. అపుడు పాఱిపోవుచున్న

రాక్షసుల యార్తనాదము నాలకించి మేఘనాదుఁడు మిగుల భయంకర
ముగ బొబ్బపెట్టి రణరంగమున నింద్రుఁడున్నయెడకు శరవేగమునఁ
బోయెను. విముక్తకవచుఁడయిన యా రావణి గొప్పబలవంతులగు దేవత
లచేఁ గొట్టఁబడుచున్నవాఁడయ్యు వారినేమియుఁ జేయక యింద్రసారథి
యగు మాతలిని, గుఱ్ఱములను మోది యింద్రునిపయి బాణవర్షమును
గ్రుమ్మరించెను. అపుడు దేవేంద్రుఁడు రథమును సారథిని విడిచి యైరావ
తముపైఁ గూర్చుండి రావణిని వెదక మొదలిడెను. మాయాబలము
నాశ్రయించి యంతరిక్షమునుండి రావణి యగపడకుండఁగనే యింద్రుని
మాయలోముంచి బాణములతోఁ గొట్ట మొదలిడెను. మఱియు నింద్రుఁ
డెపుడలసిపోయెనని తెలిసికొనెనో అపుడే మేఘనాదుఁ డాతని మాయ
తోఁగట్టి తనసైన్యమున కభిముఖముగాఁ దీసికొనిపోయి తనతండ్రిని విడి
పించెను. అట్లు రావణి యింద్రుని బలవంతముగాఁ గట్టి తీసికొని పోవు
చుండఁగాఁ జూచి దేవత లిదియేమని చింతింప మొదలిడిరి. శత్రుంజయుఁ
డగు రావణి మాయావి యగపడకయే మంత్రవిద్యావంతుఁడైన యింద్రుని
మాయచేఁ దీసికొనిపోయెను. ఇంతలో దేవతలందఱును గోపించినవారై
రావణు నెదుర్కొని బాణవర్షముచే ముంచిరి. శత్రువులచేఁ బీడింపఁబడిన
రావణుఁడు వసువులు, ఆదిత్యులు మున్నగువారి నెదుర్కొని యుద్ధము
చేయఁజాలకపోయెను. రావణి దెబ్బలచే శిథిలుఁడై హర్షక్షయమును
బొందియున్న తండ్రియెదుట ప్రత్యక్షుఁడై యిట్లనెను: "తండ్రీ! రమ్ము
పోవుదము. ఇఁక యుద్ధ మక్కఱలేదు. నేను జయమును బొందితిని. నీవు
నెమ్మది నుండుము. సురసైన్యమునకును మూఁడులోకములకును బ్రభువగు
నింద్రుఁ డిదుగో! వీనిని బట్టుకొంటిని; దేవతలగర్వమునంతను బోఁగొట్టి
తిని. శత్రువుని బలముచే నిగ్రహించి నీయిచ్ఛకు వచ్చిన మచ్చున
ముల్లోకముల నేలుకొనుము. తండ్రీ! ఇఁక నీవు వ్యర్థముగా నేల శ్రమ
పడవలయును? ఇఁక యుద్ధము నిష్ఫలము. తరువాత దేవతలు యుద్ధము
నుండి మరలిరి. రావణుఁడు కొడుకుమాటలు విని స్వస్థచిత్తుఁడాయెను.
పిమ్మట రావణుఁడు రణమువలని జ్వరమును విడిచినవాఁడై జయమును
బొంది సంతోషించుచు లంకాభిముఖుఁడై తనకుమారునితో నిట్లనియె:
"బలశాలివగు నోకుమారా! నిరుపమానమగు పరాక్రమమును బ్రకటించి
నాకులమునకు గౌరవమును వృద్ధిచేసితివి. అతుల్యబలుఁడగు నీదేవేం

ద్రుని దేవతలను జయించి నాకెంతయు సంతోషమును గలిగించితివి. కనుక నీవాసవుని రథమెక్కించి రాక్షససేనాపరివృతుఁడవై లంకాభిముఖుఁడవు గమ్ము. నేనును మంత్రిముఖ్యులతోఁ గూడి నీ వెనువెంటనే వచ్చెదను. ఇట్లు రావణుఁడు చెప్పిన తోడనే యింద్రజిత్తు సేనాపరివృతుఁడై యింద్రుని పరిగ్రహించి లంకకుఁబోయి, యుద్ధముచేసి యలసిన రాక్షసులకు సెలవిచ్చి వారివారియిండ్లకుఁ బొమ్మనెను.

## 30-వ సర్గము

### బ్రహ్మ యింద్రుని విడిపించుట

ఇట్లు రావణునికుమారునిచే నింద్రుఁడు జయింపఁబడినతోడనే దేవతలు బ్రహ్మదేవుని బురస్కరించుకొని లంకకుఁ బోయిరి. అప్పుడు బ్రహ్మ యంతరాళమందుండి పుత్రభ్రాతృప్రముఖులచేఁ బరివృతుఁడై యున్న రావణునిఁ జూచి సామపూర్వకముగా నిట్లనియె: "వత్సా! రావణా! నీకుమారునిపరాక్రమమునకు సంతోషించితిని. వీనివిక్రమౌదార్యము నిన్ను మించినది సంశయములేదు. నీవు నీతేజస్సుచే మూఁడులోకములను జయించితివిగదా! పట్టినప్రతిజ్ఞ సఫలమయినది. నీకుమారునివిషయమున నేను సంతోషించితిని. ఇది మొదలు నీకొడుకు లోకములలో నింద్రజిత్తని ప్రసిద్ధినొందఁగలఁడు. అతిబలవంతుఁడగుటచే నితని నెవ్వరును జయింపఁజాలరు. వీనిబలము నాశ్రయించియేకదా! నీవు దేవతలను స్వాధీనముగా నుంచుకొంటివి. కావున మహాబాహూ! దేవేంద్రుని విడిచిపెట్టుము. మఱియు నింద్రుని విడిపించుటకు దేవతల కాజ్ఞాపింపుము.

తరువాత సమితింజయుఁడగు నింద్రజిత్తిట్లనియె: "దేవా! వీనిని విడుచుట తప్పనిచో నాకమరత్వమును గోరుచున్నాను" ఇట్లను నింద్రజిత్తుతో బ్రహ్మ యిట్లనియె: "చతుష్పాత్తులు, ఖేచరులు, మఱియు నితరులగు మహౌజసులు, వృక్షములు, గుల్మములు, లతలు. తృణములు, రాళ్లు, పర్వతములు మొదలగునవన్నియు భయము గలిగినపుడు భయపడుచుండును. దీనినిబట్టిచూడఁగా నన్నింటివలనను, అన్నింటికిని భయమున్నట్లే స్పష్టపడుచున్నది. నాయనా! సామాన్యముగా నేప్రాణికిని సర్వామరత్వము లేదు. చతుష్పదములు పక్షులు మొదలగుభూతముల

కిదియేరీతి" అని యిట్లు పలికిన ప్రభువగు బ్రహ్మమాటలు విని యింద్రజి త్తాయనతో నిట్లనియె: "దేవా! ఇంద్రుని విడిచినందులకై నాకుఁ గావలసినసిద్ధి వినుము. నీకిష్టముగా నిత్యమును హవ్యములను మంత్రములచేత నగ్నిహోత్రునియందు వ్రేల్చుచుందును. శత్రువులను జయించుతలంపుతో యుద్ధోన్ముఖుఁడ నైనపుడు గుఱ్ఱములతోఁ గూడిన రథము నాకై యగ్నిహోత్రమునుండి రావలెను. దానిపై నున్నంతసేపు నేను తప్పక యమరుఁడనే. ఇది నానిశ్చయమయిన వరము. అట్లగ్నియందు హోమము చేయఁదగిన క్రతువు పూర్తిగాకుండ యుద్ధముచేయుట తటస్థించినచో నాశమును బొందెదఁ బొందుదునుగాక. మఱియును, దేవా! అందఱును తపస్సులచే నమరత్వమునుఁ బొందుచుందురుగాని నేనుమాత్రము నా పరాక్రమముచేతనే యమరత్వమును బొందితిని" అన నట్టే యని బ్రహ్మ యనెను. ఇంద్రజిత్తు దేవేంద్రుని విడిచెను. దేవతలు స్వర్గమునకుఁ బోయిరి.

రామా! అట్టిసమయమున స్వర్గభ్రష్టుఁడగు నమరునివలెఁ గాంతి తఱిగినవాఁడై యింద్రుఁడు చింతాసముద్రములో మునిఁగి ధ్యానతత్పరుఁ డాయెను. అట్టియింద్రునిజూచి బ్రహ్మ యిట్లనియె: "శతక్రతూ! నీవు పూర్వము మహాదోష మెందులకుఁ జేసితివి? అందువలననే సుమా నీకిట్టి కష్టము గలిగినది. అమరేంద్రా! నే నేకవర్ణముగలవారు, సమానభాషలు గలవారు, సమానరూపములుగలవారు నగు పలువురు ప్రజలను సృజించితిని. వారి దర్శనములోను లక్షణములోను విశేషమేమియు లేకపోయినది. అపుడు నే నేకాగ్రమానసుఁడనై ప్రజలనందఱను ధ్యానించితిని. వారి విశేషముకొఱకు నే నింకొక సుందరిని సృజింపనెంచి ప్రజలయందఱిలోన నుండు చక్కఁదనము గ్రహించి యహల్యయను స్త్రీని సృజించితిని. హలమనఁగా వైరూప్యము. హల్యమనఁగా దానివలనఁ బుట్టినది. ఆస్త్రీయం దదిలేదు గనుక నహల్యయని పేరుపడినది. నేనే యెక్కడను నామెకు విరూపత్వము లేదని యహల్యయని పేరుంచితిని. అట్లు సృజించి యీయామెకుఁ దగినవరుఁ డెక్కడనుండును? అని యోచింప మొదలిడితిని. ఇంద్రా! నీవప్పుడామెనుగోరితివి. నేనే మూఁడులోకముల నేలుచుంటిని గదా! నాకెందుల కీసుందరి లభింపకపోవును? అని తలంచితివి. నేనదివఱకే గౌతమమహామునికీయ సంకల్పించుకొనియుంటిని. అనేకసంవత్సరములు

నాయొద్దనే యుంచుకొని తుదకాయనకు సమర్పించితిని. అతని తపస్సున కును మనఃస్థైర్యమునకును నాకంత సంతసము గలిగినది. అతఁడామెతో గృహస్థాశ్రమమును సార్థకపఱుచుచుండె. ఆమెను గౌతముని కీయఁగానే యదివఱకుఁ దమకే లభించు ననుకొనుచున్నవారందఱును నిరాశచేసి కొనిరి. ధర్మాత్ముఁడవయిన నీవు కోపించితివి. ఆతని యాశ్రమములోనికిఁ బోయి యామెను జూచితివి. అది నీకు దీప్తమగు నగ్నిజ్వాలవలె నగపడి నది. కామార్తుఁడవును గోపివిని నగు నీవామెను మోసపుచ్చితివి. నిన్ను మహాముని చూచినవాఁడై దశాభాగవిపర్యయమును బొందునట్లు కోప మాఁపుకొనుటకు వీలుగాక శపించెను. ఏమని యనిన; "వాసవా! నిర్భ యముగా నన్ను ధర్షించితివి గనుక యుద్ధములో శత్రువులచేఁ బడి పోదువు. దుర్బుద్ధీ! నీవిపుడు ప్రవర్తింపఁజేసినభావము మనుష్యలోక మునఁగూడఁ బ్రవర్తించును. అది చేసినవారికి సగముపాపము. నీకు సగముపాపము. నీకు స్థిరమగుస్థానముండదు. నిస్సందేహము. ఎవఁడెవఁడు సురేంద్రుఁడగునో వాఁడు శాశ్వతముగా నుండకపోవుఁగాక! నే నిట్లు శపించుచున్నాఁడను"అని యతఁడు నిన్ననెను. పిదప నతఁడు దనభార్యను నిందించుచు నిట్లనియె: "దుర్మార్గురాలా! ధ్వంసమైపొమ్ము. నాయాశ్రమ ములో నుండకుము. నీవు రూపము యౌవనము గలిగి మదించి యుండు టచే నీకీదుర్బుద్ధి పుట్టినది. కనుక లోకములో నిఁక నీవొక్కతెవే రూప వంతురాలవుగావు. నీరూపమును లోకులందఱును బంచుకొందురు. దాని చేతనేకదా లోకాతీతమైన యీముచ్చట జరిగినది!"అనెను. అదిమొదలు చాలమంది ప్రజలు రూపవంతులైయుండిరి. అపుడామె గౌతముని ప్రస న్నుని జేసికొన్నది. అదిగదా యచ్చటి చమత్కారము! "నాథా! నే నజ్ఞానమువలన మోసపోతిని. ఆయింద్రుఁడు నీరూపముతో వచ్చినఁజూచి నిజమే యనుకొంటిని. కాని నేను బుద్ధిపూర్వకముగా నంగీకరింపలేదు. కావున నాలోపమును మన్నించి దయతలఁచుము" అని యహల్య యనఁ గానే గౌతముఁ డిట్లనియె.

"ఓసీ! బ్రాహ్మణుల సంరక్షించుటకై మహాబాహుండగు విష్ణువు మనుష్యశరీరమును ధరించి రాముఁడనుపేరుతో నిక్ష్వాకువంశములోఁ బుట్టఁగలఁడు. అతఁడు మహాతేజశ్శాలియు మహారథుఁడును నగును. అతఁ

డీవనములోనికిఁగూడ వచ్చును. అతనిదర్శనము కాఁగానే నీవు పవిత్రు రాల వగుదువు. నీవు చేసిన మహాపాతకము నతఁడు శాంతింపఁజేయఁ దగినవాఁడు. అతని కాతిథ్యముచేసి నాయొద్దకు రాఁగలవు. అది మొదలు నీవు నాదగ్గరనేయుండుదువు" అని యిట్లా బ్రహ్మర్షి చెప్పి తనయాశ్రమము లోనికి వచ్చెను. బ్రహ్మవాదియగు నామహర్షి భార్య శిలారూపమునొంది చిరకాలము గొప్పతపస్సు చేసినది. ఆయనశాపమువలననే యిదియంతయుఁ దటస్థించినది. ఇంద్రా! ముందు నీవు చేసిన మహాపాతకమును జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము. అందుచేతనే నీవిపుడు శత్రువులచేఁ జిక్కితివిగాని వేఱు కారణము గాదు. కనుక నీవు శీఘ్రముగా వైష్ణవయజ్ఞమును జేయుము. ఆయజ్ఞముచేఁ బవిత్రుఁడవై తరువాత స్వర్గము చేరుదువు. నీకొడుకు యుద్ధములో వినాశమును బొందుటలేదు. వానిని వానిమాతా మహుఁడు వచ్చి సముద్రములోనికిఁ దీసికొనిపోయి దాఁచియుంచెను. ఇట్లు బ్రహ్మచెప్పినమాటలు విని వైష్ణవయజ్ఞము నాచరించి స్వర్గము ప్రవే శించి యెప్పటియట్ల యేలుచుండెను. ఇది రావణికి నింద్రజిత్తుఁడనిపేరు గలిగినవిధము. వానిబలముసంగతియంతయుఁ జెప్పితినిగదా! ఆతఁడు దేవేంద్రునే జయించినప్పు డితరులసంగతి వేఱుగాఁ జెప్పవలయునా?" అనియిట్లుచెప్పిన యగస్త్యమహామునిమాటలు విని రాముఁడు లక్ష్మ ణుఁడు వానరులు రాక్షసులు మొదలగువా రందఱును "ఆశ్చర్యమే" అనిరి. అపుడు రాముని ప్రక్కనేయున్న విభీషణుఁడు "పూర్వకాలమందు జరిగిన యాయా యాశ్చర్యములన్నియు జ్ఞప్తికి వచ్చినవి" అనెను. అపుడు రాముఁడు "యథార్థమయినసంగతియంతయు వింటి"నని యగ స్త్యునితో ననెను. తరువాత నగస్త్యుఁడు "ఈరీతిగా రామా! రావ ణుఁడు లోకకంటకుఁడాయెను. వానికొడుకు దేవేంద్రునిగూడ జయిం చినవాఁడు" అనెను.

## 31-వ సర్గము

### రావణుఁడు మాహిష్మతికిఁ బోవుట

తరువాత మహాతేజుఁడగు రాముఁడు చాల నాశ్చర్యమునుబొంది యగస్త్యునిజూచి వినయముగా నిట్లనియె: "భగవానులవారూ! క్రూరుఁ డగు రావణుఁడు భూమిపైఁ దిరుగుకాలమున లోకములు శూన్యము

లయినవా? రాజుగాని, రాజమాత్రుఁడుగాని రావణుని బాధించువాఁడు లేకపోయెనా? లేక వారందఱును రావణునిచేతనే హతవీర్యులయిరా? లేదు లేదు. గొప్పగొప్పవారందఱును రావణునిచేత జయింపఁబడిరని తలంచెదను" అని యిట్లడిగిన శ్రీరామునిమాటలు విని యగస్త్యుఁడు నవ్వుచు, బ్రహ్మ పరమేశ్వరునితో నన్నచందమున నిట్లనియె: "శ్రీరామా! ఈరీతిగా రావణుఁడు రాజులను బాధించుచు భూమిపైఁ దిరుగుచుఁ గ్రమముగా నమరావతితో సమానమగు మాహిష్మతీపురమునుగూర్చి పోయెను. అందు సదా వసురేతసుని సాన్నిధ్యము గలదు. ఆవసురేతసుని ప్రభావముతో సమానమైన ప్రభావముగల యర్జునుఁ డాపట్టణము నేలుచుండెను. ఒకదినమున నాయర్జునుఁడు స్త్రీలతోఁగూడి నర్మదానదిలో జలక్రీడకై పోయియుండెను. నాఁడే రావణుఁడును మాహిష్మతికిఁ బోయెను. అట్లుపోయి యాతనిమంత్రులనుజూచి యిట్లనియె: "మీరాజగు నర్జునుఁడెక్కడ? ఉన్నదున్నవిధమునఁ జెప్పుఁడు. నేను రావణుఁడను వాఁడను. మీరాజుతో యుద్ధము చేయవలయు ననుకోరికతో వచ్చితిని. నేను వచ్చియున్నానని వేగముగా మీరాజుతోఁ జెప్పుఁడు"అని రావణుఁడనఁగానే ప్రాజ్ఞులగు మంత్రులు మారాజు ప్రకృతము పట్టణములో లేఁడనిరి.

రావణుఁ డట్లు మంత్రులవలనను పౌరులవలనను గార్తవీర్యార్జునుఁడు లేఁడని విని యచ్చటినుండి హిమవంతునితో సమానమగు వింధ్యపర్వతమునకుఁ బోయెను. ఆపర్వతము క్రిందఁ బాతాళమువఱకును మీఁద నాకాశమువఱకును వ్యాపించి వేలకొలఁది శిఖరములతోఁగూడి సింహాదులగు భయంకరమృగములచే నాశ్రయింపఁబడిన గుహలుగలిగి మీఁదినుండి పడుజలముచే సముద్రమును నవ్వుచున్నదివోలె, దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నరులు, అప్సరసలు మొదలగువారిచే విహారమునకై యాశ్రయింపఁబడి రెండవస్వర్గఖండమోయన నగపడుచుఁ, బ్రవహించుచుండు నదులచే సదా స్ఫటికకాంతిగల జలము గలిగి పడగలు చాచి నాలుకలు గీటుచు నాకసము నంటుచున్నట్లుండు ననంతునివలె నుండెను. రావణుఁ డట్టియత్యద్భుతమైన పర్వతమును జూచుచుఁ గ్రమముగా నర్మదానదినిగూర్చి పోయెను. ఆనది రాళ్లమీఁదఁ బడుచున్న జలముగలదై పడమటిసముద్రములోనికిఁబోయి కలియును. మఱియు

నెండచే బడలిన మహిషములు, సృమరములు, సింహములు, పెద్దపులులు, భల్లూకములు, మదపుటేనుఁగులు మొదలగువానిచే సంక్షోభింపఁబడుచున్న జలముగలిగి చక్రవాకములు, కారండవములు, హంసలు, జలకుక్కుటములు, సారసములు మొదలగు మదించిన పక్షుల కూజితములచే మనోహరమైయుండెను. రామా? ఆనర్మద తీరమునందలి వికసించిన చెట్లచేఁ బూవులు ముడుచుకొన్నట్లును, చక్రవాకదంపతుల కల్మిని స్తనయుక్తయును, విశాలములైన యిసుకదిబ్బల పిఱుఁదులుగాఁ గలదియు, హంసలపంక్తిచే మొలనూలు గలదియుఁ, బద్మములయందలి పరాగముచే గంధము పూసికొన్నట్లును, నీటిపైనుండు నురుగుచేఁ జీనాంబరము గట్టుకొన్నదియు, వికసించిన కలువలచే నేత్రములు గలదియునయి యొకానొక దివ్యసుందరివలె నగపడుచుండెను. అట్టినర్మదనుజూచి రావణుఁడు పుష్పకమునుండిదిగి యందుఁగృతావగాహుఁడై రమ్యమై నానామునినిషేవితమగు తత్తీరమున సమీపమునఁ మంత్రులు మొదలగువారు సేవించుచుండఁగాఁ గూర్చుండి యానదిని గంగనుగాఁ గొనియాడుచుఁ దత్సందర్శనలాభమున సంతోషించుచుండెను. అపుడు సమీపమున నున్న మంత్రులు శుకసారణులను జూచి యిట్లనియె.

"సూర్యుఁడు తన వేయికిరణములచేత జగమంతయు బంగారు పూఁతపూసిన ట్లొనరించి వేడిని జూపుచు నాకసమునడుమ నాశ్రయించి వెలుఁగుచున్నాఁడు. నేనిచ్చట నున్నాఁడనని కాఁబోలును ప్రకృతము తనవేఁడిని దక్కువగాఁజేసి చంద్రునివలెనే చల్లఁగా నున్నాఁడు. ఈ నర్మదానదీతరంగములపైఁ బ్రసరించి యందలి పద్మముల పరిమళమును సంగ్రహించుకొని నాకు భయపడినదివోలె సావధానముగా మారుతము మందముగాఁ బ్రసరించుచు నాశ్రమమును బోఁగొట్టి నాదయకుఁ బాత్రమగుచున్నది. ఈనర్మదయు నన్నుఁజూచి భయపడినయాఁడుదివోలె నాకు నర్మవర్ధినియై తనపేరు సార్థకపఱుచుకొనుచున్నది. మంత్రులారా! మీరందఱును యుద్ధములలోఁ జాల నలసటను బొందియున్నారు. శస్త్రములచే దెబ్బలు తినియున్నారు. దేహములనిండఁ జందనము పూసికొన్నట్లు రక్తముతోఁ దడిసియున్నారు. కావున మీరందఱును మదపుటేనుఁగులు గంగలో దిగి మునిఁగిన ట్లీశర్మద యగు నర్మదలో మునుఁగుఁడు. ఇందులో మునిఁగితిరేని మీపాపములన్నియుఁ బటాపంచలై

పోవును. నేనును శరచ్చంద్రునితో సమానముగనున్న యీనదియొడ్డునఁ గూరుచుండి మెల్లఁగా శివభగవానుని బుష్పాదులచేఁ బూజించెదను" అని యిట్లు రావణుఁడు చెప్పఁగానే ప్రహస్తుఁడు, శుకుఁడు, సారణుఁడు, మహోదరుఁడు, ధూమ్రాక్షుఁడు మొదలగువా రానర్మదలోనికి దిగిరి. మదపుటేనుఁగులవంటి యారాక్షసులచే క్షోభిత యగు నానది వామ నాంజన పద్మాది దిగ్గజములచే క్షోభితయగు గంగానది ననుకరించియున్నది. తరువాత మహాబలులగు నారాక్షసు లానదిలో స్నానముచేసి యొడ్డెక్కి తమ యేలికయగు రావణుఁడు చేయఁబోవు శివభగవానుని పూజకై పుష్పములు తెచ్చిరి. శరత్కాలమేఘముతో సమానమై మనోహరమైన యానర్మదయొడ్డున ముహూర్తమాత్రమున నారాక్షసులు పువ్వులుదెచ్చి యొకకొండంతరాశి పోసిరి. ఇట్లు పరిజనులు పూవులు తేఁగా రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు గంగలోనికి మహాగజము దిగిన ట్లానర్మదానదిలో స్నానార్థము దిగెను. అందులో స్నానముచేసి విధిగా జపింపవలసిన మంత్రములను జపించి యానదీజలమునుండి బయటికి వచ్చెను. ఒడ్డెక్కి తడివస్త్రములు వదలి తెల్లనిమడుఁగు ధరించియున్న యారావణుఁడు చేతులు జోడించుకొని పోవుచుండఁగా రాక్షసులందఱును వెంటఁబడి పోవుచుండిరి. అప్పుడు వారు మూర్తిమంతములగు కొండలవలె నగపడుచుండిరి. ఆరావణుఁ డెచ్చటికిఁ బోయినను బంగరులింగమును దీసికొనియే పోవుచుండును. రావణుఁ డాలింగము నిసుకతిన్నియపై నుంచి షోడశోపచారములచేతఁ బూజించెను. ఈరీతిగా రావణుఁడు సత్పురుషుల యార్తిని హరించువాఁడును బరముఁడును శ్రేష్ఠుఁడును వరప్రదాతయుఁ జంద్రకలాభూషణుఁడునునగు శివభగవానుని బూజించి తన యిరువదిచేతులను జాచి యాయనయెదుటఁ బాడుచు నాట్యము ప్రారంభించెను.

## 32-వ సర్గము

### అర్జునునిచే రావణుఁడు పట్టువడుట

సుదారుణుఁడగు రావణుఁ డెచోట్టఁ గూర్చుండి శివునకుఁ బూజ చేయుచుండెనో యచ్చటికి సమీపముననే జయించువారిలో శ్రేష్ఠుఁడును, మాహిష్మతీపట్టణమునకుఁ బ్రభువునునగు నర్జునుఁడు స్త్రీలతోఁగూడి నర్మదానదిలో జలక్రీడ చేయుచుండెను. ఆస్త్రీలమధ్యనుండి యాయర్జునుఁడు

వేలకొలఁది కరేణువులమధ్య నుండు మదపుటేనుఁగువలెఁ బ్రకాశించుచుండెను. ఆరాజు తనవేయి బాహువుల యుత్తమబలమును దెలిసికొందమను నిచ్ఛచే నొక్కమాఱుగా నర్మదావేగము నడ్డుకొనెను. ఇట్లాతని చేతులచే నడ్డఁబడిన నిర్మలమగు నానదీజలము ముందునకుఁ బోవ వలను పడక వెనుకకు మరలినవి. మీనములు మొసలగు జలజంతువులతోఁ గూడి సపుష్పకుశసంస్తరమగు నానర్మదానదియొక్క ప్రవాహవేగము వర్షాకాలమునందువలెనే ప్రకాశించుచుండెను.

ఇట్లానర్మదయొక్క వెనుకకు మరలిన ప్రవాహవేగము కార్తవీర్యార్జునునిచేఁ బంపఁబడినదివోలె రావణునిచే శివునకు సమర్పింపఁబడిన పుష్పోపహారమును హరించినది. అపుడు రావణుఁడు సగము ముగిసిన తన నియమమును విడిచి ప్రతికూలురాలైన కాంతనువలె నానదిని జూచెను. ఆనదీప్రవాహము పశ్చిమసముద్రమునకుఁ బోవునది యయ్యును దూర్పునకు మరలియున్నది. అంతకంతకు సముద్రము పొంగిపొఱలినవిధమున నానదీప్రవాహము వృద్ధిపొందినది. తరువాత రావణుఁడు తొందరపాటుపడుచున్న శకునములు గలిగి స్వభావోపకతిని బొంది నిర్వికారచిత్తము గల యంగనభంగిని గన్పట్టు నదిని జూచెను. అపుడు కుడిచేతివ్రేలిని జప్పుడు చేయుచు రావణుఁడు శుకసారణులను బిలిచి నదీప్రవాహము మరలుటకుఁ గారణము తెలిసికొని రమ్మనెను. ఇట్లు రావణునిచేఁ బంపఁబడిన యన్నదమ్ములు శుకసారణులిద్దఱును నాకాశమార్గముగాఁ బశ్చిమాభిముఖులై బయలుదేఱి యర్ధయోజనమాత్రదూర మేగి స్త్రీలతో జలక్రీడ చేయుచున్న పురుషుని జూచిరి. అతఁడు పెక్కుశాఖలు గల పెద్ద వృక్షమువలె నుండి నీటియందు విఱఁజిమ్మంబడిన తలవెండ్రుకలు గలిగి మదముచే నెఱ్ఱఁబడిన కన్నులు గలవాఁడై వేలకొలఁది ప్రత్యంతపర్వతములచే భూమి నావరించియుండు కొండవలెఁ దనబాహుసహస్రముచే నర్మదానది నడ్డఁగట్టియుండెను. మఱియు నతఁడు మదించిన కరేణువుల సహస్రముచే నావరింపఁబడిన యేనుఁగుగున్నవలె నుత్తమస్త్రీసహస్రముచే నావరింపఁబడియున్నాఁడు. ఇట్టి యద్భుతతముఁడగు నాపురుషుని శుకసారణులు చూచి మరలివచ్చి రావణునితో నిట్లనిరి: "దేవా! అతఁడెవ్వఁడో కాని పెనువ్రానివలె నున్నాఁడు. ఆనకట్టవలె నది కడ్డుగా నిలువఁబడి స్త్రీలను విహరింపఁజేయుచున్నాఁడు. అతని వేయిచేతులచే నడ్డంబడిన

జలముగలనది మాటిమాటికిని సముద్రమువలె సురుగుగ్రక్కుచుఁ బొంగు చున్నది." ఇట్లని చెప్పిన శుకసారణుల మాటలు విని రావణుఁడు వాఁడే కార్తవీర్యార్జునుఁ డనిచెప్పి యుద్ధమునందుఁ గోరికగలవాఁడై బయలు దేఱెను. రాక్షసాధిపుఁడగురావణుఁడు కార్తవీర్యార్జునకెదురుగా బయలు దేఱినతోడనే ప్రచండముగా దుమ్ము గాలి హోరు మని మ్రోయుచు వీచి నది. మేఘము లుఱిమినవి. రక్తవర్షము గురిసినది. రావణుఁడు వానిని లక్ష్యపెట్టక మహోదరుఁడు, మహాపార్శ్వుఁడు, ధూమ్రాక్షుఁడు, శుకుఁడు, సారణుఁడు మొదలగువారితోఁగూడి వెంటనే యర్జునుఁ డున్న చోటికిఁ బోయి చేరెను. అప్పటి కతఁడు నర్మదలోనే యున్నవాఁడు. ఆఁడేనుఁగుల మధ్యనున్న మదపుటేనుఁగువలె వేలకొలఁది స్త్రీలతోఁ గూడియున్న యాయర్జునుని జూడఁగానే కోపించి కన్నులు జేవురింప రావణుఁ డిట్లనియె:

"మంత్రులారా! మీరు వేగముగా రావణుఁడు యుద్ధమును గోరి వచ్చియున్నాఁడని యర్జునునితోఁ జెప్పుఁడు" అని మేఘగంభీరముగ నాయర్జునుని మంత్రులతోఁ జెప్పఁగానే, వారు రావణునిమాటలు విని యాయుధములు పట్టుకొని రావణునొద్దకు వచ్చి యిట్లనిరి: "రావణా! యుద్ధమునకు మంచిసమయము నాలోచించితివి. వహ్వారే! నీబుద్ధి మెచ్చఁ దగినది. ఎవఁడైనను మద్యపానమత్తునితోను స్త్రీలతోఁ గూడియుండువాని తోను యుద్ధము చేయ నుత్సహించునా? యుద్ధధర్మములన్నియుఁ దెలిసిన నీవెట్లు స్త్రీలదగ్గఱ నుండఁగా మా రాజుతో యుద్ధము చేయనెంచితివి? నీ రాక చూడఁగా నాఁడేనుఁగులమధ్య నున్న మదపుటేనుఁగు గున్న మీఁదికి వచ్చిన లేడిపిల్లరాకవలె నున్నది. రావణా! ఇప్పటికి క్షమించి యీరాత్రి తెల్లవాఱనిమ్ము. నాయనా! నీకంతగా యుద్ధమునందు శ్రద్ధ యున్నచో రేపు నీయిచ్చకు వచ్చిన ట్లెల్ల నర్జునునితో యుద్ధము చేసికొందువు గాని ముందుగా మమ్ముఁ జంపియో, జయించియో తరువాత మాయేలికపైకిఁ బొమ్ము." ఇట్లు వారన్నవెంటనే రావణునిమంత్రులు కార్తవీర్యార్జునుని మంత్రులను గొందఱను యుద్ధములోఁజంపిరి. మఱికొందఱను భక్షించిరి. తరువాత నర్మదాతీరమున నర్జునుపరిచరులకును రావణునిమంత్రులకును దొమ్మిగా యుద్ధమైనది. అంతటను హాలహాలాశబ్దము వ్యాపించినది. అపుడు బాణములు, తోమరములు, త్రిశూలములు, వజ్రకర్షణములు మొదలగు

వానిచేఁగొట్టి యంతటను వెంటఁబడుచు రావణుని వానిమంత్రులను బీడిం
చిరి. అర్జునుని యోధుల వేగము జలజంతువులతోఁగూడిన సముద్రముధ్వని
వలె నతిదారుణమైనది. రావణుమంత్రులు ప్రహస్తుఁడు మొదలగువారు
కోపించి యర్జునుబలమును దమతేజస్సుచే దహించివేయుచున్నారు. అపుడు
మంత్రులతోఁగూడిన రావణుని వ్యాపారమంతయు ద్వారపాలకులుపోయి
జలక్రీడ చేయు నర్జునునితోఁ జెప్పిరి. అతఁడామాటలు విని స్త్రీలను భయ
పడవలదనిచెప్పి వెంటనే గంగాజలమునుండి యేనుఁగువలె నర్మదాజలము
నుండి యొడ్డెక్కెను. తరువాత నర్జునాగ్నిహోత్రుఁడు క్రోధదూషితనేత్రుఁ
డై ప్రళయాంతమందు మండినవిధమున నొక్కసారి మహాఘోరముగా
మండెను. వరహేమాంగదుం డగునతఁడు వేగముగా గదగొని చీఁకట్లను
సూర్యుఁడు వెంబడించినవిధమున రాక్షసులను వెంటాడించెను. అతఁడు
తనభుజబలమంతయు మెఱయ గద గిఱగిఱఁ ద్రిప్పుచు మీఁదికి వచ్చుచుం
డఁగాఁ బ్రహస్తుఁడు ముసలాయుధము చేఁబూని, వింధ్యుఁడు సూర్యుని
మార్గము నడ్డినవిధమున నతనిమార్గము నడ్డుకొనెను. వెంటనే ప్రహ
స్తుఁడు మహాకోపముగాఁ దనచేతిముసలము నతనిపై విసరుచుఁ బ్రళయ
కాలపు మేఘమువలె ధ్వనిచేసెను. ప్రహస్తుఁడు పంపిన ముసలమునుండి
పడినయగ్ని యశోకపుష్పముల రాశివలె దహించుచు నగపడెను. అపుడు
నిరుపమానపరాక్రముఁడగు నర్జునుఁడు వచ్చిన ముసలమును దన గదతోఁ
రూపుమాపెను. తరువాతఁ దన నైదునందల చేతులతోను గదను ద్రిప్పు
చుఁ బ్రహస్తుని వెంటాడించెను. అపుడు బాగుగా గదచే దెబ్బలు దిన్న
వాఁడై యింద్రునివజ్రముచేఁ గొట్టఁబడిన గట్టునట్టుల క్రిందఁబడిపోయెను.
ఇట్లు ప్రహస్తుఁడు పడఁగానే మారీచుఁడు, శుకుఁడు, సారణుఁడు, మహో
దరుఁడు, ధూమ్రాక్షుఁడు మొదలగువారు యుద్ధరంగమునుండి తొలఁ
గిరి. ప్రహస్తుఁడు పడుటయుఁ దక్కినవారు తొలఁగిపోవుటయుఁ జూచి
రావణుఁడే యర్జును నెదుర్కొనెను. వేయిచేతులవానికిని, ఇరువదిచేతుల
వానికిని మహాదారుణముగను రోమహర్షణముగను యుద్ధము ప్రారంభ
మైనది. ఇట్లిద్దఱును సంరంభమునుబొందిన సముద్రములవలెను, మొదలు
గదలిన పర్వతములవలెను, తేజోవంతులగు సూర్యులవలెను, మండు
చుండు నగ్నిహోత్రములవలెను, మదించిన యేనుఁగులవలెను, వృషభ
ములవలెను, గర్జించుచుండు మేఘములవలెను, బలోత్కటములగు-

సింహములవలెను, కోపించిన రుద్రాంతకులవలెను నున్న యారావణార్జునులు కోపించి యన్యోన్యమును మిక్కిలిగా గదలతోఁ గొట్టుకొనిరి. ఒకరిగదాప్రహారము నొకరు ఘోరములగు వజ్రప్రహారములను గొండలు సహించునట్లు సహించుచుండిరి. పిడుగులు పడినప్పుడు గలుగు చప్పుడువలె వారిగదాపాతములవలనఁ గలిగిన చప్పుడుచే దిక్కులన్నియుఁ బ్రతిధ్వను లిచ్చుచుండెను. అర్జునునిచేతిగద రావణునివక్షస్థలమునఁబడి మేఘముపై మెఱుపువలెఁ బ్రకాశించెను. అట్లే రావణునిచేఁ బ్రయోగింపఁబడినగద యర్జునునిపైఁబడి కొండమీఁదను బడిన యుల్కవలెఁ బ్రకాశించెను. రాక్షసరాజుగాని యర్జునుఁడుగాని ఖేదమును బొందరయిరి. పూర్వము బలిచక్రవర్తికిని దేవేంద్రునికిని బలెనిట్లు వారిద్దఱకును ఘోరముగా యుద్ధము జరిగెను. రావణార్జునులు మహావృషభములు కొమ్ములతోను, ఏనుఁగులు దంతములతోను బోరాడినట్లు పరస్పరమును బోరాడి కొట్టుకొనుచుండిరి. తరువాత నర్జునుఁడు కోపించి తన యావచ్ఛక్తిని వినియోగించి తనచేతి గదను గిఱ్ఱునఁ ద్రిప్పి రావణునివక్షముపైఁ బ్రయోగించెను. వాఁడు వరదానముచే రక్షింపఁబడి యుండువాఁడగుటచే మీఁదఁబడినయాగద యేమియుఁజేయఁజాలక దుర్బలమై రెండై క్రిందఁబడిపోయినది. ఆదెబ్బ తగిలి రావణుఁడు ధనుస్సుపెట్టుమాత్రము దూరముగాఁ దొలఁగిపోయి చతికిలఁ బడిపోయెను.

అపుడు రావణుఁడు విహ్వలుఁడై యుండుట చూచి యర్జునుఁ డతివేగముగా సమీపించి గరుత్మంతుఁడు పామును బట్టుకొన్నట్టు లారావణుని బట్టుకొనెను. అతఁడు తనవేయిచేతులతోడను బలాత్కారముగా రావణుని బట్టుకొని, బలిని నారాయణుఁడు గట్టినట్టు గట్టివైచెను. రావణుఁడు కట్టువడుచుండఁగా నంతరిక్షమునుండి సిద్ధులు మొదలగువారందఱును సాధువాదములు చేయుచుఁ గార్తవీర్యార్జునిపైఁ బుష్పవర్షము గురిపించిరి. అర్జునుఁడు పెద్దపులి లేడిని, సింహము గజమును బట్టినట్లు రావణుని బట్టుకొని సంతోషముచే మాటిమాటికిని మేఘమువలె ధ్వనిచేసెను. అప్పటికిఁ బ్రహస్తుఁడు తెలివొంది కట్టువడి యున్న రావణుని జూచి కోపించి రాక్షసులతోఁగూడి రాజుపై నెదుర్కొనెను. ఇట్లువచ్చుచున్న రాక్షసులవేగము వర్షాకాలమున సముద్రాభిముఖము లగు మేఘముల వేగమును బోలి ప్రకాశించుచుండెను. వారు మాటిమాటికిని

విడువువిడువుమనియు నిలునిలుమనియుఁ బలుకుచు ముసలములు మొద
లగు నాయుధముల నర్జునునిపై విసర మొదలిడిరి. అతఁడు వానికి
సుంతేనియు జడియక నడుత్రోవలోనే వానిని వెంటనే గ్రహించెను.
మఱియు రాక్షసులను వారు ప్రయోగించిన యాయుధములతోడనే
ఛేదించి, వాయువు మేఘములను దూలించిన లీలను దూలించెను. అపుడు
కార్తవీర్యార్జునుఁడు రాక్షసులను బరువు లెత్తించి స్నేహితులు మొదలగు
వారితోఁగూడ రావణుని దీసికొని పట్టణములోఁ బ్రవేశించెను. ఇంద్రు
నితో సమానుఁడగు నా యర్జునుఁడు పౌరులచేఁ జల్లఁబడుచున్న పూవులు
మొదలగువానిచే నొప్పుచు నగరములోఁ బ్రవేశించెను.

## 33-వ సర్గము

### పులస్త్యుఁడు రావణుని విడిపించుట

వాయువును బట్టుకొనుటతో సమానమయిన రావణుని పట్టుకొను
టను దేవతలు స్వర్గమందుఁ జెప్పఁగాఁ బులస్త్యబ్రహ్మ వినెను: మహాధైర్య
శాలియైనను నతఁడు పుత్రకృత స్నేహముచేఁ గంపించుచుఁ గార్తవీర్యార్జు
నుని జూచుటకుఁగా మాహిష్మతికి వచ్చెను. వాయువుతో సమాన
మయినగమనముగల యా ఋషి మనోవేగమున నంతరిక్షమార్గముననే
మాహిష్మతికి వచ్చెను. అతఁ డమరావతితో సమానమయి హృష్టపుష్ట
జనాకీర్ణమయి యుండు నా మాహిష్మతిలో బ్రహ్మ యమరావతిలోఁ
బ్రవేశించినట్లు ప్రవేశించెను. క్రిందికి దిగిన సూర్యునివలె వెలుఁగుచుఁ
జూడ శక్యము గాకుండనున్న యా మునినిజూచి పరిజనులు తెలిసికొని
రాజుతో విన్నవించిరి. వారిమాటలు విని యర్జునుఁడు పులస్త్యబ్రహ్మయని
తెలిసికొని శిరస్సునందలి గూర్చుకొని యా తపోధను నెదుర్కొనెను.
అతని పురోహితుఁ డర్ఘ్యపాద్యములు సంగ్రహించుకొని యింద్రుని
ముందు బృహస్పతివలె బయలుదేఱెను. ఉదయించిన సూర్యునివలె
వెలుఁగుచున్న యాయనను జూచి భయసంభ్రమములతోఁ గూడినవాఁడై
యింద్రుఁ డీశ్వరునికింబలె వందన మాచరించి యర్ఘ్యముపాద్యమునిచ్చి
గోవును నివేదించి యర్జునుఁడు సంతోషముతో గద్గదస్వరమునఁ బుల
స్త్యునితో నిట్లనియె.

"పులస్త్య భగవానులవారూ! తమ పాదారవిందముల సంస్పర్శ

మును బొందుటచే నేఁడు నా మాహిష్మతి యమరావతితో సమాన మయి నది. చూడ శక్యముగాని తమ దర్శనము లభించుటవలన నాకుఁ గుశలము గలిగినది. నా జన్మము సఫల మయినది. నా వ్రతములు ఫలించినవి. నా తపస్సు సఫల మయినది. దేవతలచే నమస్కరింపఁబడుచున్న తమ పాదారవిందములకు వందనము చేయఁగలిగితిని. ఇంతకన్నను నా జన్మమున కెక్కువ యేమిగావలయును ? ఇదిగో రాజ్యము, వీరు నా పుత్రులు, వీండ్రు నా భార్యలు, నేను, మే మందఱమును దమయాజ్ఞను నెఱవేర్చుటకు సిద్ధముగా నున్నారము. ఏమి యాజ్ఞ? సెలవిత్తురుగాక !" అను రాజుమాటలు విని యాయన సంతోషించి ధర్మము, పుత్రులు మొదలగువారి క్షేమమడిగి హైహాయ రాజగు నర్జునునితోఁ బులస్త్యుఁడిట్లనియె : "నరేంద్రా ! పద్మపత్రవిశాలాక్షా ! పూర్ణచంద్రసమాననా ! నాయనా ! నీవు దశగ్రీవునిగూడ జయించితివి గనుక, నీ బలము నిరుపమాన మయినదని చెప్పక తప్పదు. ఎవనికి భయపడి సముద్రము గాలి చలింపకుండ నుండునో యట్టి నా మనుమని, రణములలో జయింపఁదగని ఘానిని రావణుని నీవు జయించి కట్టియుంచితివి. నా మనుమని కీర్తిని నీవు ద్రావి నీ పేరు ప్రసిద్ధినొందఁ జేసికొంటివి. నా మాటను మన్నించి, వత్సా! దశాననుని విడిచిపెట్టుము." అను పులస్త్యుని మాటలు విని యర్జునుఁడు మాఱుపలుకక సంతోషపూర్వకముగా రావణుని విడుదలచేసెను. మఱియు నా యర్జునుఁడు దేవతలకుఁ బరమ శత్రువగు రావణుని విడిచి దివ్యములయిన యాభరణములు పూవులదండలు వస్త్రములు మొదలగు వానిచేఁ బూజించి గౌరవించి యగ్నిసాక్షికముగా హింసలేని స్నేహము చేసికొని బ్రహ్మసుతుఁడగు పులస్త్యునికి నమస్కరించి గృహమునకుఁబోయెను. ఇట్లు ప్రతాపవంతుఁడగు రావణుఁడు పులస్త్యునిచే విడుదల చేయింపఁబడి తా నోటమిని జెందుటచే సిగ్గుపడుచుఁ దాతకు నమస్కరించి యాయనచేఁ గౌఁగిలింపఁబడి యనుజ్ఞాతుఁడాయెను. పితామహుని మానస పుత్రుఁడగు పులస్త్యమహాముని మనుమఁడగు దశగ్రీవుని విడుదల చేయించి వెంటనే బ్రహ్మలోకమునకుఁ బోయెను. రామా ! ఇట్లా రావణుఁడు కార్తవీర్యార్జునునివలనఁ బట్టువడి తరువాతఁ దన పితామహుఁడగు పులస్త్యునిచే విడిపింపఁ జేయఁబడెను. కనుక నిల్లే యొకరికన్న నొకరు బలవంతులు గలరు; ఇతరుల విషయమున నవమానము చేయఁగాదు. అట్టి

వానికి మేలు గలుగదు. తరువాత రాక్షసరాజు సహస్రబాహునితో స్నేహము సంపాదించుకొని మరల రాజులతో యుద్ధము చేయు తాత్పర్యముతో గర్వించి భూమిపైఁ దిరుగుచుండెను.

## 34-వ సర్గము

### రావణుఁడు వాలిచేఁ బట్టువడుట

రాక్షసాధిపతియగు రావణుఁడు పులస్త్యునిచే విడువఁబడి విచారము లేకుండ భూమియం దంతటను దిరుగుచుండెను. రాక్షసుఁడుగాని మనుష్యుఁడుగాని బలవంతుఁడెచ్చటనున్నట్లు దెలిసినను బోయి గర్వించి వానిని యుద్ధమునకు రమ్మని పిలుచుచుండెడివాఁడు. తరువాత నొకసారి వాలి పాలితమగు కిష్కింధకుఁబోయి హేమమాలియగు వాలిని యుద్ధమునకుఁ బిలిచెను. ఇట్లు యుద్ధోత్సుకుఁడై వచ్చిన రావణునిజూచి వాలికి మంత్రి యగు తారుఁడను వానరుఁడిట్లనియె: "రావణా! నీతో యుద్ధముచేయఁ జాలినవాలి ప్రస్తుత మూరఁలేడు. ఇఁకఁ దక్కినవానరులు నీయెదుట నిలువఁబడఁగలరా? వాలి నాలుగు సముద్రములలోను సంధ్యావందన మాచరించి యిపుడే వచ్చును. ముహూర్తమాత్రము తాళుము. శంఖముల రాశివలెఁ దెల్లనైన యీ యెముకల ప్రోవులను జూచితివిగదా! వానరాధిపుఁడగు వాలితో యుద్ధము గోరివచ్చిన నీవంటి బల గర్వితులవే చుమా యివి. నీవొకవేళ నమృతము ద్రావినవాఁడవే కావచ్చును. అయినను వాలి నెదుర్కొనువఱకే నీజీవితమని నమ్ముము. విశ్రవః పుత్రా! ఇపుడే నీవు జగచ్చిత్రమును జూడుము. ఈయొక్క ముహూర్తమాత్ర ముండుము. ఇట్టిది మఱి నీకు దుర్లభము గదా! ఒకవేళ నీవు మరణించుటకుఁ ద్వరపడుచుంటివేని దక్షిణ సముద్రమునకుఁ బొమ్ము. అచటనే భూమియందున్న సూర్యునివంటివానిని వాలిని జూచెదవు.

లోకరావణుఁడగు రావణుఁడు తారుని నిందించి వెంటనే పుష్పక మెక్కి దక్షిణ సముద్రమునకుఁ బోయెను. అచ్చట మేరుపర్వతమువంటి వాఁడును, ఉదయించిన సూర్యునివంటి ముఖము గలవాఁడును, సంధ్యోపాసనాపరుండును నగు వాలిని రావణుఁడు చూచెను. కాటుకకొండవంటి రావణుఁడు వెంటనే పుష్పకమునుండిదిగి వెనుకనుండి పాదములు చప్పుడు గాకుండ వాలిని బట్టుకొనుటకు సమీపించెను. పట్టుకొనుటకు సిద్ధముగా

నుండునప్పటికి వాలి హఠాత్తుగా వెనుకకుఁదిరిగి రావణునిఁజూచి వానిదురుద్దేశమును గ్రహించి యేమియు నెఱుఁగనివానివలె నూరకుండెను. చెవులపిల్లినిఁజూచి సింహము, పామునుజూచి గరుత్మంతుఁడు లక్ష్యము సేయనట్లు పాపనిశ్చయుఁడగు రావణుని వాలి లక్ష్యము సేయఁడాయెను. ఇట్లు పాపోద్దేశముగలిగి తన్నుఁ బట్టుకొనుటకు వచ్చుచున్న రావణునిఁ "జటుక్కున నేనే పట్టుకొని కక్షమునం దిఱికించికొని తక్కిన మూఁడు సముద్రములకును బోయెదను. మఱియు నీ రావణుఁడు నా కక్షమునందు శిథిలశిథిలములగు నవయవములుగల్గి గరుత్మంతుఁడు పట్టిన పామువలె వ్రేలాడుచుండఁగా నెల్లరును జూతురుగాక" యని తనలో నాలోచించుకొనెను. ఇట్లాలోచించి వాలి మౌనావలంబియై వేదమంత్రములు జపము చేసికొనుచుఁ బర్వతరాజువలెనుండెను. వాలిరావణు లొకరినొకరు పట్టుకొందమని యాలోచించి బలదర్పితులై యందుల కుపక్రమించిరి. వాలి రావణుని కాలిచప్పుడు విని చేతికి దొరకుపాటి దూరమునందే యున్నవాఁడని తెలిసికొని పరాఙ్ముఖముగానుండియే గరుత్మంతుఁడు పామును బట్టుకొన్నట్టులా రావణుని బట్టుకొనెను. తన్నుఁ బట్టుకోఁదలఁచిన రావణుని దానే పట్టుకొని వాలి చంక నిఱికించుకొని యతివేగముగా నంతరిక్షమునకెగిరెను. రావణుఁడు తన్ను మాటిమాటికిని గోళ్ళతోను దంతములతోను బాధించుచున్నను లక్ష్యముసేయక గాలి మేఘమునువలె నెత్తుకొనిపోయెను.

తరువాత రావణుని మంత్రులు రావణుని విడిపించుటకై కేకలు వైచుచు వాలిని వెంటాడించిరి. వారు వెంటఁ బోవుచుండఁగా నాకాశమధ్యమునందుండి వాలి మేఘములు వెంటఁబడిన సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. ఆరాక్షసోత్తములు వాలిని గలిసికొనఁజాలక చాల నలసిపోయి వెనుకకు మరలిపోయిరి. లేనిచో జీవనముపై నాసగలవాఁడెవఁడైనను వాలితో డీకొనఁగలఁడా? పక్షులుగూడఁ జేరరాని సముద్రములకుఁబోయి సకాలమున వాలి సంధ్యావందన మాచరించెను. మొదట దక్షిణ సముద్రమునుండి పశ్చిమసముద్రమునకుఁ బోవుచుండఁగా నాకాశమునందు సంచరించు భూతములన్నియుఁ గొనియాడుచుండెను. సరావణుఁడై వాలి యచట దిగి స్నానముచేసికొని సంధ్యాదికృత్యములు ముగించి మఱల రావణుని మోసికొనుచు నచ్చటనుండి యుత్తరసముద్ర

లై రట్లు సంతోషించుచుండిరి. తరువాత త్రిమూర్త్యాత్మకుడును, త్రికకుత్తును, త్రిధాముఁడును, త్రిదశార్చితుఁడును నగు బ్రహ్మదేవుఁడు వాయువునకు మేలుచేయు తలంపుతో నిట్లనియె: "ఇంద్రాదిదిక్పాలురారా! మీరందఱును నెఱిఁగినవారేయైనను మీకు హితము చెప్పుచున్నాను. వినుఁడు. ఈశిశువువలన మీకుఁ గావలసినకార్యములు చాలఁగలవు. కనుక మీ రందఱును వాయుదేవుని సంతోషమునకై యీశిశువునకు వరముల నిత్తురుగాక!" అని బ్రహ్మ చెప్పఁగానే, దేవేంద్రుఁడు ప్రేమతోఁ గూడిన వాఁడై పద్మమాలను దీసి యిట్లనియె: "నాచేతితో విడువఁబడిన వజ్రముచే నీతనిహనువునకు దెబ్బ తగిలినది గనుక నీకపిశార్దూలుఁడు హనుమంతుఁడనిపేరుగలవాఁడగును. మఱియు నిటుపైని నావజ్రముతో నీతని కేవిధమైనబాధయుఁ గలుగకుండుఁగాక" యనియు నేను వరమిచ్చుచున్నాను. పిదపఁ జీఁకటి పోఁగొట్టు సూర్యుఁ డిట్లనియె: "నేనితనికి నా తేజస్సులో నూఱవవంతుతేజ స్సిచ్చుచున్నాను. మఱియు నితనికి శాస్త్రము లభ్యసించు వయసు వచ్చినపిమ్మట గొప్పవక్త యగునట్లు విద్యాదానము చేయుదును. ఇతనితో సమానమైన పండితుఁ డెవఁ డొకఁడుండఁ బోఁడు." తరువాత వరుణుఁ డిట్లనియె: "పదివేలసంవత్సరములయినను నాపాశములచేతనుగాని, జలముచేతనుగాని యితనికి మృత్యువు లేదు." తరువాత "నాదండమువలన నితనికిఁ జావు లేదు. ఎప్పుడును నారోగ్యవంతుఁడై యుండును. యుద్ధములలో విషాదముండదు" అని యముఁడు సంతోషించి వరమిచ్చెను. "నాగద యితని నేమియు బాధింపఁజాల"దని సంతోషపూర్వకముగాఁ గుబేరుఁడు వరమిచ్చెను. "నావలనఁగాని నా యాయుధములవలనఁగాని యితనికిఁ జావు లే"దని శంకరుఁడు వరమిచ్చెను. "సమస్తమైన బ్రహ్మాదండములకును వధ్యుఁడు గాఁడనియు, దీర్ఘాయుష్మంతుఁడగు"ననియు బ్రహ్మదేవుఁడు వరమిచ్చెను. అంత బాలసూర్యునితో సమానుఁడై యుండు శిశువును జూచి విశ్వకర్మ యిట్లనియె: "నాచేఁ జేయఁబడిన యాయుధములు యుద్ధములలో నితని నేమియుఁ జేయఁ జాలవు. మఱియు దీర్ఘాయువు గలవాఁడై యుండును." అనఁగానే బ్రహ్మదేవతలవరములచే నలంకృతుఁడై యున్న కుమారునితోఁ గూడిన వాయువును జూచి సంతోషించుచు నిట్లనియె: "మారుతా! ఈమారుతి శత్రువులకు భయంకరుఁడును, మిత్రులకు సంతోషము గలిగించువాఁడును,

నెవ్వరిచేతను జయింపఁదగనివాఁడును, కామరూపుఁడును, కామగమనము గలవాఁడును, ఎచ్చటికిఁ బోఁదలఁచినను నడ్డులేనిగతి గలవాఁడును, కీర్తిసంపన్నుఁడునునయియుండును. మఱియు రావణునినాశనమునకును రామునిసంతోషమునకును నుపయోగించునవియు రోమహర్షణకరములును నగు నత్యద్భుతకర్మములను యుద్ధములలోఁ జేయుచుండును" అని యిట్లు వాయువును సంతోషపఱిచి బ్రహ్మాదిదేవతలందఱును దమతమ నివాసములకుఁ బోయిరి. ఆవాయుభట్టారకుఁడును కొడుకునెత్తికొని యింటికి వచ్చి యంజనాదేవితో జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పి యచ్చటినుండి యెందేనిఁ బోయెను: "రామా! అట్లితఁడు వరములను బొంది జలముతో సముద్రుఁడు నిండియున్నట్లు బలముతో నిండియుండెను. అట్లు బలాధిక్యముచేఁ బూర్ణుఁడై యీవానరపుంగవుఁడు నిర్భయుఁడై యాశ్రమములలోని మునీశ్వరుల కపరాధము చేయుచుండెను. వారిస్రుక్కులను, భాండములను, అగ్నిహోత్రములను, నారచీరలను, కృష్ణాజినములను బాడుచేయుచుండెను. మహాబలుఁడై యిటువంటిపనులు చేయుచుండఁగా నితనివరములు మొదలైనవి వినియున్నవారు గనుక మునులు క్షమించుచుండిరి. తరువాత కేసరియు వాయుదేవుఁడును నిషేధించుచున్నను నీయాంజనేయుఁడు మర్యాద నతిక్రమించుచునేయుండెను. తుదకు మహర్షులు సహింపఁజాలక క్రుద్ధులై యిట్లని శపించిరి: "వానరా! నీ వేబలము నాశ్రయించి మమ్ములను బాధించుచున్నావో, ఆ బలమును మా శాపమువలన మోహితుఁడవై చాలఁగాలమువఱకును దెలియఁజాలకుండుదువుగాక! ఎవ్వరైనను నెప్పుడు నీబలమును గూర్చి ప్రశంసింతురో, అప్పుడు నీబలము నీకుఁ దెలియఁగలదు." తరువాత నితఁడు మహర్షులవచనము వలనఁ బోయినబలముగలవాఁడై యాయాశ్రమములలోనే మంచిగాఁ దిరుగుచుండెడివాఁడు. ఇట్లుండఁగా వాలిసుగ్రీవులకుఁ దండ్రి యగు ఋక్షరజసుఁ డనునతఁడు తేజస్సుచే రెండవసూర్యునివలెఁ బ్రకాశించుచు సకలవానరరాజ్యమును బాలించుచుండెను. అతఁ డట్లు చిరకాలము రాజ్యమేలి కాలధర్మమునొందెను. అతఁడు మృతినొందినతోడనే మంత్రకోవిదు లగు మంత్రులు పెద్దవాఁ డగు వాలిని తండ్రిపదమం దభిషేకించి, సుగ్రీవుని వాలిస్థానమున యువరాజ్యాభిషిక్తునిఁ జేసిరి. ఇతనికిఁ జిన్ననాఁటినుండియు సుగ్రీవునితో నిష్కపటముగా నగ్నివాయువులకువలె

స్నేహము గలిగినది. ఇతఁడు మునుల శాపమువలననే తనబలమును దాను
దెలిసికోఁజాలకయుండెను. ఇట్లుండఁగా వాలిసుగ్రీవులకు వైరము గలిగి
నది. వాలిపెట్టుబాధలకు సహింపఁజాలక సుగ్రీవుఁడు నానాదేశములును
దిరుగవలసితిరిగెను. తనస్నేహితుఁ డిట్లు తిరుగుచున్నను మునుల శాపము
వలనఁ దనబలమును దాఁ దెలియలేక యేమియుఁ జేయఁజాలఁడాయెను.
పంజరములోఁ గట్టుపడియుండు సింహ మేమి చేయఁగలఁడు? పరాక్రమము,
ఉత్సాహము, మతి, ప్రతాపము, సుశీలత్వము, మాధుర్యము, నయము,
అనయము, గాంభీర్యము, చాతుర్యము, వీర్యము, ధైర్యము మొదలగు
గుణములచే నితనితో సమానుఁడుగాని యధికుఁడుగాని మఱియొకఁ
డుండఁబోఁ డని నమ్ముము. మఱియు నీతఁడు వ్యాకరణము నభ్యసింపఁ
దలఁచి సూర్యాభిముఖుఁడై వెనుకనుండి యుదయగిరినుండి యస్తపర్వ
తమువఱకును దిరిగి యా గొప్పగ్రంథము నంతయు ధారణపట్టి జ్ఞప్తియం
దుంచుకొనుచుండెడివాఁడు. ఈతఁడు వ్యాకరణశాస్త్రమునంతయు క్షుణ్ణ
ముగా నెఱింగినవాఁడు. ఇతనితో నేవిద్యలోను సమానుఁడే లేఁడన్నప్పు
డిఁక నెక్కువవాఁ డుండునా? దేవగురువు నతిక్రమించిన పండితుఁడు.
ఇతఁడు నవవ్యాకరణవేత్త. రామా! నీ దయవలన నితఁడు ముందు బ్రహ్మ
దేవుఁడగును. లోకములను ముంపఁదలఁచిన సముద్రమునకును, ప్రపంచ
మును దహింప నుద్యుక్తుఁ డగునగ్నికిని, ప్రళయాంతమునందలి యముని
కిని, నీ హనుమంతునికిని నెదుటఁబడి యెవ్వరు బ్రదుకఁగలరు? రామా!
ఇతఁడు, సుగ్రీవుఁడు, మైందుఁడు, ద్వివిదుఁడు, నీలుఁడు, నలుఁడు,
తారుఁడు, అంగదుఁడు, రంభుఁడు, శరభుఁడు మొదలగు వానరు లంద
ఱును నీ నిమిత్తమై దేవతలచే సృజింపఁబడినవారు. నీ యడిగిన సంగతి
యంతయుఁ జెప్పితిని. హనుమంతునికి బలము గలిగియు లేనట్లు లుండు
టకుఁ గారణము విన్నవించితిని." ఇట్లని యగస్త్యుఁడు చెప్పిన కథయంతయు
విని రాముఁడు, లక్ష్మణుఁడు, వానరులు, రాక్షసులు చాల నాశ్చర్య
మును బొందిరి. అపు డగస్త్యుఁ డిట్లనియె: "రామా! వినఁదలఁచిన
దంతయు వింటివి. నిన్నుఁ జూచితిమి. నీతో మాటలాడితిమి. కావున
నిఁక మేము మాయాశ్రమములకుఁ బోయెదము" అను నా యగస్త్యుని
మాటలు విని చేతులు జోడించుకొని వినయముగా శ్రీరాముఁడిట్లనియె:
"భగవానులవారూ! తమ దర్శనలాభమువలన మా దేవతలు, పితరులు,

బంధువులు సంతోషించిరి. కాని యిప్పుడు నాచిన్ని విన్నప మొకటిగలదు. దానిని విన్నవించుటకుఁ గోరిక యగుచున్నది. మీరందఱును నాయందు దయయుంచి యది నెఱవేర్తురని నమ్ముచున్నాఁడను. నేను పౌరులను జానపదులను దమతమకార్యములయందుంచి వచ్చి మీయందఱతోడనుగూడి క్రతువులను జేయఁ దలంచుచున్నాఁడను. మీరు నిత్యమును నాయజ్ఞములలో సదస్యులై యుండఁగోరితిని. అట్లు జరపితిరేని నేను జాలసంతోషించెదను. తపస్సులచేఁ గల్మషములను బోఁగొట్టుకొన్న మిమ్ముల నాశ్రయించి పితృదేవతలచేతను దేవతలచేతను మిక్కిలి యనుగ్రహింపఁదగినవాఁడ నగుదును. కనుక మీరందఱును దఱచుగా వచ్చుచుండవలయును." ఇట్లని చెప్పిన రామునివాక్యములు విని సంశితవ్రతు లగు నగస్త్యాదులు "తప్పక యట్లే చేయుదుము" అని చెప్పి వెళ్లుట కుపక్రమించిరి. క్రమముగా నందఱును వచ్చినదారినే పోయిరి. రాముఁ డాయా యిసంగతులను మాటిమాటికిని జింతించుచు నుండెను. తరువాత సాయంకాలము కాఁగానే రాముఁడు రాజులను వానరులను విడిచి సంధ్యావందనమునకుఁబోయెను. రాత్రి కాఁగానే యంతఃపురములోనికిఁ బోయెను.

## 37-వ సర్గము

### రాముని ప్రాతఃకృత్యము

ధర్మాత్ముఁడగు శ్రీరాముఁ డభిషిక్తుఁడు కాఁగా నారాత్రి పౌరులకు సంతోషదాయినియైనది. ఆ రాత్రి తెల్లవాఱినతోడనే ప్రాతఃకాలమున రాజులను నిద్రనుండి మేల్కొనఁజేయు స్తోత్రపాఠకులు రాజమందిరము నందునచ్చి నిండియుండిరి. వారందఱును గిన్నరులవలె మధురకంఠములు గలవారుగా శిక్షింపఁబడియుండిరి. మహావీరుఁడగు శ్రీరామచంద్రుని యథార్థముగా నిట్లు స్తుతి చేయ మొదలిడిరి: "వీరా! సౌమ్యా! కౌసల్యాప్రీతివర్ధనా! మేల్కొనుము. నరాధిపా! నీవు నిద్రించినతోడనే ప్రపంచమంతయు నిద్రించినది. నీ పరాక్రమము విష్ణుని పరాక్రమము వంటిది. నీ రూప మశ్వినీదేవతలరూపము నతిక్రమించియున్నది. నీవు బృహస్పతికంటె నెక్కుడు బుద్ధిగలవాఁడవు; రెండవ బ్రహ్మదేవునివంటి వాఁడవు. భూమితో సమానమైనక్షమగలవాఁడవు. సూర్యునితేజస్సును

మించిన తేజస్సు గలవాఁడవు. నీ వేగము వాయువేగము నతిక్రమించి యున్నది. సముద్రునిమించినగాంభీర్యము గలవాఁడవు. స్థాణువువలెనే యప్రకంప్యుఁడవు. నీ సౌమ్యత చంద్రునియందును గానము. పూర్వపు రాజులుగాని, ఇఁక ముందటి రాజులుగాని నిన్నుఁ బోలఁజాలరు. నీ వతి దుర్ధర్షుఁడవును, ధర్మమే నిత్యముగాఁ గలవాఁడవును, ప్రజలకు హితము చేయువాఁడవును నగుటచేఁ గీర్తి, లక్ష్మి, శ్రీ, ధర్మము మొదలగునవి నిన్ను విడువ నోపవు” అని యీరీతిగాను, ఇంకను ననేకవిధములుగాను మధుర స్వరములు గల స్తుతిపాఠకులు సూతులు మొదలగువారు శ్రీరాముని మేలుకొలిపిరి. శ్రీరాముఁడు వాస్తుతులన్నియు విని మేలుకొనెను. అతఁడు పాండురాచ్ఛాదనావృతమైన శయ్యనుండి శేషశయ్యనుండి నారాయణుని యట్లు లేచెను. ఇట్లు నిద్రనుండి శ్రీరామచంద్రుఁడు లేచునప్పటికి సేవకులు వినయముగా వస్త్రములను కలశములతో జలము పట్టుకొని సిద్ధముగా నుండిరి. నిత్యకృత్యములు నెరవేర్చుకొని యగ్నిహోత్రమున హోమముచేసి యిక్ష్వాకువంశపువారిచే సేవింపఁబడుచుండు దేవపూజా గృహములోనికిఁ బ్రవేశించెను. అందుండి దేవతలను, పితరులను, బ్రాహ్మణులను యథావిధిగాఁ బూజించి జనులు సేవించుచుండఁగా శ్రీరాముఁడు బైటనున్న కక్ష్యాంతరమునకు వచ్చెను. ఇంతట మంత్రులు పురోహితులు వసిష్ఠాదులు వెలుఁగుచున్న యగ్నిహోత్రములవలె వచ్చి సిద్ధముగా నుండిరి. అనేకదేశములనుండి వచ్చియున్న రాజులు మొదలగువారు రామునిపార్శ్వములయందు దేవతలు దేవేంద్రుని ప్రక్కలను గూర్చుండు నట్లు గూర్చుండిరి. యజ్ఞమును మూఁడు వేదములు నెట్లో యట్లే భరతుఁడు లక్ష్మణుఁడు శత్రుఘ్నుఁడు రాముని సేవించుచుండిరి. కింకరు లందఱును సంతోషించుచుఁ జేతులు జోడించుకొని నమస్కరించి బయటికిఁ బోయిరి. మఱికొందఱు సంతోషముగా నందందు నిలిచిరి. సుగ్రీవాది వానరులు సంతోషించుచు నాసభలోనుండిరి. నలుగురుమంత్రులతోడను గూడి విభీషణుఁడు గుహ్యకులు కుబేరుని సేవించుచున్నట్లు రాముని సేవించుచుండిరి. మఱియు వేదవృద్ధులు కులీనులు మొదలగువారు రాజును నమస్కరించి యుపాసించుచుండిరి. అట్లు శ్రీరాముఁడు శ్రీమంతులచేతను, ఋషులచేతను, రాజులచేతను, మహాపరాక్రమవంతులును కామరూపులును నగు వానర రాక్షసులచేతను జుట్టువాఱఁబడి దేవేం

ద్రునివలెఁ బ్రకాశించుచుండెను. అట్లననేల? దేవేంద్రునికన్న నెక్కుడు వైభవము గలవాఁడై వెలుఁగుచుండెను. అందఱును గూర్చుండియున్న తరువాత పురాణాదుల నెఱింగిన మహాత్ము లాయా పుణ్యకథలు చెప్పి సంతోషింపఁ జేయుచుండిరి.

---

## ప్రక్షిప్తసర్గములు

### 6-వ సర్గము

వాలిసుగ్రీవాదుల జననాదికము

శ్రీరాముఁ డిట్లగస్త్యుఁడు చెప్పినదంతయు విని మరల నాయనతో నిట్లనియె: "భగవానులవారూ! వాలిసుగ్రీవులకుఁ దండ్రియగు ఋక్షరజసుఁ డెవరు? తల్లిపేరేమి? తాము సెలవీయరైతిరి. ఇది నాకుఁ జాల సంతసము గొలుపుచున్నది. కావున సాంతముగా సెలవిండు." ఇట్లడిగిన రాముని కగస్త్యుఁ డిట్లనియె: "రామా! ఆ కథయంతయు సాంతముగాఁ జెప్పెద నాలింపుము. ఒకప్పుడు నారదభగవానుఁడు నా యాశ్రమము లోనికి వచ్చి నాకంతయుఁ జెప్పియున్నాఁడు. అట్లతఁడు భూమిపైఁ దిరుగుచు నా యాశ్రమములోనికి రాఁగా నేనతనిని యథావిధిగాఁ బూజించితిని. అతఁడు సుఖముగాఁ గూర్చుండి నేనడుగఁగా నీకథను "అగస్త్యా! వినుము" అని నాకుఁ జెప్పెను. బంగారువికారమైన మేరువను పర్వతము గలదుగదా! దానిమధ్యమశృంగము సర్వదేవతలచేతను బూజింపఁబడు చుండును. అందు నూఱుయోజనముల విశాలముగల దివ్యమైన బ్రహ్మసభ యొకటి గలదు. ఆ సభలో సదా చతుర్ముఖుఁడగు బ్రహ్మ నివసించు చుండును. ఆయన యోగాభ్యాసమును జేయుచుండఁగా నేత్రముల నుండి జారిన యుదకమును జేతులతోఁబట్టి దానిని దుడిచివిడిచెను. లోక కర్తయగు బ్రహ్మచేతినుండి యది గ్రిందఁబడినతోడనే దానినుండి వానరుఁ డొకఁడు పుట్టెను. రామా! ఆవానరుఁడు పుట్టినతోడనే బ్రహ్మ వానిని మంచిమాటలచే నోదార్చి యిట్లనియె. "వానరపుంగవా! విశాలమగు నీ పర్వతమును జూచితివిగదా; దీనియం దెప్పుడును దేవతలు విహరించు చుందురు. నీవీ పర్వతమునందు దుంపలు, పండ్లు మొదలగునవి తినుచు నాదగ్గరనే యుండుము. నీవిట్లు కొంతకాలముగడచును నుండుమువేని నీకు

మేలు గలుగును" అని యిట్లు బ్రహ్మ చెప్పఁగానే, దేవదేవుఁడగు నాతని
పాదములకా వానరుఁడు నమస్కరించి లోకకర్తయు నాదిదేవుఁడును నగు
బ్రహ్మతో నిట్లనియె: "దేవా! నీవాజ్ఞాపించినరీతిగనే నీయాజ్ఞలో నుండె
దను" అని చెప్పి యావానరశ్రేష్ఠుఁడు సంతోషించుచు ఫలములచేతను,
దుంపలచేతను, పుష్పములచేతను నిండియున్న చెట్లుగలచోటికిఁ బోయెను.
అతఁడు బ్రహ్మతో సమానమగు బలము వేగము గలవాఁడు. ఇట్లు పగ
లంతయు నడవిలోఁ దిరిగి యిచ్చకువచ్చిన మచ్చైన ఫలములు మొదలగు
నవి తిని సాయంకాలమునకు మంచిమంచి పుష్పములు ఫలములు సంగ్ర
హించుకొని బ్రహ్మయొద్దకువచ్చును; తాను దెచ్చినవానిని దేవదేవుఁడగు
బ్రహ్మయొక్క పాదసన్నిధిని సమర్పించుచుండెను. ఇట్లాకొండమీఁదఁ
దిరుగుచుండఁగాఁ జాలఁగాలము గతించినది.

ఇట్లు దిరుగుచుఁ దిరుగుచు మఱికొంతకాలమునకు వానరశ్రేష్ఠుఁ
డొకనాఁడు దప్పికొని మేరుపర్వతముయొక్క యుత్తరశిఖరమునకుఁ
బోయెను. అతఁడచ్చట ననేకవిధములైన జలపక్షులతో నిండినదియు
నిర్మలమైన నీరు గలదియు నగు నొకానొక సరస్సును జూచెను. అతఁడు
తనకేసరములను జలించునట్లుగాఁ జేసి యాతటాకమునొద్దనఁ గూరుచుం
డెను. అంతట నానీటిలోఁ దన ప్రతిబింబము నేత్రగోచరమైనది. అది
చూచి మఱియొకక్రోఁతి తనశత్రువు నీటిలో దాఁగియున్నదని తలంచి
కోపించి "దీని గర్వ మణఁచవలయును. ఇది నిజముగా నన్నవమానించు
చున్నది. కనుక నెట్టులయినను దీనిని బట్టుకొని నిగ్రహించి తీఱెదను" అని
యిట్లు మనసులో నాలోచించి యతఁడు వానరబలమువలన నెగిరి యానీట
దుమికెను. అటు దుమికి యెంత వెదకినను లోపల నేమియుఁ గానరామిచే
మరల నొడ్డునకు వచ్చిచేరెను. రామా! ఆక్షణముననే యా వానరుఁడు
స్త్రీత్వమును బొందెను. ఆస్త్రీ సుందరమైనరూపము గలది. లావణ్యముచే
నెంతయు నొప్పుచున్నది. శుభమైన యాకృతిగలది. విస్తీర్ణమైన జఘనప్రదే
శము గలది. సొగసు గులుకు కనుబొమలు గలది. ఇంద్రనీలముల కాంతిని
దిరస్కరించుచు నుంగరములవంటి ముంగురులు గలిగి ముద్దులు మూటఁ
గట్టుచున్నది. ముగ్ధ; చిఱునగవుతోఁ గూడిన మొగముగలది. పీనమైన
స్తనతటము గలది. అట్టి స్త్రీ ముల్లోకముల వారి మనస్సులను హరింపఁజాలి
యాసరస్సుగట్టున బుజాయష్టి యగు లతవలెను, పద్మము చేతలేని లక్ష్మి

వలెను, నిర్మలమైన చంద్రుని చంద్రికవలెను నొప్పారుచుండెను. వేయేల? ఆమె తనరూపముచే త్రిమూర్తులస్త్రీలను దిరస్కరించుచుండెను. ఇట్లామె దిక్కులను వెలిఁగించుచు నాగట్టునఁ గూర్చుండి యుండఁగా నంతట నింద్రుఁడు బ్రహ్మను సేవించి యింటికిఁ బోవుచు నామార్గమున వచ్చెను. ఆదేవేళకు సూర్యుఁడును పరుగుచుఁ దిరుగుచు నచ్చటికే వచ్చెను.

ఆస్త్రీ యేయడవిలో నున్నదో ఆవనములోనికే యింద్రుఁడు సూర్యుఁడునువచ్చి యొక్కమారుగా నాసుందరిపైని గన్నువైచిరి. ఆమెను జూచి యాయిద్దఱును మన్మథవశంవదు లైపోయిరి. తరువాత సురేంద్రుఁడును, సూర్యుఁడును సర్వాంగసుందరి యగు నాసుందరిని జూచి సర్వాంగములును క్షోభింపఁగా ధైర్యమూఁపుకోఁజాలకపోయిరి. అపు డింద్రుని తేజస్సాసుందరిశిరస్సుపైఁబడినది. అది యాస్త్రీని పొందకయే తిన్నఁగా వాలదేశమునకు జారినది. పిమ్మట నామె బలశాలి యగు వానరపతిని గన్నది. ఆదేవేంద్రుఁ డమోఘవీర్యుఁ డగుటంజేసి వాలదేశమునందుఁ బడిన బీజమువలనఁ గలిగినవానికి వాలి యని పేరిడెను. సూర్యుఁడు దైవవశమున నామె గ్రీవాప్రదేశమున వీర్యమును విడిచెను. ఆమెయు నేమియు ననక యూరకయుండెను. అంతట సూర్యుఁడు నివృత్తమదనుఁడాయెను. గ్రీవాదేశమునఁబడిన బీజమువలన సుగ్రీవుఁడు పుట్టెను. ఈ రీతిగా సురేంద్రుఁడును సూర్యుఁడును వీరలగు వాలిసుగ్రీవులను గనిరి. అపుడు దేవేంద్రుఁడు తనమెడలో నున్న బంగారుతామరపూలమాలను వాలిమెడలో వైచి స్వర్గమునకుఁబోయెను. సూర్యుఁడును దనకుమారుఁడగు సుగ్రీవునకు నీవాయుపుత్రుని స్నేహితునిగాను కార్యములయందుఁ దోడ్పడువానినిగాను నిరూపించి యచ్చటినుండి వెడలిపోయెను.

ఆరాత్రి తెల్లవాఱినది. మరల సూర్యోదయము కాఁగానే యాస్త్రీ యెప్పటియట్ల వానరరూపమును బొందెను. అతఁడే వానరుఁడై తన కొడుకుల నిద్దఱను బింగేక్షణులును హరివరులును కామరూపులును నై యున్నవారిని జూచెను. వెంటనే యమృతమువంటి తేనె దెచ్చి యాయిద్దఱకుఁ ద్రావించెను. తరువాత నాయిద్దఱుకొడుకులను జంకఁ బెట్టుకొని బ్రహ్మయొద్దకుఁ బోయెను. లోకపితామహుఁడగు బ్రహ్మ కొడుకులతో వచ్చిన తనకొడుకును ఋక్షరజస్సనువానిని మంచిమాటలతో నోదార్చి తరువాత దేవదూతను రావించి యిట్లాజ్ఞాపించెను. "దూతా!

నీవు నాయాజ్ఞను శిరసావహించి శుభప్రదమైన కిష్కింధ యను పట్టణ
మునకుఁ బొమ్ము. అప్పురి పేరికిఁ బగిది, దుర్గమసంపన్నము, రత్నపూ
ర్ణము. అందు పెక్కుమంది వానరులు నివసింపఁదగియున్నారు. పట్టణము నా
పురి బహురత్నసమాకీర్ణము; కామరూపులగు వానరులతో నిండియు
న్నది. మఱియు నాలుగువర్ణములవారును నుండఁగలరు. అది శత్రువు
లకుఁ జొరశక్యముగాక పహారాయంత్రములతో నొప్పారుచుండును. నా
యాజ్ఞవలననే దానిని విశ్వకర్మ బాగుగా నిర్మించెను. ఇప్పటికి నాపుత్రుఁ
డైన యీబుుక్షరజస్సనువానిని పెద్దలతోఁగూడఁ దీసికొనిపోయి
సామాన్యులగు వానరులను, యూథనాథులను రావించి యందఱయెదు
టను సింహాసనముపై వీనిని గూర్చుండఁబెట్టి యభిషేకము చేయుము.
అచ్చటనున్న వానరులందఱును నీబుుక్షరజునిచేఁ జూడఁబడినతోడనే
స్వాధీనులైయుందురు." ఇట్లని బ్రహ్మ చెప్పఁగానే, యాదూత వానరా
ధిపుని బురస్కరించుకొని శుభమగు నాకిష్కింధకుఁ బయనమాయెను.
అతఁడు వాయువేగముగాఁ గిష్కింధలోఁ బ్రవేశించి యతని నందు
బ్రహ్మాజ్ఞ ననుసరించి రాజుగా స్థాపించెను. తరువాత బుుక్షరజ
స్సనువాఁడు రాజ్యాభిషేకవిధిగా నభిషిక్తుఁడై పూజింపఁబడెను. తరు
వాతఁ గిరీటమును శిరస్సునందు ధరించి బాగుగా నలంకృతుఁడై సప్తద్వీప
ములలోనుండు వానరులను సంతోషపూర్వకముగా నేలుచుండెను.
రామా! వాలిసుగ్రీవులకుఁ దల్లియుఁ దండ్రియు నాబుుక్షరజస్సనువాఁడే
యని యెఱుఁగఁదగును. నీకు క్షేమమగుఁగాక! ఈకథను విన్నవా
రును, వినిపించినవారును సర్వకామ్యములును నెఱవేఱి యానందించుచు
నుందురు. విభూ! ఇదియంతయు యథార్థముగాను విస్తారముగాను నీకుఁ
జెప్పితిని. ఇదివఱకు రాక్షసులపుట్టుకయు నిపుడు వానరులపుట్టుకయుఁ
జెప్పితిని.

## 7-వ సర్గము

### రావణుఁడు సనత్కుమారునితో మాటలాడుట

దివ్యమును బ్రాచీనమును నగు నీకథను విని శ్రీరాముఁడు తమ్ము
లతోఁగూడఁ జాల నాశ్చర్యమును బొందెను. ఇట్లు చెప్పిన యగస్త్యభగ
వానుని వాక్యమును విని రాముఁ డిట్లనియె: "మునిపుంగవా! తమ దయ

వలన నేను గొప్పపుణ్యకథను వింటిని. అది విన్నది మొదలు చాలఁ గుతూహలముతోఁ గూడినవాఁడ నయితిని. వాలిసుగ్రీవుల దివ్యమయిన పుట్టుక యెట్టిదో యది నాకేల చిత్రము గాకుండెడివి ? దేవేంద్రుఁడును సూర్యుఁడును బలవంతులలో శ్రేష్ఠులగు వాలిసుగ్రీవులై పుట్టిరి" అని యిట్లు శ్రీరాముఁడనఁగానే యగస్త్యుఁ డిట్లనియె: "మహామహుఁడవగు నో రామా! అదియట్టులే. అది పూర్వ మట్టే జరిగినది. దాని సంగతి కేమి గాని, యింక నొకదివ్యమైన ప్రాచీనకథ చెప్పెదను వినుము. ఎందునిమిత్తమై పూర్వము రావణుఁడు వైదేహిని హరించెనో ఆసంగతి తేటపడును. నీవు సావధానచిత్తుఁడవై వినుము. పూర్వము కృతయుగమున రావణుఁడు బ్రహ్మపుత్రుఁడగు సనత్కుమారుఁడు రెండవయగ్నివలె జాజ్వల్యమానుఁడై వెలుఁగుచుఁ గూర్చుండియుండఁగా వినయావనతుఁడై చేతులు జోడించి నమస్కరించి యిట్లనియె: "భగవానులవారూ! ఈలోకములో శ్రేష్ఠుఁడును, దేవతలకంటె బలవంతుఁడును నెవరు? ఎవని నాశ్రయించి దేవతలు యుద్ధములలో శత్రువుల జయించుచుందురు? నిత్యమును జను లెవనిని బూజించుచుందురు? యోగు లెవనిని ధ్యానించుచుందురు? తాము తపోధనులు గనుకఁ దమకుఁ దెలియనిసంగతి యుండఁబోదు. నాయడిగినదంతయు విస్తరించి చెప్పుదురుగాక" అని రావణుఁ డడిగినతోడనే వానిమనోభావమును గ్రహించి "నాయనా! విను"మని యతఁ డిట్లనియె: "ఎవ రీబ్రహ్మాండము నంతయు భరించుచుండునో? ఎవనిపుట్టుక తెలియరాదో? సురాసురు లెవని నాశ్రయించి సమరమున నసురులను జయించుచుందురో అతఁడు నారాయణుఁడు. అతని నాభీపద్మమునుండి సృష్టికర్త యగు బ్రహ్మ పుట్టెను. స్థావరజంగమాత్మకమగు నీసర్వమును నతఁడు సృజించెను. విబుధులు విధిగా యజ్ఞములయందుఁ బూజించుచుందురు; మఱియు నమృతమును ద్రావుచుందురు. యోగులు పురాణములచేతను, వేదములచేతను, పాంచరాత్రాగమములచేతను నిత్యమును ధ్యానించుచు యజ్ఞములచేత నతనిని యజించుచుందురు. దైత్యులను, దానవులను, రాక్షసులను, మఱియు దేవతలకు విరోధులగువారి నెల్లరను యుద్ధములలో నతఁడే జయించుచుండును. అతఁ డందఱిచేతను బూజింపఁబడుచుండును" అని యిట్లు చెప్పిన సనత్కుమారునిమాటలువిని రావణుఁడు నమ్రుఁడై మరల నిట్లనియె: "మహాత్మా! యుద్ధములలో నాతనిచేఁ జచ్చినరాక్షసులు మొదలగువారి కేమిగతి గలు

గును? అతనిచేఁ జచ్చినవా రెవరు?" అని యడిగిన రావణుని మాటలు విని యాయన యిట్లనియె: "దేవతలచేఁ జంపఁబడినవారు స్వర్గము చేరుదురు. పుణ్యము క్షీణము కాఁగానే యచ్చోటు వాసి భూమిపైఁ బుట్టుదురు. పూర్వజన్మములయందు సంపాదించుకొన్న పుణ్యపాపములచే సుఖదుఃఖముల ననుభవించుచుఁ బుట్టుచుఁ జచ్చుచు నుందురు. రావణా! త్రిలోకనాథుఁడును జనార్దనుఁడును నగు చక్రధరునిచేఁ జంపఁబడినవారు పోయి యాతనియందు లయమును బొందుదురు. ఆ దేవునికోపము గూడ వరముతో సమానమైనదే" అని యిట్లు సనత్కుమారుఁడు చెప్పఁగా విని రావణుఁ డాశ్చర్యమును సంతోషమును బొందుచు "యుద్ధములో నే నెట్లాభగవంతుని నెదుర్కొందును?" అని యాలోచింప మొదలిడెను.

## ౩౬వ సర్గము

### సనత్కుమారుని యుపదేశము

ఇట్లాలోచించుచున్న మహాత్మునితో సనత్కుమారుఁడు మరల నిట్లనియె: "రావణా! కొంచెముకాలము సహించితివేని నీమనోరథము తప్పక నెఱవేఱును. అంతవఱకును సుఖముగా నుండు"మన విని వాఁడతనితో నిట్లనియె: "మహానుభావా! అతనిస్వరూప మెట్టిది? మఱియు నాతనిసంగతియంతయు విస్తరించి చెప్పుదురుగాక!" యన సనత్కుమారుఁ డిట్లనియె: "రావణా! నీయడిగినదంతయుఁ జెప్పెదను వినుము. ఆదేవదేవుఁడు సర్వత్ర నిండియున్నవాఁడు. సూక్ష్ముఁడు, అవ్యక్తుఁడు, సనాతనుఁడు. ఈమూఁడులోకములును నతనియం దిమిడియున్నవి. అతఁడు భూమియందు, స్వర్గమందు, పాతాళమందు, పర్వతములయందు, వనములయందు, స్థావరములయందు, పట్టణములయందు నున్నాఁడు. ఓంకారము, సత్యము, సావిత్రి, పృథివియు నతఁడే. అతఁడే భూమిని భరించు ననంతుఁడని పేర్వడియున్నాఁడు. పగలు, రాత్రి, రెండుసంధ్యలు, సూర్యుఁడు, యముఁడు, సోముఁడు, కాలము, అనలము, వాయువు, బ్రహ్మ, రుద్రుఁడు మొదలగువారందఱును నతఁడే. ప్రకాశించువాఁడు, జ్వలించువాఁడు, మెఱయువాఁడు, రక్షించువాఁడు, లోకములను సృజించువాఁడు, సంహరించువాఁడు, శాసించువాఁడు, క్రీడించువాఁడును నతఁడే. మఱియు నవ్యయుఁడు, లోకనాథుఁడు, విష్ణుఁడు, పురాణపురు

షుఁడు, భక్తులజన్మముల సఫలింపఁజేయువాఁడును నతఁడనియే తెలిసి కొనుము. రావణా! అదికాక వేయిమాటలు చెప్పనేలా? ఈమూఁడు లోకములును చరాచరప్రపంచమును నతనిచేతనే నిండియున్నది. నల్ల కలువఱేకువంటి శరీరకాంతిగలిగి, కింజల్కమువంటి కాంతిగల వస్త్రము లను ధరించి యతఁడు వర్షాకాలములో నాకసమునందు మెఱపులతోఁ గూడిన మేఘమువలెఁ బ్రకాశించుచుండును. శ్రీమంతుఁడును, మేఘము వంటి చామనచాయగల శరీరముగలవాఁడును, పంకజములవలెనే యెఱ్ఱని కన్నులు గలవాఁడును, శ్రీవత్సము వక్షఃస్థలమునందుఁ గలవాఁడును, శశాంకునిచేఁ జేయఁబడిన లక్షణము గలవాఁడును నై యొప్పుచుండును. మేఘమునందు మెఱపుతీఁగవలె నిత్యమును నతనిశరీరమునందు సంగ్రామ రూపిణి యగు లక్ష్మి యుండును. అతనిని దేవతలుగాని, రాక్షసులుగాని, పన్నగులుగాని చూడఁజాలరు. అతఁ డెవరియందుఁ బ్రసన్నుఁడగునో వారే యతనిని జూడఁగలరు. నాయనా! యజ్ఞములచేతను, సంచితమైన తపస్సులచేతను, దానములచేతను, పూజలచేతను నతనిని జూడఁజాలరు. అతనిపాదములయందు భక్తిగలవారును, అతనియందు నిలుపఁబడిన ప్రాణములుగలవారును, చిత్తమతనియం దుంచినవారును, అతఁడే దిక్కని నమ్మినవారును, జ్ఞానముచే దహించుకొనిన పాపములు గలవారును మాత్రమే యతనిని జూడఁజాలుదురు.

రావణా! ఒకవేళ నీ వాతనిని జూడఁదలఁచితివేని నీకొక చక్కని యుపాయము చెప్పెదను. నీకిష్టమైనచో నట్లు చేయుము. కృతయుగము గడచినవెనుకఁ ద్రేతాయుగప్రారంభమున నతఁడు దేవతలకును మనుష్యుల కును మేలుచేయుతలంపున రాజశరీరమును ధరించును. ఇక్ష్వాకువంశ ములో దశరథుఁ డనురా జొకఁడు పుట్టఁగలఁడు. అతనికి మహాతేజశ్శాలి యగు రాముఁ డను కుమారుఁడు పుట్టును. అతఁడు మహాతేజశ్శాలి, మహాబుద్ధిశాలి, మహాబలపరాక్రమశాలి, మహాబాహుశాలి, మహాసత్త్వ శాలి, భూమితో సమానమైన క్షమగలవాఁడు, సూర్యునివలెఁ దేజి చూడరానివాఁడు, యుద్ధవిశారదుఁడును నై నారాయణుఁడే యట్లు పుట్టఁగలఁడు. అతనిపేరు శ్రీరాముఁ డందురు. అతఁడు తండ్రియాజ్ఞ ననుసరించి తమ్మునితోడను భార్యతోడను మిగుల భయంకరమగు దండ కలో విహరింపఁగలఁడు. ఆతనిభార్య మహాభాగురాలు, లక్ష్మి సీత యని

ప్రసిద్ధికెక్కెను. ఆమె జనకునికూఁతురై భూమినుండి ప్రజననమొందును. ఆమె రూపము నిరుపమానము. లక్షణములన్నియు నామెయందే నిండి యుండును. చంద్రుని వెన్నెల యనుసరించినట్లును, నీతి మనుష్యుల ననుసరించునట్లును నామె యతని ననుసరించియుండును. ఆమె మంచిస్వభావము, ఆచారము మొదలగు మంచిగుణములతోఁ గూడియుండును. పతివ్రతలలోఁ దిలకమువలెఁ బ్రకాశించుచుండును. ధైర్యమున నామె దేయని చెప్పనొప్పును. ఏకమూర్తినిబొందిన సూర్యుని సహస్రరశ్ములవలె నుండును. రావణా! ఈరీతిగా నీకంతయుఁ జెప్పితిని. దేవదేవుఁడగు నాపరాత్పరుని సంగతి యట్టిది. వేయేల ? అతఁడు శాశ్వతుఁడు, అవ్యయుఁడు" అని యిట్లు చెప్పిన సనత్కుమారునిమాటలు విని "ప్రతాపవంతుఁడును, మహాబాహుఁడును నగు రావణుఁడు నీతోఁగూడ విరోధమును గోరుచు రామా! చింతింప మొదలిడెను. మాటిమాటికిని సనత్కుమారుని వాక్యములను దలపోయుచు రావణుఁడు సంతోషపూర్వకముగా యుద్ధమును గోరుచుఁ దిరుగుచుండెను" అని యిట్లు చెప్పిన యగస్త్యునిమాటలు విని రాముఁడు ఫుల్లలోచనుఁడై యదే యర్థమును జింతించుచు కరశ్చాలన మొనరించుచుండెను. పరేశ్వరుఁడగు రాముఁడు మునిభగవానుని మాటలు విని సంతోషించుచు విస్మయగ్రస్తమానసుఁడై మరల జ్ఞానులలో శ్రేష్ఠుఁడగు నాయగస్త్యుని నింకొక పురాతనకథను జెప్పుమనెను.

## ౯-వ సర్గము

తరువాత మహాతేజశ్శాలియును మహాకీర్తిశాలియు నగు నగస్త్యుఁడు ప్రణతుఁడగు రామునితోఁ బితామహుఁ డీశ్వరునితో నన్నట్లిట్లనియె: "సత్యపరాక్రముఁడవగు నో రామా! వినుము. ఇంకను గథాశేషము గలదు. అది నేనెట్లు వింటినో యెట్లు జరిగినదో యట్లే చెప్పెదను" అని ప్రీతమనస్కుఁడై మహామతియగు నగస్త్యుఁడు రామునికిట్లని చెప్ప మొదలిడెను: "మహామతివగు రామా! ఇందు నిమిత్తమై రావణుఁడు దురాత్ముఁడు జనకరాజకూఁతును హరించెను. ఈ కథను నాకు నారదుఁడు పూర్వము మేరుపర్వతముపై నొకప్పుడు చెప్పెను. అపుడచ్చట దేవతలు గంధర్వులు సిద్ధులు ఋషులు మొదలగువారుగూడఁ గలరు. రామా! ఆనారదుఁడే మరలఁ గథాశేషమును జెప్పెను. అతఁడు నవ్వుచు నాతో

జెప్పిన యాకథాశేషమును జెప్పెదను. అది సమస్తపాపములను బోఁగొట్టు నది. నారదుని ఋషులు, దేవతలు మొదలగువారు సంతోషించినవారై యాకథను చెప్పుమనికోరిరి. ఎవరు దానిని భక్తిశ్రద్ధాతాత్పర్యములతో విందురో? వినిపింతురో? వారీలోకమందుఁ బుత్రపౌత్రాదులతో సంతోషించి దేహాంతమందు స్వర్గములో నుందురు.

## 10-వ సర్గము

### రావణుని శ్వేతద్వీపపు కథ

"రామా! తరువాత రావణుఁడు విజయమును గోరుచు శూరులగు రాక్షసులతోఁగూడి తిరుగుచుండెను. దైత్యులలోఁగాని, దానవులలోఁగాని, రాక్షసులలోఁగాని బలవంతుఁడున్నాఁడని విన్నచో వానిని యుద్ధమునకు రమ్మని బలగర్వితుఁడై పిలుచుచుండెడివాఁడు. రామా! ఈరీతిగా నారావణుఁడు భూమియందుఁ దిరుగుచు బ్రహ్మలోకమునుండి వచ్చుచున్నవాఁడును, మేఘపృష్ఠముపై నుండి రెండవసూర్యునివలెఁ బ్రకాశించుచున్నవాఁడును నగు నారదుని జూచి, సమీపించి సంతోషించుచుఁ జేతులు జోడించుకొని నమస్కరించి యిట్లనియె: "నారదభగవానులవారూ! బ్రహ్మలోకము మొదలు తామనేకలోకములు చూచియే యుందురు. కావున నడుగుచున్నాను. ఏలోకములోని మనుష్యులు బలవంతులో చెప్పితిరేని నేను బోయి వారితో యథేచ్ఛముగ యుద్ధము చేయుదును" అని యిట్లడిగిన దురాత్ముఁడగు రావణునిమాటలు విని నారదుఁడు ముహూర్తమాత్ర మాలోచించి రావణునితో నిట్లనియె:

"రావణా! క్షీరసముద్రమునకు సమీపమున గొప్పద్వీప మొకటి గలదు. అచ్చటి మనుష్యులు చంద్రునివంటివారు, మిక్కిలి బలవంతులు, గొప్పగొప్పశరీరములుగలవారు, మహావీర్యులు, మేఘముల యుఱుముల వంటి కంఠధ్వనులు గలవారు, మహామాత్రులు, ధైర్యవంతులు, గొప్ప పరిఘములవంటి బాహువులు గలవారు. నేనట్టివారిని శ్వేతద్వీపములోఁ జూచితిని. నీవెటువంటివారితో యుద్ధము చేయఁ గోరుచుంటివో వారట్టివారే". అను నారదునిమాటలు విని రావణుఁ డిట్లనియె: "నారదభగవానులవారూ! ఆద్వీపమునందు బలవంతు లెట్లు పుట్టుదురు? ఆమహాత్ములకు శ్వేతద్వీపములో నివాస మెట్లు ప్రాప్తించినది? ఆ యీసంగతియంతయు

నాకు యథార్థముగాఁ జెప్పవలయును. తాము సర్వప్రపంచమును చేతి లోని యుసిరికకాయవలెఁ జూడఁగలరు" అను రావణునిమాటలు విని నారదుఁ డిట్లనియె: «రావణా! నిత్యమును నితరులయందు మనస్సులేని వారును, నారాయణపరాయణులును, నారాయణు నారాధింప నాసక్తిగల వారును, సదా మనస్సు నతనియందే యుంచువారును, అతఁడే దిక్కని నమ్మినవారును, ఏకాంతభావమును బొందినవారును, ప్రాణములనుసైతము నతనియందే యుంచువారును శ్వేతద్వీపవాసమును బొందఁగలిగిరి. వారు తమపుణ్యములచేతనే యచ్చట వసించుచుందురు. యుద్ధములలో శార్ఙ్గ మను వింటి నెక్కిడి నారాయణుఁ డెవరిని జంపునో వారును, చక్రాయుధముచేఁ జచ్చినవారును నాలోకమునకుఁ బోవుదురు. యజ్ఞముల ఫలముచేతను, తపస్సులచేతను, నియమములచేతను, దానములవలనఁ గలుగు ఫలముచేతను ఆలోకము ప్రాప్తింపదు" అని చెప్పిన నారదుని వాక్యములు విని రావణుఁడు మిక్కిలి యాశ్చర్యమును బొందినవాఁడై చాలకాల మాలోచించి "యతనితో యుద్ధము చేసెదను" అని నిశ్చయించుకొని నారదునియొద్ద ననుజ్ఞాతుఁడై శ్వేతద్వీపమునకుఁ బోయెను. నారదుఁడును జిరకాలము ధ్యానించి కౌతూహలముతోఁ గూడినవాఁడై పరమాశ్చర్యమును జూడఁదలఁచి యతివేగముగా నచ్చటికి పోయెను. ఆనారదుఁడు కేళికరుఁడును యుద్ధప్రియుఁడును గదా! రావణుఁడు రాక్షసులతోఁగూడి యచ్చటికిఁ బోవుచు, నచట సింహనాదముచేసి పదిదిక్కులను బ్రతిధ్వను లీనునట్లు చేసెను. నారదుఁడు శ్వేతద్వీపమునకుఁ బోయిన వెనుక రావణుఁడును దేవతలకుఁగూడ లభ్యముగాని శ్వేతద్వీపములోఁ బ్రవేశించెను. ఆద్వీపముయొక్క తేజస్సుచేత బలవంతుఁడగు రావణుని పుష్పకమను విమానము వాయువేగసమాహతమై మేఘము నిలువఁ జాలనట్లు నిలువఁజాలకపోయినది. రావణునిమంత్రులు తేజి చూడ శక్యముగాని యాద్వీపములోఁ బ్రవేశించి భయపడి రావణునితో నిట్లనిరి: "రాక్షసేంద్రా! మేము మూఢులము; తెలివితప్పియున్నారము. ఇచ్చట నిలుచుటకే మాకు శక్యముగాకుండ నున్నది. ఇఁక యుద్ధ మేలాగు చేయఁజాలుదుము!" అని చెప్పి యారాక్షసులందఱును బొఱి పోయిరి. రావణుఁడును దనపుష్పకమునుగూడ నారాక్షసులతోడనే

విడిచిపెట్టెను. ఇట్లు పుష్పకము పోయినవెనుక రావణుఁడు మహాభయంకరమగు రూపమును ధరించి యేకాకియై యాశ్వేతద్వీపములోఁ బ్రవేశించెను.

రావణుఁ డట్లు ప్రవేశించినతోడనే యందలి యాఁడువాండ్రచేఁ జూడఁబడెను. అందులో నొకసుందరి మందస్మితసుందరవదనారవిందయై రావణుని చేతితోఁబట్టుకొని "నీవెవరు? ఇచ్చటి కెందులకు వచ్చితివి? ఎవనికొడుకవు? నిన్నెవరు పంపిరి? యథార్థము చెప్పుము" అని యిట్లడుగఁగానే, రామా! రావణుఁడు చాలఁగోపించి యిట్లనియె: "నేను విశ్రవోబ్రహ్మకుమారుఁడను; నాపేరు రావణుఁడందురు. నేను యుద్ధముకొఱకిటవచ్చితిని; కాని నాతో సమముగా యుద్ధము చేయువారు గనుపడకుండనున్నారు" అని యిట్లు దురాత్ముఁడగు రావణుఁడు చెప్పుచుండఁగా నచ్చటిస్త్రీలందఱును పకపక నవ్విరి. అందులో నొకతె కోపించి బలవంతముగా బాలునివలె లాగికొని విలాసముగాఁ జెలులమధ్యను గిఱగిఱఁద్రిప్పి మఱియొకతెను బిలిచి "చెలియా! నేను బురుగును బట్టుకొంటిని జూడుము. దీని కిరువదిచేతులు పదితలలును గలవు. మఱియుఁ గాటుకకొండవలె నల్లగా నున్నది" అనునప్పటి కింకొకతె దానిచేతిలోనుండి మఱియొకతె, దానిచేతిలోనుండి వేఱొకతె, దానిచేతిలోనుండి యింకొకతె లాగికొని ముచ్చటగాఁ జూచుచుండిరి. రావణుఁ డాస్త్రీల చేతులలోఁబడి నలిగిపోవుచు నూపిరియాడక బాధపడెను. ఇట్లు పీడించుచు గిఱగిఱఁ ద్రిప్పుచుండఁగాఁ బ్రాజ్ఞుఁడుగనుక నొకతెచేయి కఱచెను. దానికిఁ గోపమువచ్చి వానిని నేలనువైచి కొట్టినది. ఇంకొకతె వానినెత్తికొని యఱచేతిలో నుంచుకొని యంతరాళమున కెగిరినది. దానిని గోళ్లతోఁ జీరెను. అది భయపడి గిఱగిఱఁద్రిప్పి నీటిలోనికి విసరివైచినది. వాఁడు భయాతురుఁడై సముద్రజలములోఁబడెను. వజ్రముచేఁ గొట్టఁబడిన పర్వతశిఖరము సముద్రములోఁ బడినచందమైనది. ఇట్లు విసరఁబడి సముద్రజలములోఁ గొంతసేపుండి పైకివచ్చెను. రామా! రావణుఁ డీరీతిగా శ్వేతద్వీపముననుండు స్త్రీలచేతనే యెన్నో బాములకు లోనయ్యెను. నారదుఁ డారావణునిపాట్లను చూచి చాల నాశ్చర్యమును బొంది నవ్వుచు నాట్యమారంభించెను. తరువాత రావణుఁడు సముద్రము నుండి బైటికి వచ్చి శిరోజములనుండి నీరుగారుచుండఁగా దక్షిణమువైపున

మనస్సు యొక్కడనేది యాశ్చర్యపడుచు నాలోచింప మొదలిడెను. నే నన్ని లోకములను జయించితినిగాని యిట్టియాపదకు లోను గాలేదని యను కొనెను. స్వభావముచేతనే యబలలగు స్త్రీ లెంతవిపరీతపుఁ బని చేసిరి? నిజమే యీలోకములోనివారు లేని చేయఁదలఁచినను జేయఁగలవారే. స్త్రీరూపముగా నుండు శరీరములను ధరించిరని నారదుఁడు నాకుఁ జెప్పి యున్నాఁడు. ఇపు డాలోచింపఁగా బలవంతులతో సంధిచేసికొనవలయు నని నిశ్చయమైనది.

రామా! రావణుఁడు మరల వారివృత్తాంతమును దెలిసికొను టకై యావనమంతయు వెదక మొదలిడెను. ఇట్లుండఁగా నింతట బ్రహ్మ మానసపుత్త్రుఁడగు సనత్కుమారుని యోగనిష్ఠాగరిష్ఠుని జూచెను: అతఁడు సమిధలచే నగ్నిహోత్త్రుఁడు వెలుగుచుండునట్లు తపస్సుచే వెలుంగుచుండెను. అతఁడు దక్షిణపార్శ్వమందు గుహాశ్రయుఁడై తిరుగు నుండెను. రావణుఁడు తపోవృద్ధుఁడగు సనత్కుమారునిజూచి చేతులు జోడించి నమస్కరించి నిక్కనొందుచు నిట్లని యడిగెను. "బ్రహ్మర్షి! సత్య వాది! మహాత్మా! యీలోక మెవ్వనిచే సృజింపఁబడినది? సర్వజ్ఞానుల లోను శ్రేష్ఠుఁడవగు నోఋషివర్యా! యీలోకములో నెవ్వఁడుండును? మఱియు నీ వింతసమాధి నవలంబించి ధ్యానించువస్తు వెద్ది? నీవు సర్వ జ్ఞుఁడవని నాకుఁ దెలిసినది" అని యడిగిన రావణునియభిప్రాయము దెలిసి కొని నవ్వుచు నతఁడిట్లనియె: "నాయనా! రావణా! చెప్పెదను వినుము. ఈచరాచరప్రపంచమునంతయు నెవఁడు ధరించుచున్నాఁడో, మూఁడు లోకములును నేమహాత్ముని పుట్టుకను దెలిసికొనఁజాలకుండునో, వేదవిదు లేపురుషుని దమస్సుకంటెఁ బైఁగా నుండువాఁడనియు, నజరమగు నాదిత్య రూపమును ధరించినవాఁడనియుఁ, బరమాత్ముఁడనియు, నీశ్వరుఁడనియుఁ జెప్పుచుందురో, నాతండ్రియగు బ్రహ్మ యెవనినాభినుండి పుట్టెనో కైలాస నిలయుండగు శివుఁ డెవ్వనిక్రోధమునుండి పుట్టెనో, యెవని నాశ్రయించి విబుధులు విధిగా యజ్ఞములలో హవిర్భాగములను, అమృతమును గొనుచుందురో, మఱియు వారు రాక్షసులను లక్ష్యముసేయక యుందు రో, యెవనిశ్వాసవాయువువలనఁ బుట్టినస్త్రీలు పరాజయమెఱుఁగని నిన్నును బట్టుకొని కడుంగడుఁ గష్టములకులోనుజేసి గిఱగిఱఁద్రిప్పి సము ద్రములోఁ బడవైచిరో, యెవనిచేతను మహావీర్యులగు దైత్యులు దాన

వులు నైర్ఋతులు నిహతులగుచుందురో, యట్టిమహానుభావుఁ డట్టిలోక నాథుఁ డట్టిమహాత్ముఁడు గోవిందుఁ డీలోకమును గల్పించెను. నారాయ ణునియం దాసక్తిగలవా రాతనిని బూజింపుచుందురు. సమస్తభూతముల యందును ద్వేషము లేనివారును, గొప్పయోగబలము నాశ్రయించిన వారును, మధుసూదనుని విధిగాఁ బంచయజ్ఞములచేత నారాధించుచుం దురు. ఏకాంతభక్తి గలవారును, మిక్కిలి సత్త్వగుణము గలవారును, సావ ధానమనస్కులును నతనియం దుందురు. ఎవఁడు పురాణములయందును, వేదములయందును, పాంచరాత్రములయందును బఠింపఁబడియున్నాఁడో, ఎవనిని మునులు సాంఖ్యయోగములచే ధ్యానించుచుఁ బూజించుచుం దురో, మునీశ్వరులు దేవతలు భగవంతుఁడగు నాహరిని గనుఁగొనుచుం దురు. మధుకైటభులను జంపిన యాభగవంతుని నెవ్వరు వెదకఁగలరు? వేయిమాటలేల? రావణా! పితామహుఁడుగూడ నాదేవుని తెలిసికోఁ జాలఁడనఁగా నీకఁ దక్కినవారిసంగతి చెప్పవలయునా? ఎవఁడు నిత్య మును హరియు నారాయణుఁడును విభువును జగత్తుల కాభరణమును పుణ్యాత్ముఁడునునగు నామహాత్ముని దెలిసికొనునో వానికిఁదప్పక మోక్షము సిద్ధించును. ఇందు సందియము లేదు."

రామా! రావణుఁ డిట్లు చెప్పిన సనత్కుమారుని వాక్యములను బ్రసన్నచిత్తముతో విని మరల నాయన నిట్లని యడిగెను: "దేవా! ఆదేవుఁ డెట్లు కనుపడును? ఎట్లు వినఁబడును? అతఁడెట్లు లోకమునఁ గ్రీడించుచుం డును? అతని నెట్లు చూడఁగలను? నేనెంతకాలము తపస్సుచేసినచో ననా యాసముగా నీలోకములోఁ బ్రవేశింపఁగలను? ఆ యీసంగతు లన్నియు నీకు స్పష్టము గనుక నాకుఁ జెప్పవలయు" నను కోరికతోఁ గూడిన రావణు నితో వాక్యవిశారదుఁడు గనుక నాసనత్కుమారుఁడు బాగుగా నాలో చించి మొదటినుండి తుదవఱకుఁ జెప్పఁదలఁచి యిట్లనియె: "ఆదేవుఁడే సర్వగతుఁడు, సూక్ష్ముఁడు, అవ్యక్తుఁడు, సనాతనుఁడు. ఈచరాచర ప్రపంచ మంతయు నతనిచేత వ్యాపింపఁబడియున్నది. అతఁడు భూమియందును, స్వర్గమందును, పాతాళలోకమందును, పర్వతములయందును, వనముల యందును, సకలసముద్రములయందును, నదులయందును, నెల్లవేళలయం దును నుండును. పగలు, రాత్రి, రెండుసంధ్యలు, సూర్యుఁడు, యముఁడు, సోముఁడు నతఁడే. అతఁడే కాలము. వరుణుఁడును నతఁడే. అతఁడే బ్రహ్మ,

రుద్రుఁడు, ఇంద్రుఁడు మొదలగువారందఱు నని తెలియవలెను. ఓంకారము, భూర్భువస్స్వరాదులు, గాయత్రి, సంధ్యలు నతఁడే. భూమిని పర్వతములను ధరించు ననంతుఁ డతఁడే యని ప్రసిద్ధి నొందియున్నాఁడు. మెఱయువాఁడు, జ్వలించువాఁడు, వర్షించువాఁడు, వీచువాఁడు, రక్షించువాఁడు, గర్జించువాఁడు, వచ్చువాఁడు, తపించువాఁడు, దహించువాఁడును నతఁడే. లోకములను సృజించి పాలించి సంహరించుచు నుండు దేవుఁ డాయనయే. మఱియు లోకములో నుండు దురాత్ములగు రాక్షసులను బలాత్కారముగా నతఁడే దహించును.

దేవతలు రాక్షసులు పన్నగులు మొదలగువా రాతనిని జూడఁజాలరు. ఆయన కెవనియం దనుగ్రహము గలుగునో వాఁడే యాయనను జూడఁగలఁడు. తద్గతులు, తద్గతప్రాణులు, శుచియగు చిత్తము గలవారు, తత్పరాయణులు, జ్ఞానముచేఁ బాపములను వోలఁచుకొన్నవారును నీ లోకములోఁ బ్రవేశింపఁగలరు. కామము లేకుండఁ గర్మములు చేయువారును, క్రోధము లేనివారును, తమోగుణము లేనివారును, స్వయంప్రకాశమానులును నగు నిటువంటి పురుషశ్రేష్ఠులు మాత్రమే యీ లోకమును బొందఁజాలుదురు. మహాకాయుఁడగు నెవఁ డీలోకములోఁ బ్రవేశించునో యతఁడు హరితోఁగూడియుండును. ఇరువది యెనిమిదవ యుగము ప్రాప్తింపఁగా వైవస్వతమను వంశమువాఁడు వైష్ణవమూర్తి నావేశించి యీలోకములోఁ బ్రవేశింపఁగలఁడు. రావణా! ఇటుపైని నా వలన నీవు వినఁదగవు. లెమ్ము పొమ్ము నీకు మేలుగలుగును. నీ విష్టమైన గతిని బొందఁగలవు."

ఇట్లు చెప్పఁబడి యట్లే యని యతనిని బూజించి నమస్కరించి తన సైన్యమును గలిసికొని నిశ్శంకముగా లంకకుఁ బోయెను. నారదుఁడును సంతోషించుచు నీసంగతియంతయుఁ జూచి యతివేగముగా మేరుపర్వతమునకు వచ్చి యచ్చటిసభలోఁ బ్రవేశించెను. అందుఁ గూర్చుండియున్న బ్రహ్మకు నమస్కరించి కృతాంజలియై యాయన వినుచుండఁగా నీసంగతి యంతయు దేవతలతోఁ జెప్పెను. మిగులఁ బుణ్యాకరమగు నీకథ విని బ్రహ్మ గతాగతములు దెలిసినవాఁడు గనుక నారదుని గౌఁగిలించుకొని యిట్లనియె: "ఈరాక్షసుఁడు పూర్వము హిరణ్యకశిపుఁడై పుట్టెను. వరదానమువలన బలవంతుఁడగుటచే ననేకయోగములచే నవధ్యుఁడాయెను.

వాఁడొకప్పుడు సభలో నారాయణుని నిందింపఁగా నాయన నరసింహరూపము నవలంబించి వాఁడియగు తనగోళ్లతోఁ జీరిచంపెను. ఆరాక్షసునికి రక్తస్పర్శమువలన దివ్యదృష్టి గలిగినది. వాఁడు తన దివ్యదృష్టిచేతను మరలఁ దనకు రాక్షసజన్మము గలుగుననియు నపుడు తనకు మనుష్యునివలన మృతి గలుగుననియుఁ దెలిసికొనెను. నరసింహభగవానుఁడు తన తొడలపైని వైచుకొని గోళ్లతోఁ జీరుచుండఁగా క్షణమాత్రము దీనుఁడై చేతులు జోడించుకొని మెల్లఁగా భగవంతునితో నిట్లనియె: "పుటము వేసిన బంగారువంటి కేశాంతము గలవాఁడవును, మండుచుండు నగ్నివంటి కన్నులు గలవాఁడవును, వజ్రాయుధముతో సమానమైన నఖస్పర్శము గలవాఁడవును నగు నోదివ్యసింహమా! నీకు నమస్కారము. కైటభారీ! హరీ! దేవా! విష్ణూ! విపులవిక్రమా! భూతభవ్యేశా! శరణాగతవత్సలా! నన్ను రక్షింపుము. నీవు మనుష్యరూపమున నారాక్షసత్వమును బోఁగొట్టఁగా నేను త్వన్మయుఁడనై నీలోకమును బొందెదను. లోకనాథా! నావిషయమునఁ బ్రసన్నుఁడవు గమ్ము." ఇట్లని హిరణ్యకశిపుఁడు విన్నవించినతోడనే "యట్లే" యని విష్ణువు హంసయుక్తమును కింకిణీజాలమాలియు నగు విమానముపైఁ గూర్చుండి యంతర్ధానమాయెను.

ఆరాక్షసుఁడే మరల రాక్షసశరీరము నవలంబించియుండుటచే రాక్షసకృత్యములను జేయుచుండెను. మనుష్యత్వమునుబొంది లోకములను నాశముచేయుట కుద్యుక్తుఁడైనవానిని జంపఁగాఁ దరువాత శ్వేతద్వీపములోఁ బ్రవేశింపఁగలఁడు. అపుడు విష్ణుతేజస్సు గలుగును. బ్రహ్మవాది యగు సనత్కుమారుఁడు చెప్పినదంతయు నేనిచ్చటనుండియే దివ్యదృష్టిచేఁ గనిపెట్టితిని. మఱియుఁ బరమాత్ముఁడగు నాదేవునిసంగతియు నాకుఁ దెలిసియున్నది. నారదుఁడు చెప్పిన యీపుణ్యకథను మొదటినుండియు భక్తిశ్రద్ధాతాత్పర్యములతో విన్నవారును, జదివినవారును నుత్తమగతిని బొందుదురు. విష్ణుసంబంధమైన యుత్తమకథ సమస్తపాపములను బోఁగొట్టునదిగదా! అది విన్న వారిపాపములన్నియుఁ బటాపంచలై పోవును. మఱియు నట్టివారికి జాతిస్మరత్వము, బ్రాహ్మణత్వము, గొప్ప వంశములో జన్మము, సర్వజ్ఞత్వము మొదలగునవి గలుగును. ఇందు సందియము లేదు. బ్రహ్మదేవుఁ డట్లు విష్ణుమూర్తిని స్తుతించి దేవతల కనుజ్ఞ

యిచ్చి తనలోకమునకుఁబోయెను. తరువాత నారదుఁడు మేరువుపైని తిరు
గుచు నాయొద్దకు వచ్చెను. నేనతనిని యథావిధిగా నమస్కరించి పూజిం
చితిని. అతఁడు నాయందలి యనుగ్రహముచే నీకథ నాకుఁ జెప్పెను. నేను
నీసభకు వచ్చి పవిత్రుఁడనై మనోహరమగు నీ కథను భక్తితోఁ జెప్పితిని.
రామా! ఇందు నిమిత్తమై సుమా దురాత్ముఁడగు రావణుఁడు నీచేతను
జావు గోరి యెఱిఁగియే సీతాపహరణ మొనరించెను. నీవు శంఖచక్రగదా
ధరుండవగు శ్రీమన్నారాయణుఁడవు; శార్ఙ్గపద్మాద్యాయుధములను ధరిం
చువాఁడవు; సర్వదేవనమస్కృతుఁడవు; హృషీకేశుఁడవు; సర్వదేవతల
చేతను బూజింపఁబడువాఁడవు; పద్మనాభుఁడవు; మహాయోగివి; భక్తుల
కభయ మొసఁగువాఁడవు; రావణుని వధించునిమిత్తమై నీవు మనుష్య
శరీరము నవలంబించితివి. నీవుమాత్రము "నేను నారాయణుఁడను" అని
యెఱుఁగకున్నావా? మోహమును బొందకుము. నిన్ను నీవే తెలిసి
కొనుము. నీవు రహస్యములన్నింటికంటెను రహస్యమైనవాఁడవని పితా
మహుఁడన్నాఁడు. నీవు త్రిగుణుఁడవు, త్రివేదివి, త్రిధాముఁడవు, త్రిప
దాత్మకుఁడవు, త్రికాలకర్ముఁడవు, త్రైవిద్యుఁడవు, త్రిదశారిమర్దనుఁడవు,
పురాణములగు మూఁడుపాదన్యాసములచే మూఁడులోకములను నీవే
యాక్రమించితివి. నీవే యుపేంద్రుఁడవు. బలిని బంధించుకొఱకై యదితి
గర్భమున వామనుఁడవై పుట్టితివి. సనాతనుఁడవగు విష్ణుఁడవు నీవే.
ఇపుడు లోకముల ననుగ్రహించు తలంపుతో మానుషదేహము నవలం
బించి దేవతలకార్యమును సాధించితివి. పాపాత్ముఁడగు రావణుని పుత్ర
పౌత్రాదులతోఁ జంపితివి. అందువలన దేవతలు మొదలగువారు పర
మానందమునుబొందిరి. లోకమంతయు శాంతినిబొందినది. ఇదియంతయు
నీదయవలననే జరిగినది. సీత మహాలక్ష్మి, మహాభాగురాలు; నీనిమిత్తమై
భూలోకములో జనకునియింటఁ బుట్టినది. ఆరావణుఁడు లంకలో నుంచి
తల్లిని గౌరవించినట్లు గౌరవించెను. ఈకథ యిట్లు జరిగినది. ఇదంతయు
రామా! నీకీర్తియే. దీర్ఘజీవియగు నారదుఁ డీకథ నాకుఁ జెప్పెను. సన
త్కుమారుఁడు రావణునికిఁ జెప్పినది నారదుఁ డెఱిఁగెను. ఆతఁ డపుడే
సర్వమును వెల్లడిపఱిచెను. ఎవఁడు దీనిని శ్రాద్ధసమయమున బ్రాహ్మణుల
సన్నిధియందు వినిపించునో వాని పితృదేవతల కక్షయమై యతఁ డిచ్చిన

దండును" అని యిట్లు కుంభసంభవమహాముని చెప్పిన కథను విని రాజీవ లోచనుఁడగు రాముఁడు తమ్ములతోఁగూడ మిక్కిలి యాశ్చర్యమును బొందెను. సుగ్రీవాదులగు వానరులు, విభీషణుఁడు మొదలగు రాక్షసులును, మంత్రులతోఁ గూడినరాజులు, ఇంకను నచ్చటఁ గూడినవారు, బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, ధర్మాత్ములగు శూద్రులు మొదలగు వారందఱును వికసించిన కన్నులుగలిగి సంతోషముతోఁ గూడినవారైరి. మఱియు వారందఱును సంతోషించుచు రామునే చూచుచుండిరి. "రామా! వినఁదగినదంతయు వింటిమి. నిన్నుఁ జూచితిమి. నీతో మాటలాడితిమి. ఇఁక మేము వెళ్లుచున్నాము" అని చెప్పి వచ్చిన మునులందఱును శ్రీరామునిచే యథావిధిగాఁ బూజితులై వచ్చినత్రోవనే పోయిరి.

ప్రక్షిప్తసర్గములు సమాప్తము.

---

## 38-వ సర్గము

### జనకాదుల వీడుకోలు

శ్రీరాముఁ డిట్లు పౌరులయు జానపదులయుఁ గార్యములు విచారించుచు దినదినమును జక్కఁగాఁ గడపుచుండెను. తరువాతఁ గొన్నాళ్లకు మిథిలాపతి యగు జనకునిజూచి చేతులు జోడించుకొని యిట్లనియె: "మామా! నీవే మాకుఁ దగిన దిక్కు. నీచేత మేము పాలింపఁబడితిమి. ఉగ్రమగు నీతేజస్సుచేత నేను రావణుని జంపఁగలిగితిని. ఇక్ష్వాకువంశపువారికిని మైథిలవంశపువారికిని సర్వవిధములచేతను సంబంధకపురస్కృతములై ప్రీతులు నిరుపమానములై యున్నవి. కావున రత్నములను గైకొని మీపట్టణమునకు వెళ్లుదువుగాక. మాభరతుఁడు సహాయముగా నీవెంటవచ్చును" అనఁగానే "మంచిదే" యని రామునితో జనకుఁ డిట్లనియె: "రామా! నీదర్శనముచేతను, నీనయవినయములచేతను నేను జాల సంతసించితిని. నానిమిత్తమై నీవెన్ని రత్నములను సంపాదించి యిచ్చెదవో, అవియన్నియు నాకుమారిత కిచ్చెదను" అని శ్రీరామునితోఁ జెప్పి జనకుఁడు సంతుష్టాంతరంగుఁడై రామునిచే ననుజ్ఞాతుఁడై మిథిలకుఁబోయెను. జనకుఁడు వెళ్లినతరువాత మేనమామ యగు కేకయునిజూచి చేతులు జోడించుకొని యిట్లనియె: "మామా! ఈరాజ్యము, ఈనేను, మాభరత

లక్ష్మణశత్రుఘ్నులు నీయధీనులము. నీవే మాకు దిక్కు. నీనిమిత్తమై యిదివఱకే తాతగారు చాల చింతించుచుందురు. కావున నేఁడే యూరికిఁ బ్రయాణమేర్పఱచినచోఁ జాలఁ బాగుగా నుండును. మాలక్ష్మణుఁడు సహాయార్థము వెంటవచ్చును. కావలసినంతధనము, రత్నములు తీసికొని వెళ్లవలయును" అను రామునిమాటలు విని "మంచిదే" యని యుధాజిత్తు ప్రయాణమున కిష్టపడి "నీవిచ్చురత్నములు ధనము నీకే యక్షయమగుచునుండుఁగాక!" యని రాముఁడు ముందుగాఁ దనకుఁ బ్రదక్షిణనమస్కారములు చేసినవెనుకఁ దాను రామునకుఁ బ్రదక్షిణముచేసి లక్ష్మణుఁడు వెంటవచ్చుచుండఁగా, వృత్రాసురుఁడు హతుఁడైనపిమ్మట విష్ణునితో నింద్రుఁడు వెళ్లినట్లు వెళ్లెను.

అట్లు యుధాజిత్తును బంపించి తరువాత శ్రీరాముఁడు స్నేహితుఁడును, నెందును భయములేనివాఁడును, కాశీపతియును నగు ప్రతర్దనుని గౌఁగిలించుకొని యిట్లనియె: "నీవు మాయందుఁగల ప్రీతిని జూపించితివి. మఱియు స్నేహమును జూపించితివి. రాజా! భరతునిచేతను నీతోఁగూడ సద్యమము చేయఁబడినది. కావునఁ గాశీరాజా! నీవిపుడు అతి రమణీయమైనదియు, నీచే రక్షింపఁబడినదియు, మంచిప్రకాశముగలదియు, మంచి తోరణములుగలదియు నగు వారాణసీపట్టణమునుగూర్చి వెళ్లుము" అని యిట్లు చెప్పి శ్రీరాముఁడు సింహాసనమునుండి లేచి యతనిని గాఢముగాఁ గౌఁగిలించుకొని యాకౌసల్యానందవర్ధనుఁడగు రాముఁ డతనిని వీడుకొలిపి శ్రీరామునియొద్ద ననుజ్ఞాతుఁడైన కాశీశుఁడును నెందును భయములేనివాఁడై శీఘ్రముగాఁ గాశికిఁ బోయెను. ఇట్లు కాశీపతిని పంపించి తరువాత మున్నూఱుమందిరాజులను జూచి నవ్వుచు నిట్లనియె: "తేజస్సుచే రక్షింపఁబడిన మీప్రీతి నిరుపమానమైనది. మీసత్యము ధర్మము నియతమైనదియు నిత్యమైనదియునై యొప్పుచుండును. మహాత్ములరగు మీయనుభావముచేతను తేజస్సుచేతను దురాత్ముఁడును దుర్బుద్ధియు నగు రావణుఁడు రాక్షసాధముఁడు చంపఁబడెను. కారణమాత్రమే నేను గాని మీతేజస్సుచేతనే వాఁడు హతుఁడాయెను. వాఁడేకాక వానిపుత్రపౌత్రాదులుగూడ హతులైరి. అడవిలోనుండఁగా రావణుఁడు జనకరాజపుత్రికను హరించెనని విని మహాత్ముఁడగు మాభరతుఁడు మిమ్ములను రప్పించెను. మీరందఱును యుద్ధోద్యుక్తులై వచ్చి చాలఁగాలమయ్యినది.

ఇక మీరు మీగృహములకేగుట నాయిష్ట”మను రామునితో వా రిట్లనిరి: “రామా! దైవవశమున జయమును బొంది స్వరాజ్యమునఁ బ్రతిష్ఠితుఁడవైతివి. సీతను దెచ్చితివి. శత్రువులను జంపితివి. ఇదియే మా గొప్పకోరిక. ఇదియే మాయుత్తమమైనప్రీతి. శత్రువులను జంపి జయమును బొందియున్న నిన్నుఁజూచుటయే మాకుఁ గావలసినది. నీవు మమ్ములను బ్రశంసించితివి. అది నీయం దుచితముగానే యున్నది. నీవు ప్రశంసింపఁదగినవాఁడవు కాని నిన్నెట్లు ప్రశంసింపవలయునో మేమెఱుఁగము. నీచే ననుజ్ఞాతులమై మా మాపట్టణములకుఁ బోయెదము. నిన్నెపుడును మాహృదయములయందే యుంచుకొనియెదము. మహాబాహూ! మేమందఱమును నిచట బహుసంతోషముగా నుంటిమి. నిత్యమును నీకు మాయందుఁ బ్రేమ యుండవలయు ననుటకంటె వేఱుకోరిక గలవారము కాము.” తరువాత రాజులందఱును గమనోన్ముఖులై చేతులు జోడించుకొని సంతోషించుచు సెలవు పుచ్చుకొని రామునిచేఁ బూజితులై తమతమదేశములకుఁ బోయిరి.

## 39-వ సర్గము

### రాముఁడు వానరులను గౌరవించుట

ఇట్లా రాజులందఱును సంతోషించుచు వేలకొలఁది గుఱ్ఱముల చేతను, ఏనుఁగులచేతను, రథములచేతను భూమిని కంపింపఁజేయుచు బయలుదేఱిరి. రామునికి సాయముచేయుదమను కోరికతో భరతుని యాజ్ఞాప్రకారముగా ననేకములగు నక్షౌహిణులు వచ్చియున్నవి. బలదర్పసమన్వితులగు నారాజులందఱును నిట్లనిరి: “రామునికి శత్రువగు రావణుని యుద్ధమునందు నెదుటనుండఁగాఁ జూడమైతిమి. వ్యర్థముగా నంతయు ముగిసినవెనుక భరతుఁడు మనలను రావించెను. మనము ముందుగానే వచ్చినచో రాక్షసులను మనమే చంపుదుము. రామలక్ష్మణులచే రక్షింపఁబడుచు సముద్రము నవతల సుఖముగా యుద్ధము చేయుదుము” ఇట్లు వేలకొలఁదిరాజులివియు మఱికొన్నియునగు కథలు చెప్పుకొనుచు సంతోషపూర్వకముగాఁ దమతమరాజ్యములనుగూర్చి పోయిరి. ముఖ్యములు, సంపన్నములు, ముదితములు, సమృద్ధధనధాన్యములు, పూర్ణములు, వసుమంతములు నగు తమతమరాజ్యములలోఁ బ్రవేశించి వివిధ

ములగు రత్నములు మొదలగునవి శ్రీరామునకుఁ గానుకగాఁ బంపిరి. మఱియు వస్త్రములను, మదపుటేనుఁగులను, ముఖ్యములగు చందనము లను, దివ్యములగు నాభరణములను, మణులు, ముత్యములు, పగడ ములు, దాసీజనము, అజావికము, రథములు మొదలగువానిని కాను కగా సమర్పించిరి. ఆవియన్నియుఁ గైకొని భరతుఁడు లక్ష్మణుఁడు శత్రు ఘ్నుఁడు తమపట్టణములోఁ బ్రవేశించిరి. ఇట్లు రమ్యమగు నయోధ్యలోఁ బ్రవేశించి తాము తెచ్చినవన్నియు శ్రీరామునిసన్నిధిలో సమర్పించిరి. తమ్ములు తెచ్చియిచ్చినవాని నన్నింటినిఁ గైకొని రాముఁడు సంతోషిం చుచుఁ దనకు జయముఁ గలుగుటకుఁ గారణభూతులగు సుగ్రీవాదివానరు లకును, విభీషణాదిరాక్షసులకును గానుకగా నొసఁగెను. మహాబలులగు వానరరాక్షసు లవి పుచ్చుకొని సంతోషపూర్వకముగా ధరించిరి. అప్పు డిక్ష్వాకుకులధురంధరుఁడగు రాముఁడు హనుమంతుని, అంగదుని తొడ లపైఁ గూర్చుండఁబెట్టుకొని సుగ్రీవునితో నిట్లనియె:

“సుగ్రీవా! అంగదుఁడు నీకుఁ గుమారుఁడు. హనుమంతుఁడు నీ మంత్రి. వీరు నీహితమును గోరుచుండువారు; నాకును మేలుచేయు నాసక్తిగలవారు. నిన్నుఁబట్టి వీ రెట్టిగౌరవమునకేని దగినవారు” అని చెప్పి మహాయశుండగు రాముఁడు తనదేహమునుండి నగలుతీసి యంగదునకును హనుమంతునకును దానే యలంకరించెను. తరువాత మహావీరస్యులు, యూథపతులలో శ్రేష్ఠులునగు నీలుఁడు, నలుఁడు, కేసరి, కుముదుఁడు, గంధమాదనుఁడు, సుషేణుఁడు, పనసుఁడు, వీరుఁడు, మైందుఁడు, ద్వివి దుఁడు, జాంబవంతుఁడు, గవాక్షుఁడు, వినతుఁడు, ధూమ్రుఁడు, వలీ ముఖుఁడు, ప్రజంఘుఁడు, సంనాదుఁడు, సంవాదుఁడు, దరీముఖుఁడు, దధి ముఖుఁడు, ఇంద్రజానుఁడు మొదలగువారిని ప్రేమపూర్వకముగాఁ జూచి రాముఁ డిట్లనియె: “వానరశ్రేష్ఠులారా! మీరందఱును స్నేహితులు, మీరే నాశరీరము. మీరు నాసోదరులు. మీరు నన్నట్టి చిక్కులలో నుండి యుద్ధరించితిరి. మీవంటిస్నేహితులు గలిగియుండుటచే సుగ్రీ వుఁడు ధన్యుఁడు” అని చెప్పి వారికందఱకును యథోచితముగా భూషణ ములు వస్త్రములు మొదలగునవియిచ్చి కౌఁగిలించుకొనెను. ఇట్లు వానరు లందఱును రామునిచే గౌరవింపఁబడి యిచ్చకు వచ్చినమచ్చున మంచి మంచి తేనెలు ద్రావుచు, మాంసములు దుంపలు పండ్లు దినుచు, నొక

మాసముదినములు నిమిషమాత్రముగాఁ గడపిరి. కామరూపులగు నా వానరులతోఁగూడి శ్రీరాముఁడును వినోదించుచుండెను. మఱియు వీర్యశాలులగు రాక్షసులు, మహాబలు లగు ఋక్షవరులును శ్రీరాముని సంతోషింపఁజేసిరి. ఇట్లు వారి కచ్చటనే చల్లఁగా రెండవనెలకూడఁ గడచినది. వానరులు రాక్షసులు నయోధ్యలో సర్వవిధములచేతను సంతోషించుచు రామునికి సంతోషమును గలిగించుచుఁ గాలము తెలియకుండ నుండిరి.

## 40-వ సర్గము

### వానరరాక్షసుల వీడుకోలు

ఈరీతిగా ఋక్షవానరరాక్షసు లుండఁగా మహాతేజుం డగు రాముఁడు సుగ్రీవునితో నిట్లనియె: "సౌమ్యా! సురాసురులచే దురాధర్షమగు కిష్కింధకుఁ బొమ్ము. మంత్రులతోఁగూడి నిహతకంటక మగు రాజ్యమును బాలించుము. అంగదుని పరమప్రీతితోఁ జూచుకొమ్ము. హనుమంతుని, మహాబలుఁ డగు నలుని, మామగారగు సుషేణుని, వీరుఁ డగు తారుని, బలవంతుఁడగు కుముదుని, దుర్ధర్షుఁడగు నీలుని, మహాబలుఁ డగు శతబలిని, మైందద్వివిదులను, గజుని, గవయుని,గవాక్షుని,శరభుని, గంధమాదనుని, ఋషభుని, సువిక్రాంతుఁడగు జాంబవంతుని, మఱియు నానిమిత్తమై కష్టపడిన మహాత్ములగు నితరవానరులను, నీవు సదాప్రేమతోఁ జూచుచుండుము; వారికెప్పుడును నప్రియము చేయకుము. వీరెల్లను నాకోసము జీవితమును త్యజింప సిద్ధపడినవారు" అని చెప్పి మాటిమాటికిని సుగ్రీవుని కౌఁగిలించుకొని రాముఁడు తీయనిమాటలతో విభీషణుని జూచి యిట్లనియె: "విభీషణా! నీవు ధర్మముగా లంకను బాలించుము. నీవు ధర్మువు తెలిసినవాఁడవని నేనెఱుఁగుదును. పురమును, రాక్షసులను, అన్నయగు వైశ్రవణుని ధర్మబుద్ధిఁ జూచుచుండుము. రాజా! నీ వెప్పుడును ధర్మము దప్పి నడవకుము. బుద్ధిమంతులగు రాజులు శాశ్వతముగా భూమి ననుభవించుచుందురు. విభీషణా! నీవును సుగ్రీవుఁడును నిత్యమును నన్నుఁ దలంచుచుందురుగాక. నాయందుఁ బ్రేమ యుంచి విచారింపక సంతోషపూర్వకముగా లంకకుఁ బొమ్ము" అని చెప్పిన యా రాముని మాటలు విని ఋక్షవానరరాక్షసులు మాటిమాటికిని రాముని సాధు

పాదములచేఁ బ్రశంసించిరి. "రామా! నీయుక్తియు, పరాక్రమము సత్య విఖ్యాతమైనవి. స్వయంభువునకువలెనే నిత్యమును నీకు మాహాత్మ్యము మిక్కిలిగాఁ గలదు." అని యిట్లు వానరులు రాక్షసులు పలుకుచుండఁగా హనుమంతుఁడు వినయముగా రామునితో నిట్లనెను: "రాజా! నా స్నేహము నిత్యమును నీయందుండునుగాక. నీయందే తప్పఁ దక్కినచో ట్లను నాకు భక్తి యుండకుండునుగాక! ఈభూతలమునందు నీకథ యెంత వఱకుండునో అంతవఱకును నాశరీరమునందుఁ బ్రాణము లుండునుగాక! రఘునందనా! నీదివ్యచరిత్రమును, నీకథలను నాకప్సరలు నిత్యమును వినిపించుచుండుదురుగాక! మహావీరా! అది విని వాయువు మేఘమాలను వలె నీయందలి యుత్కంఠను బోఁగొట్టుకొందునుగాక" అని యిట్లు చెప్పుచున్న హనుమంతునిఁజూచి రాముఁడు సింహాసనమునుండి దిగి స్నేహము మితిమీఱ హనుమంతుని గౌఁగిలించుకొని యిట్లనియె: "కపిశ్రేష్ఠా! నీవిపు డన్నట్లే యంతయుఁ దప్పక జరుగును. నీవన్నట్లు నాకథ భూలోకమునం దున్నంతవఱకు నీకీర్తియుఁ బ్రాణములును స్థిరముగా నుండును. లోకము లున్నంతవఱకును నాకథ తప్పక యుండును. కపివరా! నీవు నా విషయమై చేసిన యొక్కొక్క యుపకారమునకు నీకుఁ బ్రాణముల నర్పించెదను. నరుఁడు ప్రత్యుపకారముల కాపదలు వచ్చినపుడు పాత్రమగుచుండును" అని చెప్పి వెంటనే చంద్రకాంతిం దిరస్కరించు ముక్తాహారమును దీసి హనుమంతునికంఠమునందు వైచెను. ఆ హారము వక్షస్థలముపై వెలుఁగుచుండఁగా హనుమంతుఁడు చంద్రునిచే నాక్రమింపఁబడిన మేరుపర్వతశిఖరము ననుకరించియుండెను. ఇట్లు రాముఁడు చెప్పిన మాటలు విని వానరులందఱును లేచి రామునిపాదములకు నమస్కరించి తొలఁగిరి. రాముఁ డపుడు సుగ్రీవుని విభీషణుని గౌఁగిలించుకొనెను. అందఱును గన్నుల నీరు విడిచిరి. అందఱును రాముని విడువవలసివచ్చినందులకై విచారము నొందిరి. మఱియు నందఱును రోదన మారంభించిరి. అందఱును రాముఁ డోదార్చి పంపెను. జీవుఁడు దేహమును విడువఁజాలక విడిచినట్లు రాముని విడిచి తమతమదేశములకు బయలుదేఱిరి. తరువాత రాక్షసఋక్షవానరులు రఘువంశవర్ధనుఁడగు రామునికి నమస్కరించి రామవియోగమువలనఁ గలిగిన కన్నీటితో నిండిన నేత్రములు గలవారై తమతమనివాసములకుఁ బ్రయాణము చేసిరి.

## 41-వ సర్గము

### పుష్పకము వచ్చుట

మహాబాహుండగు రాముఁ డిట్లు ఋక్షవానరరాక్షసులను బంపి తమ్ములతోఁగూడి సుఖియై సుఖముగా సంతోషించుచుండెను. తరువాత రాముఁ డపరాహ్ణసమయమునఁ దమ్ములతోఁగూడ నంతరిక్షమునుండి పలుకఁబడిన మధురమగు వాక్యమును వినెను: "సౌమ్యా! రామా! సౌమ్యమగు మొగముతో నన్నుఁజూడుము. నేను బుష్పకమను విమానమును. కుబేరునియొద్దనుండి వచ్చితిని. నీయాజ్ఞను శిరసావహించి కుబేరునియొద్దకుఁ బోతిని. నన్నుఁజూచి యతఁ డిట్లనియె: 'ఓవిమానమా! మహాత్ముఁడును రాజేంద్రుఁడును నగు శ్రీరాముఁడు యుద్ధములో రాక్షసరాజగు రావణుని జంపి నిన్నుఁ గైకొనెను. ఆరావణుఁడు పుత్రపౌత్రసమేతముగాఁ జచ్చుట నాకెంతయు సంతోషకరము. పరమాత్మస్వరూపుఁడగు రాముఁడు నిన్ను లంకలో జయించి తెచ్చుకొన్నవాఁడు గావున నీవామహాసుభావునినే మోయుచుండుము. నేను నీకాజ్ఞాపించుచున్నాను. నాకిదియే ముఖ్యమైన కోరిక. కావున నిర్విచారముగాఁబోయి యాయనకు వాహనమవై యుండుము' అని చెప్పిన కుబేరుని యాజ్ఞాప్రకారము నీయొద్దకు వచ్చితిని. కావున నిరనుమానముగా రామా! నన్నంగీకరింపుము. కుబేరునియాజ్ఞవలన సర్వభూతములకును గనుపడకుండ నీ యాజ్ఞను బరిపాలించుచుఁ దిరుగుచుండెదను" అని యిట్లు పుష్పకవిమానము విన్నవించినతోడనే తిరిగివచ్చిన యావిమానమును జూచి రాముఁ డిట్లనియె: "విమానవరమా! పుష్పకమా! అట్లేని నీకు స్వాగతము. కుబేరుఁ డంగీకరించెనని చెప్పితివి గనుక నీక నాయం దేవిధమైనదోషమును నుండదు" అని చెప్పి లాజలు పుష్పములు మొదలగువానిచేఁ బూజించి పరిమళించుధూపములు వేసి "యిచ్చటకు వచ్చినచోటికిఁ బోయి నేను స్మరించినతోడనే నాయొద్దకు వచ్చుచుండు"మని విమానమున కాజ్ఞాపించి మరల నిట్లనియె: "ఓవిమానమా! సిద్ధులగతికి భంగము కలుగఁజేసి వారికి దుఃఖమును గలిగింపకుము. యథేష్టముగాఁ దిరుగుచుండు నీకెందును బ్రతిఘాతము కలుగకుండునుగాక" అనఁగానే యావిమాన"మట్లే"యని రామునిచేఁ బూజింపఁబడి విడువఁబడినదై తన

యిష్టము వచ్చిన చోటికి పోయెను. పుష్పకము పోయిన పిదప భరతుడు స్వేచ్ఛగా నంతర్హితమును బొందిన పిమ్మట భరతుడు చేతులు జోడించుకొని రామునితో నిట్లనియె: "అన్నా! మహావీరా! నాన్నాళ్ళుగా పుణ్యపురుష నగు నీవు పరిపాలించుచుండగా నమానుషములగు సత్త్వముల మాటలు మాటిమాటికి వినబడుచున్నవి. మనుష్యులకు రోగభయము లేదు. ఇప్పటి కొక్కనెల గడచినది. వృద్ధులను జంతువులైనను మృత్యువువలని భయము లేదు. స్త్రీలు సుఖప్రసవము గలవా రయిరి. మానవులెల్లరును సంపుష్టాంగులయిరి. పురవాసులందరు నెక్కుడు సంతోషము గలుగుచున్నది. కాలము తప్పకుండ మేఘుడు వర్షించుచున్నాడు. వత్సా! అమృతమును పోలి వీచుచున్నది. వాయువులు పుష్పఫలములును, సుఖకరములును, హితములును నై వీచుచున్నవి. పౌరులు, జానపదులు తమకుగా నిట్టిరాజే మాకెప్పుడును నుండునుగాక యని మాటిమాటికిని జెప్పుచున్నారు" అని యిట్లు సుఘోషముగా జెప్పిన భరతుని మాటలు విని రాముడు యత్యంతసంతోషమును బొందెను.

## 42వ సర్గము

### సీతారాముల వనవిహారము

తరువాత రాముడు హేమభూషితమగు పుష్పకవిమానమును విడిచి యపు డశోకవనములోఁ బ్రవేశించెను. ఆవనము చందనవృక్షములు, అగురువృక్షములు, మామిడివృక్షములు, ఉన్నతములగు కాలేయకములు, దేవదారువనములు మొదలగువానిచే సంతతము శోభితమై యున్నది. మఱియుఁ జంపకములు, అశోకములు, పున్నాగములు, ఇప్పలు, పనసములు, అసనములు, పొగలేని యగ్నివలెఁ బ్రకాశించు పారిజాతములు, లోధ్రములు, నీపములు, అర్జునములు, నాగములు, సప్తపర్ణములు, అతిముక్తకములు, మందారములు, కదళులు, పొదరులు, లతాజాలములు, ప్రియంగువులు, కదంబములు, వకుళములు, జంబూవృక్షములు, దాడిమములు, కోవిదారములు మొదలగు వృక్షములచే నెంతయు వింతసంతసమును గలిగించుచుండెను. సర్వకాలసర్వావస్థలయందును రమ్యములగు పుష్పములచేత మనోహరములగునవియు, ఫలవంతములును, దివ్యగంధరసోపేతములును, తరుణాంకురపల్లవములును, శిల్పులచేఁ గల్పితము

లును, నత్యంతము సొగసైన పల్లవములు పుష్పములు గలిగి మదించిన తుమ్మెదలచే నొప్పుచునుండు నానావిధములైన వృక్షములచేతను కోకిలములు భృంగరాజములు నానావర్ణములుగు పక్షులు మొదలగువానిచే నొప్పారుచుండునదియు, దంతలకోలంది చిత్రములు గలదియు నైయావనము ప్రకాశించుచుండెను. మఱియు నందు బంగారువన్నె గలవియు, నగ్నిశిఖవంటి కాంతిగలవియు నీలాంజనసమానములు నగు వృక్షములు గలవు. ప్రతివృక్షమునందును పరిమళించు పుష్పములు గలవు. అనేక విధములైన మడుగులు తీయని నీటితో నిండారియుండెను. ఆదీర్ఘికలకు మాణిక్యములచే సోపానము లేర్పఱుపఁబడియున్నవి. అచ్చటచ్చట స్ఫటికపురాళ్లచేఁ గట్టఁబడిన యరుగులు గలవు. ఆదీర్ఘికాజలములో వికసించిన పద్మములున్నవి. చక్రవాళదంపతులు నిండియుండెను. మఱియు దాత్యూహములు చిలుకలు ఘోషించుచుండెను. హంసలు సారసపక్షులు ధ్వని చేయుచుండును. వానితీరములయందు పూచినచెట్లు గలవు. వివిధాకారములగు ప్రాకారములును వైడూర్యమణులతోఁ గట్టిన తిన్నెలును గలవు. వేయేల! ఆయుద్యానము దేవేంద్రుని నందనవనమును, కుబేరుని చైత్రరథమును మించియున్నది. రామునియుద్యానముగదా! అది. ఎటులుండిన దన్నను నాశ్చర్యమేమియుండును? బహ్వాసనములు గల గృహములతో నొప్పుచు లతాగృహములతో నిండి సర్వసమృద్ధమైన యాయశోకవనములోఁ బ్రవేశించి శ్రీరాముఁడు పుష్పవిభూషితమై శుభాకారమయిన యాసనమునందుఁ గూర్చుండెను. ప్రక్కనే సీతాదేవిని చేయిపట్టుకొని కూర్చుండఁబెట్టుకొనెను. ఆమెచే శుచియగు మైరేయకమను మద్యమును శచిచే నింద్రుఁ డమృతమును త్రాగించినట్లు త్రాగించెను. బాగుగా వండఁబడిన మాంసములు వివిధములైన ఫలములు తెచ్చి కింకరులు సీతారాములసన్నిధి నుంచిరి. నృత్తగీతవిశారదలగు బాలికలు రూపవతులగు యువతులు త్రాగి యొడలుమఱచి రామునిసన్నిధి నాడుచుండిరి. ఇట్లు రాముఁడు నిత్యమును భూషితుఁడై మనోభిరామలగు నారామలను సంతోషింపఁజేయుచుండెను. శ్రీరాముఁడు తేజోవంతుఁడై యరుంధతితోఁగూడిన వసిష్ఠమహామునివలె సీతాదేవితోఁ గూర్చుండి యొప్పారుచుండెను. సురసుతోపమయగు సీతను బ్రతిదినమును రాముఁడు సంతోషపూర్వకముగా రమింపఁజేయుచుండెను. ఈప్రకారముగా నాయశోక

సమన్వితములైన యనేకకథలు చెప్పుచుండిరి. తరువాత రాముఁ డొకా నొకకథ చెప్పుచుండఁగా నిట్లనియె: "భద్రా! పట్టణమందును పల్లెలయం దును నావిషయమై యేమిచెప్పుకొనుచున్నారు? సీతనుగుఱించి యేమి యనుకొనుచున్నారు? భరతుని, లక్ష్మణుని, శత్రుఘ్నుని, కైకేయిని, మా యమ్మను, సుమిత్రను నుద్దేశించి యేమేమి చెప్పుకొనుచుందురు? శ్రేష్ఠ మగు రాజ్యమందలి రాజులు ప్రశస్యతను బొందుచునే యుందురుగదా!" అని రాముఁ డడుగఁగా, భద్రుఁ డనువాఁడు చేతులు జోడించుకొని యిట్లనియె: "దేవా! పురవాసులు చెప్పుకొనుకథ లనేకములున్నవి. అవి యన్నియు మంచివే. రావణునిజంపి సంపాదించిన జయమునుగూర్చి మన పట్టణమం దనేకవిధములుగాఁ బౌరులు చెప్పుకొనుచున్నారు" అని భద్రుఁ డనఁగానే, రాముఁ డిట్లనియె: "భద్రా! ఉన్నది యున్నట్లు సర్వ మును జెప్పుము. మంచిమాటలుగాని చెడ్డమాటలుగాని దాచక చెప్పుము. అవి విని యిటుపైని మంచిపనులు చేయుచుఁ జెడుపనులు మాను కొందును. నీమనసులో సుంతయు భయపడక విన్నవి విన్నయట్లు చెప్పుము. అందఱును పుణ్యాత్ములే యుండరు. జనపదములయందుఁ బాపాత్ములును నుందురు" అని రాముఁడు నొక్కియడుగఁగా, వాఁడు సావధానముగాఁ జేతులు జోడించుకొని యిట్లనియె: "రాజేంద్రా! ఆటు లేని వినుము. చత్వరములయందును, ఆపణములయందును, రథ్యల యందును, వనములయందును, ఉపవనములయందును పౌరులు చెప్పు కొనుచుండునవి యేమనఁగా:—"రాముఁడు దుష్కరమైన కార్యములు చేసెను. దేవదానవులకుఁగూడ దుష్కరమైన సేతువును సముద్రములోఁ గట్టించెను. ఇదివఱకు విన్నదియుఁ గన్నదియుఁ గాదు. దురాధర్షుఁడగు రావణుని పుత్రపౌత్రాదులతోఁ జంపెను! ఋక్షవానరరాక్షసులను స్వాధీనము చేసికొన్నాఁడు. రావణుని యుద్ధములోఁ జంపి తనపౌరుష మును వెనుకనుంచుకొని సీతను దోడ్కొని మరల నింటికి వచ్చినాఁడు. రామునిహృదయములో సీతాసంభోగమువలనఁ గలిగిన సుఖమెట్టిదో తెలియదుగాని, పూర్వము రావణుఁడు బలాత్కారముగాఁ దనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని లంకకుఁ దీసికొనిపోయి యశోకవనములో నుంచిన సీతను మరలఁ దెచ్చుకొన్నాఁడు. రామునకు మంచి చెడ్డ తెలియకపోయి నవి. ఇటుపైని మాభార్యలవిషయమున నేమిజరిగినను మేముగూడ

సహింపక [illegible]గదా! ఏమన? [illegible] ప్రజల [illegible]! [illegible] వలసి[illegible]" అని [illegible] [illegible] చెప్పు కొనుచున్నారు. ఎక్కడజూచినను జనులు [illegible] [illegible]మాటలే చెప్పుకొనుచున్నారు" అని చెప్పిన భద్రుని మాటలు విని, రాముడు మిక్కిలి [illegible] [illegible] విచారించుచు మిత్రులనందఱను జూచి [illegible] [illegible] నాకు జెప్పుడన, వారందఱును [illegible] [illegible] [illegible] [illegible] చేసి దీనముగా "అవును. [illegible]" అనిరి. అందఱును [illegible] చెప్పినమాటలు విని శత్రుసూదనుడగు రాముడు [illegible] [illegible] వారివారి యిండ్లకు బోవ సెలవొసగెను.

## 44వ సర్గము

### రాముడు తమ్ముల రావించుట

ఇట్లు శ్రీరాముడు మిత్రవర్గమును బంపించి దగ్గఱనున్న ద్వారపాల కుని జూచి "శీఘ్రముగా సౌమిత్రిని, లక్ష్మణుని దోడితెమ్ము. సుశీలుడు భరతుడు, శత్రుఘ్నుడు రావలెను" అను రాముని మాటలు శిరసా వహించి చేతులు జోడించుకొని నిర్విఘ్నంతరముగా లక్ష్మణుని యింటికి బోయి "శీఘ్రముగా రాజు నిన్నుం జూడగోరుచున్నాడ"డనెను. లక్ష్మ ణుడు రాముని యాజ్ఞను విని మంచిదే యని రథమెక్కి యతివేగముగా నన్నయొద్దకు వచ్చెను. లక్ష్మణుడు బయలుదేఱగానే ద్వారపాలుడు భరతునింజూచి నమస్కరించి యన్న యాజ్ఞను వినిపించెను. భరతుడన్న శాసనమును విని వెంటనే యాసనమునుండిదిగి కాలినడకనే యన్న వద్దకు బయలుదేఱెను. భరతుడు బయలుదేఱగానే ద్వారపాలుడు వేగ ముగా శత్రుఘ్నునియింటికింబోయి యాతనితోడ నిట్లనియె: "రఘుశ్రేష్ఠా! లెమ్ము రమ్ము. రాజు నిన్నుంజూడఁగోరెను. ఇదివఱకే లక్ష్మణుడును భరతుఁ డును వెళ్లియున్నారు" అని చెప్పఁగానే, శత్రుఘ్నుఁ డాసనము విడిచి యచ్చటనే నమస్కరించి యన్నయున్న చోటికిఁ బయనమాయెను. ద్వార పాలుడు రామునిసమీపించి ముగ్గురును వచ్చియున్నారని మనవి చేసెను. తమ్ములరాక విని రాముడు చింతాకులితమనస్కుఁడై శిరస్సువంచుకొని దీనమైన మనస్సుగలవాఁడై ద్వారపాలునితో నిట్లనియె: "నీవు శీఘ్ర ముగాఁ దమ్ములను లోపలకు రమ్మనుము. నా ప్రాణములు, జీవనము వీరియం

వచ్చిరి" అనఁగానే, ద్వారపాలుఁడు లక్ష్మణాదులను లోపలకుఁ బ్రవేశింపఁజేసెను. ఇట్లు రాజాజ్ఞాపించినతోడనే శుభ్రవస్త్రధారులగువారు ముగ్గురును వినయముతోఁ జేతులు జోడించుకొని సావధానముగా దగ్గఱకు వచ్చిరి. వచ్చి వారు రాముని ముఖము రాహుగ్రస్తమగు చంద్రునివలెను, సంధ్యాగతుఁడగు సూర్యునివలెను కాంతిహీనమై యగపడెను. ధీమంతుఁడగు రాముని ముఖము కన్నులనుండి నీరు వచ్చుచున్న కారణమున మంచుతోఁ గప్పిన పద్మమువలె శోభాహీనముగాఁ గన్పట్టినది. అప్పుడు వారు ముగ్గురును త్వరితముగా రాముని పాదములకు నమస్కరించి భక్తిని నిలువఁబడిరి. రాముఁడు కన్నులనీరు గార్చుచుఁ దమ్ములను గౌఁగిలించుకొని యెత్తి యాసనములయందుఁ గూర్చుండుఁడని నియోగించి యిట్లనియె: "తమ్ములారా! మీరు నాసర్వస్వము. మీరు నా ప్రాణము. మీచేతను నీయఁబడిన రాజ్యమును నేను పాలించుచున్నాను. మీరు శాస్త్రములన్నియుఁ జదువుకొంటిరి. బుద్ధిమంతులరు. ఇప్పుడు మీరందఱును గలిసి నాకొక కార్యము సంపాదింపవలసియున్నది" అని రాముఁడు చెప్పఁగా, సావధానమనస్కులయ్యును నొగిలిన చిత్తములుగలవారై "రాజేమని చెప్పఁబోవునో" అనుకొనిరి.

## 45-వ సర్గము

**సీత నడవిలో విడువ్రమనుట**

ఇట్లు వారు ముగ్గురును దీనచిత్తులై కూర్చున్న పిదప రాముఁడు నోరెండిపోవుచుండఁగా నిట్లనియె: "మీరందఱును వినుఁడు. మీరు మేలగుఁగాక. మనస్సన్యథాగా నుంచకుఁడు. సీతవిషయమై నాకుఁ బౌరులవలనను జానపదులవలనను గలిగిన యపవాదము సహింపరానిది. అది మిగుల నసహ్యకరమై మర్మములను గోయుచున్నది. నేను మహాత్ములగు నిక్ష్వాకువంశమువారి కులమునఁ బుట్టితిని. సీతయు మహాత్ములగు జనకవంశపువారి సత్కులమునఁ బుట్టినది. మేము దండకలో నుండఁగా రావణుఁడు మేము లేనిసమయము చూచి సీత నపహరించెనుగదా! వానిని నేను జంపితిని. తరువాత 'నే నీసీతను మరల నెట్లుకైకొని పట్టణములోనికి దీసికొని రావచ్చును' అని నాకప్పుటనే బుద్ధియందుఁ దోఁచినది నమ్మికతోడుకై సీత యగ్నిలోఁ బ్రవేశించినది. లక్ష్మణా! యిదియంతయు

నీకుఁ బ్రత్యక్షమైనసంగతియేకదా! దేవతలు, అగ్నిదేవుఁడు, ఆకాశగోచ
రుఁడై వాయుదేవుఁడు 'సీత నిర్దోషురాలు' అనిచెప్పిరి. దేవతలన్నిటిలోఁ
జంద్రసూర్యులు, ఋషులు మొదలగువారు 'సీత నిర్దోషురాలు' అని
చెప్పిరి. ఈరీతిగా సీతను శుద్ధసమాచారముగాఁ జెప్పినపిదప మహేం
ద్రుఁడు లంకాద్వీపములో సీతను నాచేతి కప్పగించెను. సీత పరిశుద్ధురా
లని నాయంతరాత్మగూడ నంగీకరించినది. తరువాత నట్టిసీతను దోడుకొని
యయోధ్యకు వచ్చితిని. ఈలోకాపవాదము ప్రస్తుతము లోకమంతయును
వ్యాపించి నాహృదయమునకు మిక్కిలి శోకమును గలిగించుచున్నది.
ఎవరికైనను లోకములో నెంతవఱకు నపకీర్తి వ్యవహరింపఁబడుచుండునో
వారంతవఱకును నరకకూపమునఁ గూలియుందురు. దేవత లపకీర్తిని నిందించి
కీర్తిని గొనియాడుచుందురు. మహాత్ములగువారందఱును గీర్తికై పాటు
పడుచుందురు. నేనపవాదకు భయపడి నాజీవితమునుగాని, మిమ్ములను
గాని విడుచుటకు సిద్ధమైయుండువాఁడను. అట్టిసంగతిలో జనకరాజ
కూఁతురగు సీతను విడుచుటయన నెంత? కావున మీరు శోకసముద్రము
లో మునిఁగియున్న నన్నుఁ జూడుఁడు. ఇంతకంటె నధికమైన దుఃఖము
నాకు వేఱొకఁడుండునా? తమ్ముఁడా! లక్ష్మణా! నీవు రేపు ప్రభాతమున
సుమంత్రుఁడు సారథిగాఁగల రథముపై సీతను గూర్చుండఁబెట్టి యడవి
లో విడిచిరమ్ము. గంగయవతలియొడ్డున వాల్మీకిభగవానుని దివ్యమయిన
యాశ్రమముగలదుగదా! అది తమసాతీరము నాశ్రయించియున్నది. నీ
వావిజనమైన యడవిలో సీతనువిడిచి వెంటనేరమ్ము. నేను జెప్పినమాట
తప్పకుము. నీవిపుడు సీతవిషయమై యేమియుఁ జెప్పరాకుము. ఇందు
విషయమై యాలోచింపక వేగముగాఁ జేసిరమ్ము; ఇందుకు నీవు మాఱు
పల్కితివేని నీయందు నాకుఁ జాలఁ గోపమువచ్చును. మీముగ్గురిలో
నెవరు ప్రతిచెప్పినను నాతోడు. నేను జెప్పినమాటనుమార్చి యనునయ
పూర్వకముగా నెవరేమిచెప్పినను వారు నాకుఁ బరమశత్రులుగా భావిం
పఁబడుదురు. నాయభీష్టమునకు విఘాతముచేయఁదగదు. మీరు నా
యాజ్ఞయందున్నవారలైనచో నామాటను మన్నింపుఁడు. ఇక్కడనుండి
నేఁడే సీతను దీసికొని పోవునది. నామాట చెల్లించి రావలెను. సీత
పూర్వము గంగాతీరమందలి మున్యాశ్రమములను జూడఁగోరియున్నది.
దానికోరికయుఁ బూర్తిపఱచినట్లగును" అని చెప్పి రాముఁడు కన్నీటితోఁ

గప్పఁబడిన వృష్టిగలవాఁడై తమ్ములు పరివారించియుండఁగా శోకసంతప్త హృదయుఁడై యేనుఁగువలె నిట్టూర్పులు విడుచుచు నంతఃపురములోఁ బ్రవేశించెను.

## 46-వ సర్గము

### లక్ష్మణుఁడు సీత నడవికిఁ గొంపోవుట

తరువాత రాత్రి తెల్లవాఱినతోడనే దీనచేతనుఁడగు లక్ష్మణుఁడు నోరెండిపోవుచుండఁగా సుమంత్రుని బిలిచి యిట్లనియె: "సుమంత్రా! శీఘ్రముగా రథమునకు గుఱ్ఱములను గట్టుము. రాజభవనమునుండి తెచ్చి సీతనిమిత్తమై మంచిమెత్తని యాసనము వేయుము. సీతను రామాజ్ఞప్రకారము పుణ్యాత్ములగు మునులయాశ్రమమునకు నేను దీసికొనివెళ్లవలయును. వేగముగా రథము దెమ్ము" అను లక్ష్మణునిమాటలువిని సుమంత్రుఁ "డట్లే" యని మంచిగుఱ్ఱములను బూన్చినరథమును దెచ్చెను. దానిలో సుఖముగాఁ గూరుండుటకుఁ దగినశయ్య సిద్ధముచేయఁబడియుండెను. అట్టి రథమును దెచ్చి మిత్రులమానమును వృద్ధినొందించు లక్ష్మణునిజూచి సుమంత్రుఁ డిట్లనియె: "ప్రభూ! రథముఁ దెచ్చితిని. చేయఁదగినపని చేయుఁడు" అను సుమంత్రునిమాటలు విని లక్ష్మణుఁడు రాజగృహము లోనికిఁబోయి సీతాదేవితో నిట్లనియె: "అమ్మా! నీవు ప్రభువుతో నాశ్రమములు చూడఁగోరి చెప్పితివఁట. రాజుగారియాజ్ఞ యయినది. కావున నిపుడే బయలుదేఱి గంగాతీరమునందలి మునీశ్వరులపుణ్యాశ్రమములను జూచివత్తువుగాక! నేనును మాయన్నయాజ్ఞను శిరసావహించి నీవెంట వచ్చుచున్నాను. మునిసేవితములగు నరణ్యములయందు విహరించిన దానవు కాఁగలవు." మహాత్ముఁడగు లక్ష్మణుఁ డిట్లు చెప్పఁగానే చాల సంతోషించి ప్రయాణమున కిష్టపడెను. మిక్కిలి విలువగల వస్త్రములను వివిధములగు రత్నములను గ్రహించి గమనమున కుపక్రమించినది. ఈ వస్త్రములు, మణులు, ధనము, ఆభరణములు నేను మునిభార్యల కిచ్చెద నన్నది. లక్ష్మణుఁడు మంచిదే యని సీతను రథ మెక్కించి రామాజ్ఞను స్మరించుచు నతివేగముగా రథమును నడిపింపఁజేసెను.

అపుడు సీత లక్ష్మణునితో నిట్లనియె: "రఘునందనా! లక్ష్మణా! అనేకములగు నశుభము లగపడుచున్నవి. నాకుడిక న్నదరుచున్నది.

దేహము కంపించుచున్నది. ఏమో కాని లక్ష్మణా! నాహృదయ మస్వస్థ ముగా నున్నట్లు తోఁచుచున్నది. మిక్కిలి యౌత్సుక్యము గలుగు చున్నది. అధైర్య మెక్కువయగుచున్నది. పృథులోచనా! నాకంటికిఁ బృథివియంతయు శూన్యముగా నగపడుచున్నది. భ్రాతృవత్సలా! మీ యన్నకు క్షేమముగా నుండునుగదా! వీరా! మాయత్తల కందఱకును నిర్విశేషముగా క్షేమముగా నుండునుగదా! పురమందు జనపదముల యందుఁ బ్రాణులకుఁ గుశలమే యగునుగదా!" అని సీత చేతులు జోడించుకొని దేవతలను వేడుకొనెను. లక్ష్మణుఁ డాపలుకులను విని సీతకు నమస్కరించి మనస్సున బెగడొందుచునే పైకి సంతోషించుచున్న వానివలె "నంతయు క్షేమమే"యని బదులుచెప్పెను. తరువాత గోమతీ తీరమునందు వాస మేర్పఱచుకొని యారాత్రి యచ్చట నివసించి ప్రభా తమునందు లేచి లక్ష్మణుఁడు సూతునితో నిట్లనియె: "సూతా! వేగముగా రథమును సిద్ధము చేయుము. ఇపుడే గంగాజలమును శివుఁడు పర్వతము నందువలె శిరసా వహించెదను." అపుడు సూతుఁడు మనోవేగము గల గుఱ్ఱములను బూన్చి చేతులు జోడించికొని యారోహింపుమని సీతతోఁ జెప్పెను. ఆమె సూతుఁడు చెప్పఁగనే మంచిదే యని రథమెక్కెను. తరు వాత లక్ష్మణుఁడును సారథియు నెక్కిరి. అర్ధదివసము గడచునప్పటికి వారు గంగాతీరము చేరిరి. అట్టిగంగనుజూచి లక్ష్మణుఁడు దీనుఁడై యెలుఁగెత్తి యేడ్చెను. లక్ష్మణుఁ డట్లు రోదనము చేయుచుండుట చూచి ధర్మాత్మురా లగు సీత యిట్లనియె: "లక్ష్మణా! ఏమియిది? యిట్లేడ్చుచున్నా వేల? జాహ్నవీతీరమునకు రావలయునని నేను చిరకాలమునుండి కోరుచుంటిని. ఇన్నాళ్లకు నాకోరిక తీరినది. నేను సంతోషముగా నుండవలసిన సమయ మున నీవేడిచి నాకు దుఃఖమును గలిగించెద వేల? ఇదిమేలా? పురుషర్షభా! నీవు నిత్యమును రామునిపార్శ్వమునందే యుండెదవు. ఒక్కనాఁ డాయ నకు దూరమైనంతమాత్రమునకే యిట్లేడువవలయునా? లక్ష్మణా! మీ యన్న నాకుమాత్రము ప్రాణములకంటె నెక్కువగా నుండుటలేదా? నేను నీవలెనే దుఃఖించుచున్నానా? నీ వీలాగు పామరులవలె దుఃఖింపఁ దగునా? నన్ను గంగదాఁటించి తాపసులను జూపించుము. తరువాత మునులకు మునిభార్యలకు వస్త్రములు ఆభరణములు మొదలగునవి యిచ్చెదను. మునులకు యథాశాస్త్రముగా నభివాదన మాచరించి

యచ్చట నొకరాత్రి నివసించి మరల నయోధ్యకుఁబోవుదము. పద్మపత్ర
క్షుఁడును, సింహోరస్కుఁడును, కృశోదరుఁడును నగు శ్రీరామునిఁజూచు
టకై నామనసుగూడఁ వ్యాకులపడుచున్నది" అని చెప్పిన సీతమాటలు విని
కన్నులు తుడుచుకొని లక్ష్మణుఁడు నావికులను రావించెను. వారందఱు న
నిదిగో నావ సిద్ధముగా నున్నదని చేతులు జోడించుకొని విన్నవించిరి
లక్ష్మణుఁడు గంగను దాఁట నిశ్చయించి నావ నెక్కెను. క్రమముగ
లక్ష్మణుఁడు సావధానముగా నావను పరతీరమునకుఁ జేర్పించెను.

### 47-వ సర్గము

### సీతతో రాముని యాజ్ఞ జెల్పుట

తరువాత లక్ష్మణుఁడు సుసిద్ధమును నిషాదులదియు నగు నావ
యందు ముందుగా సీతను గూర్చుండఁజేసి తానును నావలోఁ గూర్చుండె
ను. తాను వచ్చువఱకును సుమంత్రుని గంగాతీరమున నుండుమనెను.
లక్ష్మణుఁడు శోకసంతప్తుఁడై నావికుని నావ నడపుమనెను. తరువాత
నావలియొడ్డుచేరి కన్నుల నీరు దెచ్చుకొనుచుఁ జేతులు జోడించుకొని
సీతతో నిట్లనియె: "అమ్మా! సీతా, ధీమంతుఁడగు మాయన్న నాహృద
యమునందు గొప్పశల్యము నుంచెను. వైదేహీ! అతఁడు లోకముచే
నిందితుఁడై యున్నాఁడు. ఇపుడు నాకు మరణమే మేలు. మృత్యువుకంటె
నాకుఁ గావలసినది లేదు. నేనిట్టి లోకనిందితమైన కృత్యమునందు నియో
గింపఁబడితిని. ఇది నాకుఁ దగదు. శోభనాంగీ! నాయందు దయయుం
చుము. నాయందుఁ బాప మాలోచింపకుము" అని యేడ్చుచు లక్ష్మ
ణుఁడు చేతులు జోడించుకొని క్రిందఁ బడిపోయెను. ఏడ్చుచున్న వాఁ
డును, చేతులు జోడించుకొన్న వాఁడును, తనకు మృత్యువు వచ్చిన
బాగుగ నుండునని కోరుచున్న వాఁడును నగు లక్ష్మణునిజూచి సీత మిగుల
బెగ్గిలినమనసు గలదియై యిట్లనియె: "లక్ష్మణా! లక్ష్మణా! నీవన్న
మాటలను నాకర్థము గాలేదు. స్పష్టముగాఁ జెప్పుము. నీవు నెమ్మదిగా
నున్నట్లు కనుపడవు. రాజుగారికి క్షేమమే కదా! నీమనసులోని సంతాప
మునకుఁ గారణము చెప్పవేని మీయన్నతోడు! నేను నీ కాజ్ఞాపించు
చున్నాను. నాసన్నిధియం దున్నదున్నట్లు చెప్పుము" అని యిట్లు సీత
ప్రశ్నింపఁగా లక్ష్మణుఁడు దీనచిత్తుఁడై శిరస్సు వంచుకొని గద్గదస్వర

ముతో నిట్లనియె: “అమ్మా! జానకీ! పరిపక్వబుద్ధివైన నీవిషయమునఁ బుట్టిన దుస్సహ మైన లోకాపవాదమును విని మాయన్న సంతప్తహృదయుఁడై నాతో నివేదించి లోపలికిఁ బోయెను. దేవీ! నే నానిందావాక్యములు నీయెదుట నుచ్చరింపఁజాలను. వానినన్నింటిని మాయన్న నీకై నాయొక్కమనస్సు వెనుక నుంచుకొని హృదయమునఁ బెట్టుకొన్నాఁడు. అట్టి నిన్ను మా యన్న విడిచెను. నీవు నిర్దోషురాలవని యాయనయే కాక నేనుగూడ నెఱుఁగుదును. అయినను లోకాపవాదమునకు భయపడి యట్లు చేసెను. ని వన్యథాగా గ్రహింపకుము. ఈయాశ్రమములలో నిన్ను విడిచి నేను మరలఁ బురికిఁ బోవలెనయ్యెను. అట్లు రాజాజ్ఞాపితుఁడనైతిని. ఓ విదేహ రాజపుత్రీ! దౌహృదముగాఁ గోరియుంటివి కదా! కావున నీవిప్పుడు గంగాతీరమునందలి ఋషుల యాశ్రమము. అమ్మా! ఇవి పుణ్యమైనవి రమణీయమైనవి గనుక మనసులో విచారింపకుము. మాతండ్రియగు దశరథమహారాజు నకు వాల్మీకిమునిపుంగవుఁడు మిక్కిలి స్నేహితుఁడు. మంచికీర్తిమంతుఁడు. ఆయన పాదచ్ఛాయ నాశ్రయించి సుఖముగా నుండుము. జానకీ! ఉపవాస పరాయణురాలవై యేకాగ్రచిత్తముతో నిచట నుండుము. పాతివ్రత్య మవలంబించి సదా రాముని హృదయమునం దుంచుకొనుము. అట్లు చేసితివేని దేవీ! నీకెక్కువగా శ్రేయస్సు ప్రాప్తించును.”

## 48వ సర్గము

### సీత చింతించుట

ఇట్లు లక్ష్మణుఁడు చెప్పిన దారుణమగుమాటలు విని జానకి మిగుల విషాదమును బొంది క్రిందఁ బడిపోయెను. ఆమె ముహూర్తకాలము తెలివితప్పినదియై బాష్పపర్యాకులేక్షణ యగుచు దీనదీనముగా లక్ష్మణు నితో నిట్లనియె: “లక్ష్మణా! నాశరీరము దుఃఖముకొఱకే సృజింపఁబడినది. ఇపుడు నాకెటుచూచినను దుఃఖమయముగానే యగపడుచున్నది. నేను బూర్వ మెట్టిపాపమును జేసితినో? ఏదంపతులకు వియోగమును గలిగించితినో? ఏమియుఁ జేయకున్నచో నిర్దోషురాలనని యెఱిఁగియు మాయన్న నన్ను విడుచునా? పూర్వము నేను రామపాదముల సేవించుచు నాశ్రమములో నుండియు నాయన నన్ను నూఱడించుచున్నను దుఃఖించుచునే యుండెడిదానను. అట్టి నేను విజనమగు నీయాశ్రమములలో నెట్లుండఁ

గలను? సర్వదా దుఃఖపరాయణురాలనగు నే నీదుఃఖము నెవ్వరితోఁ జెప్పుకొందును? మునులు వచ్చి యడిగినచో నేనేమిచెప్పుదును? ఏమి మంచిపనిచేసితినని చెప్పఁగలను? "నీమగఁ డేల విడిచె"నని యడిగిన వారి కే నేమని చెప్పుదును? లక్ష్మణా! నేనిపుడే యీగంగాజలములోఁ బడి ప్రాణములు విడుతునా? అట్లు చేసినచో నాభర్తయొక్క రాజవంశము పరిహసింపఁబడునో యేమో! ఇట్టి యోచన యెందులకు? లక్ష్మణా! మీ యన్నగారియాజ్ఞ చెల్లింపుము. దుఃఖభాగిని నగు నన్ను విడువుము. నీవు మీయన్నగారియాజ్ఞలోనుండుము. నాచెప్పఁబోవు నీమాటలుమాత్రము వినుము. మాయత్తలందఱకును వినయముగాఁ జేతులు జోడించి నమస్కరించితినని చెప్పుము. రాజుగారి క్షేమ మడిగితినని చెప్పుము. లక్ష్మణా! అందఱకును శిరస్సాష్టాంగము చేసితినని తప్పక చెప్పెదవుకదా!

ధర్మకార్యములయం దాసక్తుఁడగు రాజుగారితో "రాఘవా! నే నెట్టిశుద్ధిగలదాననో నీవు యథార్థముగా నెఱుఁగుదువు. నీయందుఁ బరమ భక్తురాలననియు నెఱుఁగుదువు. నిత్యమును నీకు హితమే కోరుచుండు దాననని నీకే తెలియును. అట్టిసీతను లోకాపవాదకు భయపడి నిర్జనమగు నడవిలో విడువుమంటివి. నీకు వచ్చిన యపవాదము నేనెట్లైనను బరిహరించి తీరవలయును. నీవే నాకుఁ బరమగతి" అని నేను జెప్పుమంటినని చెప్పుము. మఱియు "నీవు ధర్మమును సావధానముగాఁ గనిపట్టుచు నీ తమ్ముల నెట్లు చూచుచుందువో పౌరులను, జానపదులను నట్లే చూచుచుందువుగాక! అదియే నీపరమధర్మము. అందువలన నీకుత్తమకీర్తిగలుగును. పౌరులను ధర్మముగాఁ బాలించినచో నిరుపమానమైనకీర్తి గలుగును. నరర్షభ! నేనును పౌరుల యపదూరునకై విచారించునట్టులు నాశరీరము నకై విచారింపను. పౌరులయపవాద యెట్టిదైననగుఁగాక! ఆఁడుదానికిఁ బెనిమిటియే దేవత, అతఁడే బంధువు, అతఁడే గురువు. కావునఁ బ్రాణములచేతనైనను బెనిమిటికి హితము చేయవలయును" అనియు నేను సంగ్రహముగాఁ జెప్పుమన్నట్లు చెప్పుము. "నీవు గర్భిణి నగు నన్ను చూచి యిపుడే వెళ్లిపొమ్ము" అని యిట్లు సీత చెప్పుచుండఁగా లక్ష్మణుఁడు దీనచిత్తుఁడై సాష్టాంగవందన మాచరించి మాటలాడఁజాలకపోయెను. ఆమెకుఁ బ్రదక్షిణమాచరించి యేడుచుచు నే ముహూర్తకాలము ధ్యానించి "శోభనురాలా! నాకేమిచెప్పెద"వనెను. "అమ్మా! ఇదివఱ కెన్నఁ

మును నీరూపము చూచినవాఁడను గాను. పాదములమాత్రము చూచి
తిని. రామునితో విరహమును బొందియుండగా నిప్పుడు నిన్నెట్లు
చూడఁగలను" అని చెప్పి యామెకు నమస్కరించి మరల నావనెక్కెను.
అట్లు నావయెక్కి నావికులను త్వరపెట్టెను. శోకభారమునఁ గ్రుంగినవాఁడై
యుత్తరతీరముచేరి దుఃఖముచే సంమూఢుండైనవానివలె వేగిరి రథ
మెక్కెను. మాటిమాటికిని వెనుకకు తిరిగి యనాథురాలివలెనే యావలి
యొడ్డున దుఃఖించుచున్న సీతను జూచుచు లక్ష్మణుఁడు వెడలిపోయెను.
దూరమైనరథమును, లక్ష్మణుని, మాటిమాటికిని చూచుచున్న దీనురాలై
నదియు నగు సీతహృదయమున శోకము ప్రవేశించినది. కీర్తిమంతురాలగు
సీత దుఃఖభారాక్రాంతయై యొకనినిజూచు రక్షకుండులేక నెమళ్లు గల
నవి సంచరించు నావిజనమైన యడవిలో నెలుఁగెత్తి గోలుమని యేడువ
మొదలిడెను.

## 47-వ సర్గము

### వాల్మీకి సీత నోదార్చుట

అచ్చట నేడ్చుచున్న సీతను జూచి మునికుమారులు వాల్మీకిమహా
మునియొద్దకుఁ బరుగులెత్తిరి. వారు మునిపాదములకు నమస్కరించి
యామె రోదనవృత్తాంతమంతయు నాయనతో నిట్లు విన్నవించిరి: "భగవా
నులవారూ! మేమెన్నఁడును జూచి యెఱుఁగము. ఆమె యేమహాత్ముని
భార్యయో కాని రెండవలక్ష్మివలె నున్నది. సంమోహమువలన వికృతా
ననయై యేడుచుచున్నది. ఆమె రూపము చూడఁగా ఆకాశము
నుండి జారిపడిన దేవతవలె నున్నది. ఆమెకేమి దుఃఖము తటస్థించినదో
కాని గంగాతీరమున నున్నది. వెక్కివెక్కి శోకపరాయణురాలై యున్నది.
ఆమె దుఃఖింపఁదగనిది. ఒక్కతెయు దీనురాలై దిక్కులేనిదానివలె వగ
పడుచున్నది. ఆమె మనుష్యస్త్రీ యని మేమనుకొనము. ఆమెను సత్క
రింపవలయును. మనయాశ్రమమునకు సమీపముననే యున్నది. మిమ్మును
శరణుపొందినది. ఆపతివ్రత రక్షించువారిని గోరుచున్నది. తామామెని
రక్షింపఁదగుదురు." ఇట్లు చెప్పినవారిమాటలు విని ధర్మజ్ఞుఁడైన వాల్మీకి
బుద్ధిచే నిశ్చయించి తపోబలముచేఁ జూచి మైథిలియున్న చోటికిఁ ద్వరగాఁ
బోయెను. మహామతి యగు వాల్మీకి వెళ్లుచుండుట చూచి శిష్యులుకూడ

వెంటవెళ్లిరి. ఆవాల్మీకి పవిత్రమగు నర్ఘ్యమును గ్రహించి గంగాతీరముఁజేరి అచ్చట దీనురాలై దిక్కులేనిదానివలె నున్న శ్రీరాముని భార్యను జూచెను. ఇట్లు మునిపుంగవుఁడగు వాల్మీకి శోకభారార్తురాలైన సీతను జూచి సంతోషము గలుగునట్లుగా నామెతో మధురముగా నిట్లనియె: "అమ్మా! దశరథుని కోడలవు, రామునికిఁ బ్రియమైనభార్యవు; జనకరాజునకుఁ గుమారితవు; పతివ్రతవు; నీకు స్వాగతము. నీవు వచ్చుచున్నదానవని నేను ధర్మసమాధిచేఁ దెలిసికొంటిని. నీవిచ్చటికివచ్చినకారణమంతయు నేను మనసుచేఁ గనుఁగొంటిని. మూఁడులోకములయందును జరుగు సంగతులు నాకుఁ దెలియుచునేయుండును. నేను నిన్ను నాతపోబలముచే నిర్దోషురాలివిగాఁ దెలిసికొంటిని. నేనుండఁగా నీకేవిధమైన భయమును లేదు; విశ్వాసము గలిగియుండుము. ఇచ్చటికి సమీపముననే నాయాశ్రమమున్నది. అందుఁ దాపసస్త్రీలు తపస్సుచేసికొనుచు నున్నారు. వారు నిన్నుఁ దల్లులు పిల్లను గాపాడినట్లు కాపాడుచుందురు. ఇదిగో, అర్ఘ్యము; గ్రహింపుము. మనస్సులో నేవ్యాకులమును లేకుండ విస్రబ్ధురాలవై యుండుము. మాయింట నుండునట్లే యుండవచ్చును. ఇంక వగవకుము" అని యిట్లోదార్చిన యద్భుతమగు మునిమాటలు విని చేతులు జోడించుకొని "మంచిదే" యని సీత యంగీకరించెను. ఆముని యాశ్రమములోనికిఁ బోవుచుండఁగాఁ జేతులు జోడించుకొని యాయనవెంటఁ బోయినది. సీతను వెంటఁబెట్టుకొని వచ్చుచున్న వాల్మీకిని జూచి మునిభార్యలు త్వరగా నెదుర్కొని సంతోషించుచు నిట్లనిరి:

"మునిశ్రేష్ఠా! నీకు స్వాగతము. నీయాగమనము చిరకాలమునకుఁ గలిగినది. మేమందఱమును నీకు నమస్కరించుచున్నాము. ఏమిచేయు నాజ్ఞయొసఁగెదవు?" అను తాపసస్త్రీలమాటలు విని వాల్మీకి యిట్లనియె. ధీమంతుఁడగు రామునిభార్య యీమె; సీత యని పిలువఁబడుచుండును. దశరథునికోడలు. జనకునికూఁతురు. పతివ్రత. ఏపాపమును నెఱుఁగదు. ఈమెను మగఁడు విడిచెను. నే నీమెను సదా పాలించుచుండవలయును. మీయందఱును నీమెను మిక్కిలి స్నేహమునఁ జూచుచుండవలెను. గౌరవముచేతను నామాటనుబట్టియు మీకీమె విశేషముగాఁ బూజింపఁదగినది." ఇట్లుచెప్పి మహాయశుఁడగు వాల్మీకి మాటిమాటికిని సీతను దివ్యదృష్టితోఁజూచుచు శిష్యపరివృతుఁడై మరలఁ దనయాశ్రమమునకు వచ్చెను.

## ౫౦-వ సర్గము

### సుమంత్రుని వాక్యములు

ఆశ్రమములోఁ బ్రవేశింపఁజేయఁబడిన మైథిలిని సీతఁజూచి లక్ష్మణుఁడు దీనచేతస్కుఁడై ఘోరమగు సంతాపమును బొందెను. అతఁడు మంత్రసారథి యగు సుమంత్రునిఁజూచి యిట్లనెను: "సుమంత్రా! రాముఁడు సీతాపరితాపమునలనఁ గలిగిన దుఃఖమును జూచితివిగదా! రామున కింతకన్న నెక్కుడు దుఃఖ మేముండును? నిర్దోషురాలగు సీతను విడువ వలసివచ్చినది. సీతారాములకు దైవవశమున నీవియోగము గలిగినదని తలంచెదను. దైవ మెట్టివారికిని నతిక్రమింపరానిదిగదా! కోపించినచో దేవతలను, రాక్షసులను, గంధర్వులను జయింపఁజాలిన రాముఁడుకూడ దైవము ననువర్తించువాఁ డాయెను. చూచితే! పూర్వము రాముఁడు తండ్రియాజ్ఞ వలనఁ బదునాలుగువత్సరములు నిర్జనమగు మహారణ్యములో నుండెను. ఇప్పు డంతకంటెను దుఃఖతరముగా సీతావియోగ మనుభవింపవలసివచ్చినది. ఇదియంతయుఁ బౌరులమాటలవలనఁగదా తటస్థించినది! ధర్మము నాశ్రయించినవాఁ డెవఁ డిట్టికీర్తినాశకరమైనకర్మమును జేయును? అయినను పౌరులు నీచపుమాట లనుకొనుచుండుటవలన నిట్టిపనిపుట్టినది" అని యిట్లనేకవిధములుగా నాడుచున్న లక్ష్మణునిమాటలు విని ప్రాజ్ఞుఁడగు సుమంత్రుఁడు శ్రద్ధగా నిట్లనియె:

"లక్ష్మణా! నీవు సీతనుగూర్చి సంతాపింపకుము. పూర్వము నీతండ్రియెదుట బ్రాహ్మణులు చెప్పఁగా వింటిని. రాముఁడు సదాదుఃఖప్రాయుఁడై యల్పసౌఖ్యము ననుభవించు ననిరి. మఱియు నతఁడు తన యిష్టజనముతో వియోగమును బొందుననియుఁ జెప్పిరి. నిన్ను భరతశత్రుఘ్నులను చాలకాలమునకు విడువఁగలఁడు. లక్ష్మణా! యీసంగతి సీతతోడను, భరతునితోడను, మఱియెవ్వరితోడను జెప్పరానిది. ఇట్లని దుర్వాసోముని చెప్పియున్నాఁడు. మహాజనసమీపమునందును నేనుండఁగాను వసిష్ఠభగవానుని సన్నిధిని జరిగినది. ఆఋషిమాటలువిని మీతండ్రి 'సూతా! నీవీసంగతి యెవ్వరితోడను జెప్పకుము' అనెను. లోకపాలసదృశుఁడగు మీతండ్రిమాటను నే ననృతముగాఁ జేయనని నిశ్చ

యించుకొంటిని. ఈసంగతి నీయెదుట నేను జెప్పఁదగినదిగాదు. నీ కంత వినవలయునని శ్రద్ధయున్నచో వినుము. మీతండ్రి నాతో నీసంగతి రహస్యమనిచెప్పినను నేను నీకుఁజెప్పెదను. దైవ మలంఘ్యముగదా! ఆ దైవమువలననే యిట్టిదుఃఖము తటస్థించినది. నీతో నేనెందులకో చెప్పితిని. ఈసంగతి నీవు భరతశత్రుఘ్నులతో మాత్రము చెప్పఁబోకుము." ఇట్లని సుమంత్రుఁడు చెప్పిన గంభీరార్థపదములుగలమాటలు విని యథార్థముగాఁ జెప్పుమని లక్ష్మణుఁడు సుమంత్రు నడిగెను.

## 51-వ సర్గము

### సుమంత్రుఁడు దుర్వాసునిమాటలు చెప్పుట

మహాత్ముఁ డగు లక్ష్మణునిచే నట్లు ప్రేరితుఁడై సుమంత్రుఁడు దుర్వాసోముని చెప్పిన యామాటలు చెప్పుట కుపక్రమించెను: పూర్వ మత్రిమహామునికుమారుఁడు దుర్వాసుఁ డనుమహాముని పుణ్యమగు వసిష్ఠుని యాశ్రమమునందుఁ జాతుర్మాస్యవ్రతమునకై నివసించియుండెను. ఆయాశ్రమములోనికి మీతండ్రి తనపురోహితుఁడగు వసిష్ఠుని దర్శించుటకుఁ బోయెను. అతఁడు సూర్యసంకాశుఁడై తేజస్సుచే వెలుఁగుచు వసిష్ఠుని సవ్యపార్శ్వమునందుఁ గూర్చున్న దుర్వాసునిజూచి యాయిద్దఱు మునులకును నమస్కరించెను. ఆయిద్దఱును మీతండ్రిని స్వాగతము చేతను, ఆసనదానాదికముచేతను బూజించిరి. అర్ఘ్యపాద్యాదులు గైకొని ఫలమూలము లుపయోగించి మీతండ్రి మునులతోఁగూడి కూర్చుండెను. వారచ్చటఁ గూర్చుండి యాయాయిమధురములగు కథలు చెప్పుకొనుచుండిరి. అప్పుడు మధ్యాహ్నసమయము. తరువాత నొకానొక కథాసందర్భములో మీతండ్రి చేతులు జోడించుకొని దుర్వాసునితో నిట్లనియె: "భగవానులవారూ! నావంశ మెంత ప్రమాణముగలదియగును? మా రాముని కెంతయాయువు? ఇతరులగుపుత్రు లెన్నాళ్లు జీవింతురు? రాముని కెందఱుసుతులు పుట్టుదురు? వారి యాయు వెంత? నేను గోరితిని గనుక మావంశముయొక్కసంగతిని జెప్పుదురుగాక!" అని యిట్లడిగిన మీతండ్రిమాటలు విని దుర్వాసుఁ డిట్లుచెప్ప నుపక్రమించెను: "రాజా! పూర్వము జరిగినది వినుము. ఒకప్పుడు దేవాసురులకు యుద్ధము

జరిగినది. సురలచే నోటమి చెంది దైత్యులు భృగుపత్నిని శరణుజొచ్చిరి. ఆమె యభయదాన మిచ్చుటచే నిర్భయులై యుండిరి. ఆమె శరణ మిచ్చినదగుటచే నిర్భయులైన రాక్షసులను జూచి విష్ణువు కోపించి చక్ర ముచే నామెశిరస్సు ఖండించెను. తరువాత భృగుమహాముని భార్య చచ్చి యుండుటచే వెంటనే కోపించి రిపుకులాంతకుఁడగు విష్ణుని 'అవధ్యురా లగు నాభార్యను కోపించి చంపితివి గనుక, జనార్దనా! నీవు మనుష్య లోకములోఁ బుట్టుము. అచ్చట చిరకాలము నీవు భార్యావియోగ మును బొందుము' అని శపించెను. శాపాభిహతచిత్తుఁడై యతఁడు తనలోఁదాను భావితుఁడాయెను. శాపితుఁడగు భృగువు విష్ణుదేవుని బూజించెను. తపస్సుచే నారాధితుఁడై భక్తవత్సలుఁడగు విష్ణుదేవుఁడు లోకోపకారార్థ మాశాపమును గ్రాహ్యముగా నంగీకరించెను. ఇట్లు భృగువుచేఁ బూర్వజన్మమందు శపింపఁబడి యీజన్మమునందు నీకుఁ గుమా రుఁడై పుట్టినవాఁడనుమా! రాజా! అతఁడే రాముఁడని ప్రసిద్ధి కెక్కిన వాఁడు. భృగుశాపఫలమును నతఁడు యనుభవించును. రాముఁ డయో ధ్యకుఁ బతియై చిరకాలము జీవించును. అతని ననుసరించినవారు సుఖ వంతులు, సమృద్ధిగలవారునునై యుందురు. పదునొకండువేల సంవత్సర ములు రాజ్యమేలి బ్రహ్మలోకమునుగూర్చి పోవును. పరమసమర్థుఁడై బహువిధములగు నశ్వమేధములు చేయును. అనేకములగు రాజవంశము లను స్థాపింపఁగలఁడు. రామునకు సీతయం దిద్దఱు కొడుకులు పుట్టుదురు. మఱియొకచోటఁ బుట్టుదురు గాని యయోధ్యలోఁ బుట్టరు. తరువాత సీతాపుత్రులకు రాముఁడు పట్టాభిషేకము చేయును." ఇట్లు మీవంశము సంగతియంతయుఁజెప్పి మహాముని యూరకుండెను. ఆముని యిట్లు చెప్పి యూరకుండఁగానే మీతండ్రి యచ్చటి మునులకు నమస్కరించి మరలి పురమునకు వచ్చెను. ఆయన చెప్పుచుండఁగా నేను వింటిని. మనస్సులో నుంచుకొంటిని. అది యన్యథాగాఁ గాదు. ఇట్లుండుటచే నీవు సీతవిష యమున రామునివిషయమున విచారింపక ధైర్యముగ నుండుము. లక్ష్మ ణుఁడు పరమాద్భుతమగు సారథిచెప్పినమాటలు విని సంతోషించి సాధు వాదములు చేసెను. ఇట్లు సుమంత్రుఁడు లక్ష్మణుఁడు త్రోవలో మాట లాడుకొనుచు వచ్చుచుండఁగా సాయంకాలమైనది. అపుడు వారు గోమతి యను స్థలమున నివసించిరి.

## 52-వ సర్గము

### లక్ష్మణుడు రాముని యొద్దకు వచ్చుట

లక్ష్మణుఁడా రాత్రి గోమతియందుండి తెల్లవాఱినతోడనే లేచి యయోధ్యకు బయలుదేఱెను. మతిమంతుఁడగు లక్ష్మణుఁడు మిగుల ధైర్యమును బొందెను. "రామునిసన్నిధికిఁబోయి యేమి మనవి చేయుదును?" అని విచారింపమొదలిడెను. ఇట్లాతఁడు విచారించుచుండఁగానే చంద్రునివలెఁ బ్రకాశించు శ్రీరామునిభవనము ముందఱ నగపడినది. రాజద్వారమందు లక్ష్మణుఁడు రథముదిగి శిరస్సువంచుకొని దీనచిత్తుఁడై యని వారితుఁడై లోపలకుఁ బోయెను. అతఁడు కన్నుల నీరుగార్చుచు దీనమానసుఁడై సింహాసనముపై కూర్చుండియున్న రఘురాజును జూచి వెంటనే పాదములకు నమస్కరించెను. మఱియుఁ జేతులు జోడించుకొని దీనముగా నిట్లనియె. "తమయాజ్ఞను శిరసావహించి జనకాత్మజను గంగాతీరమందలి వాల్మీకిమహాముని యాశ్రమములో విడిచి తమపాదముల సన్నిధికి వచ్చి చేరితిని. పురుషవ్యాఘ్రా! విచారింపకుము. కాలగతి యిట్టిది. మీవంటి బుద్ధిమంతులు, ధైర్యవంతులు దుఃఖింపరు. సర్వవృద్ధులు క్షయాంతములు. ఔన్నత్యము పతనాంతము. సంయోగములు వియోగాంతములు, జీవితము మరణాంతము. కావునఁ బుత్రులయందును, భార్యలయందును, మిత్రులయెడను, ధనమువిషయమున నతిప్రసంగము కూడదు. ఏమన? నెప్పటికైన వానితో వియోగము తప్పనిది. నీవు నీయాత్మను వినోదపలుచుకొన శక్తిగలవాఁడవు. మఱియు లోకములకే వినోదమును గలుగఁజేయఁగల నీవు నీయాత్మను శోకము చెందకుండఁ జేసికొనుట నీకొకగొప్పకార్యముగాదు. నీవంటిపురుషశ్రేష్ఠు లిటువంటివిషయములు తటస్థించినపుడు మోహమును బొందరు. ఆయపవాదము దానంతట నదియే పోవును. ఏయపవాదమునకు భయపడి సీతను విడిచితివో యాయపవాదము తప్పకుండఁ బట్టణమున వ్యాపింపఁగలదు. కావున నీవు ధైర్యమవలంబించి యీదుర్బలమగు బుద్ధినివిడిచి సంతాపమును బొందక నెమ్మదిగానుండుము" అని యిట్లు లక్ష్మణుఁడు చెప్పఁగానే రాముఁడతనితో నిట్లనియె: "లక్ష్మణా! నీవిపుడు చెప్పినసంగతులన్నియు యథార్థములే. నీవు

నామాటను మన్నించినందులకు నేను చాలసంతోషించితిని. సౌమ్యా!
నీమాటలవలన నాకు నివృత్తిగలిగినది. సంతాపము పోయినది. నీమంచి
మాటలచే నూరట చెందితిని."

## 53-వ సర్గము

### రాముఁడు నృగమహారాజు చరిత్ర చెప్పుట

ఇట్లు లక్ష్మణుఁడు చెప్పిన పరమాద్భుతము లగు వాక్యములు విని
రాముఁడు చాల సంతోషించి యతనితో నిట్లనెను: "తమ్ముఁడా! నీవంటి
బంధుఁడు దుర్లభుఁడు. అందునను నీవంటి బుద్ధిమంతుఁడు మహాత్ముఁడు దుర్లభుఁడు.
నీవు తప్పక నామనస్సు ననుసరించువాఁడవని నే నెఱుఁగుదును. నామన
స్సులో నొకసంగతియున్నది చెప్పెదను వినుము. అదివిని యట్లుచేయుము.
నేటికి నాలుగుదినములనుండి నేను పౌరకార్యములు విచారింపఁజాలక
యుంటిని. అది నామర్మములను గోయుచున్నది. ప్రజలను, బ్రాహ్మణులను, పురో
హితులను, మంత్రులను, కార్యార్థులను, పురుషులను, స్త్రీలను పిలిపిం
పుము. ఏరాజు ప్రతిదినమును పౌరకార్యములను జక్కఁజేయఁడో యట్టి
రాజు మృతినొంది తప్పక ఘోరనరకమునఁ బడు"నని పెద్దలు చెప్పుదురు.
పూర్వము బ్రాహ్మణప్రియుఁడును, శుచియుఁ, గీర్తిమంతుఁడును, సత్యవచ
నుఁడును నగు నృగుఁడను మహారాజు గలఁడు. అతఁ డొకప్పుడు పుష్క
రములయందుఁ గోట్లకొలఁది గోవులను, వత్సలను, స్వర్ణభూషితలను
బ్రాహ్మణులకు దానమిచ్చెను. అందొక యావు పొరపాటున నారాజు నావుల
మందలలోఁ గలసిపోయెను. అది తెలియక యారాజు దాయావునే దరిద్రుఁ
డును, ఉంఛవృత్తియునగు వేఱొక బ్రాహ్మణునకు దానమిచ్చెను. తొలుత
దానము గొనిన బ్రాహ్మణుఁ డాఁకలిచేఁ బీడితుఁడై తనగోవును వెదక
మొదలిడెను. ఎన్నోసంవత్సరము లన్నిరాజ్యములయందును దిరిగి తిరిగి
వెదకియుఁ దానిని గానకపోయెను. తరువాతఁ గొన్నాళ్లకుఁ గనఖల మను
చోటున నొకబ్రాహ్మణునియింటఁ దనగోవును జూచెను. అతఁ డాగోవును
జూచి యదివఱకుఁ దాను వాడుకచేసిన పేరున నాగోవును బిలువఁగా నది
యాబ్రాహ్మణుని స్వరము విన్నది. ఆబ్రాహ్మణుఁడు వెళ్లిపోవుచుండఁగాఁ
గట్టుత్రాడుతెంచుకొని యాఁకలిగొన్న యాదరిద్రుని వెంబడించినది.

కయింటి బ్రాహ్మణుఁ డాగోవును వెంబడించెను. అట్లు వెంబడించి "యిది నాగోవు; నీవు తోలుకొనిపోవుచున్నావే"మని యడిగెను. మఱియు "నీ గోవును నాకు నృగమహారాజు దానమిచ్చియున్నాఁ"డనికూడఁ జెప్పెను. ఆయిద్దఱు బ్రాహ్మణులకును గోవ్వివాద మేరుపడినది. అట్లు వివదించి యిద్దఱును దాతయగు నృగునియొద్దకు వచ్చిరి. వారు ద్వారమందుండి రాజు ననుమతిని బొందఁజాలకపోయిరి. ఇట్లు వారిద్దఱును ద్వారము కడనే కొన్ని యహోరాత్రములుండి తుదకుఁ బ్రాణము విసిగి కోపించి "మేము కార్యార్థులమై వచ్చి యిన్నాళ్లు కాచియున్నను మాకు దర్శన మీయనైతివి గనుక సర్వభూతములకును గనుపడకుండ నూసరవెలిరూప మును బొంది యొకగోతిలో ననేకసహస్రసంవత్సరము లుండువుగాక! కొంతకాలమునకు యదువంశమందుఁ గీర్తివర్ధనుఁడగు వాసుదేవుఁడు పుట్టఁగలఁడు. అతఁ డీఘోర శాపమునుండి నిన్ను విడిపింపఁగలఁడు. నీవు చేసిన యీమహాపాతకమునకు కతఁడు ప్రాయశ్చిత్తము చేయును. కలియుగ ప్రారంభమునకు ముందు భూభారమును హరించుటకై నరనారాయణులు భూమియం దవతరింతురు" అని యిట్లు బ్రాహ్మణు లారాజును శపించి కోపమునుండి విరామమును బొందిరి. దుర్బలయు, వృద్ధయు నగు నాగోవును వారు మఱొక బ్రాహ్మణునకు దానమిచ్చిరి. ఈరీతిగా నానృగ మహారాజా బ్రాహ్మణశాపము ననుభవించుచున్నాఁడు. కావునఁ గార్యార్థులను విచారింపకుండుట రాజునకు మహాదోషాపాదకమగును. కనుకఁ గార్యార్థులను శీఘ్రముగా నాయొద్దకుఁ దీసికొనివచ్చులాగున నాజ్ఞాపించుము. అకృతకార్యమునకు ఫలమును రాజు పొందఁజాలఁడు. కావున నీవు పోయి కార్యార్థులను బ్రతీక్షించుచుండుము.

## 54-వ సర్గము

### నృగమహారాజు చరిత్ర

రామునిమాటలు విని పరమార్థవిదుఁడగు లక్ష్మణుఁడు చేతులు జోడించుకొని రామునితో నిట్లనియె: "అన్నా! ఆబ్రాహ్మణులు స్వల్పాపరాధమునకై రాజర్షియగు నృగమహారాజునకు రెండవయమదండమువలె నిట్టిశాపమొసఁగిరి. పురుషర్షభా! తన్నుఁ బాపాత్మునిగాఁ దలంచు

గాని యిట్టిశాపము విని యా రాజు కోపముతోఁ గూడిన యా బ్రాహ్మణు
లనుగూర్చి 'యేమనెను?” అని లక్ష్మణుఁ డడుగఁగా రాముఁ డిట్లనెను:
“లక్ష్మణా! చెప్పెదను వినుము. ఆ రాజు శాపోపహతుఁడై యా బ్రాహ్మ
ణులు మార్గముఁబట్టి పోవుచుండఁగా మంత్రులను బౌరులను పురోహి
తులను బిలిపించి వారితో నిట్లనెను: “ప్రజలారా! వినుఁడు నా పలుకులు
సావధానముగా వినుఁడు. నారదుఁడు పర్వతుఁడు నను మునులు నాకు
గొప్పభయమును గలిగించి వాయురూపమునఁ ద్రిభువనములు బ్రవేశిం
టకుఁ బోయిరి. ఈ వసువను కుమారునికి మీరు పట్టాభిషేకము చేయుఁడు.
శిల్పులను బిలిపించి సుఖస్పర్శమగు గోయి త్రవ్వించుఁడు. ఆ బ్రాహ్మణు
లిచ్చినశాపమును గోతిలోనుండి యనుభవించెదను. ఆశిల్పులచే వర్ష
మును నివారించు నొకగోయి, చలిని వోలఁగించు నొకగోయి, వేఁడిమిని
బోఁగొట్టు నొకగోయి త్రవ్వించుఁడు. ఆగోతులకుఁ జుట్టును ఫలవంతము
లగు వృక్షములను పుష్పములతో నిండియుండు లతలను చాల నీడ
గలుగునట్లు నాటించుఁడు. గోతులకు నలువైపుల రమణీయముగా
నుండునట్లు చేయుచుండుఁడు. శాపము తీఱువఱకును నేనాగోతులలో నుండె
దను. యోజనమునఱకును సుగంధములగు పుష్పములు గోతులకుఁ
జుట్టును నుండవలయును” అని యీరీతిగా మంత్రులు మొదలగువారి
తోఁజెప్పి కుమారునిబిలిచి “నాయనా! నీవు ధర్మముదప్పకుండఁ బ్రజలను
నిత్యమును బాలించుచుండుము. చూచితివిగదా! నాకు బ్రాహ్మణు లెట్టి
శాపమిచ్చిరో? నాయపరాధమైనను నంతగొప్పదికాదు. అయినను వారు
కోపించి శాపమిచ్చిరి. నరర్షభా! నానిమిత్తమై నీవు తనువును సంతాపము
నొందించుకొనకుము. దైవము కుశలమైనది, ఆదైవమే నాకిట్టివ్యసనము
గలుగఁజేసెను. పొందఁదగినవానినే ప్రాణి పొందుచుండును. వెళ్లఁదగిన
చోట్లకే వెళ్లుచుండును. పొందఁదగినవానినే పొందుచుండును. సుఖ
ములుగాని, దుఃఖములుగాని యూరకరావు. ఇవియన్నియుఁ బూర్వ
జన్మసంస్కారమువలనఁ గలుగుచుండును. ఈవిషయమై నీవు చింతింప
కుము” అని యీరీతిగా నానృగమహారాజు కుమారునితోఁజెప్పి బాగుగా
సిద్ధము చేయఁబడిన గోతిలోనికి నివాసార్థముపోయెను. ఈరీతిగా మహా
రత్నవిభూషితమగు నాగోతిలోనికిఁబోయి కోపముతో నా బ్రాహ్మణు
లిచ్చినశాపము ననుభవించుచుండెను.

## 55-వ సర్గము

### రాముఁడు నిమిచరిత్ర చెప్పుట.

"లక్ష్మణా! నృగమహారాజుయొక్క శాపప్రసంగతి నీకు విస్తరించి చెప్పితిని. ఇంకను నీకు వినవలయునని యున్నచో మఱియొకకథ చెప్పెదను వినుము" అని యిట్లు శ్రీరాముఁ డనఁగానే లక్ష్మణుఁ డిట్లనియె: "అన్నా! ఆశ్చర్యభూతములైనకథలు వినుటయందు నాకుఁ దృప్తి లేదు" అని యిట్లు లక్ష్మణుఁ డనినవెంటనే శ్రీరాముఁడు మిక్కిలి ధర్మయుక్తమగు నొకానొకకథ చెప్పుట కుపక్రమించెను: "మహాత్ములగు నిక్ష్వాకువంశపు రాజులలో నిమి యను మహారాజొకఁడు గలఁడు. అతఁ డిక్ష్వాకునకుఁ బదిరెండవ కుమారుఁడు. ఆతఁడు వీర్యమునందును, ధర్మమునందును గొప్పవాఁడు. వీర్యసంపన్నుఁడగు నారాజు దేవపురమువంటి యొకపురమును గౌతమిసమీపమునఁ గట్టించెను. ఆపట్టణమునకు వైజయంత మను పేరుంచెను. మహాకీర్తిసంపన్నుఁడగు నారాజాపట్టణములోనుండి రాజ్య మేలుచుండెను. అతఁ డాపట్టణములో నుండి తండ్రి మనస్సు[నకు] సంతోషముగలుగునట్టుగా గొప్పదగు యజ్ఞమొకటి చేయవలయు"నని తలఁచెను. తరువాత నతఁడు మనువు కుమారుఁడగు నిక్ష్వాకు నామంత్రించి బ్రహ్మర్షిసత్తముఁడగు వసిష్ఠుని ముందుగా ఋత్విజునిగా వరించెను. అనంతరమున నిక్ష్వాకునందనుఁడగు నానిమి అత్రిని, అంగిరసుని, తపోధనుఁడగు భృగువును వరించెను. అపుడు వసిష్ఠుఁడు "రాజా! నేను ముందుగా నింద్రునిచే వరింపఁబడియున్నాను. కొలఁదికాలము ప్రతీక్షించుము" అనెను. అనంతరము మహావిప్రుఁడగు గౌతముఁడు నిమి యజ్ఞమును బూర్తిచేయించెను. మహాతేజుఁడగు వసిష్ఠుఁ డింద్రుని యజ్ఞమును జేయింపఁబోయెను. నిమిరాజు హిమవత్పార్శ్వమునందలి పట్టణమునొద్ద నైదువేలసంవత్సరములు దీక్షితుఁడై యజ్ఞము సమాప్తి నొందించెను. ఇంద్రునియజ్ఞము పూర్తి కాఁగానే వసిష్ఠభగవానుఁడు నిమి యజ్ఞమును జేయించు తలంపుతో వచ్చెను. తాను వచ్చునప్పటికి గౌతముఁ డాతనియజ్ఞమును బూర్తి చేయించుట చూచెను. బ్రహ్మకుమారుఁడగు వసిష్ఠుఁడు కోపించి రాజును జూచు కోరికతో ముహూర్తకాల మచటనే యుండెను. ఆదినమున నిమి నిద్రాగ్రస్తుఁడై పండియుండెను. అంతకంతకు వసిష్ఠభగవానునికిఁ గోప మధిక

మైనది. ఎంతసేపటికిని రాజగపడమిచే "రాజా! నన్ను నవమానపఱిచి యితరులచే యజ్ఞము చేయించుకొంటివి గనుక నీదేహము చేతనశూన్యము గాఁగావుత"మని శపించెను. తరువాత రాజు మేల్కాంచి శాపసంగతి యంతయు విని కోపమూఁపుకోఁజాలక "తెలియక నిద్రపోవుచుండఁగాఁ గోపించి కలుషితుఁడవై నాయందు శాపాగ్నిని విడిచితివి గనుక మునివరా! నీదేహముగూడఁ జేతనశూన్యముగాఁగావుత"మని యాతని శపించెను. ఇట్లిద్దఱును కోపమూఁపుకోఁజాలక యొకరినొకరు ఘోరముగా శపించుకొనిరి. సమానప్రభావములుగల యాయిద్దఱును వెంటనే విదేహులయిరి.

## ౫౬-వ సర్గము

### వసిష్ఠుని పునర్జన్మము

ఇట్లు రాముఁడు చెప్పినమాటలు విని లక్ష్మణుఁడు చేతులు జోడించుకొని రామునితో నిట్లనియె: "అన్నా! ఆయిద్దఱును నట్లు శపించుకొని దేహమును విడిచిరిగదా! మరల నెట్లు దేహములను బొందిరి"రన శ్రీరాముఁ డిట్లనియె: "లక్ష్మణా! అట్లు వారు దేహములను విడిచి యిద్దఱును తపోధనులే కనుక వాయుభూతులైరి. వసిష్ఠమహాముని యశరీరుఁడై యితరశరీరముకొఱకు బ్రహ్మయొద్దకుఁబోయి యతనికి నమస్కరించి వాయుభూతుఁడై యుండియే బ్రహ్మతో నిట్లనియె: "తండ్రీ! నిమి యిచ్చిన శాపమువలన నేను దేహములేనివాఁడనయితిని. లోకనాథా! మహాదేవా! నీ వండమునుండి పుట్టినవాఁడవయ్యు నబ్జమునుండి పుట్టినవాఁడవు. ఎవరికైనను దేహములేకయున్నచో మహాదుఃఖము గలుగును. దేహము లేనివాని క్రియలన్నియు లోపించు నని నీకు నేను వేఱుగాఁ జెప్పవలయునా! కావున నాకు వేఱొకశరీరము గలుగున ట్లనుగ్రహింపవేఁడెదను" అని యిట్లు వేఁడిన వసిష్ఠునిఁజూచి బ్రహ్మ యిట్లనియె: "వసిష్ఠా! నీవు మిత్రావరుణుల తేజమునఁ బ్రవేశింపుము. ద్విజోత్తమా! నీవపుడును అయోనిజుఁడవే యగుదువు. గొప్పదియగు ధర్మముతోఁగూడి మరల నావశమును బొందెదవు" అని యిట్లు బ్రహ్మ చెప్పఁగానే వసిష్ఠుఁ డాతనికిఁ బ్రదక్షిణమాచరించి యచ్చటినుండి తిన్నఁగా వరుణాలయమునకుఁ బోయెను. ఆకాలమందే మిత్రుఁడను నతఁడును క్షీరసముద్రముతోఁ

పూజితవాఁడై సురోత్తములచేఁ బూజింపఁబడుచు వరుణత్వమును జేయిం చెను. అప్పుడుసముద్రమున నప్సరశ్శ్రేష్ఠురాలగు నూర్వశి చెలికత్తెయలతోఁ గూడి స్వేచ్ఛగా సముద్రాభిరతయగుచు వరుణునియొద్దకు వచ్చినది. వరుణా లయములోఁ గ్రీడించుచున్నదియు, రూపవంతురాలును నగు నూర్వశిని జూచి వరుణుడు చాలసంతసించెను. పూర్ణచంద్రసమానముఖియుఁ, బద్మ దళసమనేత్రయునగు నూర్వశిని వరుణుడు గ్రామ్యధర్మమునకుఁ గోరెను. అప్పు డామె చేతులు జోడించుకొని యెదుటనిలువఁబడి "సురేశ్వరా! ఇంతకు ముందుగా నేను మిత్రునిచే వరింపఁబడియుంటిని" అన్నది. కందర్ప శరపీడితుఁడగు వరుణుఁడు "దేవనిర్మితమగు నీకుంభమునందు నాయీ తేజస్సును విడిచెదను. సుశ్రోణీ! వరవర్ణినీ! నీవు నాతో సంగమము నిచ్చుటయింపనిచో నేనట్లు విడిచి కృతకాముఁడ నయ్యెదను" అనెను. ఇట్లు లోకపాలుఁడగు వరుణుఁడు చెప్పినమాటలు విని యూర్వశి మిక్కిలి సంతోషించి యతనితో నిట్లనియె: "దేవా! నాహృదయము నీయందున్నది. నీవన్నట్లు చేయుము. నాభావము నీయధీనము. దేహమన్ననో మిత్రుని యధీనము" అని యూర్వశి చెప్పినతోడనే వరుణుఁడు పరమాద్భుతమును, జ్వలదగ్నిశిఖాప్రఖ్యమును నగు రేతస్సు నాకుంభమునందు విడిచెను. మిత్రుఁడను దేవత యున్నచోటి కా యూర్వశి పోయినది. మిత్రుఁ డాయూర్వశిపైఁ గోపించి యిట్లనియె: "ఓసీ! నీవు ముందుగా నాచేఁ గోరఁబడి నన్నువిడిచి మఱియొకమగని వరించితివి గనుక దుష్టచారిణీ! నీ వీపాపము కారణముగా నాకోపముచేఁ గలుషితురాలివై మనుష్యలోకములోఁ గొంతకాలమువఱకును నుండు ము. దుర్బుద్ధిగలదానవగుటచే బుధునికుమారుఁడును గాశిరాజును నగు పురూరవసునియొద్దకుఁ బొమ్ము. నీకతఁడు భర్తకాఁగలఁడు" అని శపిం చెను. తరువాత నామె శాపదోషమున పురూరవశ్చక్రవర్తిని బొందినది. అతఁడు బుధునకుఁ గడుపునఁబుట్టిన కుమారుఁడు. ఆతని కామెయం దాయు వను కుమారుఁడు గలిగెను. ఇంద్రునితో సమానకాంతిగల నహుషుఁ డాయాయువునకుఁ గుమారుఁడై పుట్టెను. దేవేంద్రుఁడు వృత్రునిపై వజ్రమువిడిచి యాబ్రహ్మహత్యవలన దేశములు దిరుగుచుం డఁగా నూఱువేలసంవత్సరము లానహుషుఁడు దేవేంద్రపదమునుబొంది లోకము లేలెను. చక్కనిపలువరుస గలదియు, సునేత్రయు నగు నా

యూర్వశి యాశాపమువలన భూలోకమునుబొంది చాలసంవత్సరములు
భూలోకములో నుండి శాపము క్షీణించిన తరువాత మరల నింద్రుని
సభకు వచ్చిచేరెను.

## 57-వ సర్గము

### నిమిపునర్జన్మము

లక్ష్మణుం డిట్లు శ్రీరాముడు చెప్పిన దివ్యాలంకారమయు నద్భుత
వర్ణనయు నగు కథవిని మిక్కిలి సంతోషించి రామునితో నిట్లనెను:
“కాకుత్స్థా! దేహరహితులగు నానిమి వసిష్ఠు లెట్లు నిత్యదేహులైరి
గదా! మరల వారు దేహయుక్తు లగుట యెట్లు సంభవించె” నని యడిగిన లక్ష్మ
ణునిమాట విని రాముడు వారిరువురి కథ యిట్లని చెప్ప మొదలిడెను:
“లక్ష్మణా! ఆమహాత్ముల తేజస్సులే బ్రహ్మనగు నాకుంభమునుండి
తేజోమయులగు నిద్దఱు విప్రు లుద్భవించిరి. అందు ముందుగా ఋషిసత్తముం
డగు నగస్త్యభగవానుడు పుట్టెను. అతడు నేను నీకుమారుడను గానని
మిత్రుని విడిచెను. ఆతేజస్సు పూర్వము మిత్రునకే యూర్వశికై కార్చి
నది. వరుణునితేజ స్సేకుంభమునందున్నదో ఆకుంభమునుండి మఱికొంత
కాలమునకు మిత్రావరుణ సంభవుండై తేజస్సుతోగూడి యిక్ష్వాకుదైవత
మగు వసిష్ఠుడు పుట్టెను. పుట్టినతోడనే యాముని మహాతేజశ్శాలి
యగు నిక్ష్వాకుమహారాజు మనవంశము వృద్ధిచెందుటకై పురోహితు
నిగా వరించెను. తమ్ముడా! యిట్లు పాయినదేహము మరల మన వసిష్ఠ
భగవానులవారికి గలిగినకథ వింటివిగదా! ఇక నిమిసంగతి చెప్పెదను
వినుము: అట్లు నిమి విదేహుడగుట ఋషులందఱును జూచి తరువాత
మనీషు లతనిని యాగదీక్షను యోజింపజేసిరి. బ్రాహ్మణు లాశరీరమును
జాగరూకతగా గంధమాల్యాదులచే నలంకరించి పౌరభృత్యసమన్వితులై
రక్షించుచుండిరి. తరువాత యజ్ఞము పూర్తికాగానే భృగుమహాముని
యిట్లనియె: “రాజా! నేను సంతోషించితిని. నీకు జైతన్యమును గలిగిం
చెద” ననెను. దేవతలందఱును నిమియొక్క చేతనమునుగూర్చి సంతో
షించి యిట్లనిరి: “రాజర్షీ! వరము గోరుము. నీచేతన మెచ్చట నుండవలె
యునో నిరూపింపుము” అని యందఱు దేవతలును పలుకగానే నిమి

యొక్క చేతనము "దేవతలారా! నేను సర్వప్రాణుల నేత్రములయందును నుండఁగోరెద" ననఁగానే దేవతలందఱును నిమి చేతనమునుగూర్చి "యట్లే యగుఁగా" కనిరి. నీ విట్లునైన వాయుభూతమవై సర్వభూతముల నేత్రములయందును సంచరింపుము. రాజా! నీకొఱకుఁగన్నులు నాడ్చుచుండును. నీవు వాయుభూతుఁడవై చరించునపుడు మాటిమాటికిని నీకు విశ్రాంతి గలుగుచుండును" అని పలికిచ్చి దేవతలందఱును యథాగతముగాఁ బోయిరి. మహాత్ములగు ఋషులు నిమి దేహమును దెచ్చిరి. దానియం దరణి నుంచి బలముగా మథించిరి. పుత్రజననముకై మంత్రములచేతను హోమములచేతను మథింపఁగా మహాతపశ్శాలి యగు పుత్రుఁడు పుట్టెను. మథించుటవలనఁ గలిగినవాఁడగుటచే వానికి మిథియని పేరిడిరి. జననమువలన జనకుఁడనిరి. విదేహునివలనఁ బుట్టుటచే వైదేహుఁడయ్యెను. ఇట్లు విదేహుఁడని జనకుఁడని వీరి మూలపురుషుఁడాయెను. మిథి యనువాని పేర మిథిల యను నగరము వర్తిల్లెను.

## 59-వ సర్గము

### రాముఁడు యయాతిచరిత్ర చెప్పుట

శ్రీరాముఁడిట్లు చెప్పఁగా విని తేజస్సుచే వెలుఁగుచున్న మహాత్ముఁడగు శ్రీరామునితో లక్ష్మణుఁ డిట్లనియె: "అన్నా! విదేహుని పూర్వకథ మిగుల నాశ్చర్యకరముగా నున్నది. రాజశార్దూలా! రామా! నిమియొక్కయు వసిష్ఠునియొక్కయు సంగతి వేరొకఁబడినది. నిమి క్షత్రియుఁడు, శూరుఁడు, అందును విశేషించి దీక్షితుఁడు. మహాత్ముఁడగు వసిష్ఠుని విషయమున శాంతినిజూపవలసియుండఁగా నట్లు చూపకపోయెను" అని యిట్లు లక్ష్మణుఁ డడుగఁగా రాముఁ డిట్లనియె: "తమ్ముఁడా! అంతటను బురుషులయందు శాంతి కనుపడుట దుర్లభము. రోషము నెట్టివాఁడును నాఁపుకోఁజాలఁడు. ఒక్కయయాతిమాత్రము తన సత్వగుణము నవలంబించి శాంతినే చూపెను. ఆకథ చెప్పెదను; సావధానముగా వినుము: నహుషునికి యయాతి యను కుమారుఁడు గలఁడు. ఆతనికి లో[illegible]వతులగు నిద్దఱు భార్యలు గలరు. అందొకతె వృషపర్వమహారాజు [illegible] శర్మిష్ఠ యనునది. రెండవభార్య శుక్రాచార్యుని కూఁతురు

దేవయాని. కాని శర్మిష్ఠ యంతగా యయాతికి దేవయాని ప్రేమాస్పద రాలుగాదు. ఆయిద్దఱు భార్యలకును రూపవంతులగు కొడుకులు పుట్టిరి. శర్మిష్ఠ యనునది పూరుని గన్నది. దేవయాని యదుండను వానిని గన్నది. రాజునకుఁ బూరుఁడెక్కువ ప్రేమాస్పదుఁడాయెను. ఏలనఁగా నాబాలుఁడు మొదలే గుణవంతుఁడు. రెండవది ప్రేమపాత్రమగు శర్మిష్ఠ కొడుకు. వానియందుఁ దండ్రికిఁ గల ప్రేమను సహింపఁజాలక యదుఁడు తల్లితో నిట్లనియె: «అమ్మా! నీవంతటి శుక్రాచార్యుని కూఁతురవై యిట్టి యవమానమును సహించుచున్నావు. కనుక మనమిద్దఱమును నగ్ని హోత్రములోఁ బ్రవేశింతము. రాజు రాక్షసరాజు కూఁతురగు దాసిని శర్మిష్ఠతో రమించుచు నుండనీ. ఒకవేళ నీవు సహించినను నే నాయవ మానమును సహింపఁజాలను. నాకనుజ్ఞ యిమ్ము. నేనిపుడే బలవంతముగాఁ జచ్చెదను" అని యిట్లేడుచుచుఁ జెప్పిన కొడుకుమాటలువిని దేవయాని పట్టరానంత కోపమును వహించి వెంటనే తండ్రిని స్మరించినది. ఆశుక్రుఁడు కూఁతు నభిప్రాయమును దెలిసికొని దేవయాని యున్నచోటికే వచ్చెను. మతిలేక ప్రకృతిచెడి సంతోషము దక్కియున్న కూఁతురు జూచి «అమ్మా యిదేటి సంగతి?" అని యడిగెను. ఇట్లు మాటిమాటికిని నడుగుచున్న తండ్రినిజూచి దేవయాని మిగులఁ గోపించి యిట్లనియె: «తండ్రీ! నే నగ్ని లోఁబడికాని, విషముతినికాని, నీళ్లలోఁ బ్రవేశించికాని చచ్చెదనుగాని యింక బ్రదికి యుండఁజాలను. నేనిదివఱకే యవమానింపఁబడి దుఃఖ సముద్రములో మునిఁగియున్నాను. నన్ను మఱింత యవమానమునకు లోనుగాఁజేసి దుఃఖింపఁజేయకుము. వృక్షమున కవమానము గలుగుట వలన వృక్షజీవులు ఖేదమును బొందుదురు. నామగఁడు నన్నవమానించి తిరస్కరించియున్నాఁడు. నన్ను బహుమానించుటయే లేదు" అని యిట్లు కూఁతురు చెప్పినమాటలు విని శుక్రాచార్యులు చాలఁగోపించి యయాతినిగూర్చి మాటలాడుట కుపక్రమించెను: «ఓరీ దురాత్మా! యయాతీ! నీవు నన్నవమానించితివి గనుకఁ బూర్ణముగా జరచే జీర్ణించి శైథిల్యమును బొందుము" అని యట్లుశపించి ద్విజపుంగవుఁడగు నాశుక్రాచార్యులు కూఁతురగు దేవయాని నోదార్చి సూర్యసమానతేజుఁ డతఁడింటికిఁ బోయెను.

## 59-వ సర్గము

### యయాతిచరిత్ర

అప్పుడు నహుషాత్మజుఁడగు యయాతి శుక్రుఁడు కోపించెనని విని గొప్పదియగు ముదిమినిఁబొంది దుఃఖార్తుఁడై యదువును బిలిచి యిట్లనియెను: "యదూ! నీవు ధర్మజ్ఞుఁడవు. నానిమిత్తమై ముదిమిని నీవు వహింపుము. నేను భోగము లనుభవింతును. విషయసుఖములయందు నా కింకను తృప్తి చాలకున్నది. నేను భోగముల ననుభవించి మరల నా ముదిమిని నేను గొందును" అను తండ్రిమాటలువిని యదువు తండ్రితో నిట్లనియె: "నీకు ముద్దులకుమారుఁడగు పూరుఁడు నీ ముదిమిని గ్రహించుఁగాక! ప్రతివిషయమందును నేను బహిష్కరింపఁబడియే యుంటిని. నీతోఁగూడి యెవ్వఁడు భుజించుచున్నాఁడో వాఁడే నీముదిమిని గ్రహింపరాఁడా!" అను యదునిమాటలు విని రాజు పూరుని బిలిచి యిట్లనియె: "నాయనా! పూరూ! నీవు నావిషయమై యీముదిమిని గ్రహింపుము" అను తండ్రిమాటలు విని యతఁడు చేతులు జోడించుకొని యిట్లనియె: "తండ్రీ! నేను ధన్యుఁడను. అనుగ్రహింపఁబడినవాఁడ నైతిని. నీయాజ్ఞను శిరసావహించెదను" అను పూరునిమాటలు విని యయాతి మిగుల సంతోషించి తన ముదిమిని వానియందు సంక్రమింపఁజేసెను. తరువాత నా రాజు యౌవనమును బొంది వేలకొలఁది యజ్ఞములు చేసి పెక్కువేలసంవత్సరములు భూమిని పాలించెను. ఇట్లు చాలఁగాల మతిక్రమించినవెనుకఁ బూరుని బిలిచి యిట్లనియె: "నాయనా! నేను నీయందు సంక్రమింపఁజేసిన నాముదిమిని నాకిమ్ము. నేను నీయొద్ద దాచుకొంటిని గనుక దానిని నేను ప్రతిగ్రహించుచున్నాను. వేఱుగాఁ దలఁపకుము. నాయాజ్ఞను నీవు మన్నించినందులకు నేనెంతయు సంతసించితిని. కనుక నిన్ను నారాజ్యమం దభిషిక్తునిగాఁ జేసెదను" అని పూరునకుఁ బట్టాభిషేకము చేసి దేవయాని కొడుకగు యదువునుజూచి కోపపూర్ణుఁడై యిట్లనియె: "ఓరీ! నీవు రాక్షసుఁడవు. నాకుఁ బుత్రరూపమునఁ బుట్టితివి. నీవు నాయాజ్ఞను మన్నింపవైతివి గనుక నీవు రాజ్యార్హత లేనివాఁడ వగుము. గురుభూతుఁడనగు తండ్రిని నన్నవమానించితివి గనుక నీవంశమునందు దుర్మార్గులగు రాక్షసులే జన్మింతురు. చంద్రునివలనఁ బుట్టిన నావంశమందు దుర్మార్గుఁడవగు నీవంశముం

డదు. నీవంశము నీతో సమానమై దుర్వినయసంపన్నము గాఁగలదు" అని వాని నిట్లు ధిక్కరించి పూరునకుఁ బట్టాభిషేకముచేసి వానప్రస్థాశ్రమములోఁ బ్రవేశించెను. అతఁడు మఱికొంతకాలమునకు దైవగతిని బొంది తాను జేసిన సుకృతముల ఫల మనుభవించుటకై స్వర్గమునకేగెను. తరువాతఁ బూరుఁడను కుమారుఁడు ప్రతిష్ఠానపట్టణమునుండి రాజ్యమేలెను. యదు వనువాఁడు వేలకొలఁది రాక్షసులను గనెను. వాని రాజవంశము బహిష్కరించుటచేఁ గ్రౌంచ మనువేరుగల దుర్గమైన యడవిలోనికిఁ బోయియుండెను. "తమ్ముఁడా! ఇట్లు శుక్రుఁ డిచ్చినశాపమును యయాతి సహించెను. రాజధర్మమునం దున్న నిమి గురుశాపమును సహింపఁజాలకపోయెను. ఇది వెనుకటిరాజుల చరిత్రము. నీకంతయుఁ జెప్పితిని. కావున మీరైనంతలో నృగమహారాజునందువలె దోషము తటస్థింపకుండ మసలుకొనుట చాల మంచికార్యము." ఇట్లు చంద్రతుల్యాననుఁడగు రాముఁడు కథలు చెప్పుచుండఁగా నపుడు నభోభాగమంతటను జుక్కలు పలుచనైనవి. తూర్పుదిక్కున నరుణుని కిరణములు వ్యాపించి ప్రకాశించినవి. తూర్పు కుసుమరసముతో రంగువేసిన వస్త్రమువలె నెఱ్ఱఁ బడినది.

---

# ప్రక్షిప్తసర్గములు

## 11-వ సర్గము

### రాముఁడు కుక్కవివాదము విమర్శించుట

తరువాతఁ బ్రభాతము కాఁగానే రాముఁడు పౌర్వాహ్ణికక్రియలు నిర్వర్తించుకొని ధర్మాసనమునందుండి బ్రాహ్మణులతోడను, పౌరులతోడను, వసిష్ఠునితోడను, కశ్యపుఁడను ఋషితోడను, వ్యవహారజ్ఞానముగల మంత్రులతోడను, ధర్మజ్ఞులగు నితరులతోడను, న్యాయశాస్త్రసంపన్నులగు సభ్యులతోడను, రాజులతోడను గూడి రాజధర్మములు కనుఁగొనుచుండెను. అక్లిష్టకర్ముఁడగు రామునిసభ మహేంద్రయమవరుణుల సభ నతిక్రమించియుండెను. తరువాత నాసభలో రాముఁడు లక్ష్మణునితో నిట్లనియె: "సుమిత్రానందవర్ధనుఁడవగు లక్ష్మణా! నీవు బయటికిఁబోయి కార్యార్థులెవ్వరైన నున్నచోఁ గనుఁగొని తీసికొని రమ్మనఁగానే యతఁ

డక్ష్మణుఁడు పోయి ద్వారదేశమునందు నిలువఁబడి స్వయముగాఁ గార్యార్థులను బిలువ మొదలిడెను. "నాకు నేఁడు కార్యమున్నది" అని యొక్కఁడును జెప్పఁడాయెను. రాముఁడు రాజ్యమేలుచుండఁగా నాధులుగాని వ్యాధులుగాని లేవు. భూమి పక్వసస్యయు, సర్వౌషధిసమన్వితయునై యుండెను. ఆయనరాజ్యములో బాలుఁడుగాని, వయసులోనున్న వాఁడుగాని మృతినొందుటయే లేదు. అంతయు ధర్మయుక్తముగాఁ బాలింపఁబడుచున్నది. ఎవ్వరికిని నేవిధమైన బాధయు లేదు. రాముఁడు రాజ్యమేలుచుండఁగాఁగార్యార్థియొక్కఁడును గనుపడఁడు. లక్ష్మణుఁడు రామునకుఁ జేతులు జోడించి "యెవ్వరును లే"రని విన్నవించెను.

తరువాత రాముఁడు ప్రసన్నుఁడై తమ్మునితో నిట్లనియె: "తమ్ముఁడా! నీవు మరలఁబోయి కార్యార్థులను విచారించిరమ్ము. బాగుగాఁ బ్రయోగింపఁబడిన నీతిచేతను నెచ్చటను నధర్మముండదు. ఆరాజభయము వలననే పరస్పరమును రక్షించుకొనుచుండునట్లుందురు. నాచే విడువంబడిన బాణములవలె నాప్రజలు రక్షించుచుందురు. అయినను నీవు జాగరూకుఁడవై ప్రజలను రక్షించుచుండుము" అనియిట్లు శ్రీరాముఁడు చెప్పఁగానే లక్ష్మణుఁడు రాజభవనమునుండి బయలుదేఱి ద్వారమునొద్దకు వచ్చి యచ్చట నొకకుక్కను జూచెను: అది లక్ష్మణునివైపుచూచి మొఱగుట ప్రారంభించినది. ఆసంగతి చూచి లక్ష్మణుఁడు దానితో నిట్లనియె: "మహాభాగా! శ్వానమా, నీకార్యమేమైన నున్నదా? నిర్భయముగాఁ జెప్పుము" అని లక్ష్మణుఁ డడుగఁగాఁ గుక్క యిట్లనియె: "సర్వభూతశరణ్యుఁడును, అక్లిష్టకర్ముఁడును, భయము గలిగినవారి కభయమిచ్చువాఁడును అగు రామునితోడనే మనవిచేయఁదలఁచితిని." లక్ష్మణుఁ డిట్లు చెప్పిన కుక్కమాటలు విని యాసంగతి రామునితో విన్నవించుటకు లోపలికిఁబోయెను. అట్లుపోయి రామునితో విన్నవించి మరల ద్వారమునొద్దకు వచ్చి "చెప్పవలసిన సంగతులు నీవే లోపలకు వచ్చి రామునితో విన్నవింపు" మన లక్ష్మణునిమాటలు విని కుక్క యిట్లనియె: "దేవాలయమందును, రాజమందిరమందును, బ్రాహ్మణులయిండ్లయందును వహ్ని, దేవేంద్రుఁడు, సూర్యుఁడు, వాయుదేవుఁడును నుందురు గావున నచ్చటికి మాబోఁటి నీచజంతువులు రాఁదగదు. అందును రాజు శరీరమును ధరించిన ధర్మమనికదా పెద్దలు చెప్పుచుందురు! రాముఁడు సత్యవాది, యుద్ధ

విశారదుఁడు, సర్వభూతములకును మేలుచేయుటయం దాసక్తిగలవాఁడు, షాడ్గుణ్యముయొక్క సంగతిని బాగుగాఁ దెలిసినవాఁడు, నీతిని బాగుగా వ్యాపింపఁజేయువాఁడు, సర్వజ్ఞుఁడు, సర్వమును గనుగొనువాఁడు, సంతోషించువారలలో నుత్తముఁడు, అతఁడే సోముఁడు, అతఁడే మృత్యువు, అతఁడే యముఁడు, కుబేరుఁడు, వహ్ని, దేవేంద్రుఁడు, సూర్యుఁడు, వరుణుఁడును నైనవాఁడు. కావున లక్ష్మణా! నీవేపోయి ప్రజాపాలకుఁడగు రామునితో విన్నపించుము. ఆయనయాజ్ఞ కాకుండ లోపలకు రానిచ్చగింపను" అని కుక్క చెప్పఁగానే దయాళువును, మహాభాగుఁడును, మహాద్యుతియునునగు లక్ష్మణుఁడు రాజసభలోనికిఁబోయి యిట్లనియె: "కౌసల్యానందవర్ధనుఁడ వగు రామా! నావిన్నపమును వినవలయును. నీయాజ్ఞను శిరసావహించి బయటికిఁబోయి చూచితిని. ద్వారమునొద్దఁ గుక్కయొకటి కార్యార్థియై యున్నది" అని పలికిన లక్ష్మణునిమాటలు విని "కార్యార్థియగువా రెవ్వరైనను సరియే లోపలకుఁ దీసికొనిర"మ్మని రాముఁ డాజ్ఞాపించెను.

## 12-వ సర్గము

రామునివాక్యము విని లక్ష్మణుఁ డతిత్వరగాఁ గుక్కను బిలుచుకొని రామునియొద్దకుఁబోయి విన్నవించెను. అట్లు వచ్చియున్న కుక్కను జూచి రాముఁ డిట్లనియె: "సారమేయమా! చెప్పఁదలఁచినసంగతి నాతోఁ జెప్పుము. నీకు భయములేదు" అంత తలపగిలియున్న యాకుక్క రాముని జూచి యిట్లనియె: "రాజు ప్రజలు నిదురించుచుండఁగా మేలుకొని యుండును. రాజు ప్రజలను బాలించుచుండును. కర్తయు గోప్తయు రాజే. రాజే సర్వలోకములకును దండ్రి. రాజు కాలము యుగము. అదియిది యననేల? ఈజగమంతయు రాజే. రక్షకుఁడగు రాజు బాగుగాఁ బ్రయోగింపఁబడిన నీతిచేత ధర్మమును రక్షించుచుండును. రాజు పాలించని నాఁడు ప్రజలందఱును వెంటనే నశింతురు. ధారణమువలన ధర్మమందురు. ధర్మముచేతను బ్రజలు ధరింపఁబడిరి. ధర్మము చరాచరప్రపంచమును ధరించుచుండును. ప్రజలనుగూడ ధరించుటవలనను, ధర్మముగాఁ బ్రజలను రంజింపఁజేయుటవలనను ధారణమని చెప్పఁబడినది. అదియే ధర్మమని నిశ్చయము. రాజా! ఈధర్మము బాగుగాఁ రక్షింపఁబడి యైహికాముష్మికముల నొసఁగును. ధర్మమువలనఁ బ్రాప్తింపనివస్తు వెందును లేదు,

దానము, దయ, సజ్జనులను బూజించుట, వ్యవహారములయం దార్జవము ననునవే పరమధర్మము. వానిని రక్షించుటవలన నైహికాముష్మికములు సిద్ధించును. సుప్రతిష్ఠితుఁడవగు రామా! నీవన్ని ప్రమాణములకును బ్రమాణభూతుఁడవైతివి. సజ్జనులచే నాచరింపఁబడినధర్మము నీవెఱుఁగనిది గాదు. ధర్మములకు నీవు పరమాశ్రయుఁడవు. గుణములకు సముద్రునితో సమానుఁడవు. రాజసత్తమా! నే నజ్ఞానమువలన నీతో నింతయుఁ జెప్పితిని. నేను 'తలవంచి నీయనుగ్రహమును వేఁడుచున్నాను. నాపైని నీవు కోపింప కూడదు" అని చెప్పిన కుక్కమాటలువిని రాముఁడిట్లనియె: "సారమేయమా! నేనిప్పుడు నీకేమిచేయవలయును? వెంటనే నిశ్చయముగాఁ జెప్పు"మనఁ గుక్కయిట్లనియె.

"ధర్మముచే రాష్ట్రము పొందఁబడును. ధర్మముచేతనే పాలింపఁ బడును. రాజు ధర్మమువలన శరణ్యుఁడగును. మఱియు నందఱభయమును బోఁగొట్టుచుండును. ఇది తెలిసికొని నాకేమిచేయవలయునో రామా! వినుము. సర్వార్థసిద్ధుఁ డను భిక్షుఁడు బ్రాహ్మణగృహమునం దుండెను. నే నేమియపరాధమును జేయకుండఁగనే యాబ్రాహ్మణుఁడు నాతల పగులఁ గొట్టెను" అను కుక్కమాట విని రాముఁడు వెంటనే ద్వారపాలకునిబంపి యాబ్రాహ్మణుని రావించెను. అప్పు డాబ్రాహ్మణుఁడు రామునిజూచి "రామా! నేనిపు డేమిచేయవలసియున్నదో చెప్పు"మన రాముఁడిట్లనియె: "బ్రాహ్మణా! నీ వీకుక్కను దల పగులఁగొట్టితివఁట! ఇది నీకేమపకారము చేసినది? నిష్కారణముగా దండముతో దీనిని గొట్టితివి. కోపము ప్రాణములను హరించు శత్రువు. క్రోధము మిత్రరూపమున నుండు శత్రువు. కోపము మిక్కిలి వాఁడిగల కత్తి. క్రోధమన్నింటిని నపకర్షించును. ఎంత తపస్సుచేసినను, ఎన్ని యజ్ఞములను జేసినను, ఎన్ని దానములిచ్చినను కోపమున్నచో నవియన్నియు గంగలోఁ గలియును. కావునఁ గోపమును విడువవలయును. ఇంద్రియములు పెంకెగుఱ్ఱములవలెఁ బరుగులిడుచుండును. వానిని ధైర్యమును సారథిగాఁజేసి యింద్రియగోచరమును సంహరించి స్వాధీనమం దుంచుకొనవలయును. మనస్సుచేతను, వాక్కుచేతను, కర్మములచేతను, చూపులచేతను లోకులకు శ్రేయస్సు గలుగఁజేయవలయును. అట్లు నడచువానికి ద్వేషమ్ముఁ డుండఁడు. వాని కేపాపమును గలుగదు. తీక్ష్ణమగు కత్తిగాని, కాలితోఁ ద్రొక్కఁబడిన పాముగాని, నిత్యమును

మునం దచటఁ గులపతినైయుండి శిష్టాన్నమును భుజించుచు దేవద్విజ పూజయం దాసక్తిగలిగి దాసీదాసాదులకుఁ బంచియిచ్చుచు శుభకార్యములయం దాసక్తుఁడనై దేవద్రవ్యమును గాపాడుచు నుంటిని. మఱియు నేను వినయము గలిగి శీలసంపన్నుఁడ ననిపించుకొనుచు సర్వజంతువులకు మేలుచేయుచు నుండియు నిట్టిఘోరమగు నీచజాతియందుఁబుట్టి యధమ గతి ననుభవించుచున్నాను. ఇట్లు కోపముతోఁగూడిన యీబ్రాహ్మణుఁడు ధర్మము విడిచి యహితాసక్తుఁడై నృశంసుఁడు పరుషచిత్తుఁడు నగును. మఱియు నితఁడు పండితుఁడును ధర్మాత్ముఁడును గాఁడు కావున నితఁడు కులములను, నేడుకులములను నరకమునఁ గూలఁద్రోయును. కావుననే యెట్టిచిక్కులు తటస్థించినను దేవాలయాధికారమునందుఁ బ్రవేశింపఁ గూడదందురు. ఎవనిని బుత్రులతోడను, పశువులతోడను, బంధువుల తోడను నరకమునకుఁ బంపఁ దలంచుకొందురో వానికి దేవాధికారము గోబ్రాహ్మణాధికారము నీయవలయును. బ్రాహ్మణధనము, దేవద్రవ్యము, స్త్రీధనము, బాలురధనము నెవరు హరింతురో వారి యిష్టము లన్నియు నశించును. అందును దేవబ్రాహ్మణధనము నపహరించినవారు వెంటనే మహావీచి యను నరకమందుఁ గూలుదురు. ఎవఁడు మనస్సుచేతనుగూడ దేవతలయు బ్రాహ్మణులయు ధనమును హరింపఁదలఁచునో వాఁ డొక నరకమునుండి మఱియొకనరకమునకుఁ బోవుచునేయుండును" అని యిట్లు కుక్క చెప్పినమాటలు విని యాశ్చర్యముచే వికసించిన కన్నులుగలవాఁడై యుండెను. కుక్క రామునియొద్ద సెలవుగైకొని వచ్చినదారినే పోయినది. అది పూర్వజన్మస్మృతిగలదై మనోనిగ్రహ మవలంబించి జాతిమాత్రము చేతనే దూషితమయ్యును వారాణసికిఁబోయి ప్రాయోపవేశముచేసి ప్రాణము విడిచి యోగుల కందరాని పదమును బ్రాపించినది.

## 13-వ సర్గము

### రాముఁడు గృధ్రోలూకవివాదము తీర్చుట

ఇట్లుండఁగా రమ్యమును వృక్షములచే శోభితమును, నదీకీర్ణమును, గిరిచరమును, ననేకకోకిలకూజితమును, సింహములు, పెద్దపులులు మొదలగు వనజంతువులు గలదియు నానావిధములైన పక్షులు గలదియు నగు నొకానొకవనములో నొక్కగ్రద్ధయు గ్రుడ్లగూబయుఁ జిరకాలమునుండి

వాసము చేయుచుండినవి. గ్రుడ్లగూబ నివసించు నింటిని పాపవినిశ్చయ
మగు గృధ్రము "ఈయిల్లు నాది" అని యాక్రమించుకొని కలహము
ప్రారంభించినది. "రాజీవలోచనుఁడగు రాముఁడు సర్వలోకములకును
రాజు. ఆయనవద్దకుఁబోయి చెప్పుకొందము. ఆయన యీయిల్లెవ్వరి
దని తీర్పుచెప్పునో వారే దీని ననుభవించవలెను" అని యన్యోన్యమును
నాలోచించి యారెండును గోపామర్షములతోఁగూడి రామునియొద్దకు
వచ్చినవి. అట్లన్యోన్యము జగడమాడుచువచ్చి యవి రామునిపాదముల
పైఁబడినవి. అపుడు గ్రద్ద రామునిజూచి యిట్లనియె: "రామా! నీవు
సురాసురులకుఁ బ్రధానుఁడవని నాతాత్పర్యము. నీతియందు బృహస్పతి
కంటెను శుక్రునికంటెను నెక్కువవాఁడవు. భూతముల మంచిచెడ్డ లెఱుఁ
గుదువు. కాంతిచేఁ జంద్రునివంటివాఁడవు. సూర్యునివలెఁ జేరిచూడ
శక్యముగాని ప్రతాపము గలవాఁడవు. హిమవంతుని మించిన గౌరవము
గలవాఁడవు. సముద్రమువంటి గాంభీర్యము గలవాఁడవు. లోకపాలుఁ
డగు యమునివంటి ధర్మముగలవాఁడవు. భూమితో సమానమగు నోరిమి
గలవాఁడవు. వేగమునం దనిలునివంటివాఁడవు. నీవ గురువవు; సర్వ
సంపన్నుఁడవు; కీర్తిమంతుఁడవు; అమర్షముగలవాఁడవు; దుర్జయుఁడవు;
జయించువాఁడవు; సర్వాస్త్రముల విధులను దెలిసినవాఁడవు. నరశ్రేష్ఠుఁడ
వగు రామా! నాదొకవిన్నపము గలదు చిత్తగింపుము. నేను పూర్వము
గట్టుకొన్నయిల్లు నాదని బాహుబలము నాశ్రయించి యీయులూక
మాక్రమించుకొన్నది. నీవు నన్ను రక్షింపవలయును" అని యిట్లు
గృధ్రము చెప్పఁగానే గ్రుడ్లగూబ యిట్లనియె: "రామా! చంద్రుని
యొక్కయు, దేవేంద్రునియొక్కయు, సూర్యునియొక్కయు, యముని
యొక్కయు నంశములవలన రాజు పుట్టును. మనుష్యుఁడని పేరేకాని రాజు
సాక్షాద్దేవాంశసంభూతుఁడు. అందును నీవు ధర్మమయుఁడవు. రెండవ
నారాయణమూర్తివి. రాజా! నీసౌమ్యత బాగుగాఁ బ్రణిహితమైయున్నది.
సమముగా సంచరింతువు. కావున నీవు సోమాంశసంభూతుఁడవు. ప్రజా
నాథా! క్రోధమువిషయమున, దండమువిషయమున, దానమువిషయము
నను పాపమువలనఁ గలుగు భయమును బోఁగొట్టుటచేతను దాతవు,
హరించువాఁడవు, రక్షకుఁడవు నగుటచేతను నీవే యింద్రుఁడవు. సర్వ
భూతములయందును దేజస్సుచే ధర్షింప శక్యముగానివాఁడవగుటను నీ

వహ్నిదేవునితో సమానుఁడవు. నీవు సాక్షాత్తుగాఁ గుబేరునితో సమానుఁ
డవు. అట్లననేల? రాజసత్తమా! నీవు కుబేరునికంటె నధికుఁడవు. విత్తేశునికి
వలెనే నీకును పద్మయగు లక్ష్మిగలదు. స్థావరములు జంగమములు నగు
సర్వభూతములయందును సముఁడవు. రాఘవా! శత్రువులయందును
మిత్రులయందును నీదృష్టి సమానముగా నుండును. నీశాసనము నిత్య
మును ధర్మము ననుసరించియుండును. వ్యవహారము విషయమై విధి
యొక్క క్రమము ననుసరించియుండును. నీవెవనివిషయమై కోపింతువో
వానియొద్దకు మృత్యువు వచ్చును. అందుచే నీవు యముఁడవని
యమితవిక్రముఁడవని చెప్పఁబడుచున్నావు. ఇపుడు నీకు మానుష
భావము గలదు. నీ వాన్నృశంస్యపరుఁడవు. జంతువులయందు క్షమతోఁ
గూడియుందువు. దుర్బలునకు దిక్కులేనివానికి రాజే బలము; దిక్కు.
కన్నులులేనివానికి నీవే కన్ను. గతిలేనివానికి నీవే గతి. మాబోంట్లకును
నీవే నాథుఁడవు. ధర్మాత్మా! నామొఱ్ఱ వినుము. ఈగృధ్రము నాయింటఁ
బ్రవేశించి నన్ను బాధించుచుండును. నరపుంగవుఁడవగు నో దేవా!
మనుష్యులను నీవు శాసించువాఁడవు" అనిచెప్పిన యులూకముమాటలు
విని రాముఁడు స్వయముగా మంత్రులను బిలిచెను. ధృష్టి, జయంతుఁడు,
విజయుఁడు, సిద్ధార్థుఁడు, రాష్ట్రవర్ధనుఁడు, అశోకుఁడు, ధర్మపాలుఁడు,
మహాబలుఁడు ననువారు రామునిమంత్రులు. వీరే దశరథునినాఁడును
మంత్రులు. వారు నీతికోవిదులు, మహాత్ములు, సర్వశాస్త్రములు దెలిసిన
వారు. ప్రీతిమంతులు, సత్కులమందుఁ బుట్టినవారు. నీతియందును,
ఆలోచనచెప్పుటయందును నేర్పరులు. ధర్మాత్ముఁడగు రాముఁడు పుష్పక
మును స్మరించెను. అంత మంత్రులతోఁగూడ దానిపై నాయిల్లుగల
చోటికిఁబోయి పుష్పకమునుండి దిగి మంత్రులసమక్షమున నాగృధ్రోలూక
వివాదమునుగూర్చి రాముఁడిట్లు ప్రశ్నించెను. "ఓగృధ్రమా! నీవెన్ని
సంవత్సరములనాఁ డీయింటినిగట్టితివి? దీనికిఁ గారణము నీకుఁ దెలిసియుం
డినచో యథార్థముగాఁ జెప్పు" మని యడుగఁగా నాగృధ్రము రాము
నితో నిట్లనియె:

"రామా! ఈభూమి యెప్పుడు మనుష్యులతోఁ గూడియున్నదో,
అప్పటినుండియు నేనాయింట నుంటిని" అనఁగానే గూబ "రామా! ఎప్పు
డీభూమి చెట్లతోఁ గూడియున్నదో, అదిమొదలు నేనాయింటనుంటి"

అనెను. ఇట్లుభయజంతువులును జెప్పినమాటలువిని రాముడు సభాసదు
లతో నిట్లనియె: "వృద్ధులులేనిసభ సభకాదు. ధర్మమును జెప్పనివారు
వృద్ధులుగారు. సత్యములేనిది ధర్మముగాదు. మోసముతోఁగూడినది
సత్యముగాదు. సభ్యులు సదా తెలిసి ధ్యానించుచు మూకయుందురో!
సమయము తటస్థించినపుడు చెప్పరో! వారందఱును యథార్థముచెప్పని
వారే యగుదురు. తెలిసియుఁ బ్రశ్నములకుఁ గామమువలనఁగాని,
క్రోధమువలనఁగాని, భయమువలనఁగాని చెప్పనిచో వారిని వేలకొలఁది
వారుణపాశములువచ్చి చుట్టుకొనును. వారికొక్కొక్కసంవత్సరమున
కొక్కొక్కపాశము విడువఁబడుచుండును. కావునఁ దెలిసినవారు
సత్యమునే చెప్పవలయును" అనిచెప్పిన రామునిమాటలువిని మంత్రు
లిట్లనిరి. "మహామతివగు రామా! ఉలూకము గెలిచినది, గృధ్ర మోడి
పోయినది. మహారాజా! ఈవిషయమై నీవే ప్రమాణము. రాజేకదా
యెల్లరకును బరమగతి. ప్రజలందఱకును రాజే మూలము. రాజు సనా
తనమైనధర్మము. ఎవరిని రాజు శాసించునో వారు నరకమును బొందరు.
వైవస్వతునిచే విడువఁబడినవారు పురుషోత్తములగుదురు" అని చెప్పిన
మంత్రులమాటలు విని రాముఁడిట్లనియె: "నేను బురాణములయందుదా
హరింపఁబడిన సంగతి చెప్పెదను వినుఁడు: అపుడు చంద్రార్కనక్షత్రము
లతోఁగూడిన యంతరిక్షము, పర్వతములు మహావనములు మొదలగు
వానితోఁ గూడినభూమి సముద్రములతోఁ గూడినదియు చరాచరము
లతోఁ గూడినదియు, నగు త్రైలోక్యమంతయు నొక్కటియై రెండవ
మేరువువలె నుండెను. పూర్వము భూమి లక్ష్మితోఁగూడ విష్ణుని జఠర
ములోఁ బ్రవేశించినది. మహాతేజశ్శాలి యగునతఁడు సలిలార్ణవమును
బ్రవేశించి యాభూమిని నిగ్రహించి బహుసంవత్సరములు నిద్రించెను.
విష్ణుఁడు నిద్రవోవుచుండఁగా బ్రహ్మ యతనిజఠరములోఁ బ్రవేశించెను.
విష్ణుని నాభియందు హేమవిభూషితమగు పద్మము పుట్టినతోడనే బ్రహ్మ
దేవుఁడు యోగబలముచే బయటికి వచ్చి సృష్టి చేయఁదలఁచినవాఁడై
భూమిని వాయువును పర్వతములను వృక్షములను మనుష్యులను సరీ
సృపములు మొదలగువానిని జరాయుజములను అండజములను మహా
తపశ్శాలి యతఁడు సృజించెను. తరువాత విష్ణుని కర్ణమలమువలనఁ బుట్టిన
మధుకైటభులు రాక్షసులు మహావీర్యులు ఘోరరూపులు దురాసదులు

నయి బ్రహ్మనుజూచి కోపించిరి. వెంటనే వారు మహావేగముతోఁ గూడిన వారై బ్రహ్మమీఁదికి జగడమునకు వచ్చిరి. బ్రహ్మ వారినిద్దఱను జూచి వికృతముగా మొఱ్ఱపెట్టెను. ఆధ్వనిచే విష్ణువు నిద్రమేల్కాంచి రాక్షసులతో యుద్ధముచేసి చక్రముచే మధుకైటభులను జంపెను. తరువాత వారిమెదడుచే నీభూమిని ముంచి లోకధారి యగుహరి భూమిని మరల శోధించి శుద్ధముచేసి వృక్షములచే నిండించెను. ఓషధులు సర్వవిధములైనసస్యములు వేలువేలుగాఁ బుట్టినవి. మేదోగంధము గలది యగుటచే నీభూమి మేదిని యని పేరుపడినది. కావున నీయిల్లు గ్రద్దగూబదేకాని గృధ్రముది కాదని నాయభిప్రాయము. ఒకరియింటిని హరించిన యాగృధ్రము పాపి; దండనకుఁ దగియున్నది. వినయము విడిచి యనాథజంతువును బీడించుచుఁ బాపము సంపాదించుచున్నది" అని రాముఁడు చెప్పినతోడనే యాకాశవాణి యిట్లనియె: "రామా! తపోబలముచేత నిదివఱకే దగ్ధమైయున్న యీగృధ్రమును నిష్కారణముగాఁ జంపకుము. పూర్వకాలమున గౌతమశాపదగ్ధమైన ప్రజానాథుఁడు ధనేశ్వరుఁడు. ఇది పూర్వజన్మమున బ్రహ్మదత్తుఁడను పేరుగలవాఁడు. శూరుఁడు, సత్యవ్రతుఁడు, శుచి. వీనియింటికి గౌతముఁ డనుబ్రాహ్మణుఁడు భోజనార్థము వచ్చెను. 'రాజా! నీయింట నూఱుసంవత్సరములు పూర్తిగా భుజించెద'ననెను. బ్రహ్మదత్తుఁ డనురాజు గౌతమున కర్ఘ్యము పాద్యము స్వయముగా నిచ్చెను. అతనికిఁ బ్రీతిపూర్వకముగాఁ గోరినమేరకు భోజనము పెట్టెను. ఒకనాఁ డాహారములో నెట్లో మాంసము మిశ్రితమైనది. వెంటనే గౌతముఁడు కోపించి 'రాజా! నాకు మాంసము పెట్టితివి గనుక నీవు గృధ్రమ వగు'మని శపించెను. మఱియు నతఁ డిట్లనియె: రాజా! ఇక్ష్వాకువంశములో రాజీవలోచనుఁడు రాముఁడు పుట్టును. అతనిచే స్పృశింపఁబడి నిష్పాపుఁడవగుదు"వనెను. ఇట్లనిచెప్పిన యాకాశవాణి మాటవిని రాముఁ డాగృధ్రమును స్పృశించెను. ఆగ్రద్ద గృధ్రత్వమును విడిచి వెంటనే దివ్యగంధానులేపనుఁడగు దివ్యపురుషుఁడై రామునితో నిట్లనియె: "రామా! సాధు! సాధు! నీయనుగ్రహమువలన ఘోరనరకమునుండి విముక్తుఁడనైతిని. నీవు నాశాపమున కంతము గలిగించితివి. నీదయవలన నేను బోవుచున్నాను" అని యెందేనిపోయెను.

ప్రక్షిప్తసర్గములు సమాప్తము.

## 60.వ సర్గము

### తాపసుల రాక

అప్పుడు రామలక్ష్మణు లిట్లుమాటలాడుకొనుచుండఁగా సమశీతోష్ణ
మగు వసంతకాలపు రాత్రి తుదముట్టెను. తరువాత రాముఁడు విమల
మగు ప్రభాతమునఁ బౌర్వాహ్ణికక్రియలు నిర్వర్తించుకొని పౌరకార్యము
లను జూచుట కుపక్రమించెను. తరువాత సుమంత్రుఁడు వచ్చి రాము
నితో నిట్లనియె: "రాజా! తాపసులు ద్వారమునొద్ద కాచియున్నారు.
వారు భార్గవచ్యవనుని బురస్కరించుకొనివచ్చిరి. వారు నీదరిసెనమును
త్వరగాఁ గోరుచున్నారు. వారు నీయందుఁ బ్రేమగలవారు; యమునా
తీరనివాసులు" అని చెప్పిన సుమంత్రునిమాటలువిని ధర్మాత్ముఁ డగు రాముఁ
డిట్లనియె: "సుమంత్రా! భార్గవప్రముఖులగు ఋషిమహాభాగులను లోప
లకుఁ దీసికొని రమ్ము" అనిచెప్పిన రామునిమాటలువిని ద్వారపాలుఁ
డాదరముగాఁ జేతులు జోడించుకొని యావచ్చిన తాపసులను లోపలఁ
బ్రవేశింపఁజేసెను. తమతేజస్సుచేఁ బ్రకాశించువారు మహాత్ములు తాప
సులు నూఱుగురికంటె హెచ్చుగానేయున్నారు. వారు సర్వతీర్థముల
యందును సంపాదింపఁబడిన పుణ్యజలముతోఁ గూడిన కలశములను పట్టు
కొనివచ్చి ఫలమూలాదికముతో రామునకు సమర్పించిరి. ప్రీతిపూర్వక
ముగా శ్రీరాముఁడు వారిచ్చినవన్నియుఁ బరిగ్రహించి యామునులతో
నిట్లనియె: "మహర్షులారా! ఇవిగో నాసనములు. యథోచితముగాఁ
గూర్చుండుడు" అను రామునిమాట విని మహర్షులందఱును బంగారు
వికారమైన బృసులయందుఁ గూర్చుండిరి. వారు కూర్చున్నపిదప పర
పురంజయుఁడగు రాముఁడు నమస్కరించి చేతులు జోడించుకొని యిట్ల
నియె. "మహాత్ములారా! తమరాక కేమిప్రయోజనము? నావలనఁ గావల
సిన దేమిగలదో సెలవిండు. మీయాజ్ఞను శిరసావహించి నెఱవేర్చుటకు
సిద్ధముగా నున్నాఁడను. నారాజ్యము, నాజీవనము మొదలగునదంతయు
బ్రాహ్మణులకొఱకే. నేను యథార్థముగాఁ జెప్పుచున్నాను" అని రాముఁ
డనఁగానే వారందఱును సాధువాదములు ప్రారంభించిరి. మఱియు
యమునాతీరవాసులగు ఋషులు పరమసంతోషముతోఁ గూడినవారై
రామునితో నిట్లనిరి: "ఇట్లుచెప్పుట రామా! నీకేతగును గాని మఱియొక

రిగి నశించిరి. ఇదివఱ కెందఱో మహాబలులగు రాజులు గతించిరి. కార్య గౌరవ మాలోచించి ప్రతిజ్ఞ కిష్టపడరైరి. నీవో బ్రాహ్మణులయందుఁగల గౌరవమువలనఁ గారణమును గనిపట్టి యిట్లు ప్రతిజ్ఞ పట్టితివి. కావున మేము వచ్చినపని తప్పక నీవు చేసెదవు. ఇందు సందియము లేదు. కావున మహాభయమునుండి మునులను రక్షించుట నీకే తగియున్నది.”

## 61-వ సర్గము

### లవణాసురుని కథ

ఇట్లు చెప్పినమునులతో రాముఁ డిట్లనియె: “మునులారా! నా వలనఁ గావలసినకార్యము చెప్పుఁడు. మీభయము పోవునుగాక!” అని యిట్లడిగిన రామునితో భార్గవుఁ డిట్లనియె: “నరేశ్వరా! దేశమునకు భయకారణము చెప్పెద నాలింపుము. రాజా! పూర్వము కృతయుగ మందు లోలయనుదాని పెద్దకొడుకు మధువనురాక్షసుఁ డొకఁ డుండెడి వాఁడు. వాఁడు మహాబలశాలియయ్యును బ్రహ్మణ్యుఁడు బుద్ధిశాలియు నైయుండెడివాఁడు. వానికి దేవతలతో మిక్కిలి స్నేహముగలదు. వీర్య సంపన్నుఁడగు నామధువు ధర్మమునందు మిక్కిలి యాసక్తుఁడు. అతఁడు రుద్రునిగూర్చి పెక్కువేలసంవత్సరములు తప మాచరించెను. ఆతని తపస్సునకు సంతోషించి శివుఁడు వర మీయఁబోయెను. ఆతనియందలి గౌరవముచే నత్యద్భుతమైనవర మిచ్చెను. మఱియుఁ దనశూలమునుండి శూలమును సృజించి యిచ్చి యిట్లనియె: “ఓయీ! నీవు నాకనుగ్రహము గలుగులాగున నిరుపమానమగు ధర్మము నాచరించితివి. నీయందు నాకు గొప్పప్రీతిగలుగుటచే నీ కీయాయుధము నిచ్చుచుంటిని. ఈశూలము మహావీర్యము, మహాప్రభము నని యెఱుఁగుము. నీవు దేవతలకును బ్రాహ్మణులకును హానిచేయకుండ నున్నంతవఱకును నీయొద్ద నుండును. హానిచేసితివేని నశించిపోవును. నీపైకి యుద్ధమునకు వచ్చినవానిని నశింపఁ జేసి యీశూలము మరల నీచేతికి వచ్చును.” ఈరీతిగా నామధురాక్షసుఁ డీశ్వరునివలన వరము పొంది మరల నమస్కరించి యీశ్వరునితో నిట్లు విన్నవించెను: “శివభగవానులవారా! తాము సురాసురుల కీశ్వరత్వ మును బొందియున్నారు. ఈయాయుధము నావంశమువారికి సంతతము నుండునట్లుగూడ వర మీయ వేఁడెదను.” అనియిట్లు ప్రార్థించిన మధురాక్ష

సునిజూచి సర్వభూతపతి యగు శివుఁడు “దని యట్లు కానేరదైనను నా యనుగ్రహమునకుఁ బాత్రమవైన నీకోరిక వ్యర్థపుచ్చరాదు గనుక నీ కుమారునికిమాత్రమే యాయుధమై యుండునని శివుఁడనెను. ఎంత వఱకు నీకుమారునిచేతిలో నీశూలముండునో అంతవఱకును వాని నెవ్వరును జయింపఁజాలరు. వేయేల? వాఁడు నాతో సమానుఁడగు”ననెను. ఇట్లు మధురాక్షసుఁడు శివునివలన వరములు పొంది తనయిల్లు దేదీప్యమానముగాఁ జేయించెను. అతనిభార్యయే రావణాసురుని పినతాత కూఁతు కూఁతురు కుంభీనస యనునది. అది విశ్వావసువను గంధర్వుని వలన ననల యనుదానియందుఁ బుట్టినది. దానికొడుకు లవణాసురుఁడు. వాఁడు మహాపరాక్రమశాలి. అతి దారుణమైనవాఁడు. వాఁడు బాల్యమునుండియుఁ బాపములే చేయుచుండెను. అట్టి దుర్వినయ సంపన్నుఁడగు కొడుకునుజూచి మధువు కుపితుఁడై దుఃఖించెనే కాని వాని నేమియు ననఁడయ్యెను. ఆమధు వీలోకమును విడిచి వరుణలోకమునకుఁ బోవుచుఁ గొడుకున కాశూలము నిచ్చి శివునివరము సంగతి వినిచెను. వాఁడు మొదలే దుర్మార్గుఁడు. ఆపైన యాశూలముయొక్క ప్రభావము వలన మూఁడులోకములను బాధించుచున్నాఁడు. అందును మాబోఁటి మునులను వాఁడు మఱియు బాధించుచున్నాఁడు. రామా! లవణాసురుఁ డిట్టి ప్రభావముగలవాఁడు. వానియొద్దనున్నశూల మట్టిది. ఉన్నసంగతి విన్నవించుకొంటిమి. అటుపైని నీచిత్తము మాయదృష్టము. నీకన్న మాకు గతి లేదులేదు లేదు. మేమిదివఱ కెందఱురాజులనో శరణువొచ్చితిమి గాని యెవ్వరును మాభయమును దీర్చి కాపాడఁజాలకపోయిరి. ఇప్పుడు మేమందఱమును నీవు రావణాసురుని సహపుత్రమిత్రాదులతోఁ జంపితివని విని నీవే తప్ప నిఁక మమ్ములను రక్షించువారు లేరని నిన్ను శరణువొచ్చి తిమి. కావున లవణునివలన భయపడిన మమ్ములను గాపాడి పుణ్యము గట్టుకొనుము. రామా! మాభయకారణమంతయుఁ జెప్పితిమి. దానిని దొలఁగించుటకు నీవే తగినవాఁడవు. అహీనవిక్రమా! నీవు మాకోరికి నెఱవేర్పుము.”

## 62వ సర్గము

### రాముఁడు లవణుని జంపించెద ననుట

అని యిట్లు ఋషులు చెప్పినమాటలు విని రాముఁడు చేతులు

జోడించుకొని వారితో నిట్లనియె: "వాఁ డెట్టియాచారముగలవాఁడు? వాని కాహారమేమి? వాఁడు నివసించు చోటేది?" అని యడిగిన రామునిమాటలు విని మునులందఱును లవణుఁ డెట్లువృద్ధిపొందెనో దాని నిట్లు చెప్ప మొదలిడిరి: "రామా! వానికి సర్వజంతువులు నాహారమే; కాని విశేషించి తాపసులను దినుచుండును. వాని యాచారము నిత్యమును రౌద్రతయే. వాఁడు మధువనమందుండును. వాఁడు వేలకొలఁది సింహములను వ్యాఘ్రములను మృగములను జంపి, మనుష్యుల నాపైని జంపి నిత్యమును భోజన మాచరించుచుండును. మహాబలుఁడగు నాలవణాసురుఁడు మధ్యమధ్య నితరజంతువులనుగూడఁ జంపి తినుచుండును. వేయేల? వాఁడు సంహారమున కుపక్రమించినచో నోరు తెఱచుకొన్న యముఁడేయని చెప్పక తప్పదు." అనిచెప్పిన మునుల మాటలు విని "మునులారా! నేను వానిని దప్పక చంపించెదను. మీరిటుపైని వానికి భయపడవల"దని ధైర్యము చెప్పెను. ఇట్లుగ్రతేజులగు మునులతోఁ బ్రతిజ్ఞపట్టి తమ్ములనందఱనుజూచి యిట్లనియె: "తమ్ములారా! లవణుని జంపువా రెవ్వరు? వాని నెవ్వనిభాగముగా నిర్ణయించుకొంటిరి? భరతుని భాగమా? లేక శత్రుఘ్నుని భాగమా? వేగముగఁ జెప్పుఁ" డన భరతుఁ డిట్లనియె: "అన్నా! నేను వానిని జంపెదను. నాభాగముగా నేర్పఱుపవలెను" అనియిట్లు ధైర్యశౌర్యసమన్వితముగాఁ జెప్పినభరతుని పలుకు విని లక్ష్మణునితమ్ముఁడు శత్రుఘ్నుఁడు వెంటనే కనకాసనమునుండి దిగి నిలువఁబడెను. అతఁడు రామునకు నమస్కరించి యిట్లనియె: "అన్నా! మనభరతుఁడు చేయవలసినంతపని యిదివఱకే చేసియున్నాఁడు. మీరు పూర్వము దండకలో నున్నప్పు డీయయోధ్యాపట్టణమును బాలించెను గదా! మీరు వచ్చువఱకును నీతఁడు పడిన సంతాప మిట్టిదని చెప్పుటకు వలనుపడదు. అదిగాక యితఁడు బహుదుఃఖములనుగూడ ననుభవించి యున్నవాఁడు. నందిగ్రామములోనుండి దుఃఖశయ్యలపైనే శయనించి దుఃఖములపాలాయెను. ఫలములు దుంపలు భుజించెను. జటలు ధరించెను. నారచీరలు గట్టెను. ఇదివఱకే యతఁ డెక్కువదుఃఖములను బొందియుండుట మరల దుఃఖములను బొందు టుచితముగాదు. అదియునుంగాక, కింకరుఁడ నేనుండఁగా నతఁడేల శ్రమపడవలయును" అని శత్రుఘ్నుఁ డనుచుండఁగా రాముఁడిట్లనియె: "సరియే శత్రుఘ్నా! అట్లే చేయుము.

నాయానతి నెఱవేర్పుము. నిన్నిపుడే మధురాధీశుని నగరమున నభిషే
కించెదను. భరతునికి శ్రమగలుగునని యోజించుచుంటివేని యతని
నాఁపుము. అదిగాక నీవును శూరుఁడవు; కృతవిద్యుఁడవు; రాజ్యమేలఁ
జాలినవాఁడవు. ఎవఁడు శత్రుపురము జెల్లించి తత్స్థానమున వెంటనే
మఱొకరాజు నుంచఁడో వాఁడు నరకమును బొందును. నీవు పాపనిశ్చ
యుఁడగు లవణుని జంపి నామాటయందు గుఱియుంచుకొని ధర్మముగా
రాజ్యమును బరిపాలింపుము. శూరా. శత్రుఘ్నా! నామాటకు బదులు
చెప్పకుము. బాలుఁడగుతమ్ముఁడు దన్న చెప్పినమాట తప్పక వినవలయును.
శత్రుఘ్నా! నాయిష్టప్రకారం మీవును చేయఁబోవు నభిషేక మంగీకరిం
పుము. అదియును వసిష్ఠాదులగు విప్రులచే విధిమంత్రపురస్సరముగఁ
జేయఁబడును."

## 63-వ సర్గము

### శత్రుఘ్నుని మధురకు రాజునుగాఁ జేయుట

రాముఁ డిట్లు చెప్పఁగానే మిగుల సిగ్గుపడి వీర్యసంపన్నుఁడగు
శత్రుఘ్నుఁడు మెల్లమెల్లఁగా నిట్లనియె: "నరేశ్వరా! ఈవిషయము నే
నధర్మముగా భావింతును. పెద్దలుండఁగాఁ జిన్న లభిషేకింపఁబడుదురా?
తప్పక నీశాసన మాచరింపఁదగియున్నది. అదియునుంగాక, నీశాసనము
దాఁటుటకు వీలుగానిది. మహావీరా! రామా! నీవలనను శ్రుతులవలనను
నేను వినియుంటిని. భరతుఁడు లవణునిజంపుటకుఁ బ్రతినపట్టుచుండఁగా
నేను బదులు చెప్పరాదు. అయినను నేనే లవణునిజంపెద నని యంటిని.
అనరానిమాట యన్నందులకు నాకీదుర్గతిరూపమైన రాజ్యాధికారము
తటస్థించినది. పెద్దవాఁడు చెప్పుచుండఁగా నే నూరకయుండవలసినది. అ
ట్లుండకపోవుట యధర్మము. మఱియుఁ బరలోకమును గలిగింపనిది. ఇది
వఱకైనదేచాలును. ఇపుడు మరల బదులు చెప్పను. ఒకదానికే చాలుఁ
జాలును. ఇంక రెండవమాటకుఁగూడ నాకు దండన లభించును. అట్లు
కాఁగూడదు. పురుషర్షభ! నేను నీకుఁ గింకరుఁడను. నావిషయమునఁ
దటస్థించిన యధర్మమును బరిహరింపుము" అనియిట్లు శత్రుఘ్నుఁ డనఁగా
రాముఁడు సంతోషించి భరతుని లక్ష్మణుని జూచి యిట్లనియె : "మీరు
రాజ్యాభిషేకమునకు సంభారములు సిద్ధము చేయుఁడు. ఇపుడే నేను

శత్రుఘ్నునకు రాజ్యాభిషేకము చేసెదను. నే నాజ్ఞాపించితినని పురోహితుని, పౌరులను, ఋత్విజులను, మంత్రులను వెంటనే రావింపుఁడు" అని రాముఁ డాజ్ఞాపించినతోడనే వారు పురోహితాదులను రావించి సంభారములు సిద్ధపఱిచిరి. రాజులు, బ్రాహ్మణులు రాజభవనములోఁ బ్రవేశించిరి. అపుడు శత్రుఘ్నునకుఁ బట్టాభిషేకము ప్రారంభింపఁబడినది. అది రాఘవులకును, పౌరులకును సంతోషజనకరమైనది. శత్రుఘ్నుఁ డభిషిక్తుఁడై పూర్వము సేనాపత్యమునం దభిషిక్తుఁడై యింద్రాదులతోఁ గూడిన కుమారస్వామివలెఁ బ్రకాశించుచుండెను.

అక్లిష్టకర్ముఁడగు రామునిచే శత్రుఘ్నుఁ డభిషిక్తుఁడు కాఁగానే పౌరులు బహుశ్రుతులగు బ్రాహ్మణులు సంతోషించిరి. కౌసల్య, సుమిత్ర, కైకేయి యింకను రాజభవనమందున్న స్త్రీలు మంగళోత్సవము జరపిరి. శత్రుఘ్నునకుఁ బట్టాభిషేకము కాఁగానే యమునాతీరవాసులగు మునులు లవణుని జచ్చినవానినిగానే తలంచిరి. తరువాత రాముఁడు తమ్ముని తొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని యతనికిఁ దేజమును హెచ్చుచేయుచు మధురముగా నిట్లనియె: "తమ్ముడా! ఈబాణ మమోఘము. దీనిచే లవణుని దప్పక చంపఁగలవు. ఇది దివ్యబాణము, శత్రుపట్టణములను జయించునది. మఱియు నీబాణము స్వయంభువు. దేవదేవుఁడు సురాసురుల కగపడనివాఁడు సముద్రములోఁ బండుకొని యున్నప్పు డాయనచే సృజింపఁబడినది. ఇది సర్వభూతములకును నదృశ్యమగుటచే, శరోత్తమమైనది. దురాత్ములగు మధుకైటభులను వధించునిమిత్తమై సృజింపఁబడినది. క్రోధముచే నొడలెఱుఁగనియపుడు దీనిని సృజించి మధుకైటభులను దీనిచే వధించెను. అట్లు మధుకైటభులను జంపి జనుల యనుభవమునకై లోకములను సృజించెను. దీనిని నేను రావణుని వధించుటకుఁగూడఁ బ్రయోగింపఁలేదు. అట్లు ప్రయోగించితినేని భూతములకు భయము గలుగునని తలంచితిని. శివుఁడు లవణునితండ్రి మధువను రాక్షసునకు శూల మొకటి యిచ్చెను. అది యిపుడు వానికుమారుఁడగు లవణునియొద్ద నున్నది. వాఁడు దాని నింట నుంచి మాటిమాటికిని బూజించుచు నలుదిక్కులకును బోయి యాహారము సంపాదించుకొనుచుండును. ఎవరైనను దనపైకి యుద్ధమునకు వచ్చి పిలిచినచో వాఁ డాశూలమును గైకొని వారిని భస్మముచేయును. కావునఁ దమ్ముఁడా! వాఁడాశూల మేమఱియుండఁగా

బురములోనికిఁ బ్రవేశింపకుండ ద్వారము గాచి యాయుధముఁబట్టుకొని సిద్ధముగా నుండుము. ఎక్కడను వాఁడు పురములోఁ బ్రవేశింపఁబోవును. పోనీయక వానిని జంపుము. అట్లు చేయనిచో వానిని జంపుట సాధ్యము గాదు. నేను జెప్పినట్లు చేసితివేని వాఁడు తప్పక వినాశమును బొందును. నీకు వానియొక్కయు వానిశూలముయొక్కయుసంగతి యంతయుఁ జెప్పితిని. శ్రీమంతుఁడగు శివభగవానునికృత్యము మాఁట మీలుగానిది గదా!

## 64-వ సర్గము

### రాముఁడు సైన్యమును లవణునిమీఁదికిఁ బంపుట

శ్రీరాముఁ డిట్లు తమ్మునితో మాటిమాటికిని జెప్పి ప్రశంసించి మరల మఱియొకసంగతి చెప్పమొదలిడెను: "తమ్ముఁడా! శత్రుఘ్నా! ఇదిగో నాలుగువేలగుఱ్ఱములు, రెండువేలరథములు, ఉత్తమములగు నేనుఁగులు నూఱు, నానాపణ్యోపశోభితములగు నంతరాపణవీథులు, నటులు, నర్తకులు మొదలగువారిని నీవెంటఁదీసికొనిపొమ్ము. మఱియు నీకుఁ గావలసినంతధనము దీసికొనిపొమ్ము. హృష్టము, పుష్టము, అనుద్ధతమునగు సైన్యమును దీసికొనిపొమ్ము. వారిమనసు రంజించునట్లు మాటలాడి వలసినంతధన మిచ్చుచుండుము. అచట ధనముండదు; భార్యలుండరు; బంధువు లుండరు; నీవున్నచోటున భృత్యవర్గము సుప్రీతమై యుండవలయును. ముందుగా సంతోషమును గలిగించి వలసినంత సైన్యమును బంపి తరువాత నీవొక్కరుఁడవే ధనుష్పాణివై మధువనములోనికిఁ బొమ్ము. నీవు యుద్ధమును గోరి వచ్చుచున్నట్లు వానికిఁ దెలియనీయకుము. వాని కనుమానము గలుగకుండ వెళ్లుము. వానికి వేఱుగా మృత్యువే లేదు. వానికంటఁబడినవాఁడు తప్పక మృతినొందును. వానిని గ్రీష్మముపోయి వర్షాకాలమురాఁగా నాసమయమునఁ జంపుము. వానిని జంపుట కదియే తగిన సమయము. నీసైనికులు మహర్షులను బురస్కరించుకొని ముందుగాఁ బోవుదురుగాక! గ్రీష్మముండఁగానే వారు గంగానదిని దాఁటిపోవుదురుగాక! ఆగంగాతీరమున సైనికులను నిలిపి జాగరూకుఁడవై లఘువిక్రముఁడవగు నీవు ముందుగా ధనుష్పాణివై పొమ్ము" అని రాముఁడు చెప్పినతోడనే సైనికులను మహాబలవంతులను రప్పించి వారితో నిట్లనియె: "సైనికులారా! మీకు నివాసస్థానము లేర్పఱుపఁబడియున్నవి. అందు

మీఁదు నివసింపవచ్చును. ఎవరికి నేవిధమైనబాధయుఁ గలుగకుండ నిర్విరోధముగ నుండును." ఆప్రకారముగా వారికాజ్ఞాపించి సైన్యమును బంపించి కౌసల్యాసుమిత్రాకైకేయులకు నమస్కరించెను. రామునకుఁ బ్రదక్షిణముచేసి సాష్టాంగనమస్కారమొనరించి రామునిచే ననుజ్ఞాతుఁడై, శత్రుత్రాపనుఁడగు నాశత్రుఘ్నుఁడు లక్ష్మణునకును భరతునకును నమస్కరించి చేతులు జోడించుకొని పురోహితుఁడగు వసిష్ఠభగవానునకుఁ బ్రదక్షిణనమస్కారము లాచరించి వారివారి యాశీర్వాదములను బొంది బయలుదేఱెను. అతఁడు ముందుగా నేనుఁగులు గుఱ్ఱములు రథములు మొదలగువానితో సంకులమైన సైన్యమును బంపించి, యొక్కమాసము వఱకు నన్నగారియొద్దనేయుండి తరువాత శత్రుపురమిఁదికి యుద్ధమునకు వెడలెను.

## 65-వ సర్గము

### వాల్మీకి శత్రుఘ్నునకు సౌదాసునికథ చెప్పుట

ఇట్లు బలమునంతయు ముందుగాఁబంపి నెలదినములు గడచిన తరువాత శత్రుఘ్నుఁ డొక్కరుఁడును త్వరితముగా బయలుదేఱి వెళ్లెను. అట్లు రెండుదినములుమాత్రము దారిలో నిలిచి వాల్మీకిమహామునియొక్క పుణ్యాశ్రమమందు నివసించెను. అతఁడు వాల్మీకిమహామునికి నమస్కరించి చేతులు జోడించుకొని యాయనతో నిట్లనియె: "భగవానులవారూ! మాయన్నగారియానతిపై నిట్లు వచ్చితిని. నేఁటిరాత్రి యిచ్చటనుండి రేపు తెల్లవాఱినతోడనే పశ్చిమదిశకుఁ బోయెదను" అనిచెప్పిన శత్రుఘ్నుని మాటలు విని మునిపుంగవుఁడగు వాల్మీకి నవ్వి మహాత్ముఁడగు శత్రుఘ్నునితో నిట్లనియె: "మహాయశా! నీకు స్వాగతము. ఇది రఘువంశపువారి యాశ్రమము. నావలన నాసనము, పాద్యము, అర్ఘ్యము మొదలయిన వంగీకరింపుము. మఱియు నేఁజేయుపూజను బరిగ్రహించి ఫలములను మూలములను భుజింపు"మన నతఁ డట్లు చేసి మిక్కిలి తృప్తిని బొందెను. అతఁడు భుజించిన తరువాత వాల్మీకితో నిట్లనియె: "మొదట నీయాశ్రమ మెవ్వరిది? ఇచ్చట యజ్ఞసమృద్ధి పూర్వము జరిగినట్లు గనుపడుచున్న"దన నాతనితో వాల్మీకి యిట్లనియె: "శత్రుఘ్నా! ఇది పూర్వ మెవరిదో చెప్పెదను వినుము. మీవంశములోఁ బూర్వము సుదాసుఁడను రా జుండెడి

వాఁడు. అతనికుమారుఁడు వీరసహుఁడను నతఁడు వీర్యవంతుఁడును, అతిధార్మికుఁడును నై యుండువాఁడు. ఆతఁడు బాల్యమునందే వేఁటకు బయలుదేఱి, శార్దూలాకారమును ధరించి వేలకొలఁదిగ మృగములను భక్షించుచు సంతుష్టి యన నెట్టిదో యెఱుఁగకయుండు నిద్దఱు రాక్షసులను జూచెను. అతఁ డట్లా రాక్షసులను, నిర్మృగమైన యడవిని జూచి చాలఁ గోపించి యొకరాక్షసుని బాణముతోఁ గొట్టెను. పురుషర్షభుఁడగు సౌదాసుఁ డట్లొకనిని జంపి విజ్వరుఁడు విగతామర్షుఁడునై రెండవరాక్షసుని జూచెను. అటు చూచుచున్న సౌదాసునిజూచి హతుని సహాయుఁడగు రాక్షసుఁడు చాల సంతాపమును బొంది సౌదాసునితో నిట్లనియె: "నీవు నిరపరాధుఁడగు నాసహాయుని గొట్టితివి గనుకఁ బాపాత్ముఁ డా నీకుఁ బ్రతిక్రియ చేసెదను" అని ప్రత్యక్షముగఁ జెప్పి వాఁ డచ్చటనే యంతర్ధానమును బొందెను. మఱికొంతకాలమున కారాజు మిత్రసహుఁడాయెను. ఆరాజీయాశ్రమసమీపమున వసిష్ఠునియాజమాన్యముక్రింద నశ్వమేధయాగ మారంభించెను. ఆయజ్ఞము చాలసంవత్సరములవఱకును జరగినది. వేయేల? అది పరమసమృద్ధమై దేవతలయజ్ఞముతో సమానముగ నుండెను. తరువాత యజ్ఞము పూర్తియగుచుండఁగా వెనుకటివైరమును స్మరించుకొని యారాక్షసుఁడు వసిష్ఠునిరూపమును ధరించి సౌదాసుఁడనురాజుతో నిట్లనియె: "రాజా! నీయశ్వమేధము పూర్తియైనది. కనుక నాకు మాంసముతో భోజనము పెట్టుము. వేగము కావలెను. ఆలోచింపకుము." ఇటు బ్రాహ్మణరూపముతో వచ్చి రాక్షసుఁ డనఁగానే రాజు వంటలో నేర్పుగలవానిని బిలిచి యిట్లనియె.

"ఓయీ! మాగురువు సంతోషించునట్లు మాంసముతోఁ గూడిన హవిస్సును మంచి రుచిగా నుండునట్లు వేగము సిద్ధము చేయుము" అని రాజు చెప్పఁగానే వంటవాఁడు తొందరపడిన మనస్సుగలవాఁడై యుండెను. ఆరాక్షసుఁడు మరల వంటవానివేషము నవలంబించెను. వాఁడు మనుష్యమాంసమును వండి రాజుతో "రాజా! ఇది రుచియగు హవిస్సు మాంసముతో సిద్ధము చేసితిని" అనెను. ఆరాజు దానిని దనభార్యతోఁ గూడ వసిష్ఠునకు నివేదించెను. ఆయనభార్య మదయంతి రాక్షసుఁడు వండినదానిని వసిష్ఠునకు వడ్డించినది. మనుష్యమాంసమును దనకుఁ బాత్రములో వడ్డించియుండుట దెలిసికొని ముని చాలఁ గోపించి రాజుతో

నిట్లనియె: "రాజా! నాకు మనుష్యమాంసమును బెట్టితివి గనుక నీకెప్పుడును నీమనుష్యమాంసమే యాహారమగుచుండుఁగాక!" యని శపింపఁగానే సౌదాసుఁడును గోపించి చేతితో జలము గ్రహించి వసిష్ఠుని శపింపఁబోఁగా నతనిభార్య మదయంతి వారించెను. "నాథా! వసిష్ఠభగవానులవారు మనకుఁ బ్రభువు. కావున దైవతుల్యుఁడగు పురోహితునిపై నలుక పూని మరల శపింపఁగూడదు" అని భార్య నివారింపఁగా, నతఁడు క్రోధమయమును తేజోబలసమన్వితమును నగు నాయుదకమును దన పాదములమీఁదను బోసికొనెను. అందువలన నారాజుపాదములు కల్మాషత్వమును బొందినవి. అదిమొదలు ఆమహాకీర్తియగు సౌదాసుఁడు కల్మాషపాదుఁడని ప్రసిద్ధినొందెను. ఆరాజు భార్యతోఁగూడ మాటిమాటికిని నమస్కరించి బ్రాహ్మణరూపముతో రాక్షసుఁ డన్నమాటలను స్మరింపఁజేయఁగా, వసిష్ఠుఁడు ధ్యానదృష్టితోఁ గనుఁగొని యదియంతయు రాక్షసునికృత్యమునుగా భావించి రాజుతో నిట్లనియె: "రాజా! నేను కోపించి నీకు శాపమిచ్చితిని. అదిత్రిప్పుట కెవ్వరికిని శక్యముగాదు. కాని నీకు వరమిచ్చెదను గైకొనుము. నేనిచ్చినశాపమునకుఁ బండ్రెండుసంవత్సరములే పరిమితి. అటుపై నది నిన్ను బాధింపదు. నాయనుగ్రహమువలన రాజా! గడచినదానిని స్మరింపవు" అని చెప్పఁగానే, యారాజు సంతోషించి యాశాపము ననుభవించి మరల నెప్పటియట్లు రాజ్యమును బొంది ప్రజలను బరిపాలించెను. ఇది యాకల్మాషపాదునియజ్ఞసదనము. నా యాశ్రమమునకు సమీపముననే యున్నది. "శత్రుఘ్నా! నీవడిగితివి గనుకఁ జెప్పితిని." అట్లు శత్రుఘ్నుఁడు వాల్మీకిమహాముని చెప్పిన సౌదాసుని ఘోరమైనకథను విని యాయనకు నమస్కరించి పర్ణశాలలోఁ బ్రవేశించెను.

## 66-వ సర్గము

### కుశలవులజన్మము

శత్రుఘ్నుఁడు పర్ణశాలలోఁ బ్రవేశించిన సమయముననే సీత యిద్దఱుకుమారులను ప్రసవించినది. తరువాత నర్ధరాత్రసమయమున మునికుమారులు సీత ప్రసవించినదని వాల్మీకిమహామునితో శుభవర్తమానము నిట్లు చెప్పిరి: "భగవానులవారూ! రామునిభార్యయగు సీతాదేవి యిద్దఱుకుమారులను ప్రసవించినది. కావున మహాతేజా! భూతములవలన

నివారించు రక్ష చేయవలయును" అనిచెప్పిన బాలురమాటలు విని వాల్మీకిమహాముని ప్రసూతిగృహమునొద్దకుబోయి బాలచంద్రునితో సమానులై దేవపుత్రులవంటి తేజశ్శాలులను కుమారులను జూచెను. భూతప్రేతపిశాచాదులు చేరకుండ రక్ష చేసెను. అతఁడు కుశముష్టిని లవమును బట్టుకొని వారికి భూతవినాశకరమగు రక్షను జేసెను. ముందు పుట్టిన బాలునకు మంత్రములచే సంస్కరింపఁబడిన కుశలతో మార్జన మొనరించుటచేఁ గుశుఁడనియే పేరు గలిగినది. రెండవబాలునకు లవముచే మార్జన మాచరించుటచే లవుఁ డను పేరు గలిగినది. అట్లు కవలయి పుట్టిన వారికిద్దఱకును గుశలవులని పేరు కలిగినది. అపుడు వాల్మీకిమహాముని "నాచే నుంచఁబడిన యీపేళ్లతోడనే వీరిద్దఱును ఖ్యాతిమంతులగుదు"రనిచెప్పి తనచేతిలో నున్న రక్ష నచ్చటి స్త్రీలచేతి కీయఁగా వారు జాగ్రత్తగా వారికి రక్ష చేసిరి. అపుడు రక్షాకాలమున వృద్ధలగుస్త్రీలు గోత్రము, తలిదండ్రుల పేళ్లను నుచ్చరించిరి. ఆయర్ధరాత్రసమయమున శత్రుఘ్నుఁడు శుభవార్త విని తనవాతఁ బర్ణశాలలోనికిఁబోయి "అమ్మా! దైవానుగ్రహ"మనెను. అట్లతఁడు సంతోషించుచుండఁగా నావర్షాకాలపురాత్రి యతివేగముగా నతిక్రమించిపోయినది. తెల్లవాఱిన తోడనే శత్రుఘ్నుఁడు పౌర్వాహ్ణికకృత్యములు నిర్వర్తించుకొని వాల్మీకి భగవానునియొద్ద సెలవుపొంది మరలఁ బశ్చిమాభిముఖుఁడై వెళ్లిపోయెను. అట్లతఁ డేడురాత్రులు మార్గములో విశ్రమించి యమునాతీరమందలి పుణ్యకీర్తులగు మునులయాశ్రమములలో నివసించెను. ఆశత్రుఘ్నుఁడు భార్గవప్రముఖులగు ఋషులతోఁగూడ నభిరూపములగు కథలు వినుచు నివసించెను. నరేంద్రకుమారుఁడును మహాత్ముఁడును నగు నాశత్రుఘ్నుఁడు రఘుప్రవీరుఁడు కాంచనాద్యులగు మునులతోఁగూడి యపుడు బహుప్రకారములగు కథలచే నారాత్రిని విరమింపఁజేసెను.

## 67-వ సర్గము

### లవణుని బలాదివర్ణనము

తరువాత రాత్రి ప్రవర్తించినతోడనే శత్రుఘ్నుఁడు భృగువంశమునఁ బుట్టిన చ్యవనుని జూచి లవణుని బలమునుగూర్చి యడిగెను: "ఆర్యా! వానిశూల మెట్టిబలముగలది? ఆశూలముచేఁ బూర్వ మెవ్వరు వినాశ

మును బొందిరి?" అని యిట్లడిగిన శత్రుఘ్నునిమాటలు విని చ్యవనుఁ డిట్లనియె: "శత్రుఘ్నా! ఆలవణుఁడు చేసిన కృత్యము లసంఖ్యములు. కాని వాఁడు మాంధాతవిషయమై చేసినది చెప్పెదను వినుము: పూర్వ మయోధ్యయందు యువనాశ్వునికుమారుఁడు మాంధాత బలవంతుఁడు ముల్లోకములయందును బేరుపడినవాఁడు గలఁడు. అతఁ డీభూలోకము నంతను దనయధీనముగాఁ జేసికొని దేవలోకమును జయించుటకుఁ బ్రయత్నించెను. ఆతనిప్రయత్నమున కింద్రాదిదేవతలు భయపడిరి. ఆరాజు దేవేంద్రుని యర్ధాసనమును, అర్ధరాజ్యమును దేవతలసేవయు సంపాదింపఁ బ్రతిజ్ఞపట్టెను. ఇంద్రుఁ డతనిపాపసంకల్పమును దెలిసికొని మాంధాతతో సాంత్వపూర్వకముగా నిట్లనియె: "రాజా! నీవు మనుష్యలోకమునకు రాజవు. భూమిని స్వాధీనముగాఁ జేసికొనకుండ దేవరాజ్యమును గోరుచున్నావు. నీకు భూమియంతయు స్వాధీనమైయున్నయెడల సభృత్యబలవాహనుఁడవై వచ్చి దేవరాజ్య మేలుకొనుము." ఇట్లు చెప్పుచున్న యింద్రునితో మాంధాత యిట్లనియె: "ఇంద్రా! నీవట్లను చున్నావుగదా? భూమిలో నాశాసన మెచ్చోటను జెల్లకుండ నున్నదో చెప్పుము" అన నింద్రుఁ డిట్లనియె: "రాజా! లవణుఁడు మధువనములో నున్నాఁడు. వాఁడు నీయాజ్ఞను లక్ష్యపెట్టుచున్నాఁడా?" అని యిట్లు విప్రియముగా నింద్రుఁడు చెప్పినమాటవిని సిగ్గుపడి తలయెత్తి మాటాడఁజాలకపోయెను. శిరస్సు వంచుకొనియే యింద్రుని యనుమతికొని మాంధాత మరల నీభూలోకమునకు వచ్చెను. అతఁడు మనస్సున నమర్షము నుంచుకొని సభృత్యబలవాహనుఁడై లవణుని స్వాధీనము చేసికొనుటకై మధువనమునకు వచ్చెను. అతఁడు లవణునితో యుద్ధము చేయఁగోరి తనదూతను వానియొద్దకుఁ బంపెను. ఆదూత లవణుని యొద్దకుఁబోయి యెన్నో విప్రియవాక్యములు పలికెను. అట్లు పలుకుచున్నదూత నాలవణుఁడు భక్షించెను. ఎప్పటికిని దూతరాకుండుటచే మాంధాతకోపించి నలువైపులనుండియు బాణవర్షముఁగురిపించి లవణుని పీడించెను. తరువాత నాలవణుఁడు నవ్వి శూలముఁగైకొని సపరివారముగా మాంధాతను జంపుట కాశూలమును బ్రయోగించెను. ఆశూల మందఱను భస్మముచేసి మరలి వానిచేతికిఁ బోయినది. ఈరీతిగా నట్టి మాంధాతృచక్రవర్తి నిశ్శేషముగా వానిశూలముచే మృతినొందెను.

కావున వానిశూలముయొక్క శక్తి యిట్టిదని వచింప వీలులేదు. అయినను నీవు రేపుదయము వాని నిస్సంశయముగాఁ జంపెదవు. వాఁడాయుధము చేతిలో లేకుండ నుండుసమయముమాత్రము కనిపట్టవలెను. అట్లైని జయము తప్పదు. నీవు వానిని జంపితివేని లోకములకు మేలు గలుగును. శత్రుఘ్నా! వానియొక్కయు వానిశూలముయొక్కయు బల మట్టిది. నీకంతయుఁ జెప్పితిని. ఆరీతిగా వాఁడు మాంధాతను జంపెను. మహాత్మా! శత్రుఘ్నా! నీవు రేపు ప్రభాతమునం దప్పక లవణుని జంపి తీరెదవు. నాకావిషయమున సందియములేదు. వాఁడు చేత శూలము లేకుండ మాంసమునిమిత్తమై యడవికి బయలుదేఱినపుడు నీకుఁ దప్పక జయము గలుగును.

## 68-వ సర్గము

### శత్రుఘ్నుఁడు లవణు నడ్డగించుట

శత్రుఘ్నునకు జయమును శుభమును గోరుచు మునులు కథలు చెప్పుచుండఁగా శీఘ్రముగా రాత్రి తెల్లవాఱినది. తెల్లవాఱినతోడనే లవణాసురుఁడు భక్ష్యాహారప్రచోదితుఁడై పట్టణమునుండి బయలు దేఱెను. ఇంతలో వీరుఁడగు శత్రుఘ్నుఁడు యమున దాఁటి ధనుష్పాణి యై మధుపురద్వారమందు నిలిచెను. రెండుయామము లగునప్పటికిఁ గ్రూరకర్ముఁడగు లవణుఁడు వేలకొలఁది జంతువులనుజంపి యాహారమును వహించి వచ్చెను. వాఁడు ద్వారమందున్న శత్రుఘ్నుని జూచెను. "నీ వీయాయుధము పట్టుకొనియుంటివిగదా! యేమిచేయుదు"వని యడిగెను. మఱియు "నరాధమా! నీవంటివారిని వేలకొలఁది సాయుధులను భక్షిం చితిని. నీకుఁ గాలము గూడినది కాఁబోలును. పురుషాధమా! నేఁడు నాకు సంపూర్ణముగా నాహారము దొరకినది. ఓరీదుర్మతీ! నీయంతట నీవే వచ్చి నానోటిలోఁ బ్రవేశించితివేలరా!" అనియిట్లు పలుకుచున్న వాఁడును మాటిమాటికిని నవ్వుచున్న వాఁడును నగు లవణునిజూచి వీర్యసంపన్నుఁ డగు శత్రుఘ్నుఁడు రోషమువలనఁ గన్నులెఱ్ఱఁజేసెను. ఇట్లు రోషాభి భూతుఁడైన శత్రుఘ్నుని సర్వశరీరమునుండియుఁ దేజోమయములయిన మరీచులు బయలుదేఱినవి. మఱియు నతఁడు కోపించి యారాక్షసునితో నిట్లనియె: "ఓరీదుర్బుద్ధీ! లవణా! నీతో ద్వంద్వయుద్ధము చేయవచ్చితినిరా.

నేను దశరథమహారాజునకుఁ గుమారుఁడను; శ్రీరామునకుఁ దమ్ముఁడను. నిత్యమును శత్రువులనుజంపు శత్రుఘ్నుఁ డనుపేరుగలవాఁడను. నిన్నుఁ జంపుటకై వచ్చితిని. అటువంటి నాకు నీవు ద్వంద్వయుద్ధమిమ్ము. సర్వజీవులకును శత్రుఁడవగు నీవు నాయెదుటనుండి జీవముతోఁ బోఁజాలవు" అని యిట్లు శత్రుఘ్నుఁ డనుచుండఁగా రాక్షసుఁడు నవ్వుచు నిట్లనియె: "దుర్మతీ! దైవవశమున నాకంటఁబడితివి. నా పెద్దతల్లియన్న రాక్షసరాజు రావణుఁడు మీయన్న చే స్త్రీనిమిత్తమై చంపఁబడెను. రావణుని కులక్షయమంతయు విని క్షమించితిని: మీరేమాత్రపువారని లక్ష్యముచేయనైతిని. నేను గొప్పగొప్పవారిని జంపితిని. నాకందఱును తృణసమానులు. వెనుకటివారు, మీబోఁటి యిప్పటివారు, ముందు పుట్టఁబోవువారు ప్రతివారును నాకు లోఁగిపోవువారే కాని నన్నెదిరింపఁజాలరు. దుర్మతీ! నాతో యుద్ధముచేయవచ్చితివేమి? అటులేని రమ్ము; నీబులుపు తీర్చెదను. నే నాయుధము పట్టుకొని యిపుడే వచ్చెదను; క్షణమునే పోఁగుము. నీ కోరిక తీరును. నిన్ను జయించుట కాయుధము సిద్ధముచేసికొని వచ్చెదను" అను లవణునిమాటలు విని శత్రుఘ్నుఁ డిట్లనియె: "ఓరీ రాక్షసాధమా! నాయెదుటనుండి బ్రతికిపోఁజాలుదువఁటరా? ప్రాజ్ఞుఁడగు వాఁడు శత్రువగపడినపుడు విడుచునా? ఎవఁడు భయస్వభావముగల బుద్ధిచేత శత్రువునకు సమయమిచ్చునో, అట్టిమందబుద్ధి కాపురుషుఁడు హతుఁడగును. కావున జీవలోకమునంతయు లెస్సగా నొక్కసారి చూడుము. నావాఁడిబాణములచేతను నిన్నిపుడు యముని గృహమునకుఁ బంపెదను. పాపాత్ముఁడా! నీవు మూఁడులోకములవారిని బాధించుచుందువేమి? రాఘవుల కంటఁబడిన శత్రువు మరలిపోఁగలఁడా?"

## 69-వ సర్గము

### శత్రుఘ్నుఁడు లవణుని జంపుట

ఇట్లు చెప్పిన శత్రుఘ్నునిమాటలు విని లవణుఁడు తీవ్రముగఁ గోపించి యుండుండుమనెను. చేతులు పిసికికొనెను; పండ్లు పటపట లాడించెను. శత్రుఘ్నుని మాటిమాటికిని బిలువ మొదలిడెను. ఇట్లు పిలుచుచున్న ఘోరదర్శనుఁడగు లవణునిజూచి దేవశత్రుఘ్నుండగు శత్రుఘ్నుఁ డిట్లనియె: "ఓరీ రాక్షసా! నీవిదివఱకుఁ జంపినవారివంటివాఁ డీశత్రుఘ్నుఁ

డెంతమాత్రమును గాఁడు. కావున నీ విప్పుడు నాబాణములచేఁ జచ్చి యముని యింటికిఁ బొమ్ము. పాపాత్ముఁడవగు నిన్నుఁ జచ్చియుండఁగా నిచ్చటి మునులందఱును జూచెదరుగాక! నీమామయగు రావణుని జంపి నప్పు డందఱును జూచి సంతసింపలేదా ? పాపాత్ముఁడవగు నీవు నాచేఁ జచ్చినప్పుడే పురములయందును బల్లెలయందును క్షేమము కలుగఁగలదు. ఇప్పుడు నాబాహువునుండి బయలుదేఱిన వజ్రమువంటి బాణము, సూర్యకిరణము పద్మములోఁ బ్రవేశించినటుల నీహృదయములోఁ బ్రవేశించును గాక!" అని యిట్లు శత్రుఘ్నుఁడనఁగానే లవణుఁడు కోపించి యొకమహావృక్షమును శత్రుఘ్నునిపై వైచెను. అతఁడు దానిని చూర్ణము చేసెను. అది విఫలమగుట చూచి వాఁడెన్నియో వృక్షములను శత్రుఘ్నునిపైని వైచెను. వచ్చిన వృక్షముల నన్నింటిని శత్రుఘ్నుఁ డొక్కొక్కటి రెండేసి మూఁడేసి బాణములతో మధ్యనే పొడి చేసెను. తరువాత రాక్షసునిపై బాణవర్షము గురిసెను. అట్లు కురియుచున్న వీర్యసంపన్నుఁడగు శత్రుఘ్నునిబాణములకు లవణుఁడు కంపించుటయే లేదు. తరువాత లవణుఁడు నవ్వి యొకవృక్షమును బెల్లగించి శూరుఁడగు శత్రుఘ్నుని శిరస్సుపైఁ బడవేయఁగా నతఁడు శిథిలాంగుఁడై మూర్ఛవోయెను. వీరుఁడగు నతఁడు మూర్ఛపోవఁగానే ఋషులు దేవతలు గంధర్వులు మొదలగువారందఱును హాహాకారము చేసిరి. ఇట్లు శత్రుఘ్నుఁడు చచ్చిపడి యుండెనని యోజించి లక్ష్యముచేయక వాఁడు సమయము దొరకినను బట్టణములోని కాయుధమునకై పోలేదు. అతఁడు పడిపోయినట్లు నిశ్చయించుకొని శూలము తేలేదు. శత్రుఘ్నుఁడింక బ్రదుకఁడని నిశ్చయించుకొని తాఁదెచ్చిన మృగములభారము నెత్తెను. ముహూర్తమాత్రములో శత్రుఘ్నుఁడు లేచి యాయుధము చేతఁబట్టుకొని పురద్వారముచెంత నిలువఁబడెను. ఋషు లాతనిఁ బూజించిరి. తరువాత శత్రుఘ్నుఁడు దివ్యము, అమోఘము, జ్వలించునది, ఘోరము, తేజస్సుచే దశదిశలను బూరించునది, వజ్రాననము, వజ్రవేగము, మేరుమందరములతో సరిపోవునది, పర్వములయందు వంగియున్నది, వీరయుద్ధములలోను బరాజయము లేనిది, చందనాదులచేఁ బూయఁబడినది, చారుపత్రము, దానవేంద్రులను పర్వతముల ఛేదించునది, రాక్షసుల నివారించునది యగు రాముఁడిచ్చిన యుత్తమశరమును వానిపైఁ బ్రయోగించెను.

ప్రళయాంతమునందలి కాలాగ్నివలె వెలుఁగునది యగు నాశరమును జూచి సర్వభూతములును భయపడినవి. దేవతలు, రాక్షసులు, గంధర్వులు, మునులు, అచ్చరలు మొదలగువారితోఁ గూడిన సర్వజగము స్వస్థత దప్పినది. అపుడు వారందఱును బ్రహ్మయొద్దకుఁ బోయి యిట్లనిరి: "దేవా! ఇపుడు లోకముగాని యుగముగాని క్షయము గానున్నదియారయేమి? ఇటునంటిసమయ మిదివఱకుఁ గనియు వినియు నెఱుఁగము. మాయందఱకును లోకక్షయమగునేమో యని భయమగుచున్న"దనువారిమాటలు విని లోకపితామహుండగు బ్రహ్మలోకమున కభయంకరుఁడగుచు "భయకారణములను జెప్పెదను" వినుఁడని దేవాదులతో మధురముగా నిట్లనియె: "లవణాసురుని వధించునిమిత్తమై శత్రుఘ్నుఁడు బాణమును సంధించెను. దానితేజస్సుచే సర్వలోకములును సమ్మోహమును బొందినవి. అది విష్ణుని సనాతనమైన తేజోమయమైన బాణము. దానిచే మీకిట్లు భయము గలిగినది. దానిని బూర్వము మధుకైటభులవధకై విష్ణుదేవుఁడు నిర్మించెను. దాని నాయన యొక్కరుఁడే యెఱుఁగును. ఇది మహాత్ముఁడగు విష్ణుని పూర్వశరీరము. మీరిచ్చటనుండిపోయి శత్రుఘ్నునిచేఁ జంపఁబడు లవణుని జూడుఁడు. అతఁడు శ్రీరామునితమ్ముఁడగు శత్రుఘ్నుఁడు లవణుని జంపుటకై యతఁ డాశరమును బ్రయోగించుచున్నాఁడు" అని బ్రహ్మచెప్పినతోడనే దేవాదులందఱును శత్రుఘ్నలవణులయుద్ధమును జూచుటకై వచ్చిరి. శత్రుఘ్నునిహస్తముచేఁ బట్టఁబడినదియు దివ్యసంకాశమును, యుగాంతాగ్నివలెనున్నదియు నగు నాబాణము నందఱును జూచిరి. దేవతలచే నాకాశమంతయు నిండియుండుట చూచి శత్రుఘ్నుండు సింహనాదము చేసి మరల లవణాసురుని జూచెను. మహాత్ముఁడగు శత్రుఘ్నుఁడు మరల నాలవణుని బిలిచెను. లవణుఁడు కోపముతోఁగూడి యుద్ధమునకు వచ్చెను. ధనుర్ధరశ్రేష్ఠుఁడగు శత్రుఘ్నుఁ డాబాణము నాకర్ణాంతమాకర్షించి లవణుని వక్షస్థలమునకు గుఱిచేసి ప్రయోగించెను. ఆబాణము వానివక్షస్థలమును ఛేదించి పాతాళమునకుఁబోయి విబుధపూజితమై మరల వెంటనే శత్రుఘ్నునియొద్దకు వచ్చినది. ఇట్లు శత్రుఘ్నునిబాణముచే విదారితుఁడై యాలవణుఁడు వజ్రముచే గొట్టఁబడిన కొండవలె నేలఁగూలెను. లవణుఁడు హతుఁడు కాఁగానే గొప్పదియగు వానిశూలము సకలదేవతలును

చూచుచుండఁగా శివునియొద్దకుఁబోయినది. రఘుప్రవీరుఁడగు శత్రుఘ్నుఁ డిట్లొక్క బాణముచే మూఁడులోకముల భయమును బాపి చీఁకటిని బో నడఁచిన సూర్యునివలెఁ బ్రకాశించుచుండెను. తరువాత దేవతలు, ఋషులు, పన్నగులు, అప్సరసలు మొదలగు నెల్లరును శత్రుఘ్నుని బూజించిరి. శత్రుఘ్నునకు దైవవశమున జయము చేకూరినది. అందఱ కును భయము పోయినది. అందఱును శాంతమును వహించిరి.

## 70వ సర్గము

### శత్రుఘ్నుఁడు మధురాపురమును వశపఱుచుకొనుట

లవణుఁడు హతుఁడు కాఁగానే యగ్నిపురస్సరులగు దేవతలు శత్రుతాపనుఁడగు శత్రుఘ్నునిజూచి సుమధురముగా నిట్లనిరి: "వత్సా! దైవవశమున నీకు జయము గలిగినది. దైవవశమున లవణుఁడు హతుఁ డాయెను. పురుషశార్దూలా! సువ్రతా! వరము గోరుము. మహా బాహూ! నీకు వరమిచ్చుటకై సర్వదేవతలును వచ్చిరి. మేమందఱ మును నీకు జయము గోరుచుంటిమి. మాదరిసెన మమోఘమైనది" అని యిట్లు దేవతలు పలికిన పలుకులు విని శత్రుఘ్నుఁడు చేతులు జోడించు కొని వారితో నిట్లనియె: "దివ్యమైన యీమధుపురి మధుర ; దేవనిర్మి తము. ఇది నాసేనానివేశమును బొందునట్లు వరమీయఁగోరితిని. ఇదియే నాకుఁ గావలసినవరము. ఇట్లని కోరిన శత్రుఘ్నుని పలుకులు విని దేవ తలు సంతోషించి మంచిదే యనిరి. ఈరమ్యమైనమధుర శూరులగు సేన గలదియగును సందియములేదు. అనిచెప్పి దేవత లంతరిక్షమునకుఁబో యిరి. మహాతేజుఁడగు శత్రుఘ్నుఁడు తన సేనను రావించెను. ఆసేన శత్రు ఘ్నుని శాసనమును విని శీఘ్రముగ వచ్చెను. శత్రుఘ్నుఁడు శ్రావణమున సేనానివేశనము నారంభించెను. దివ్యసంకాశయగునది మొందుగా ద్వాద శమమగు సంవత్సరమున శూరసేనలకు నివేశమైనది. దేశము నిర్భయ మైనది. క్షేత్రములు సస్యయుక్తములైనవి. ఇంద్రుఁడు కాలమునఁప్పక వర్షించుచుండెను. ఆరోగవీరపూరుషము, శత్రుఘ్నభుజపాలితము, అర్ధ చంద్రప్రతీకాశము, యమునాతీరశోభితము, మంచిమంచి గృహములచే తను చత్వరాపణ వీథులచేతను బ్రకాశితము, చాతుర్వర్ణ్య సమా యుక్తము, నానావాణిజ్యశోభితమునై యొప్పారుచు నామధురాపట్ట

ణము కన్నులపండువైయున్నది. పూర్వము లవణాసురుడుండు నామధుర యందు శత్రుఘ్నుడుండెను. నానావర్ణోపశోభితము, ఆరామములచేతను విహారములచేతను నెల్లయెడల శోభాయమానము, శోభనీయములగు దేవాగారములచేతను మనుష్యులచేతను శోభితమును, దివ్యసంకాశమును, నానాపణ్యోపశోభితమును, నానాదిక్కులనుండి వచ్చిన వణిజులచే సుపశోభితమును, సస్యసమృద్ధమును నగు నాపట్టణమును సమృద్ధార్థుడును, భరతానుజుడును నగు శత్రుఘ్నుడు చూచి పరమప్రీతుడై మిగుల సంతసించెను. అచ్చటనే దనసేనను నిలిపి పండ్రెండవసంవత్సరములో శ్రీరామపాదములను జూచెదనుగాక యని శత్రుఘ్నునకు బుద్ధి పుట్టినది. తరువాత శత్రుఘ్నుడు వివిధజనాభిసంవృతమై యమరావతి వలె నొప్పారుచున్న యాపట్టణములోని దనసేనను నివసింపజేసి శ్రీరాముని సందర్శించుట కభిలాషగలవాడాయెను.

## 71-వ సర్గము

### శత్రుఘ్నుడు కుశలవుల గానము వినుట

ఇట్లు పండ్రెండవయేట శత్రుఘ్నుడు స్వల్పమగు సైన్యమును వెంటబెట్టుకొని శ్రీరామపాలితమగు నయోధ్యకుబోవ నుద్యుక్తుడాయెను. అపుడు మంత్రులు మొదలగువారిని, బలములో ముఖ్యులగువారిని మరలించి కొన్ని మంచిగుఱ్ఱములను నూఱురథములను దీసికొని శత్రుఘ్నుడు బయలుదేఱెను. అతడు నిర్ణీతములైన యేడెనిమిది వాసస్థానములను దాటి వాల్మీకిమహాముని యాశ్రమములో నివాస మేర్పఱుచుకొనెను. పురుషర్షభుడగు శత్రుఘ్నుడు వాల్మీకిమహామునిపాదములకు నమస్కరించి యాతనివలన నర్ఘ్యపాద్యాదులను సంగ్రహించెను. మహాత్ముడగు శత్రుఘ్నునకావాల్మీకిమహాముని వేలకొలది మనోహరములైన కథలు చెప్పెను. మఱియు నాయన లవణునిసంబంధమగు వాక్యము నిట్లు పలికెను: "నాయనా! నీవు లవణునిజంపి చాలమంచిపని చేసితివి. మహాబాహూ! ఆలవణుడిదివఱ కెందఱనో మహామహులను యుద్ధములలో జంపియున్నాడు. అట్టి పరమపాపాత్ముని నీవు విలాసముగా జంపితివి. నీధర్మమున లోకములకు భయముపోయినది. రావణ

వధము మహాప్రయత్నముమీఁదఁ జరిగినదిగాని నీ వీలవణాసురుని నిష్ప్రయత్నముగాఁ జంపితివి. ఇది చాల గొప్పకార్యము. లవణుని జంపుటచే దేవతలకుఁ జాల సంతోషము గలిగినది. భూతములకు లోకములకును జాల సంతోషమును గలిగించితివి. నీవు లవణునితో యుద్ధము చేయుచుండఁగా నేను దేవేంద్రునిసభలో నుండి యంతయుఁ జూచితిని. శత్రుఘ్నా! అపుడు నాకెంతయు సంతోషము గలిగినది. నాయనా! ఒక్కమా ఱిటురమ్ము. నీశిరస్సు మూర్కొనియెదను. ప్రేమకిది పరమావధి. అని యాయన శత్రుఘ్నునిశిరస్సు మూర్కొని యతనికిని, సైన్యమునకును దగురీతి నాతిథ్య మొసఁగెను. అతఁడు ప్రీతిపూర్వకముగా భుజించి యాకాలమందు యథాక్రమముగా నుత్తమరీతిని గానము చేయఁబడిన రామచరితమును వినెను. ఆగీతము తంత్రీలయసమాయుక్తము, త్రిస్థానకరణాన్వితము, సంస్కృతము, లక్షణయుక్తము, సమతాళసమన్వితము, పూర్వము వాల్మీకిచేఁ జేయఁబడినదియునై యుండెను. ఆయక్షరములు సత్యములు, యథార్థముగా జరిగినవియునై యానుపూర్వికగా నున్నవి. పురుషశార్దూలుఁడగు శత్రుఘ్నుఁ డదివిని నిస్సంజ్ఞుఁడై బాష్పపూరితలోచనుఁడు నాయెను. అతఁడు ముహూర్తకాలము నిస్సంజ్ఞుఁడై నిట్టూర్చి యాగీతము ప్రస్తుతము జరుగుచున్నట్టుగా భావించెను. అతని వెంటవచ్చినవారును గీతమునువిని తలలువంచుకొని దీనులయి "యాశ్చర్యమాశ్చర్య"మనిరి. సైనికులందఱును "ఇది యేమి! మన మెచ్చట నున్నారము? ఇది స్వప్నమా? మనము పూర్వము చూచినదియు, వినినదియు, నెఱిఁగినదియు నగు సందర్భమునంతను మరల నీయాశ్రమమున వినుచున్నారము. ఇది గీతబంధము నాశ్రయించిన స్వప్నము కాదుగద!" అని యొకరితో నొక రనుకొనిరి. వా రట్లు విస్మయమును బొంది శత్రుఘ్నునితో నిట్లనిరి: "నరశ్రేష్ఠా! ఈసంగతియంతయు బాగుగా వాల్మీకిమహామునిని నడుగుఁడు" అని చెప్పఁగా శత్రుఘ్నుఁడు కౌతూహలసమన్వితుడైన తనసైనికులను జూచి "మనము వాల్మీకిమహాముని నడుగఁజాలము. ఈ మహామునియాశ్రమమం దిటువంటి యాశ్చర్యములు వెక్కుగలవు. మనము కౌతూహలపడి యాయన నడుగఁదగునా" అనెను. అని యట్లు సైనికులతోఁ జెప్పి శత్రుఘ్నుఁడు వాల్మీకిమహర్షికి నమస్కరించి తన నివాసమునకు నపుడే పోయెను.

బాలునకు కాలమృత్యువు సంభవించునా? ఇతర దేశములయందుండు బాలురకు మృత్యువువలన భయము లేదే! రాజా! మృత్యువశంవదుఁడైన నా బాలుని బ్రతికింపుము. లేనిచో నే నీ రాజద్వారమున భార్యతోఁగూడ ననాథునివలెఁ జచ్చెదను. బ్రహ్మహత్య ననుభవించుచు నీవు సుఖముగా నుండుము. నీవు నీ తమ్ములతో జిరకాలజీవులై యుండుఁడు. సుమహాబలా! ఇదివఱకు నీ రాజ్యమున సుఖముగా నుంటిమి. ఇప్పు డిట్టి ఘోరము తటస్థించినది. రామా! నీ యధీనమైతిమి. కాలవశమును బొందియున్న మాకు స్వల్పముగానైనను సుఖము లేదు. ఇక్ష్వాకువంశపు రాజుల దేశము దిక్కులేనిదియైపోయినది. రాముఁడు రాజగుటచే బాలునకు మృతి గలిగినది. ఇది నిజమైనసంగతి. రాజువలన దోషము గలిగిననే ప్రజలకు విధివశమున నిట్టి యుపద్రవములు గలుగుచుండును. రాజు దుర్మార్గుఁడైననే ప్రజల కకాలమరణము సంభవించును. లేదేని పట్టణములయందుఁగాని, పల్లెలయందుఁగాని జనులు తగనిపనులు చేయునపుడు రాజు వానిని గనిపెట్టి చక్కఁజేయుచుండవలయును. అట్లుచేయనిచో నిట్టి యకాలమరణములు ప్రాప్తించును. ఏమైనను రాజదోషమువలననే యిట్టివి జరుగుచుండుట నిశ్చయము" అని యిట్లనేకవిధములుగా మాటిమాటికిని రాముని నిందించుచు నాముసలిబ్రాహ్మణుఁడు కొడుకును గౌఁగిలించుకొని యేడుచుచుండెను.

## 74-వ సర్గము

### నారదుఁడు బాలునిమృతికిఁ గారణముఁ జెప్పుట

ఇట్లు జాలి గలుగునట్లు మాటిమాటికిని దుఃఖసంతప్తుఁడై యేడుచుచున్న యాబ్రాహ్మణుని రోదనమంతయు రాముఁడు వినెను. అట్లువిని రాముఁడు తాను దుఃఖించి సంతప్తుఁడై మంత్రులను, వసిష్ఠవామదేవులను, భరతుని, లక్ష్మణుని, నీతిశాస్త్రవేత్తలను బిలిపించెను. అట్లు వసిష్ఠునితో నెనమండుగురు బ్రాహ్మణులు వచ్చి దేవసమానుఁడగు శ్రీరాముని నాశీర్వదించిరి. మార్కండేయుఁడు, మౌద్గల్యుఁడు, వామదేవుఁడు, కాశ్యపుఁడు, కాత్యాయనుఁడును, జాబాలి, గౌతముఁడు, నారదుఁడు మొదలగువారందఱును యథోచితముగ నాసనముల నలంకరించిరి. రాముఁ డిట్లు వచ్చియుండిన మునులకందఱకును నమస్కరించి మంత్రులను, నీతిజ్ఞ

దాను క్రమముగాఁ దపస్సు మూఁడువర్ణములవారిని బొందుచుండును. మూఁడుయుగములయందును మూఁడువర్ణములను ధర్మము పొందుచుండును. యుగమునుబట్టి శూద్రున కప్పుడు ధర్మాధికారము లేదు. నృపశ్రేష్ఠా! హీనవర్ణుఁడు గొప్పతపస్సు చేయుచున్నాఁడు. శూద్రులు తపస్సు చేయుచుండుట కలియుగమునందు సంభవించును. ద్వాపరమందు శూద్రున కధర్మము ఒనగూడుచుండును. అట్టిశూద్రుఁడు నీరాజ్యప్రాంతమునందు దుర్బుద్ధియై తప మాచరించుచున్నాఁడు. కావుననే యిపు డీబాలుఁడు మృతినొందెను. ఏరాజుయొక్క దేశమం దధర్మకార్యములు జరుగునో ఆ రాజు తప్పక నరకమునకుఁ బోవును. అధ్యయనము, తపము, సుకృతము మొదలగువానిలో నాఱవపాలు ధర్మముగా రాజ్యమేలు రాజునకు లభించును. అట్లు బాగుగా రక్షింపనిచో రాజు ప్రజలపాపమునందలి నాలవ భాగమును బొందును. కనుక రాజు తనరాజ్యము ధర్మముగాఁ బాలింపవలెను. పురుషశార్దూలా! నీదేశమంతయు వెదకుము. దుష్కృత మెచ్చటఁ గనవచ్చిన దానిని రూపుమాపుము. అట్లు జరిగినచో ధర్మవృద్ధియు నరులకు దీర్ఘాయువును గలుగును. రాజా! ఈబాలుఁడును వెంటనే జీవించును.

## 75-వ సర్గము

### రాముఁడు శంబూకుని జూచుట

శ్రీరాముఁ డట్లు నారదమహాముని చెప్పిన యమృతమయమైన యామాటలు విని నిరుపమానమైన సంతోషమునుబొంది లక్ష్మణునిజూచి యిట్లనియె: "తమ్ముఁడా! నీవు వెళ్లి సువ్రతుఁడగు నాబ్రాహ్మణు నోదార్పుము. ఆమృతబాలునిశరీరమును తైలద్రోణికయం దుంపింపుము. పరమోద్దారకములైన గంధములు, తైలములు మొదలగునవి నించి యాబాలునిశరీరము పాడువడకుండ నుంపించుము. శిష్టకర్ముఁడగు నాబ్రాహ్మణునికుమారుఁడు రక్షింపఁబడినవాఁడై విపత్తినిగాని, భేదమునుగాని పొందకుండఁ జేయింపుము." రాముఁ డిట్లు శుభలక్షణుఁడగు లక్ష్మణున కాజ్ఞాపించి వెంటనే రమ్మని పుష్పకమును స్మరించెను. హేమభూషితమగు నాపుష్పకము రామునిమనోభావమును దెలిసికొని ముహూర్తమాత్రములో రామునిసన్నిధికి వచ్చెను. అటువచ్చి "నరాధిపా! ఇదిగో వచ్చితి

నేమి సెల"వని నమ్రముగ నమస్కరించినది. నీ కింకరుడను [illegible]
సన్నిధికి వచ్చితి ననెను. నరాధిపుఁడు పుష్పకవిమానముయొక్క మనోహరమైన
పలుకు విని యమ్మహర్షులకు నమస్కరించి పుష్పక మారోహించెను.
ధనుర్బాణములను గత్తిని చేతఁబట్టుకొనెను. లక్ష్మణభరతులకుఁ బట్టణ
మప్పగించెను. అప్పటప్పుడు వెదకుచుఁ బశ్చిమదిశకు బయలుదేరెను.
హిమవంతునిచే నావరింపఁబడిన యుత్తరదిక్కునకుఁ బోయెను. మహా
స్వచ్ఛమయిన పుష్పకముతో నప్పుడు నగరమునుండి పూర్వదిక్కంతయు
వెదకెను. ఆదిక్కంతయు విశుద్ధసమాచారము, అద్దమువలెనుండుట గా
గనుపట్టినది. అప్పటినుండి బయలుదేరి యారాజర్షి యగు రాముఁడు
దక్షిణదిక్కునకుఁ బోయెను. శైలముయొక్క యుత్తరప్రాంతమునఁ
బెద్దసరస్సు చూచెను. ఆసరస్సులో నధోముఖుఁడై ఘోరతప మాచరించు
వానిని జూచెను. రాముఁడు ఘోరతపస్సు చేయువానిదగ్గఱకుఁ బోయి
"సువ్రతా! నీవు ధన్యుఁడవు, తపోవృద్ధా! నీ వేజాతియందుఁ బుట్టితివి?
నేను సంతోషాశ్చర్యములతోఁ గూడి యడుగుచున్నాను. నేను రాముఁ
డనుపేరుగలవాఁడను. మాతండ్రి దశరథమహారాజు. నీకోరిక యేమి?
స్వర్గలోకము గావలయునా? ఇంతదుష్కరమయినతప స్సేవరమునకొఱకుఁ
జేయుచున్నావు? తాపసా! నీ వెవని నాశ్రయించి యింత తపస్సు చేయు
చున్నావు? బ్రాహ్మణుఁడవేని నీకు భద్రమగును. రాజవేని దుర్జయుఁడవు,
మూఁడవవర్ణమగు వైశ్యుఁడవా? లేక శూద్రుఁడవా? యథార్థము
చెప్పుము." రాముఁ డిట్లడుగఁగాఁ దలక్రిందుగాఁ దపస్సుచేయు నాతపస్వి
తనజాతిని తపఃకారణమును రామున కిట్లుచెప్ప మొదలిడెను:

## 76-వ సర్గము

### శంబూకవధ, దేవతాదర్శనము

ఆతపస్వి యక్లిష్టకర్ముఁడగు రాముఁ డడిగినమాటలు విని తల
క్రిందుగా నుండియే యిట్లనియె: "రాజా! నేను శూద్రయోనియందుఁ
బుట్టితిని. నాపేరు శంబూకుఁడు. మహాయశా! యీశరీరముతో దేవత్వ
మును బడయఁగోరుచుంటిని. రామా! నే నసత్యమాడను. దేవలోకజిగీ
షచే నే నిట్టిఘోరతప మాచరించుచుంటిని. నేను నిజముగా శూద్రుఁ
డను" అని యాశూద్రుఁ డిట్లుచెప్పుచుండఁగానే రాముఁడు వాఁడియగు

క్షితిమీఁది పడియున్న వానికంఠము దెగఁగోసెను. ఆశూద్రుఁడు హతుఁడు కాఁగానే యగ్నిప్రముఖులగు దేవతలు మాటిమాటికిని రాముని సాధువాదములతోఁ గొనియాడిరి. సుగంధయుక్తమగు పుష్పవర్షము గురిసినది. దేవదుందుభులు మ్రోఁగినవి. వాయుముక్తమై పుష్పరాశి యంతటను బడినది. దేవతలు సంతోషించి రామునితో నిట్లనిరి: "మహామతీ రామా! నీవు సురలకార్యము నెఱవేర్చితివి. అరిందమా! నీయిష్టమయిన వరము వేఁడుము. రఘునందనా! యీశూద్రుఁడు నీధర్మమున స్వర్గమునకు బోకుండఁ జేసితివి. మాకంతియే చాలును" అనియిట్లు దేవతలన్న మాటలు విని రాముఁడు సావధానుఁడై చేతులు జోడించుకొని దేవేంద్రునితో నిట్లనియెను: "దేవతలారా! ఇంద్రభగవానుఁడా! మీరు నాయందనుగ్రహముంచితిరేని యాబాలుఁడు జీవించునుగాక. ఇదియే నాకుఁ గావలసిన వరము. నాయపచారమువలన నాబ్రాహ్మణబాలుఁ డకాలమున కాలధర్మమునొంది యమునియింటికిఁ జనెను. వానిని బ్రదికింపుఁడు. నామాట ననృతము చేయకుఁడు. నీబాలుని బ్రదికించెదనని యాబ్రాహ్మణునితోఁ బ్రతిజ్ఞపట్టి చెప్పితిని" అనియిట్లు రాముఁ డన్నమాటలు విని దేవతలు సంతోషించి రామునితో నిట్లనిరి: "రామా! నెమ్మదిగా నుండుము. ఆ బాలుఁడు నేఁడే బ్రదికి తనబంధువులతోఁ గలసికొనెను. ఏముహూర్తమున శూద్రునిశిరస్సు ఖండించితివో యప్పుడే యాబాలునిప్రాణములు మరల శరీరమును బొందినవి. నీకు మేలగుఁగాక! మేము వెళ్లెదము. ఈ ప్రాంతముననే యగస్త్యునియాశ్రమ మున్నది. అచ్చటికిఁబోయి యాయనను జూచెదము. మహర్షియయిన యాతనిదీక్ష సమాప్తమయినది. జలశయ్యయం దిప్పటికిఁ బండ్రెండేఁడులనుండి శయనించియున్నాఁడు. ఆమునినభినందించుకొఱకు వెళ్లెదము. ఆమునిని జూచుటకై నీవును మాతో రమ్ము" అని యన్న దేవతలమాటలు విని రాముఁ డంగీకరించి హేమభూషితమగు పుష్పకము నారోహించెను. బహువిస్తారములగు విమానములెక్కి దేవతలు బయలుదేరిరి. రాముఁడును వారివెంటఁ గుంభయోనియగు నగస్త్యుని జూచుటకు బయలుదేఱెను. తపస్సులకు నిధియగు నగస్త్యుఁడు దేవతలను జూచి ధర్మాత్ముఁ డతఁ డందఱను యథోచితముగాఁ బూజించెను. దేవత లతనివలనఁ బూజను గైకొని యాతనిఁ బూజించి సంతోషించుచు ననుచరులతో స్వర్గమునకుఁ బోయిరి.

దేవతలు పోఁగానే రాముఁడు విమానము దిగి బుషిసత్తముఁడగు నగస్త్యునకు నమస్కరించెను. అతఁ డగ్నిహోత్రమువలె వెలుఁగుచున్న మహాత్ముఁడైన యాయగస్త్యునికి నమస్కరించి యాతనివలన నాతిథ్యముఁ గైకొని యాసనము నలంకరించెను. అపు డగస్త్యుఁ డాతనితో నిట్లనియె: "రాఘవా! నీకు స్వాగతము. నాపుణ్యవశమున నిటువచ్చితివి. ఉత్తమ మయిన బహుగుణములచే నీవు నాకు బహుమానపాత్రుఁడవు. నీ వెప్పుఁ డును నాహృదయమునందే యున్నాఁడవు. ఇప్పుడు ప్రత్యక్షముగా నిక్క డకు వచ్చితివి. అతిథివి. పూజనీయుఁడవు. నీవు శూద్రునిఁ జంపుటకై వచ్చితివని నాకు దేవతలు చెప్పిరి. నీవు ధర్మముచే బ్రాహ్మణబాలునిఁ బ్రతి కించితివి. నాదగ్గఱ నీరాత్రి యుండిపొమ్ము. తెల్లవాఱినతోడనే పుష్పక మెక్కి మీపట్టణమునకుఁ బోదువుగాక! నీవు శ్రీమంతుఁడవగు నారాయ ణుఁడవు. నీయందు సర్వమును బ్రతిష్ఠితమైయున్నది. సర్వభూతముల కును నీవే ప్రభుఁడవు; నీవు సనాతనుఁడవయిన పురుషుఁడవు. సౌమ్యా! యీ యాభరణము విశ్వకర్మచే నిర్మింపఁబడినది. ఈదివ్యాభరణమును జాజ్వల్యమానముగా నీశరీరమున కలంకరించుకొని నామనస్సును సంతోష పెట్టుము. దత్తమయినదానిని మరల దానమిచ్చినచోఁ జాలఫలము గల దందురు. నీ వింద్రాదులను భరించుటకుఁ దగినవాఁడవు. ఇంద్రాదిదేవత లను దరింపఁజేయుటకు నీవు శక్తిగలవాఁడవు. కావున రాజా! రామా! నేనిచ్చినదానిని విధిగాఁ బరిగ్రహింపుము" అనిచెప్పిన యగస్త్యునిమాటలు విని యిక్ష్వాకుకులమహారథుఁడు మతిమచ్ఛ్రేష్ఠుఁడు రాముఁడు రాజ ధర్మము నాలోచించుచు బ్రాహ్మణోత్తమా! దానము గ్రహించుట బ్రాహ్మ ణునకుఁ దగును. క్షత్రియుఁడనైన నేనెట్లు పుచ్చుకొందును? విశేషించి బ్రాహ్మణునిచే దత్తమయినదానిని" అని రాముఁ డనఁగా నగస్త్యుఁ డిట్లనియె.

"రామా! పూర్వము కృతయుగమునఁ బ్రజలు రాజులేకుండ నుండెడివారు. దేవతలకు శతక్రతువు రాజుగా నుండెడివాఁడు. ఆప్రజలు తమకు రాజు కావలయునని దేవదేవునియొద్దకుఁబోయి యిట్లనిరి: 'దేవా! నీవు దేవతలకు శతక్రతువును రాజునుగా స్థాపించితివి. లోకేశా! మాకును నరపుంగవుఁడగు రాజు నిమ్ము. మేమతనిని బూజించుచు నిష్పాపులమయి సంచరించెదము. రాజులేకుండ మేముండఁజాలము. ఇది మాముఖ్యమైన నిశ్చయము.' ఇట్లను ప్రజలమాటలు విని యుత్తమమయిన యర్థమును

నిర్మించి తరువాత బ్రహ్మ యింద్రాది లోకపాలకులను రావించి 'మీ మీ తేజోభాగము లిత్తురుగాక!' యని యడిగెను. లోకపాలకులందఱును దమతమ తేజస్సులయందు నాలవభాగము నిచ్చిరి. తరువాత బ్రహ్మ వానితో రాజును సృజించెను. అతఁడు క్షువు డను పేరుగలవాఁడాయెను. అతనిని బ్రహ్మ లోకపాలుర యంశములతో యోజనచేసెను. ఆక్షువుని ప్రజలకు రాజునుగా నిచ్చెను. ఆక్షువుఁ డింద్రునియంశముచేతను భూమి నాజ్ఞాపించుచుండెను. రాఘవా! వరుణునిభాగముచేతను శరీరమును బోషించుచుండెను. కుబేరునిభాగముచేతను బ్రజలకు ధనమిచ్చుచుండెను. యమునియంశముచేతను బ్రజలను శాసించుచుండెను. నరశ్రేష్ఠుఁడవగు రామా! నీయందున్న యింద్రునియంశభాగముచేతను నేనిచ్చుదానిని బరిగ్రహింపుము. నేను దరింతును" అనియిట్లు చెప్పిన పరమధార్మికుఁడైన యగస్త్యునివాక్యములు విని యాయనయిచ్చిన యాభరణమును బరిగ్రహించెను. ఆ ట్లాయాభరణమును బరిగ్రహించి బాగుగ వెలుఁగుచుండు నాయాభరణప్రాప్తి నడుగుట కుపక్రమించెను: "భగవానులవారూ! ఈయాభరణ మత్యద్భుతమయినది. దివ్యమైన యాకృతిగలిగియున్నది. ఇది తమ కెట్లు లభించినది? దీని నెవ్వరు తెచ్చి తమ కిచ్చిరి? మహాయశా! నాకుఁ జాలనాశ్చర్యముగలిగి యడుగుచున్నాను. తామే పరమాశ్చర్యములకు నిధియని నాకుఁ దెలిసినది" అనియిట్లు శ్రీరాముఁ డడుగఁగా నగస్త్యుఁ డిట్లనియె: "రామా! జరిగినవృత్తమును జెప్పెదను వినుము. పూర్వము త్రేతాయుగమున రమణీయప్రదేశమగు నీవనమున నేనొక యాశ్చర్యమును జూచితిని. అది దీని యాగమనమునకు ముఖ్యహేతువు. దానిని జెప్పెద నాలింపుము."

## 77-వ సర్గము

### అగస్త్యుఁడు చెప్పిన శ్వేతునికథ

రామా! పూర్వము త్రేతాయుగములో బహువిస్తారమగు నరణ్యముండెను. అది యంతటను యోజనశతము పరిమితిగలిగి మృగములు పక్షులు లేకయుండెను. అట్టినిర్మానుష్యమయిన యరణ్యమం దుత్తమమగు తపస్సు చేయుటకై నేనుబోయితిని. ఫలములచేతను, మూలములచేతను, బహురూపములగు వృక్షములచేతను నాయరణ్యముయొక్క రూపము

దినుట కెట్లు సమ్మతింతువు? అందును నీబోటి దివ్యపురుషుఁడా యిట్టి యాహారమును దినుట? ఇదియంతయు నాకుఁ జాలనాశ్చర్యమును గలిగించుచున్నది. యథార్థముగా నేను వినఁదలఁచుకొనియున్నాను. ఏమైనను నీకిది తినఁదగిన భక్ష్యముగాదని నేను ముఖ్యముగాఁ జెప్పఁగలను." రామా! నేనిట్లనఁగానే యాదివ్యపురుషుఁడు "నానిజమైన మాటలు విని తనసంగతియంతయు యథార్థముగా నీకుఁ జెప్పెద" ననియె.

## 78-వ సర్గము

### శ్వేతుని పూర్వవృత్తాంతము

శ్రీరామా! ఆదివ్యపురుషుఁడు మధురాక్షరములు గల నావాక్యములు విని చేతులు జోడించుకొని నాకిట్లు బదులు చెప్పెను: "మునివర్యా! నాసుఖదుఃఖములను దెలుపు పూర్వవృత్తము చెప్పెద వినుము: నీవు నన్నడిగితివి. నీవంటిమహామునిమాటకు బదులుచెప్పకయుండరాదు. పూర్వము మహాయశస్కుండగు నాతండ్రి విదర్భదేశాధీశ్వరుఁడు సుదేవుఁడను నతఁడు. మూఁడులోకములయందును విఖ్యాతుఁడుగా నుండెడివాఁడు. అతని కిద్దఱు భార్యలు గలరు. ఇద్దఱకును నిద్దఱు కుమారులు పుట్టిరి. నేను శ్వేతుఁడనువాఁడను. సురథుఁడనువాఁడు చిన్నవాఁడు. తరువాత మాతండ్రి స్వర్గమునకుఁ బోఁగాఁ బౌరులు మొదలగువారు నన్నభిషేకించిరి. నేను సావధానచిత్తుఁడనై ప్రజలను ధర్మముతోఁ బరిపాలించుచుంటిని. సువ్రతా! ఇట్లు బహువర్షసహస్రములు గడచినవి. నేనెంతయు ధర్మముగాఁ బ్రజలనేలితిని. ద్విజోత్తమా! నేనొకానొక నిమిత్తమున నాయువు దెలిసినవాఁడనై కాలధర్మమును మనసున నుంచుకొని వనమునకుఁ దరలితిని. నే నీనిర్మానుష్యమును నిర్మృగపక్షికమును నగు వనమునకు వచ్చి యీసర స్సమీపమునఁ దపస్సుచేసికొనుటకు నిశ్చయించుకొంటిని. నేను నాతమ్ముని సురథుని రాజ్యమునం దభిషేకించితిని. నే నిచ్చటికి వచ్చి చిరకాలము తపమాచరించితిని. నేను మూఁడువేలసంవత్సరములు ఘోరముగఁ దపస్సుచేసి యనుత్తమమగు బ్రహ్మలోకమునకుఁ బోతిని. ద్విజోత్తమా! స్వర్గతుఁడనైన నన్ను నాఁకలిదప్పులు బాధింపఁ జొచ్చినవి. నేను వ్యాకులపడితిని. అపుడు త్రిభువనశ్రేష్ఠుఁడగు బ్రహ్మ యొద్దకుఁబోయి "దేవా! ఇది బ్రహ్మలోకమనియు నిచ్చట నాఁకలిదప్పిక

లుండవనియు నమ్మితిని. కాని నేను క్షుత్పిపాసాపరీతుఁడనై యుంటిని. ఇదియే దుష్కృతకర్మమునకుఁ బరిపాకము? నాకాహార మేమి? అది నాకుఁ జెప్పవలయును" అని యడుగఁగా బ్రహ్మ నాతో నిట్లనెను: "సుదేవతనూ జుఁడవగు నో శ్వేతా! నీశరీరమాంసము రుచిగా నుండును. నీవు దానిని నిత్యము భక్షించుచుండుము. ఉత్తమమైన తపమాచరించుచు నీశరీర మును బుష్టముగాఁ జేసితివి. మహామతీ! బీజము నాటకుండఁ జెట్లెట్లు మొలచును? జంతువిహీనమగు నడవిలో నీకు లవలేశమును దృప్తి లేక పోయినది. పూర్వము నీవు భిక్షుకునకైన యతులకుఁగాని, యతిథులకుఁ గాని భిక్ష యీయనైతివి. ఎల్లకాలమును తపమే చేయుచుంటివి. కావు ననే నాయనా! నీ వీలోకమునకు వచ్చినను నిన్ను క్షుత్పిపాసలు బాధించు చున్నవి. నీవిటుపైని మంచిమంచియాహారములచే బాగుగాఁ బెంచియున్న నీశరీరమునందలి మాంసమును దిని దృప్తిని బొందుచుండుము. ఎప్పుడా యడవిలోని కగస్త్యుఁడు వచ్చునో అప్పుడు నీ కాకష్టము తీరును. అతఁడు దేవతలనుగూడఁ దరింపఁజేయ శక్తిగలవాఁడు. క్షుత్పిపాసాపరీతుఁడ వైన నిన్నుఁ దరింపఁజేయుట యన నతని కెంత?" అని చెప్పిన బ్రహ్మవాక్య ములు విని "ద్విజోత్తమా! అదిమొదలు నిందితమైన యీ నాశరీరమాంస మును భుజించుచున్నాను. నేనిదివఱ కెన్ని వేలసంవత్సరములనుండియో యిట్లు తినుచున్నాను. నాకుఁ దృప్తిగాని యీశరీరమునకు క్షయముగాని కనుపడదాయెను. కనుక నే నీకష్టసంకటమునుండి యెట్లు విడుదలను బొందు దునో యట్లుచేయఁగోరితిని. నన్ను రక్షించుము. నన్నుఁ దరింపఁజేయుట కగస్త్యునకుఁదక్కఁ దక్కినవారికి వశముగాదు. నన్నుఁ దరింపఁజేయుట కుఁగా నీయాభరణము పుచ్చుకొనుము. నీకు క్షేమమగుఁగాక. నన్నిపు డనుగ్రహింపుము. ఇది ప్రతిదినమును సువర్ణమును, ధనమును, వస్త్రము లను, భక్ష్యమును, భోజ్యమును, ఆభరణములను నిచ్చుచుండును. ముని పుంగవా! సమస్తమయిన కోరికలను భోగములను నిచ్చెదను. నన్నెటు లైనను దరింపఁజేయుము." ఇట్లు దుఃఖముతోఁగూడిన యాదివ్యపురుషుని వాక్యములు విని యతనిని దరింపఁజేయుటకై యుత్తమమైన యీయాభ రణమును బుచ్చుకొంటిని. శుభమైన యీయాభరణము బ్రతిగ్రహించిన తోడనే యారాజర్షి యొక్క పూర్వదేహము నశించినది. ఆశరీరము నశిం చినతోడనే యతఁడు చాలసంతోషించి స్వర్గమునకుఁబోయెను. ఇంద్ర

తుల్యుఁడగు నాతనిచేత సీదివ్యాభరణము ఆత్మతరణార్థమై నాకీయఁబడినది. ఇది యత్యద్భుతమైన యాభరణము.

## 79-వ సర్గము

### అగస్త్యుఁడుచెప్పిన దండునికథ

శ్రీరామచంద్రుఁ డిట్లుచెప్పిన యగస్త్యభగవానుని యత్యద్భుతమైన వాక్యమును విని గౌరవమువలనను విస్మయమువలనను మరల నడుగుట కుపక్రమించెను. భగవానులవారా! శ్వేతుఁడు తపస్సుచేసిన యరణ్యము మృగపక్షిశూన్యమగుటకుఁ గారణమేమి? అట్టి నిర్మానుష్యమైన యరణ్యములోఁ దపస్సుచేయుటకు శ్వేతుఁడెందులకు బ్రవేశించెను? ఇది వినుటకుఁ గోరికయగుచున్నది. సెలవీయఁదగునని యడుగఁగా నగస్త్యుఁడు చెప్పుట కుపక్రమించెను. రామా! పూర్వము కృతయుగమున మనుచక్రవర్తి దండధరుఁడు ప్రభువై యుండెను. అతని కిక్ష్వాకుఁడు కుమారుఁడై పుట్టెను. ఆతఁడు తనకుమారుఁడగు నిక్ష్వాకునకు రాజ్యాభిషేకము చేసి భూమియందు రాజవంశములకుఁ గర్తవు కమ్మని చెప్పెను. తండ్రి చెప్పినమాట కుమారుఁ డంగీకరించెను. తరువాత మనువు చాల సంతోషించినవాఁడై కుమారునితో నిట్లనియె: "నాయనా! నేను జాలసంతోషించితిని. నేనుజెప్పినట్లు నీవుచేయుట కేవిధమైన యభ్యంతరమును లేదు. ప్రజలను దండముచే రక్షించుము. అకారణముగా దండమును బ్రయోగింపకుము. అపరాధముచేసినవారివిషయమై ప్రయోగించిన దండము విధియైనది. అది రాజును స్వర్గమునకుఁ బంపును. కావున నాయనా! దండనీతివిషయమునఁ జాలయత్నముగలవాఁడవై యుండుము. అటు నడచువాఁడవైనచో నీకు ధర్మముగలుగును" అని యిట్లనేకవిధములుగాఁ గుమారునకు బోధించి మనువు సమాధి నవలంబించి సంతోషముగా బ్రహ్మలోకమునకుఁ బోయెను. అట్లు మనువు బ్రహ్మలోకమునకుఁ బోయిన పిదప నమితప్రభుఁడైన యిక్ష్వాకుమహారాజు "నేనెట్లు పుత్రులను గనుదును" అని చింతాపరుఁడాయెను. అతఁ డాయాకర్మములచేత నెట్లో దేవసుతోపములగు నూఱుగురుకుమారులను గనియెను. రఘునందనా! రామా! వారిలోఁ గడగొట్టువాఁడు మూఢుఁడు, చదువనివాఁడు నగుటచేఁ బూర్వజులను సేవించినవాఁడుగాఁడు. బుద్ధితక్కువవాఁడగు వానికిఁ దండ్రియే

దండుఁడని నామకరణము చేసెను. వీనిశరీరమునందుఁ దప్పక దండపతన మగునని యతఁడు తలఁచెను. ఆతనికిఁ దండ్రి వింధ్యశైలముల మధ్య మున రాజ్యమిచ్చెను. ఆతఁ డాపర్వతప్రాంతమున నొక్క దేవలోక రమ్యమైన పురమును నిర్మింపఁజేసికొనెను. ఆపట్టణమునకు మధుమంత మని నామముంచెను. తనకు శుక్రాచార్యుని పురోహితునిగా వరించు కొనెను. ఈరీతిగాఁ బురోహితునితోఁ గూడి యతఁడు రాజ్యమేలుచుం డెను. ఆతనిద్వారమునం దంతటను బ్రతివారును సంతోషించుచుండిరి. అతఁడు దేవేంద్రుఁడు స్వర్గము నేలినట్లుగా నేలుచుండెను.

## 30-వ సర్గము

### దండుఁ డరజను బలాత్కరించుట

ఇట్లగస్త్యమహాముని యింతవఱకుఁజెప్పి యీకథాసందర్భమున నిం కొకసంగతినిజెప్పుట కుపక్రమించెను. రామా! అట్లు దండుఁడనురాజు పెక్కువేలసంవత్సరములు దాంతుఁడై నిహతకంటకమగు రాజ్యమేలు కొనుచుండెను. ఇట్లుండఁగా నతఁడొకవసంతఋతువులో రమణీయమగు భార్గవుని యాశ్రమములోనికిఁ బోయెను. అచ్చట సర్వాంగసుందరియగు భార్గవునికన్యను వనములోఁ దిరుగుచుండుదానిని జూచి యామహాదుర్బుద్ధి మన్మథశరపీడితుఁడై యాకన్నియదగ్గఱకుఁబోయి యిట్లనియె: "సుశ్రోణీ! నీవెచ్చటిదానవు? సుందరీ! నీవెవ్వనితనయవు? నేను నిన్నుఁజూచి మన్మథ వశంవదుఁడనైతిని. కావున నాకోరికదీర్చవలయు"నను వానిని మోహో న్మత్తునిగాఁ దెలిసికొని బ్రతిమాలుచు నాకన్నియ యిట్లనియె: "రాజా! నేను శుక్రాచార్యుల కుమారితను. నాపే రరజ యందురు. నేను పెద్ద దానను. ఈయాశ్రమములో నుందును. నేను గన్యను. తండ్రియధీనమున నున్నదానను. నన్ను బలాత్కరింపకుము. వలదు వలదు. నన్ను ముట్ట వలదు. నాతండ్రి నీకు గురువు. నీవతనికి శిష్యుఁడవు. మహాతపశ్శాలి యగు నాయనకుఁ గోపమువచ్చినచో నీకుఁ జాలఁ గష్టము సంభవింపక తప్పదు. నేనింకను నీకేదియైనను జేయవలసియుండినచో ధర్మదృష్టమైన సన్మార్గమున మహాద్యుతియగు మాతండ్రిని గోరుము. అట్లు కాదేని నీ కిందువలన మహాఘోరశాపము తటస్థించిలీరును. నాతండ్రికిఁ గోపమువచ్చి నచో మూఁడులోకములను దహించును. కావున నీవుపోయి మాతండ్రిని

యాచించినచో నతఁడు దప్పక నన్ను నీకిచ్చును" అని యిట్లు చెప్పుచున్న యాయరజను కామపరవశుఁడైన యాదండుఁడు మదోన్మత్తుఁడై శిరస్సునం దంజలి యుంచుకొని యిట్లనియె: "సుందరీ! నాయం దనుగ్రహింపుము. కాలహరణము చేయకుము. నీకొఱకు నాప్రాణములు పోవుచున్న ట్లున్నవి. నిన్నుఁ బొందిన వెనుక శాపమైనను గానిమ్ము, వధమైనను గానిమ్ము లక్ష్యముచేయను. నేను నీసేవకుఁడను, నన్నాదరింపుము" అనియి ట్లామెతోఁ జెప్పి బలాత్కారముగా నామెనుబట్టుకొని యటునిటుఁ దప్పించుకొనుట కుద్యుక్తురాలైన యామెకు మానభంగముచేసి గ్రామ్యధర్మమున కుపక్రమించెను. దండుఁ డిట్టిమహాఘోరము నాచరించి వెంటనే తనపట్టణములోనికిఁబోయెను. అరజయు నేడ్చుచు నాయాశ్రమసమీపముననే యుండి భయంపడుచు దేవసన్నిభుఁడగు తండ్రిరాక కెదురుచూచుచుండెను.

## 81-వ సర్గము

### శుక్రుఁడు దండుని శపించుట

అమితతేజశ్శాలియు, దేవర్షియునగు శుక్రాచార్యుఁడు ముహూర్తమాత్రములో నామహాఘోరము విని క్షుధార్తుఁడై శిష్యులతోఁ దన యాశ్రమమునకు వచ్చెను. అతఁడు వచ్చిచూచునప్పటి కాయరజ దీనురాలై ధూళిధూసరితాంగియై ప్రాతఃకాలమం దరుణునికాంతిచేఁ దిరస్కరింపఁబడిన వెన్నెలవలెఁ గాంతిహీనయై కనుపట్టినది. అతఁడు మిక్కిలి యాఁకలిగొన్నవాఁ డగుటచే మఱింతగోప మెక్కువయయినది. మూఁడు లోకములను దహించునా యనునట్లు చూచుచు శిష్యులతో నిట్లనియె: "ఆత్మనిగ్రహములేని దండుని విపరీతచర్య చూచితిరిగదా! సపరివారముగా వానికి వినాశకాలము సమీపించినది కాఁబోలును! లేనిచో మండుచుండు నగ్నిజ్వాలను ముట్టఁబోవునా? వాఁడిట్టి యకార్యమున కొడిగట్టినవాఁడగుటచే దానికిఁ దగినఫల మనుభవించును. ఈదుర్మార్గుని దేశముచుట్టును నూఱుయోజనములమేర గొప్పపాంసువర్షముచేత దేవేంద్రుఁడు నశింపఁజేయఁగలఁడు. ఇచ్చటనుండెడి సర్వజంతువులును, స్థావరములును వెంటనే జయమును బొందఁగలవు. ఈదండుని దేశమంత యుఁ బాంసువర్షముచే నేఁడు దివారాత్రములు మునిఁగిపోవును" అని

చెప్పి క్రోధతామ్రాక్షుఁడయి యాయాశ్రమమునం దున్నవారిని మఱి యొకచోటికిఁ బొమ్మని చెప్పెను. ఇట్లుచెప్పిన శుక్రునిమాటలు విని యా ప్రాంతమునం దున్నవారందఱును వేఱుచోటికిఁ బోయిరి. అతఁ డిట్లు మునులతోఁ జెప్పి కూఁతుతో నిట్లనియె: "ఓసీ బుద్ధితక్కువదానా! నీ వీయాశ్రమముననే సావధానచిత్తురాలవయియుండుము. ఇది యోజన పర్యంతమును సుందరప్రభమగు సరస్సు. అరజా! నిశ్చింతురాలవయి యనుభవించుచుఁ గాలము నెడుపుచుండుము. నీసమీపమందున్న యావజ్జంతువులును పాంసువర్షముచే నశ్యములగును" అని యిట్లు తండ్రి చెప్పినమాటలు విని మిక్కిలి దుఃఖించుచుఁ దండ్రితో నట్లే యగుం డెవనని చెప్పినది. తరువాత శుక్రుఁడు వేఱొకచోటికిఁబోయి యాశ్రమ మును గల్పించుకొని యందుండెను. దండుఁడను నారాజు రాజ్యమంతయు శుక్రుఁ డన్నట్లుగానే యేడురాత్రులు ధూళివర్షముగురియుటచే సభృత్య బలవాహనముగా భస్మీభూతమయిపోయినది. రామా! అదియే వింధ్య శైవలములమధ్యనున్న దేశము. రాజు ధర్మము తప్పుటచే బ్రహ్మర్షి యగు శుక్రునిచే శపింపఁబడినది. అదిమొదలు రామా! దండకారణ్యమని పేరు పడినది. ఇపు డచటఁ దపస్విజనము నివసించుచుండెను. అటుపయిని జన స్థానమున్నది. నీవడిగినవిషయమంతయుఁ జెప్పితిని. రామా! సంధ్యావంద నమునకు సమయ మతిక్రమించుచున్నది. ఈమహర్షులందఱును బూర్ణ కుంభములతో సూర్యు నుపాసించుచున్నారు. సూర్యుఁ డస్తాద్రిచాటు నకుఁ బోవుచున్నాఁడు. బ్రహ్మపవిత్రములగు బ్రాహ్మణులతోఁ గూడిపోయి సంధ్యావందన మాచరింపుము.

## ౮౨-వ సర్గము

### శ్రీరాముఁ డయోధ్యకువచ్చుట

రాముఁ డగస్త్యునిమాటలువిని యప్సరోగణసేవితమగు నాసరస్సు నకు సంధ్యావందనమాచరించుటకుఁ బోయెను. అచట నతఁడు సాయం సంధ్యావందన మాచరించి మరల నగస్త్యునియాశ్రమములోఁ బ్రవేశిం చెను. అతని కగస్త్యుఁడు బహుగుణమగు కందమూలాదికమును భోజన మునకై యేర్పాటుచేసెను. అమృతోపమమగు నాయన్నము నతఁడు భుజించి సంతోషముగా నారాత్రి యచట నివసించెను. ప్రభాతసమయ

మున నిదురనుండి లేచి నిత్యకృత్యములు నెఱవేర్చుకొని గమనము
కొఱకు నాఋషియొద్దకుఁ బోయెను. అతఁడు కుంభసంభవమహామునికి
నమస్కరించి "భగవానులవారూ! సెలవయినచో నయోధ్యకుఁ బోయె
దను. నన్ననుగ్రహింపవలెను. నేను ధన్యుఁడనయితిని. తమదయకుఁ
బాత్రుఁడనయితిని. తమదర్శనమువలనఁ గృతకృత్యుఁడనయితిని. అప్పు
డప్పుడు తమదర్శనముచేసికొని పవిత్రుఁడ నగుచుందును." శ్రీరాముఁ
డిట్లనుచుండఁగా నద్భుతదర్శనమగు నావాక్యములు విని మిగుల సంతో
షించి ధర్మము జ్ఞానసాధనముగాఁగల యగస్త్యుఁడిట్లనియె: "రామా! నీ
మాట లత్యద్భుతములు; మఱియు శుభావహములు. రఘునందనా! సర్వ
భూతములను బవిత్రముచేయువాఁడవునీవే. రామా! ముహూర్తమాత్ర
మయినను నిన్నుఁ జూచినవారు పవిత్రులయి స్వర్గభూతులై సర్వదేవతల
చేతను బూజ్యులగుదురు. ఎవరు నిన్నుఁ దమఘోరచక్షువులచేఁజూతురో
వారు వెంటనే యమదండముచే హతులై ఘోరనరకములలోఁ గూలు
దురు. రఘుశ్రేష్ఠా! నీవిట్టువంటివాఁడవు. సర్వదేహములలోను పవిత్రుఁ
డవు. రాఘవా! నిన్నీభూలోకములోఁ జెప్పుకొనుచుండువారుగూడ
నిష్టసిద్ధులను బొందుచుందురు. జాగరూకతగా క్షేమముగాఁ బట్టణము
నకుఁబోయి ధర్మముగా రాజ్యము నేలుచుండుము. నీవేకదా లోకము
లకు దిక్కు" అని యిట్లుచెప్పిన యాయగస్త్యమహామునికి నమస్కరించి
చేతులు జోడించుకొని పుణ్యవంతుఁడగు నాతనికిఁ బ్రదక్షిణ మాచరించి
యచ్చటి తపోధనులకు నమస్కరించి వెంటనే హేమభూషితమైన పుష్ప
కము నారోహించెను. ఇట్లు వెళ్లుటకు సిద్ధముగా నున్న రామునిఁజూచి
దేవతలు దేవేంద్రు నాశీర్వదించిన ట్లాశీర్వదించిరి. రాముఁ డంతరిక్షము
నందు హేమభూషితమైన విమానముపైనుండి వర్షాకాలములో మేఘ
ముల సమీపముననున్న చంద్రునివలెఁ బ్రకాశించెను. అతఁడచ్చటచ్చటఁ
బూజింపఁబడుచు రెండుజాము లగునప్పటి కయోధ్యకు వచ్చి మధ్య
కక్ష్యలో దిగెను. తరువాత కామగమనముగల విమానమును జూచి
"నీకు క్షేమమగుఁగాక, నీయిచ్చకు వచ్చిన మచ్చునఁ బొ"మ్మనెను. తరు
వాత నాకక్ష్యాంతరమందున్న ద్వారపాలకునిఁజూచి నీవు వేగముగఁ
బోయి లఘువిక్రములగు భరతుని లక్ష్మణుని నేను వచ్చితి ననిచెప్పి వేగ
ముగాఁ దీసికొని రమ్మనెను.

## ౮౩వ సర్గము

### భరతుఁడు రాజసూయము వలదనుట

ఆక్లిష్టకర్ముఁడగు రాముని మాటలు విని ద్వారపాలుఁడు వెంటనే లక్ష్మణుని భరతుని దోడ్కొనివచ్చి రామునకు విన్నవించెను. అట్లువచ్చిన తమ్ములను కౌఁగిలించుకొని రాముఁ డిట్లనియె: "తమ్ములారా! నిజముగా నేను బ్రాహ్మణకార్యము చేసివచ్చితిని. మఱియు ధర్మసేతువు నెప్పటియట్లు చేయఁగోరుచుంటిని. ధర్మసేతువక్షయమైనది, అవ్యయమైనదని నాకు బోధ పడినది. ఈధర్మసారమునునది సర్వపాపప్రణాశకము. ఆత్మభూతులగు మీసాయమున రాజసూయము చేయఁ దలఁచుచున్నాను. అది చేసినచో శాశ్వతమగు ధర్మము గలుగును. శత్రునిబర్హణుఁడగు మిత్రుఁడను నతఁడు రాజసూయమాచరించి పూర్వము మిత్రత్వమునుబొందెను. ధర్మవిదుఁడగు చంద్రుఁడు పూర్వము ధర్మముగా రాజసూయమాచరించి సర్వలోకములయందును శాశ్వతమగుకీర్తిబొందెను. ఈదినమున మీరు నాతో నేదిశ్రేయమో దాని నాలోచింపుఁడు. మీరు నాకు హితమును, ఉత్తరకాలాభివృద్ధిని జేయఁదగుదురు." ఇట్లు శ్రీరాముఁడు చెప్పినవాక్యములువిని వాక్యవిశారదుఁడగు భరతుఁడు చేతులుజోడించుకొని యాతనితో నిట్లనియె: "అన్నా! నీయందు ధర్మమంతయు నున్నది. నీయందు సర్వభూమియుఁ బ్రతిష్ఠితమైయున్నది. అమితవిక్రమా! నీకీర్తియంతటను వ్యాపించియున్నది. ప్రజాపాలురందఱును దేవతలు బ్రహ్మను జూచుచుందునట్లు మావలెనే మహాత్ముని నిన్నును జూచుచున్నారు. మహాబలా! ప్రజలందఱును నిన్నుఁ దండ్రినిగా భావించుచున్నారు. రాఘవా! నీవు భూమికిని బ్రాణిమాత్రమునకును గతివైయున్నావు. భూమియందలి రాజవంశ్యులకు వినాశమును గలిగించు నీరాజసూయమును నీవెట్లాచరించెదవు? రాజా! భూమియందలి పౌరుషవంతులు పౌరుషము నవలంబించి సంక్షయమును బొందుదురు. ఇపుడు నీయధీనమందున్న భూమినంతయుఁ బాడుచేయఁదగవు" అనియి ట్లమృతమొలుకునట్లు పలికిన భరతునిమాటలు విని సత్యపరాక్రముఁడగు రాముఁడు మిగుల సంతోషించి కైకేయికొడుకగు భరతునిజూచి యిట్లనియె: "అనఘా! భరతా! నీవు చెప్పినమాటలకు నేనెంతయు సంతోషించితిని. నీవుచెప్పినమాట సార

వంతమును ధర్మముతోఁగూడినదియునై యున్నది. నీవు భూమికి హితము గలుగునట్లు చెప్పితివి. ఇపుడు నీవు చెప్పిన న్యాయమైన పలుకులచే రాజసూయారంభమునుండి నామనసును మరలించుకొంటిని. ధర్మజ్ఞా! ప్రాజ్ఞులగువారు లోకములకుఁ బీడగలుగు కార్యములు చేయఁగూడదు గదా! భరతా! బాలుర మాటలు తప్పకవినవలయును. అందువలన శుభ మొనఁగూడును. మహామతీ! అందుచే నీవు బాగుగాఁ జెప్పిన మాటలు శ్రద్ధగా వింటిని.

## 84-వ సర్గము

### లక్ష్మణుఁ డశ్వమేధము చేయుమనుట

ఇట్లు రాముఁడు, భరతుఁడును జెప్పినతరువాత లక్ష్మణుఁడు రాముని తో శుభవాక్యములను బలుకుట కుపక్రమించెను: "అన్నా! అశ్వమేధము మహాయజ్ఞము. సర్వపాపములను బోఁగొట్టి పవిత్రముచేయును. కావున దానిచేయుట కంగీకరించవలయును. పూర్వము దేవేంద్రుఁడు బృహస్పతియనుమతిపై నశ్వమేధ మొనరించి పవిత్రుఁడాయెనని విందును. మహాబాహూ! పూర్వము దేవాసురసమాగమనముగలిగినపుడు వృత్రుఁడను పేరుగల రాక్షసుఁడు లోకసమ్మతుఁడుగలఁడు. మూఁడువందల యోజనములవిస్తీర్ణము తొమ్మిదివేల యోజనముల పొడవుగలిగియుండెడి వాఁడు. అతఁడు మూఁడులోకములను విశేషముగ ననురాగముచేఁ జూచుచుండువాఁడు. మఱియు ధర్మజ్ఞుఁడు కృతజ్ఞుఁడు బుద్ధిమంతుఁడునై సావధానముగా ధర్మముతప్పకుండ భూమిని బాలించుచుండెడివాఁడు. అతఁడట్లు పాలించుచుండఁగా భూమి సర్వకామముల నొసఁగుచుండెడిది. పువ్వులు, దుంపలు, ఫలములు రసవంతములైయుండెడివి. ఆమహాత్ముని పాలనవలన భూమి దున్నకుండనే పండుచుండెడిది. అతఁడట్లత్యద్భుతముగా విస్తారముగా రాజ్యము ననుభవించుచుండఁగా నతనికిఁ దపమాచరింపవలయునని బుద్ధిపుట్టినది. తపస్సేకదా మిగుల శ్రేయస్కరమైనదనియు, నితరసుఖములు సంమోహమును గలిగించునవియనియు నతనికిఁ దోఁచినది. అతఁడు తన పెద్దకుమారుని రాజ్యకర్తనుగాఁజేసి సర్వదేవతలకును దాపముగలుగునట్టుగా నుగ్రమైనతపముచేయ మొదలిడెను. అతఁడట్లు తపస్సుచేసికొనుచుండఁగా దేవేంద్రునికి భయముగలిగినది. వెంటనే

యింద్రుఁడు విష్ణువొద్దకుఁబోయి యిట్లనియె: "దేవా! వృత్రునితపస్సుచే మూఁడులోకములును జయింపఁబడినవి. ఆతఁడు బలవంతుఁడును, ధర్మాత్ముఁడును నగుటచే నతనిని జయింపఁజాలను. ఆరాక్షసేశ్వరుఁడు మఱలఁ దపముచేసెనేని యెంతవఱకు లోకములుండునో అంతవఱకును నతనికి స్వాధీనులుగా నుండవలసివచ్చును. మహాబలా, విష్ణూ! అట్టివాని నుపేక్షించితివేని యిఁక నిలువఁజాలము. సురేశ్వరా! నీవు క్షణమాత్రము కోపించితివేని వృత్రుఁడుండఁబోఁడు. నీవు నాయందనుగ్రహము గలిగి నప్పటినుండియు నేను లోకములకుఁ బ్రభువనై యుంటిని. నీవు సావధానచిత్తుఁడవై దేవతల ననుగ్రహదృష్టితోఁ జూడుము. నీమహత్త్వముచే జగమంతయుఁ బ్రశాంతమై నిరుపద్రవమైయుండెను. ఈదేవతలందఱును నీకై యెదురుచూచుచున్నారు. వృత్రునిజంపి వీరికి సాయపడుము. మహాత్ములగు దేవతలకు నిత్యమును నీవు సహాయముచేయుచు నేయుంటివి. ఇపుడెవరికిని సాధ్యముగాని కార్యము తటస్థించినది. గతిలేని మాకు నీవు గతివగుము."

## 85-వ సర్గము

### వృత్రవధవృత్తాంతము

శత్రునిబర్హణుఁడగు రాముఁడు లక్ష్మణునిమాటలువిని వృత్రవధ సాంతముగఁ జెప్పుమన లక్ష్మణుఁడు మరల నిట్లుచెప్ప మొదలిడెను: అట్లు దేవేంద్రుఁడు మొదలగు దేవతలపలుకు లాలించి విష్ణుఁడు వారికిట్లనియె: "దేవేంద్రాదులారా! పూర్వము నేను మహాత్ముఁడగు వృత్రాసురునితో స్నేహముగనుంటిని గనుక మీప్రీతికొఱకు నేను వానిని జంపను. కాని మీ కెట్టులైనను సుఖముగలుగఁజేయవలయును. వృత్రుఁడు చచ్చు నుపాయము చెప్పెదను. దేవతలారా! నాయాత్మను మూఁడువిధములుగాఁ జేసెదను. అందుచే నింద్రుఁడు తప్పక వృత్రుని వధింపఁగలఁడు. ఒక భాగము దేవేంద్రుని, ఒకభాగము వజ్రాయుధమును, మూఁడవభాగము వృత్రునిదేహమును ధరించుటకు శక్తిసిద్ధించుకొఱకు భూతలమును బొందించెదను. అపుడింద్రుఁడు వృత్రాసురుని వధించితీరును." విష్ణుఁడిట్లుచెప్పఁగా దేవతలిట్లనిరి: "విష్ణూ! నీవన్నది నిజమే సందియములేదు. నీకు భద్రమగుఁగాక! మేము వృత్రాసురునివధను గోరుచుఁ బోయెదము. పరమా

ప్రాజ్ఞా! నీతేజస్సునకు దేవేంద్రునియందు యోజనచేయుము అనిచెప్పి యింద్రాదిదేవతలు వృత్రాసురుఁడుండు వనములోనికిఁ బోయిరి. అట్లు పోయి వారు తేజస్సుచే వెలుఁగుచు ఘోరముగఁ దపస్సు చేయువానిని మూఁడులోకములను గ్రాగిపైచునట్లును, అంబరతలమును దహించు నట్లును నగపడువానిని వృత్రాసురుని జూచిరి. అతనిని జూడఁగానే దేవ తలకు భయము గలిగినది. వీనినెట్లు జయింతుము? మనకెట్లు పరాజయము కలుగకుండెడిని? అనియిట్లు దేవత లాలోచించుచుండఁగా సహస్రాక్షుఁ డగు పురందరుఁడు తనవజ్రము రెండుచేతులతోఁ బట్టుకొని వృత్రాసురుని శిరముపైఁ గొట్టెను. కాలాగ్నివలె ఘోరమై మండుచున్న యగ్నిజ్వాలా సమూహమును బోలిన వృత్రునిశిరస్సు పడఁగానే లోకములకు భయము గలిగినది. దేవేంద్రుఁ డతనిని జంపుట యనుచితమని చింతించుచు వెంటనే లోకముయొక్క తుదిప్రదేశమునకుఁ బోయెను. అట్లు పోవుచుండిన యింద్రుని వెంబడించి బ్రహ్మహత్యయుఁబోయి యింద్రునిసర్వావయవముల యందును వ్యాపించినది. ఇంద్రునకు దుఃఖముగలిగినది. అపు డగ్నిపురో గములగు దేవతలు హతశత్రులు ప్రణష్టేంద్రులునై మాటిమాటికిని విష్ణునిఁ ద్రిభువనేశ్వరుని బూజించిరి. పరమేశ్వరా! నీవేదిక్కు. నీవు లోకములన్నింటికిని మొదటితండ్రివి. సర్వభూతములను రక్షించుటకై విష్ణుత్వ మవలంబించితివి. నీవు వృత్రుని జంపితివి. బ్రహ్మహత్య యింద్రుని బాధించుచున్నది. సురశార్దూలా! విష్ణూ! దానిని వదల్పించు నుపాయ మును జెప్పుము" అని దేవత లడుగఁగా విష్ణుఁ డిట్లనియె: "నన్నుఁగూర్చి యింద్రుఁడు యజ్ఞముచేసినచో నేను బవిత్రునిగాఁజేయుదును. అశ్వమేధ మాచరించినయెడల నెప్పటియట్లు బ్రహ్మహత్యతొలఁగి యింద్రుఁడు దేవత లకుఁ బ్రభువగును." విష్ణుఁ డిట్లు దేవతల కాజ్ఞాపించి వారిచే స్తుతి చేయఁ బడుచుఁ దననివాసమునకుఁ బోయెను.

## 86-వ సర్గము

### బ్రహ్మహత్యావిభాగము.

లక్ష్మణుఁ డిట్లు వృత్రవధ వృత్తాంతము చెప్పి మరలఁ గథాశేషము జెప్పుట కుపక్రమించెను: "దేవా! అట్లు దేవభయంకరుఁడగు మహావీర్య శాలి వృత్రుఁడు హతుఁడు కాఁగా నింద్రుఁడు బ్రహ్మహత్యావృతుఁడై

తెలివినిబొందఁడాయెను. అతఁడు లోకములయంత ప్రదేశము నాశ్ర
యించి నష్టసంజ్ఞుఁడును విచేతనుఁడునునై చుట్టుకొనుచున్న పామువలెఁ
గొంతకాల మచ్చటఁ గడపెను. పిమ్మట దేవేంద్రుఁడు లేకుండుటచే జగ
త్తంతయు బెగ్గిలిపోయినది. భూమియంతయు నిస్స్నేహయు శుష్కకాన
నయునై ధ్వంసప్రాయమయిపోయినది. ఎచ్చటను జలము లేకపోయినది.
అనావృష్టివలన జంతువులన్నియు సంక్షోభమును బొందినవి. ఇట్లు లోకమం
తయు క్షీణించిపోవుటచూచి దేవతలు సంభ్రాంతచిత్తులై విష్ణుఁడు చెప్పిన
చొప్పున యజ్ఞము చేయఁదలఁచి బృహస్పతి మొదలైన ఋషులతోఁ గూడి
యింద్రుఁడు భయమోహితుఁడై పడియున్న చోటికిఁ బోయిరి. అట్లుపోయి
బ్రహ్మహత్య చుట్టుకొనియున్న యింద్రునిఁ జూచి యతనిఁ బురస్కరించు
కొని విష్ణునిగూర్చి యశ్వమేధయాగ ముపక్రమించిరి. అన్నా! మహేం
ద్రుని బ్రహ్మహత్యపోయి పవిత్రుఁడగుటకై యశ్వమేధము జరిగినది. తరు
వాత యజ్ఞముకాఁగానే బ్రహ్మహత్య నాకెచ్చట స్థానమేర్పఱిచితిరని
యడిగినది. అపుడు దేవతలు సంతోషచిత్తులై "దురాసదమవగు నో బ్రహ్మ
హత్యా! నీవు నిన్ను నాలుగుభాగములుగాఁ జేయుము" అనిరి. మహా
త్ములగు దేవతలమాటలువిని తనకు స్థానములను వేఁడినది. "ఒకభాగ
ముచేఁ బూర్ణోదకముగల నదులయందు వర్షాకాలము నాలుగునెలలు
యథేచ్ఛముగ స్నానము చేయుచుందును. నేను సర్వకాలమును భూమి
యం దొకయంశముచే నుందును; నిజముగాఁ జెప్పుచున్నాను. నా
మూఁడవభాగముచే యౌవనవతులగు స్త్రీలయందు మూఁడురాత్రు
లుందును. అపుడు దర్పముచే నిండియుండువారలకుఁ బురుషసంయో
గము లేకుండఁ జేయుచుందు ననెను. ఎవరు నిష్కారణముగాఁ గోపపూర్ణు
లై బ్రాహ్మణులను జంపెదరో వారిని నాల్గవభాగముచే నావహించి
యుందు" ననెను. ఆమాటలువిని "దేవతలు నీవన్నయట్లే చేయుము. నీ
యిష్టమువచ్చినట్లుపొమ్ము" అని దేవత లా బ్రహ్మహత్యను జంపివైచిరి. తరు
వాత దేవతలు ప్రీతిపూర్వకముగా నింద్రునకు నమస్కరించిరి. ఇంద్రుఁడు
పవిత్రుఁడై విచారముపోయి సుఖముగా నుండెను. దేవేంద్రుఁ డెప్పటి
యట్ల రాజ్యమేలుచుండఁగా జగత్తంతయు శాంతిని బొందినది. అత్య
ద్భుతమైన యశ్వమేధయాగమును దేవేంద్రుఁడు గౌరవించెను. రఘు
నందనా! అశ్వమేధముయొక్క ప్రభావమిట్టిది. కావున రాజా! నీవును

వేగముగ నశ్వమేధయాగము నాచరింపుము." ఇట్లు లక్ష్మణుఁడు చెప్పిన యుత్తమ వాక్యమునువిని మహాత్ముఁడును, దేవేంద్రునితో సమానమయిన విక్రమము తేజస్సుగలవాఁడునగు శ్రీరామచంద్రుఁ డెంతయు సంతోషించెను.

## 87-వ సర్గము

### ఇలమహారాజుకథ

ఇట్లు లక్ష్మణుఁడు చెప్పిన వాక్యములు విని వాక్యవిశారదుఁడైన రాముఁడు నవ్వుచు నిట్లనియె: "లక్ష్మణా! వృత్రవధమును వాజిమేధ ఫలమును నీవు చెప్పినచొప్పుననే జరిగినది. సౌమ్యా! పూర్వము కర్దమ ప్రజాపతికుమారుఁడు బాహ్లీకదేశాధీశ్వరుఁడు శ్రీమంతుఁడు మహా యశుఁడు నగు నిలుఁడనువాఁ డొకఁడు గలఁడు. ధార్మికుఁడగు నాయిల మహారాజు భూమినంతయుఁ దనయధీనముచేసికొని రాజ్యమును మహా నందముగఁ బాలించుచుండెను. లక్ష్మణా! అతనిని దేవతలు, రాక్షసులు, పన్నగులు, గంధర్వులు, యక్షులు మొదలగువా రందఱును గౌరవించు చుండెడివారు. అతనికిఁ గోపముగలిగినచో మూఁడులోకములవారును భయపడుచుండెడివారు. ధర్మాత్ముఁడును వీర్యసంపన్నుఁడును నగు నారా జట్టివాఁడుగనేయుండెను. ఆబాహ్లీకదేశాధీశ్వరుఁడు చాలబుద్ధిమంతుఁడు. అతఁడొకప్పుడు మనోహరమగు చైత్రమాసమున సభృత్యబలవాహ నుఁడై యడవికి వేటకుఁబోయెను. అట్లుపోయి వేలకొలఁదిగ మృగము లను గొట్టెను. అట్లెన్నిమృగములను గొట్టినను నతనికిఁ దృప్తిగలుగక పోయినది. ఇట్లనేకమృగములను జంపుచుఁ గుమారస్వామిపుట్టినచోటికిఁ బోయెను. ఆప్రదేశమందుఁ బార్వతీపరమేశ్వరులు తమయనుచరులతోఁ గూడఁ గ్రీడించుచుండిరి. వృషభధ్వజుఁడగుశివుఁడు స్త్రీవేషమును ధరించి దేవి నాపర్వతప్రాంతమున సంతోషింపఁజేయుచుండెను. పురుషరూప ముతో నాయడవిలోనుండు జంతువులు వృక్షములు మొదలుగా స్త్రీ రూపముతోడనే యున్నవి. వేయేల? అచ్చటిదంతయు స్త్రీమయమైయుం డెను. ఇంతలోఁ గర్దమునికుమారుఁడగు నిలమహారాజు మృగములఁ గొట్టుచు నాప్రదేశమునకుఁ బోయెను.

అచ్చటనంతయు స్త్రీమయమైయుండుటయుఁ దానును దనతోడి వారును నట్లయగుటయుఁజూచి చాలదుఃఖించెను. అదియంతయు శివుని

విలాసమని తెలిసికొని భయపడెను. తరువాత నారాజు సభృత్యబల వాహనుఁడై శివుని శరణు చొచ్చెను. అప్పుడు పార్వతితోఁగూడ శివుఁడు నవ్వి యారాజుతో నిట్లనియె: "రాజర్షీ! లెమ్ము లెమ్ము. పురుషత్వముదక్కఁ దక్కిన యేవరమైన నడుగుము." అమాటవిని రాజు దుఃఖించి యాయనచే నిరాకరింపఁబడినవాఁడయ్యెను పురుషత్వమును దప్ప మఱి యేవరమును గోరఁడాయెను. తరువాత నతఁడు పట్టరాని శోకముతోఁగూడి మనస్సుచే దేవినిగూర్చి నమస్కరించి "అమ్మా! పార్వతీ! నాయందు దయ దలఁచుము. నన్ను సౌమ్యదృష్టితోఁ జూడుము. నీవు సర్వలోకములకును దల్లివి; ఈశ్వరివి; వరములకు వరమునాలవు. నీదరిసెన మెప్పుడును వ్యర్థముగాదు" అని ప్రార్థింపఁగా సర్వాంతర్యామిని యగు నాయంబ యతని యభిప్రాయము దెలిసికొని యీశ్వరునకు సమ్మతమగున ట్లిట్లనియె: "ఓయీ రాజా! నేను సగముశరీరము శివునిసంబంధము గలిగి యున్నాను. సగముశరీరము నాయధీనము. కావున మావలెనే సగము శరీరము పురుషుఁడవు, సగముశరీరము స్త్రీవియగుదువు" అను దేవియొక్క యత్యద్భుతమైన వరము విని రాజు కొంతసంతసించి యిట్లనియె: "దేవీ! నీకు నాయెడ దయయున్నచో నొకమాసము పురుషుఁడను, ఒకమాసము స్త్రీగను నుండున ట్లనుగ్రహింపుము" అని కోరఁగా నాయంబ యతని యిష్టమును దెలిసికొని యట్లే యగునని నవ్వుచు వరమిచ్చినది. మఱియు "రాజా! పురుషుఁడవైయున్నపుడు స్త్రీత్వమును, స్త్రీవైయున్నపుడు పురుషత్వమును స్మరింపకుండనుందువు" అని యామె చెప్పఁగానే యట్లే సమ్మతించి యారాజు నెలదినములు పురుషుఁడును, నెలదినములు త్రైలోక్యసుందరి యగు సుందరిగాను నగుచుండెను.

## 83-వ సర్గము

### ఇలమహారాజుకథ

ఇట్లు శ్రీరాముని చేఁ జెప్పఁబడిన యిలసంబంధ మగు కథ విని భరతుఁడు లక్ష్మణుఁడు మిక్కిలి యాశ్చర్యపడి వారు చేతులు జోడించుకొని యారాజుయొక్క యాకథను విస్తరించి చెప్పుమని రామునడిగిరి: "అన్నా! ఆరాజట్లు దుర్గతిని బొంది స్త్రీయై యేమేమి చేసెను? పురుషుఁడైనప్పు డెట్లుండెడివాఁడు?" అని తమ్ములడుగఁగా రాముఁ డత్యద్భుతమయిన యా

తరువాతికథ యథార్థముగా నిట్లు చెప్పుట కుపక్రమించెను. తమ్ములారా! ఆరాజిట్లు మొకటినెలలో త్రిలోకసుందరి యగు సుందరియై తనతోడి వారును నట్లే స్త్రీత్వమును వహించి తనవెంట వచ్చుచుండఁగా నాయడ విలో నిచ్చకువచ్చినచ్చునఁ గాలినడకతోనే నడచుచు విహరించెను. ఆసుందరి తనవాహనముల నన్నింటిని సమీపమున నున్న పర్వతప్రాంత మున విడిచివచ్చెను. ఆపర్వతమునకు సమీపమున నొక రమ్యమైన సర స్సున్నది. అందు జలపక్షులు మనోహరముగాఁ గూఁతలిడుచు విహ రించుచుండెను. అచ్చటనే చంద్రునికొడుకు బుధుఁడు తపస్సు చేసికొను చుండెను. అతఁడు రెండవపున్నమచందమామవలె వెలుఁగుచుండెను. అతఁ డాసరోవరములోనుండి ఘోరముగఁ దపమాచరించుచుండెను. మఱియు నతఁడు పూర్ణయౌవనుఁడు, కామమును గలిగించువాఁడునయి యుండెను. ఇట్లామె తనతోపాటు స్త్రీరూపమును ధరించిన సహచరు లతోఁగూడి యాసరస్సులోనికిదిగి సరస్సంతయు క్షోభింపఁజేసినది. బుధుఁ డామెను జూడఁగానే కామబాణపీడితుఁడై యాత్మను నిలుపుకోఁజాలక నీటిలోనికి దిగెను.

త్రిలోకసుందరి యగు నామందగమనచందమంతయుఁజూచి "ఇంత చక్కని యీచంటిగమన యెవ్వతెయోకదా! ఇంతరూపవంతురాలగు నింతి దేవతాంగనలలోఁగాని, నాగకాంతలలోఁగాని, మఱి యేస్త్రీలలోఁగాని కనియు వినియు నెఱుఁగను. ఇది నాకు దొరకినచో నేనిఁక దేనిని గోరక యుందును" అని యాలోచించి మెల్లఁగా నీటినుండి యొడ్డెక్కెను. అతఁ డాశ్రమములోనికిఁబోయి యాయాస్త్రీలను దనయొద్దకుఁబిలిచెను. వారు పోయి యాయనకు నమస్కరించిరి. ధర్మాత్ముఁడగుబుధుఁ "డామెయెవరు? ఇచటి కెందులకు వచ్చినది? మీరు దాఁచక వృత్తాంతమంతయుఁ జెప్పుఁ" డని యడుగఁగా, వారు మధురాక్షరములుగల యతనిపలుకు లాలకించి యతిమధురముగా నతనికిట్లనిచెప్పిరి: "అయ్యా! ఆమె మాకుఁ బ్రభుత్వ మును వహించియున్నది. ఆమెకుభర్త లేఁడు. కాననాంతరముల మాతోఁ గూడి తిరుగుచుండును" అనియిట్లు వారుచెప్పిన యమృతమొలుకు పలు కులు విని యతఁడు దివ్యదృష్టితో సర్వవృత్తాంతమును గనిపట్టి యా స్త్రీలతో నిట్లనియె: "సుందరులారా! మీరీకొండప్రాంతమున నెందుల కుండెదరు? మీరీయాశ్రమములో నివాసమేర్పఱుచుకొనుఁడు. ఇచ్చట

నుండి కందమూలాదులచే జీవనవ్యాపారమును గడపుకొనుచుండుఁడు. ఇచ్చటనుండు కింపురుషులను మీరు భర్తలనుగా వరింపుఁడు" అనియిట్లు బుధుఁడు చెప్పినమాటలు విని కింపురుషీకృతలైన యాస్త్రీలందఱును నా పర్వతము నాశ్రయించిరి.

## ౮౯-వ సర్గము

—ఇలమహారాజుకథ—

భరతుఁడు లక్ష్మణుఁడు కింపురుషుల పుట్టువు విని చాల నాశ్చర్యముగా నున్నదని రామునితో ననిరి. మరల రాముఁ డాకథాశేషము చెప్పుట కుపక్రమించెను. "అట్లు బుధుఁడు కిన్నరస్త్రీలందఱును బాఱి పోవుటఁజూచి చిఱునగవుమొగము నలంకరింప రూపవతియగు నాస్త్రీతో నిట్లనియె: 'సొగసైనమొగముగలదానా! నేను జంద్రుని ముద్దుఁగుమారుఁడను. వరారోహా! నన్ను భక్తిచేతను, స్నేహదృష్టిచేతను భజింపుము.' జనులు లేని యాయాశ్రమమున బుధుఁడిట్లు పలికిన పలుకులు విని, యేకాకినియగు నిల సురుచిరప్రఖ్యుఁడును మహాగ్రహమును నగు నతని జూచి యిట్లనియె: 'సౌమ్యా! నేను కామచారిణిని. నేను నీయధీనురాలను. చంద్రతనూజా! నీయిచ్ఛకువచ్చినమచ్చున నన్నేలుకొనుము' అని యామె చెప్పిన యద్భుతపుమాటలకు సంతోషించి బుధుఁ డామెతోఁగూడి క్రీడించుచుండెను. అతని కావసంతమాస మతివేగముగాఁ గడచిపోయి నది. పిమ్మట నామాసముపోఁగానే యిల పూర్ణచంద్రనిభాననుఁడై ప్రక్క నుండి లేచెను. సరోవరములోఁ దపస్సుచేయుచున్న బుధు నాతఁడు చూచెను. ఇట్లుచూచి యూర్ధ్వబాహుఁడు, నిరాలంబుఁడునగు నాబుధునితో నిలుఁడిట్లు మాటలాడఁదొడఁగెను: మహాత్మా! నేను బరిజనులతోఁగూడ నీదుర్గమమగు పర్వతప్రాంతమునఁ బ్రవేశించితిని. నాసైనికులెందుఁబోయి రో కానరాకుండనున్నారు."

అనియిట్లు నష్టసంజ్ఞుఁడై పల్కిన రాజుపలుకు లాలకించి బుధుఁ డోదార్చుచు మధురముగా నిట్లనియె: "రాజా! నీభృత్యులు రాలవానచే నశించిపోయిరి. వాతవర్షభయార్దితుఁడవై నీ వీయాశ్రమములోఁ బండు కొంటివి. సమాశ్వసించికొమ్ము. నీకు మేలు గలుగును. నిర్భయుఁడవై విగతజ్వరుఁడవుగమ్ము. ఇచ్చట ఫలమూలాశనుఁడవై సుఖముగా నుండుము

ము.'' ఇట్లుచెప్పిన బుధునిమాటలు కాతఁడరాజుట చెంది భృత్యుల నాశన మునకుఁ గుందుచు దీనముగ నిట్లనియె: "నేను భృత్యులు లేనిరాజ్యమును విడిచెదను. నాకనుజ్ఞయిచ్చితి రేని భగవానులవారూ! క్షణమాత్రములో వచ్చెదను. ధర్మపరుఁడు శశబిందు వను వాఁడు నా పెద్దకొడుకుగలఁడు. కీర్తి వంతుఁడగు నతఁడు రాజ్యము బొందుఁగాక! సుఖాన్వితులగు భృత్య దారాదులతో సమంగళ వాక్యములను బలుకఁజాలను.'' ఇట్లు రాజనుచుం డఁగాఁ దరువాత బుధుఁడు సాంత్వపూర్వముగ నీవిచ్చటనుండు టంగీక రింపుమనియె. మఱియు "మహాబలా! కార్దమేయా! ఇలమహారాజా! నీవు సంతాపమును బొందకుము. నీవొకసంవత్సర మిచ్చటనుంటివేని నీకు హితము చేయించెదను.'' ఇట్లు క్లిష్టకర్ముఁడగు బుధుఁడు చెప్పినమాటలు విని యా బ్రహ్మవాది చెప్పినట్లు యచట వాస మంగీకరించెను. ఒకమాసము స్త్రీ యై యతని సంతోషపఱుచుచుండెను. మాసము పురుషుఁడై ధర్మముగ నడచుచుండెను. తరువాత తొమ్మిదవమాసమున నిలాదేవి పురూరవసుఁ డను పేరుగల బాలునిగనియె. పుట్టఁగానే యా బాలుని తండ్రి చేతిలో నప్ప గించెను. అతఁడు తండ్రితో సమానముగా నుండెడివాఁడు. బుధుఁడు పురుషీభూతుఁడగు నతనిని ధర్మయుక్తములగు కథలు చెప్పి సంతోష పఱుచుచుండెను.

## 90-వ సర్గము

### ఇలమహారాజుకథ

ఇట్లు రాముఁ డా యద్భుతమైన యతనిజన్మవృత్తాంతమును జెప్పఁగా మహాయశులగు భరతుఁడు, లక్ష్మణుఁడు నిట్లనిరి: "అన్నా! ఆయిల యట్లు బుధునియొద్ద సంవత్సరముండి యేమిచేసెనో నీవా సంగతి చెప్పుదువుగాక!'' యని తమ్ములడుగఁగా, నిలమహారాజుకథను రాముఁ డిట్లని చెప్పెను: "ఆయిల పురుషత్వమును బొందఁగానే పరమబుద్ధిశాలి యగు నాబుధుఁడు పరమోదారుఁడగు సంవర్తుని రావించెను. భృగుపుత్త్రుఁడగు చ్యవనుని, మఱియు నరిష్టనేమి యను నతనిని, మోదకరుఁ డగు ప్రమోదనుని, దుర్వాసోమునినిగూడ రావించెను. ఇట్లందఱను రప్పించి వాక్యకోవిదుఁ డగు నతఁడు ధైర్యముగలవారును సావధానచిత్తులును స్నేహితులును నగు నాతత్త్వదర్శులను జూచి యిట్లనియె. మహాబాహుఁడగు నీరాజు

కర్దమప్రజాపతికుమారుఁడగు నిలుఁడు. ఇతనియవస్థ మీరందఱును దెలిసికొని యితనికి మేలుచేయుఁడు. వారట్లుమాటలాడుకొనుచుండఁగానే మహాతేజశ్శాలియగు కర్దముఁడు బ్రాహ్మణులతోఁగూడి యాయాశ్రమములోనికి వచ్చెను. పులస్త్యుఁడు, క్రతువు, వషట్కారుఁడు, ఓంకారుఁడు మొదలగువా రాయాశ్రమములోనికి వచ్చిరి. పరస్పరసమాగమమువలన వారందఱును సంతోషించిరి. వారందఱును నిలునికి హితమునుగోరుచు నెవరిబుద్ధికిఁ దోఁచినట్లు వారుపన్యసించిరి. అపుడు కర్దముఁడు సుతునికొఱకుఁ బరమహితముగా నిట్లనియె: "బ్రాహ్మణులారా! నావాక్యము వినుఁడు. అది యీరాజునకు హితమగును. ఈశ్వరునికంటె నితరమయిన మందు వీనిరోగమునకు నాకుఁగనుపడలేదు. అశ్వమేధముకంటె నెక్కువ యాగము లేదు. అది యామహాత్మునకుఁ బ్రియమైనది. కనుక మనమందఱమును నీరాజుకొఱకు యజ్ఞమును జేయుదము."

ఇట్లు కర్దముఁడు చెప్పఁగానే యాబ్రాహ్మణులందఱును హయమేధముచే శివుని నారాధించుట కంగీకరించిరి. సంవర్తుఁడను రాజర్షి శిష్యుఁడును పరపురంజయుండును బ్రసిద్ధుఁడును నగు మరుత్తుఁ డాయజ్ఞము నారంభించెను. పిమ్మట బుధునియాశ్రమమం దాయజ్ఞము గొప్పగ జరిగి యీశ్వరునికిఁ జాల సంతోషమును గలిగించినది. ఇట్లు యజ్ఞము పూర్తి కాఁగానే సంతోషించి యుమాపతివచ్చి యిలునియొద్దనే యాబ్రాహ్మణులందఱతోడను నిట్లనియె: "ఓబ్రాహ్మణశ్రేష్ఠులారా! మీరుచేసిన యశ్వమేధమువలనను మీభక్తికిని జాలసంతోషించితిని. ఈయిలమహారాజునకేమిచేయుమందురో చెప్పుఁడు" అని యిట్లు శివుఁడు చెప్పఁగా, నాబ్రహ్మర్షులు సావధానచిత్తులై యిల పురుషుఁడగునట్లు వరముగోరిరి. తరువాత శివుఁడు సంతోషించి మరలఁ బురుషత్వము నొసఁగెను. ఇట్లు వరమిచ్చి శివుఁ డంతర్ధానము నొందెను. అశ్వమేధము పూర్తియై శివుఁడంతర్ధానము నొందఁగా దీర్ఘదర్శులగు బ్రహ్మర్షులందఱును తరలిపోయిరి. ఇలమహారాజు బాహ్లీకదేశమును విడిచి యనుత్తమమగు మధ్యదేశమునందలి యశస్కరమగు ప్రతిష్ఠానపురములో నివసించెను. శశబిందుఁడు బాహ్లీకదేశమును, ఇలమహారాజు ప్రతిష్ఠానపురమును బాలించుచుండిరి. మఱికొంతకాలమునకు మహాత్ముఁడగు నిలమహారాజు బ్రహ్మలోకమునకుఁ బోయెను. తరువాతఁ బురూరవసుఁ డాప్రతిష్ఠానమున కధిపతియాయెను. తమ్ములారా!

అశ్వమేధప్రభావ మిట్టిది. ఆయిలుఁడు స్త్రీభూతుఁడై యశ్వమేధప్రభావమువలన దుర్లభమైన పురుషత్వమును మరలఁ బొందెను.

## 91-వ సర్గము

### శ్రీరాముని యశ్వమేధప్రారంభము

శ్రీరాముఁ డిట్లు తమ్ములతో నిలమహారాజుకథచెప్పి లక్ష్మణునితో ధర్మయుక్తముగా నిట్లనియె: "వసిష్ఠుని, వామదేవుని, జాబాలిని, కాశ్యపుని, సర్వశ్రేష్ఠులును అశ్వమేధప్రవర్తకులునునగు బ్రాహ్మణులను రావించి వారితో నాలోచించి లక్షణసంపన్నమైన యశ్వమును విడిచెద"నను రామునిమాట విని త్వరతోఁ గూడినవాఁడై లక్ష్మణుఁడు బ్రాహ్మణాదులను రావించి శ్రీరామునికిఁ జూపించెను. వారు దేవసంకాశుఁడును, తమకు నమస్కరించినవాఁడును, దురాధర్షుఁడును నగు రాముని నాశీర్వదించిరి. ఆపుడు రాముఁడు చేతులు జోడించుకొని యాఋషులతోఁ దన యశ్వమేధసంకల్పమును జెప్పెను. వా రామాటవిని, శివునకు నమస్కరించి యశ్వమేధమును మిగుల నందించిరి. అశ్వమేధము నభినందించు నా ఋషులమాటలు విని రాముఁ డెంతయు సంతుష్టాంతరంగుఁడాయెను. అపుడు రాముఁడు వారు చేయఁదలఁచినదానిని దెలిసికొని లక్ష్మణునితో నిట్లనియె: "లక్ష్మణా! మహాత్ముఁడగు సుగ్రీవునియొద్దకు శీఘ్రముగా దూతలను బంపుము. నీవు సపరివారముగా యజ్ఞోత్సవము ననుభవించుటకు రమ్మని చెప్పుము. రాక్షసులతోఁగూడి విభీషణుఁడుగూడ నశ్వమేధమునకు వచ్చునట్లు వెంటనే వార్తలంపుము. నాకు మేలుచేయు రాజుల నందఱను శీఘ్రముగా వచ్చునట్లు చేయుము. వారు సపరివారముగా యజ్ఞమును జూచి సంతోషింతురుగాక! నానాదేశములయందు వసించు నుత్తములగు బ్రాహ్మణులను లక్ష్మణా! అశ్వమేధమునకై రావింపుము. తపోధనులగు ఋషులనందఱను రప్పింపుము. దేశాంతరములయందలి గృహస్థులను బుత్రదారసమేతముగా రప్పింపుము. మఱియు గాయకులు, నటులు, నర్తకులు మొదలగువారిని రప్పింపుము. నైమిశవనమందు గోమతియొద్దున యజ్ఞవాటము సిద్ధము చేయింపుము. అది తమ్ముఁడా! మహాపుణ్యవంతమైన ప్రదేశముగదా! అంతటను శాంతులు జరిగింపుము. జనుత్తమము, మహాయజ్ఞము నగు నీయశ్వమేధమును నైమిశవనములో

గోమతీతీరమునఁ జేయుదానినిజూచి సంతోషించుకొఱకు ధర్మజ్ఞులగు వారిని వందలకొలఁది రప్పింపుము. వారు సంతోషించులాగునఁ బుష్టిని బొందులాగునను, యథావిధిగ గౌరవింపఁబడులాగునను జేయుము. వేల కొలఁది బండ్లతో ధాన్యము, బియ్యము, తిలలు, పెసలు మొదలగు నవియు; సెనగలు, ఉలవలు, మినుములు, లవణము వీనికిఁ దగినట్లు చమురు, సంక్షేపముగా గంధము మొదలయినవి పంపుము. ఇఁక సువ ర్ణము కోట్లకొలఁదిగాఁ బంపించుము. ఆయా సామగ్రియంతయు భరత పురస్సరముగా జాగ్రత్తగాఁ బంపుము. మధ్యమధ్య నంగడివీథు లుండు నట్లు చేయించుము. నటులు, నర్తకులు, వంటవాండ్రు మొదలగువారిని, వయసులో నున్న యువతులను భరతునితోఁ బంపుము. పౌరులు, బాల వృద్ధులు, సావధానులగు ద్విజులు, పనిపాటులవాండ్రు, శిల్పులు మొద లగువారినిగూడఁ బంపుము. మనతల్లులను, అంతఃపురస్త్రీలను బంగా రుతోఁ జేయఁబడిన నాభార్యను భరతునివెంటఁ బంపుము. అని యిట్లు చెప్పి, తోడనే యతఁడు విలువగల రాజసదనములను రాజులకును వారి యనుచరులకును యథోచితముగ నేర్పాటుచేయు"మనెను.

## 92-వ సర్గము

### శ్రీరాముని యశ్వమేధము

భరతాగ్రజుఁడగు రాముఁ డిట్లంతయు వేగముగఁ బంపునట్లు చేసి లక్షణసంపన్నమును, కృష్ణవర్ణప్రధానమును నగు గుఱ్ఱమును విడిచెను. కొందఱు ఋత్విజులతోఁగూడ లక్ష్మణుని గుఱ్ఱమును గాపాడుటకై నియోగించి సైన్యముతోఁగూడి నైమిశమునకుఁ బోయెను. మహాబాహుఁ డగు రాముఁడు పరమాద్భుతమగు యజ్ఞవాటమునుజూచి చాల సంతో షించెను. రాజులెల్లరును నైమిశారణ్యములో నున్న శ్రీరామునకుఁ గాను కలు విశేషముగా సమర్పించిరి. అవి పుచ్చుకొని రాముఁడవారిగ వారిని గౌరవించెను. ఆయాయి రాజసదనములయందా రాజులను పరివారము తోఁ గూడియుండునటు లాజ్ఞాపించెను. వచ్చిన రాజులకును వారి పరి జనులకును భరతశత్రుఘ్ను లన్నపానాదికములు యథోచితముగ నిచ్చు చుండిరి. సుగ్రీవాదివానరులు వచ్చినబ్రాహ్మణాదులకు వినయముతో భోజనసదుపాయములు చేయుచుండిరి. విభీషణుఁడు తన పరిజనులతోఁ

గూడి యుగ్రతపస్వులగు ఋషులను బూజించుచుండెను. ఈరీతిగా నా యశ్వమేధము మంచియేర్పాట్లుగలదియై ప్రవర్తిల్లుచుండెను. లక్ష్మణునిచే నభిగుప్తమై హయసంచారమును ప్రవర్తిల్లుచుండెను. ఆరాజసింహునియజ్ఞ మీరీతిగా జరుగుచుండెను. ఆమహాత్ముని హయమేధములో నేదియు లేదను శబ్దమేలేదు. అంతయు యాచకులును మాకిక నక్కఱలేదన్న మాటయేకాని, మాకింకను కావలయునని యొక్కరును నడుగరైరి. అట్లు తృప్తిగలుగునట్లు భోజనపదార్థములు సర్వజనులకును వడ్డించుచుండిరి. భుజించువారి పెదవులుదాఁటి పైకి మాటరాకుండఁగనే వానరులు, రాక్షసులు వారివారికిఁ గావలసిన వస్తువులను సమృద్ధిగా వడ్డించుచుండిరి. ఆయజ్ఞములో మలినుఁడుగాని దీనుఁడుగాని దరిద్రుఁడుగాని కనుపడఁడు. ఆరాముని యజ్ఞములో నందఱును సంతోషముతోఁ గూడియేయుండెడి వారు. అచ్చటికివచ్చిన చిరజీవులగు మును లిట్టియజ్ఞమును స్మరింపరయిరి. ఏమన నిట్టియజ్ఞ మిదివఱకెన్నఁడును జరిగియుండలేదు. సువర్ణము గావలసినవారికి సువర్ణము, ధనము గావలసినవారికి ధనము, రత్నములు గావలసినవారికి రత్నములు, వెండి గావలసినవారికి వెండి, మాణిక్యములు గావలసినవారికి మాణిక్యములు, వస్త్రములు గావలసినవారికి వస్త్రములు రాత్రింబవళు లొక్కమాదిరిగా నిచ్చుచునేయుండిరి. ఆయావస్తువులు కొండలపాడువున రాసులు పోయించి పంచిపెట్టుచుండిరి. తపోధనులు దేవేంద్రుని యజ్ఞముగాని, కుబేరుని యజ్ఞముగాని, యముని యజ్ఞముగాని, వరుణుని యజ్ఞముగాని యెప్పుడును నీరీతిగా జరిగియుండనేలేదని చెప్పుకొనుచుండిరి. ఎక్కడఁ జూచినను వానరులే, యెచ్చటఁ జూచినను రాక్షసులే యగపడుచుండిరి. వారు యాచకులకు వస్త్రములు, ధనము, అన్నము మొదలగునవి తృప్తిగా నిచ్చుచుండిరి. రాజసింహుఁడగు రామునియజ్ఞము సర్వగుణసమృద్ధమై యిట్లు జరుగుచుండెను. ఇట్లు సంవత్సర మొకరీతిగా జరిగినదిగాని యొకదానికిని లోపము గనుపడలేదు.

## 93-వ సర్గము

### వాల్మీకి కుశలవుల రామాయణము గానముచేయుమనుట

ఇటువంటి పరమాద్భుతమైన యజ్ఞము జరుగుచుండఁగా మునిపుంగవుఁడగు వాల్మీకిభగవానుఁడు శిష్యసహితముగా నచ్చటికి విచ్చే

నెను. అతఁడు దివ్యసంకాశము, అత్యద్భుతోపక్రమమునగు యజ్ఞమును జూచి యేకాంతమందు ఋషివాటికలోని పర్ణశాలలో నివసించెను. ఫలమూలాదులతో నిండిన యనేకము లగు శకటములు వాల్మీకి పర్ణశాలకు సమీపమున నుండెను. ఆవాల్మీకిమహామునిని శ్రీరాముఁడును, మహాత్ములగుమునులును పూజించిరి. ఇట్లు పూజితుఁడై యతఁడు పర్ణశాలలో సుఖముగా నివసించెను. ఆతఁడు పరమానందభరితుఁడై శిష్యులను బిలిచి "మీరు సావకాశముగా రామాయణకావ్యమంతయుఁ బరమసంతోషముగా గానముచేయుఁడు. పుణ్యాపుణ్యములగు ఋషివాటములయందును, బ్రాహ్మణుల యిండ్లయందును, రథ్యలయందును, రాజమార్గములయందును, రాజుల విడిదులయందును, శ్రీరాముని యజ్ఞవాటమునందును, ఋత్విజులుండుచోటులను విశేషముగ గానముచేయుచుండుఁడు. ఇవిగో ఫలములు నానావిధములైనవియు రుచికరములునునైయున్నవి. ఇవి పర్వతాగ్రములయందుఁ బుట్టినవి. మీకాఁకలియగునపు డివి తిని గానము చేయుచుండుఁడు. వత్సలారా! మీరు శ్రమపడకుఁడు. ఈఫలములు దుంపలు తిని యీనగరమునకు బయట నుండుఁడు. మీపాట వినుటకుఁ గోరికగలిగి రాముఁడు పిలిపించినచోఁ దప్పక వెళ్లి ఋషులందఱును గూర్చుండి వినుచుండఁగా గానముచేయుఁడు. దినమున కిరువదిసర్గములవంతున మధురముగా గానముచేయుఁడు. నేను బూర్వము బహుప్రమాణములతో నుద్దేశించినరీతి విడువకుఁడు. ధనమందు స్వల్పమును లోభపడకుండుఁడు. వత్సలారా! ఆశ్రమములలో నుండి ఫలములచేతను, దుంపలచేతను జీవించెడు మనకు ధనమెందులకు? మీ రెవరిబిడ్డ? లని యొకవేళ రాముఁడడిగినచో 'మేము వాల్మీకిభగవానుని శిష్యుల'మని రామునితోఁ జెప్పుఁడు. మీరిద్దఱును నిర్భయముగా నీతంత్రులు మధురమైనవి కనుక ముందు నేను జెప్పిన చొప్పున మూర్ఛనలుచేసి యతిమధురముగాఁ బాడుఁడు. మొదటినుండియుఁ బాడుఁడు. రాజు నవమానపఱుపకుఁడు. వత్సలారా! ధర్మమునుబట్టి రాజేగదా సర్వభూతములకును దండ్రి. కనుక మీరిద్దఱును రేపు ప్రభాతమునుండి తంత్రీలయ సమన్వితముగా మధురముగ గానముచేయుఁడు" అని యిట్లు వాల్మీకిమహాముని వారి కనేకవిధములుగ బోధపఱిచి యూరకయుండెను. ఇట్లు నియమింపఁబడిన సీతకొడుకు లిద్దఱును "తాతగారూ! అట్లే చేయుదుము" అని బయటికి

బోయిరి. ఇట్లద్భుతముగా మధురముగా వాల్మీకిభగవానుఁడు చెప్పిన మాట లాకుమారులు మనస్సున నుంచుకొని యశ్వినీదేవతలవలె సముత్సుకులై యారాత్రి నెట్లో కడపిరి.

## 94-వ సర్గము

కుశలవుల రామాయణగానము

ఆకుమారు లిద్దఱును రాత్రి తెల్లవాఱినతోడనే స్నానాదికృత్యములు దీర్చుకొని వాల్మీకిమహాముని చెప్పినచొప్పున గానముచేయుట కుపక్రమించిరి. పూర్వాచార్య వినిర్మితమును, అపూర్వమును, గేయముతో నలంకరింపఁబడినదియు, అనేకప్రమాణములతోఁగూడినదియు, తంత్రీలయసమన్వితమునునగు నాపాత్యజాతిని బాలురవలన విని రాముఁడు కౌతూహలపరుఁడాయెను. పిమ్మట యజ్ఞము సమాప్తికాఁగా నవకాశసమయమున రాజగు రాముఁడు మహామునులను, రాజులను, పండితులను, పౌరులను, పౌరాణికులను, శబ్దవిదులను, వృద్ధులగు బ్రాహ్మణులను, స్వరముల లక్షణము దెలిసినవారిని, ఉత్సుకులగు ద్విజసత్తములను, లక్షణజ్ఞులగు సంగీత విద్వాంసులను, పాదాక్షరసమానముల నెఱిఁగినవారిని, ఛందస్సు బాగుగఁ దెలిసినవారిని, కలలు మాత్రలు దెలిసినవారిని, జ్యోతిష్కులను, క్రియాకల్పవిదులను, కావ్యములు బాగుగాఁ దెలిసినవారిని, భాషాజ్ఞానము గలవారిని, ఇంగితమెఱిఁగినవారిని, హేతూపచార కుశలులను, మాటలయందు నేర్పుగలవారిని, వైదికులను, చిత్రజ్ఞులను, వృత్తములు సూత్రములు దెలిసినవారిని, గీతనృత్యవిశారదులను, శాస్త్రజ్ఞులను, నీతి నిపుణులను, వేదాంతార్థములను దెలిసినవారిని నొక్కచో సమావేశముచేయించి యీ బాలకులచే గానముచేయించెను. రాజులు మునులు రాజును గాయకులను కన్నులతోఁ ద్రాగివేయుదురా యనునట్లు చూడ మొదలిడిరి. "ఇద్దఱును రామునితో సమానముగా నున్నారు" అనియు, "బింబము నుండి బింబము పుట్టినట్లున్నది" అనియు నొండొరులతోఁ జెప్పుకో మొదలిడిరి. వీరు జడలనుధరించి నారచీరలు కట్టుకొనకుండ నుండినచో వీరికిని రామునకును భేదమే తెలియకపోవు ననుకొనిరి. ఇట్లు సంతోషవృద్ధియగునట్లుగా శ్రోతలు మాటలాడుకొనుచుండఁగా నాయిద్దఱు మునికుమారు

లును గాన ముపక్రమించిరి. అపు డతిమానుష మైన సంగీతము మధుర
ముగాఁ బ్రవర్తించినది. ఆగానము విన్నవారి కెవ్వరికిని తృప్తిగలుగకపోయి
నది. నారదుఁడు వాల్మీకికిఁ జెప్పిన మొదటిసర్గ మొదలుకొని యిరువది
సర్గలవఱకును బాడిరి.

రాముఁ డిట్లుపరాహ్ణమువఱకును బాడిన యిరువదిసర్గలును విని
తమ్మునితో నిట్లనియె: "తమ్ముఁడా! ఈబాలకుల కతివేగముగాఁ బదునెని
మిదివేలు సువర్ణము లిమ్ము. మఱేదను నేదిగావలయునందురో యదియు
నిమ్ము." అన్నయాజ్ఞకాఁగానే తమ్ముఁ డాయిద్దఱకును వేలువేలుగా
నీయఁబోయెను. ఆగాయకులు భరతుఁడీయఁబోవుచు సువర్ణములు పుచ్చు
కొనక యవిచూచి యాశ్చర్యపడి "ఇవి యెందులకు? మేము వనవాసు
లము. మూలములచేతను ఫలములచేతను జీవించువారలము. వనములో
నుండు మేము మీరిచ్చిన సువర్ణముచేతను హిరణ్యముచేతను నేమిచేయఁ
గలము" అనిరి. వారిట్లుచెప్పఁగానే యాసభలోని శ్రోతలు రాముఁడును
గూడ మిగుల నాశ్చర్యపడిరి. రాముఁ డాకావ్యముయొక్క యాగమ
మును వినఁదలఁచినవాఁడై యామునిబాలకుల నిట్లడిగెను. "బాలకు
లారా! ఈకావ్య మెంతప్రమాణము గలది? ఈకావ్యమును రచించిన
మహానుభావుఁడెవ్వరు? ఆయన యెచ్చటనున్నాఁడు?" అనియడిగిన రాము
నకు బాలకులిట్లనిరి. "ఈకావ్యమును వాల్మీకిభగవానులవారు రచించిరి.
వారీయజ్ఞములోనికి దయచేసియున్నారు. ఇది యిరువదినాలుగువేలు
శ్లోకములుగలది. ఇం దుపాఖ్యానశతముగలదు. మొదటినుండి యయిదు
వందలసర్గములు గలవు. నీఉత్తరకాండముతో నిం దేడుకాండములు
గలవు. ఇది నీచరితము. దీనిని మాగురుభగవానులవారు రచించి మాకుఁ
బాఠముచెప్పిరి. మహారథా! ఇది వినవలయునని కుతూహలముండినచో
నవకాశము వెంట నీవు నీయనుజులతోఁగూడి వినుచుండుము" అని వారు
చెప్పఁగా "మంచిదే"యని వారికి సెలవిచ్చిపంపెను. వారటు రాము
నితోఁజెప్పి వెంటనే వాల్మీకియున్నచోటికిఁబోయిరి. రాముఁడును మునుల
తోడను రాజులతోడను వారి గానము చేసిన చరిత్రను విని యజ్ఞశాల
లోనికిఁ బోయెను. ఇట్లు కాల లయోపపన్నము స్థానాన్వితము స్వరశబ్ద
యుక్తము తంత్రీలయవ్యంజనయోగయుక్తము నగు నాకుశలవులు
పాడిన చరిత్రమును రామాదులందఱును విని సంతోషించిరి.

## 95-వ సర్గము

### రాముఁడు సీతచే శపథము చేయఁ గోరుట

రాముఁడీరీతిగా వారిగానమును మునులతోడను రాజులతోడను గూడి చాలదినములు వినెను. ఆగీతముల సందర్భమున నాగాయకులను సీతాపుత్త్రులనుగాఁ దెలిసికొని యాసభలో రాముఁడు శుద్ధసమాచారము గల దూతలను దనబుద్ధిచేతనే యాలోచించి రావించి యిట్లనియె: "దూతలారా! వాల్మీకిభగవానులవారిసన్నిధి కేఁగి నేనన్నట్లు చెప్పుఁడు. సీత శుద్ధసమాచారురాలును వీతకల్మషయు నైనచో వాల్మీకిభగవానుల వారి యనుమతిపై నిచ్చటికివచ్చి తనశుద్ధిని జూపించుఁగాక! మునిభగవానులవారియభిప్రాయమును సీతయభిప్రాయమును దెలిసికొనివచ్చి నాతోఁ జెప్పుఁడు. నానమ్మికకొఱకు రేపటిప్రభాతమున నీసభలో జానకి శపథ మాచరింపవలయును." ఇట్లనిచెప్పిన రామునిమాటలువిని దూతలు వాల్మీకిమహామునియుండు ఋషివాటికకుఁ బోయిరి. వారు మునికి నమస్కరించి రాముఁడుచెప్పినమాటలన్నియు మృదువుగను మధురముగను జెప్పిరి. ఆయన వారిమాటలువిని రామునియభిప్రాయము దెలిసికొని వారితో నిట్లనియె: "అట్లేయగుఁగాక. మీకు భద్రమగుఁగాక! రాముఁడన్నప్రకారమే సీతశపథముచేయఁగలదు. స్త్రీలకుఁ బతియేకదా దైవము" అని యాయన చెప్పఁగానే దూతలు రామునియొద్దకు వచ్చి యట్లే విన్నవించిరి. ఆమహాత్ముని యంగీకారమును విని రాముఁడు సంతోషించి యచ్చటఁ గూడియున్న మునులను, రాజులను జూచి యిట్లనియె: శిష్యులతోఁగూడిన మునీంద్రులారా! సపరివారులగు రాజేంద్రులారా! సీతాశపథమును జూచెదరుగాక! ఇంకను గోరినది యున్నచో నదియు జరుగును" అనియిట్లు రాముఁడనఁగానే మునిముఖ్యులందఱును సాధువాదములు పలికిరి. రాజులును రామునిఁ బ్రశంసించిరి. "నరశ్రేష్ఠా! ఇది నీకే తగియున్నదిగాని మఱియొకరికిఁగాదు." రేపంతయు జరుగునని రాముఁడు నిశ్చయము చేసికొని నాఁటికి సభ చాలించెను. సభలోనివా రందఱును దమతమ నివాసములకుఁ బోయిరి.

## 96-వ సర్గము

### వాల్మీకి సీత పరిశుద్ధురాలని చెప్పుట

తరువాతఁ దెల్లవాఱఁగానే రాముఁడు యజ్ఞవాటములోనుండి మునీశ్వరులనందఱను బిలిపించెను. వసిష్ఠుఁడు, వామదేవుఁడు, జాబాలి, కాశ్యపుఁడు, దీర్ఘతపుఁడగు విశ్వామిత్రుఁడు, మహాతపశ్శాలియగు దుర్వాసుఁడు, పులస్త్యుఁడు, శక్తి, భార్గవుఁడు, వామనుఁడు, దీర్ఘాయువగు మార్కండేయుఁడు, మహాయశుఁడగు మౌద్గల్యుఁడు, గర్గుఁడు, చ్యవనుఁడు, ధర్మవిదుఁడగు శతానందుఁడు, తేజస్వియగు భరద్వాజుఁడు, సుప్రభుఁడగు నగ్నిపుత్రుఁడు, నారదుఁడు, పర్వతుఁడు, మహాయశుఁడగు గౌతముఁడు, కాత్యాయనుఁడు, సుయజ్ఞుఁడు, తపోనిధియైన యగస్త్యుఁడు మొదలగు మునులందఱును కౌతూహలముతోఁ గూడినవారై వచ్చిరి. రాక్షసులును వానరులును వచ్చియుండిరి. నానాదేశములనుండి వచ్చిన నాలుగువర్ణముల వారును వచ్చియుండిరి. ఇట్లందఱును గూడియున్నారనివిని వాల్మీకిమహాముని సీతనుదోడ్కొని సభకువచ్చెను. రాముని హృదయపద్మమునందుంచుకొని, బ్రహ్మదేవుని వెంటవచ్చు శ్రుతివలె వాల్మీకిమహాముని వెనుక వచ్చు సీతాదేవినిజూచి యందఱును సాధువాదములు పలికిరి. దుఃఖము వలనఁగలిగి హెచ్చయిన శోకముచే నాకులపడువారి హాలహలాశబ్దము వ్యాపించినది. 'రామా! సాధు!' అని కొందఱు, 'సీతా! సాధు!' అని కొందఱును బ్రశంసించిరి. రెండుతెగలవారును బ్రేక్షకులై యాక్రోశించిరి. తరువాత నాజనసంఘముమధ్యను సీతతోఁగూడ వాల్మీకిమహాముని ప్రవేశించి రామునితో నిట్లనియె: "రామా! ఈసీత సువ్రతురాలు; ధర్మచారిణి; లోకాపవాదమునకు భయపడి నాయాశ్రమసమీపమున విడువఁబడినది. లోకాపవాదమునకు భయపడిన నీకు నమ్మికగలుగుటకునిమిత్తమై శపథము చేయును. కావున నీవామె నంగీకరింపవలయును. ఈబిడ్డలిద్దఱును సీతకొడుకులు. వీరిసంగతి యిట్టిదని చెప్పరాదు. కవలుగాఁ బుట్టిరి. నేను యథార్థముగాఁ జెప్పుచున్నాను. రఘునందనా! నేను ప్రచేతసుని పదియవ కుమారుఁడను. నే నసత్యమాడినట్లు స్మరింపను. వీరు నీకొడుకులు. నేను బహువర్షసహస్రములు తపమాచరించితిని. ఈసీత దుష్టచిత్తురాలే యగు నేని యాతపస్సుయొక్క ఫలము నేననుభవించువాఁడనుగాను. నేను పంచ

భూతములు, నాయంతఃకరణము సాక్షులుగా సీత పరిశుద్ధురాలే యని యడవిలోనుండి నాయాశ్రమములోనికిఁ దోడ్కొనిపోతిని. ఈమె శుద్ధసమాచార; పాపమెఱుఁగనిది; పతిదేవత. లోకాపవాదభీతుఁడవయిన నీకు నమ్మకము కలిగింపఁగలదు. కావున నో రామా! ఈమె శుద్ధాంతఃకరణురాలు. నేను దివ్యదృష్టితోఁజూచితిని. లోకాపవాదకలుషీకృతచిత్తుఁడవై విడిచితివి. పరిశుద్ధురా"లని నీవును హృదయపూర్వకముగా నెఱుఁగుదువు.

## 97-వ సర్గము

### సీత పాతాళమునకుఁ బోవుట

ఇట్లు వాల్మీకి చెప్పిన మాటలు విని రాముఁడు చేతులు జోడించుకొని సభామధ్యమున్న సీతనుఁజూచి యిట్లనియె: "వాల్మీకిమునీంద్రా! ధర్మవిదులగు తాము సెలవిచ్చినసంగతులన్నియు యథార్థములు. అకల్మషములగు తమవాక్యములచేతనే నాకు నమ్మికగలిగినది. పూర్వమే లంకలో దేవతలసన్నిధిలో నగ్నిసాక్షిగా నమ్మికగలిగినది. అపుడు నమ్మిక కలుగుటచేతనే యింటికిఁ దోడుకొనివచ్చితిని. క్రమముగా లోకాపవాదము ప్రబలమైనది. విధిలేక విడిచితిని. నిర్దోషురాలని యెఱిఁగియుండియు మునీంద్రా! లోకాపవాదమునకు భయపడి సీతను విడిచితిని. నాయీయపరాధమును మన్నింతురుగాక! వీరిద్దఱు కవలలును నాకుమారులని యెఱుఁగుదును. ఈసభలో శుద్ధురాలైన జానకియందు నాకుఁ బ్రీతి గలుగుఁగాక!" రామునియభిప్రాయమును దెలిసికొని యాసీతశపథమును జూచుటకై యింద్రాదిదేవతలు బ్రహ్మను బురస్కరించుకొనివచ్చిరి. మఱియు నాదిత్యులు, వసువులు, రుద్రులు, అశ్వినీదేవతలు, గంధర్వులు, అప్సరసలు, సాధ్యులు, విశ్వేదేవతలు, పరమఋషులు, పన్నగులు, సుపర్ణులు, సిద్ధులు మొదలగువారు సంతుష్టాంతరంగులై సీతశపథమువిషయమై సంభ్రాంతులైవచ్చిరి. అపుడందఱనుజూచి రాముఁడిట్లనియె. "సురశ్రేష్ఠులారా! అకల్మషములైన ఋషివాక్యములచేత నీసభామధ్యమున శుద్ధురాలైన సీతయందు నాకుఁ బ్రీతిగలుగుఁగాక." అపుడు శైత్యసౌరభ్యమాంద్యములతోఁగూడినవాయు వాసభవారిమీఁదఁ బ్రసరించి సంతోషింపఁజేసెను. వచ్చినవారందఱును నిది యత్యద్భుతమని ప్రసంగించిరి. ఇట్లు సమస్తజనులచేతను నిండియున్న యాసభలో సీత కాషాయవస్త్ర

మును గట్టుకొని చేతులు జోడించుకొని తలవంచుకొని నేల చూచుచు నిట్లనియె: "నేను రామునికంటె నితరుని మనసుచేఁగూడఁ జింతింపక యుంటినేని, మాధవపత్నియగు భూదేవి నాకు దారియిచ్చుఁగాక. మనోవాక్కాయములచేతను నేను రామునిబూజించుచుంటినేని మాధవపత్ని యగు భూదేవి నాకు దారియిచ్చుఁగాక. నేను రామునికంటె నన్యు మెఱుఁగకుండుట సత్యమేని మాధవపత్నియగు భూదేవి నాకు దారి యిచ్చుఁగాక." సీత యిట్లు పలుకుచుండఁగా భూమిలోనుండి దివ్యసింహాసన మొకటి యత్యద్భుతముగా వచ్చినది. దానిని బలవంతులగు నాగ కుమారులు మోసికొనివచ్చిరి. మొదలే యది దివ్యమైనది, పైని దానిని మఱింత నాగకుమారుల శిరోరత్నములు వెలిగించుచున్నవి. ఇఁక దాని సొగసు చెప్పుటకు సాధ్యమగునా? భూదేవి సీతను రెండుచేతులతోఁ బట్టుకొని స్వాగతముచే నభినందించి యాసింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టినది. ఆసింహాసనము సీతను దీసికొని పాతాళలోకమునకుఁ బోవుచుండఁగా నాకసమునుండి పుష్పవర్షము గురిసినది. వెంటనే దేవతలు లేచి సాధువాదములు చేసిరి. "సీతా! నీశీల మిట్టిదా? ఎంతని కొనియాడఁ గలము" అని ప్రశంసించిరి. ఇట్లు దేవతలంతరిక్షమునందుండి సీత పాతాళమునకుఁ బోవుట చూచి సంతోషించుచుఁ బలికిరి. ఆయజ్ఞవాటమునందున్న మునులందఱును రాజులు మొదలగువారును విస్మయసముద్రములోనే మునిఁగిపోయిరి. అంతరిక్షమునందును భూమియందును స్థావరములు జంగమములు రాక్షసులును పాతాళములోని పన్నగులును కొందఱు సంతోషించుచుఁ గేకలువైచిరి. కొందఱు ధ్యానమున మునిఁగి యుండిరి. కొందఱు రామునివైపు చూచుచుండిరి. కొందఱు దీనులై సీతవైపుచూడ మొదలిడిరి. సీత పాతాళమునకుఁ బోవుట చూచి జగమంతయు నిట్లు క్రమముగా సమ్మోహమును బొందిపోయినది.

## 93-వ సర్గము

### బ్రహ్మ రామునోదార్చుట

సీత రసాతలమునఁ బ్రవేశించిన వెంటనే వానరులందఱును నేడిచిరి. "సాధ్వీ జానకి! సాధు! సాధు!" అని మునులు రామునిసన్నిధిని ప్రశంసించిరి. రాముఁడు కన్నుల నీరుగ్రమ్ముచుండఁగా దండకాష్ఠమొకటి

యూతగొని తలవంచుకొని దీనచిత్తుఁడై మిగుల దుఃఖించుచుండెను. అతఁడు చాలసేపువఱకును నేడిచి కన్నుల నీరు కాల్వలుగట్టఁ గ్రోధశోకములతోఁగూడి యిట్లనియె: "నేనిట్టిదుఃఖ మెపుడును నెఱుఁగను. ఇది నామనస్సునకు బాగుగా నాటినట్లున్నది. రూపమును ధరించి వచ్చిన లక్ష్మివంటిసీత చూచుచుండఁగనే మఱఁగిపోయినది. పూర్వము సముద్రము నవతల లంకలోనుండఁగాఁ దెచ్చిన నేనిపుడు భూమిలోనికిఁబోయినసీతను దేఁజాలకపోవుదునా? భూదేవీ! నాసీతను నాకిమ్ము. లేదేని కోపముచూపె దను. అపుడు నాసంగతి తెలిసికొందువుగాక. నిజముగా నీవే నాకత్తవు. నీయొద్దనుండి పూర్వము జనకమహారాజుదున్నుచు నాఁగలియను చేతితో సీతను బయటికిఁ దీసెను. కావున నాసీతనైనను నాకిమ్ము. లేదేని నాకును దారినైన నిమ్ము. పాతాళమందుఁగాని స్వర్గమందుఁగాని దానితోఁగూడి యుండెదను. సీతనుదీసికొనిరమ్ము. సీతకొఱకు నాకుఁ బిచ్చియెత్తుచున్నది. ఎప్పటిచందమున నాకు సీతనుదెచ్చియీయవేని సపర్వతవనవగు నిన్ను ధ్వంసముచేసెదను. నేనిపుడే నీరూపుమాపెదను. సర్వము జలమయ మగుఁగాక! ధనుర్బాణములను గొనితెండు; సీతవిషయమున నీమెయభి ప్రాయమును గనుఁగొని, తరువాత నీభూమిని బ్రద్దలుచేసెదను." క్రోధ శోకములతో రాముఁడిట్లుపల్కుచుండఁగా బ్రహ్మ దేవతలతోఁగూడ నిట్లనియె: "సువ్రతా! రామా! నీవు సంతాపమును బొందకుము. నీపూర్వపుసంగతిని జ్ఞప్తికిఁదెచ్చికొమ్ము. అవతారమునిమిత్తమై దేవత లతోఁ జేసిన యాలోచనను జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము. అనుత్తముఁడవగు నిన్ను నేను స్మరియింపఁజేయను. దుర్ధర్షమగు నీమహాత్మ్యమునందు నీవైష్ణవభావమును స్మరింపుము. సీత విమలాంతఃకరణురాలు. పతివ్రత. పూర్వమునుండియు నీయందాసక్తురాలు. నిన్నాశ్రయించిన తపోబలము కతమున నాగలోకమునకుఁ బోయినది. తప్పక నిన్నుఁ గలసికొనును. ఈసభయందు నేను జెప్పుమాట నాలకింపుము. ఈకావ్యమే కావ్యము లలోనెల్ల నుత్తమము. దీనివలన సర్వము విస్తరముగాఁ దెలియును. వాల్మీకి జన్మము మొదలు నిర్యాణమువఱకునుగల నీచరిత్రమంతయు నిందుఁ బొందుపఱచియున్నాఁడు. రామా! ఇది యాదికావ్యము. నీయందు సర్వమును బ్రతిష్ఠితమైయున్నది. కావ్యయశస్సు నీకంటె మ ఱొకనికిరాదు. నేనును దేవతలును బూర్వము దీనిని వినియుంటిమి.

ఇందుఁ జెప్పినదంతయు సత్యమైనది. పురుషశార్దూలా! ధర్మముచే సావధానుఁడవై మిగిలినకావ్యమునుగూడ వినుము. నీకును నీప్రజకు కావ్యము యొక్కతుదిభాగమును వినుము. నీకంటె నితరులచే వినఁదగినది గాదు. నీచేతనే వినఁదగినదానినిగా వాల్మీకి దీనిని రచించెను." ఇంత వఱకుఁజెప్పి బ్రహ్మ దేవతలతోఁగూడ స్వర్గమునకుఁ బోయెను. అచ్చటికి వచ్చిన మునులు మొదలగువారందఱును మిగిలినకథ వినుటయం దుత్సాహముతో నుండిరి. అపుడు బ్రహ్మచెప్పినమాటలువిని వాల్మీకితో నిట్లనియె: "భగవానులవారూ! మిగిలిన కథాభాగమును వీరందఱును వినఁ గోరుచున్నారు; గావున రేపుదయము ప్రారంభింతము"అనియిట్లుచెప్పఁగా వాల్మీకి మంచిదేయని కుశీలవులగు కుశలవులను దోడుకొని యాసభలో నుండి పర్ణశాలకుఁబోయెను. అందఱును సీతసంగతి తలఁచుకొనుచునే యారాత్రి వేగించిరి.

## ౧౧౧-వ సర్గము

### కౌసల్యాదులు స్వర్గమునకుఁ బోవుట

తెల్లవాఱినతోడనే యందఱును నిత్యకృత్యములు దీర్చుకొని యాసభలోవచ్చి కూర్చుండిరి. నిర్విశంకముగా గానముచేయుఁడని రాముఁడు కొడుకులతోఁ జెప్పెను. మహాత్ములగు బ్రహ్మర్షులందఱును గూర్చుండఁగానే యుత్తరచరితమును గానముచేయ మొదలిడిరి. అట్లు సత్యసంపదచే సీత పాతాళలోకమునకుఁ బోయినతరువాత నాయజ్ఞము పూర్తికాఁగానే రాముఁడు మిగుల దుర్మనాయమానుఁడై సీతకనుపడమిచే జగమంతయు శూన్యముగాఁ దలఁచెను. శోకగ్రస్తుఁడై శాంతియన నెట్టిదో యెఱుఁగకుండెను. యజ్ఞమునకు వచ్చినవారలనందఱును యథోచితముగా సత్కరించి పంపివైచెను. ఆరాముఁడట్లు యథావిధిగా యజ్ఞము పూర్తిగావించి సీతను హృదయములోఁ దలంచుకొనుచు నయోధ్యకు వచ్చెను. వచ్చునపుడు కొడుకులనుగూడఁ దీసికొనివచ్చెను. సీతనువిడచి మఱియొకస్త్రీని బెండ్లియాడలేదు. ప్రతియజ్ఞమందును బంగారుసీతనే దగ్గఱనుంచుకొనెడువాఁడు. పదివేలసంవత్సరము లశ్వమేధయాగములను వాజపేయములను జేసెను. అగ్నిష్టోమములు, అతిరాత్రములు, గోమేధములు, ఇతరక్రతువులు లెక్కలేకుండఁజేసెను. ప్రతియజ్ఞము

ంనదును విస్తారముగ దక్షిణలిచ్చెను. ఇట్లు ధర్మమునకై ప్రయత్నించుచు న్యాయముగ రాజ్యమేలుచుఁ జిరకాలము గడిపెను. నానాఁటికందఱును రామునియందనురాగము నెక్కుడుగాఁజూప మొదలిడిరి. ఋషివానర రాక్షసులు రామునియాజ్ఞలోనుండిరి. సకాలమునఁ బర్జన్యుఁడు వర్షించుచుండెను. అంతటను సుభిక్షముగా నుండెను. దిక్కులు నిర్మలముగా నుండెను. పట్టణములు పల్లెలు హృష్టపుష్టజనాకీర్ణములై వెలుఁగొందుచుండెను. అకాలమరణములు, రోగములు, ననర్థములు మొదలయినవి రాముఁడు రాజ్యమేలుచుండఁగా లేనేలేవు. ఇటుండఁగాఁ గొంతకాలమునకు రామునితల్లి కౌసల్య యందఱును దగ్గఱనుండఁగానే కాలధర్మము నొందినది. సుమిత్ర కైకేయిగూడ నామెతోనే మృతినొంది స్వర్గమునకుఁ బోయిరి. వీరందఱును స్వర్గమునందు దశరథునితోఁగూడి సంతోషించుచుండిరి. పతివ్రతలు గనుక సకలధర్మఫలములను బొందిరి. తల్లి నుద్దేశించి యాయాకాలములందు రాముఁడు మహాదానము లిచ్చుచుండెడివాఁడు. అట్లే తక్కినయిద్దఱు తల్లులవిషయమైకూడ నాచరించి బ్రాహ్మణులను మునులను దృప్తినొందించిరి. పితృప్రియములగు ధనములు రత్నములు మొదలగువానిచేఁ బరమదుస్తరములగు యజ్ఞములుచేసి దేవతలను, పితృదేవతలను సంతుష్టినొందించెను. ఇట్లనేకవేలసంవత్సరములు సుఖముగాఁ గడపెను. నానాఁటికి యజ్ఞాదులచే ధర్మమును వృద్ధిచేసికొనెను.

## 100-వ సర్గము

యుధాజిత్తు గార్గ్యుని రామునియొద్దకుఁ బంపుట

మఱికొంతకాలమునకుఁ గేకయదేశాధీశ్వరుఁడగు యుధాజిత్తు శ్రీరామునియొద్దకుఁ దనగురువును బంపించెను. అంగిరసుని పుత్త్రుఁడగు నాగార్గ్యునితోఁగూడఁ బదివేలగుఱ్ఱములను గానుకగాఁబంపెను. మఱియు రత్నకంబళములు, ఉత్తమమగు చిత్రవస్త్రము, శుభములైన యాభరణములుగూడ నిచ్చిపంపెను. రాముఁడు బ్రహ్మర్షియగు గార్గ్యుఁడు వచ్చియున్నాఁడని విని మాతులపురోహితుఁడగు నాయన నెదుర్కొని యాయనయిచ్చిన ధనాదికమంతయుఁ గైకొని దేవేంద్రుఁడు బృహస్పతిని వలెఁబూజించెను. అట్లుపూజించి యాయనతెచ్చినవి పుచ్చుకొని యందఱు

క్షేమము నడిగెను. ఆయన కూర్చుండిన పిదప మఱియు నడుగుట కుపక్ర
మించెను: "మామేనమామ యే మాజ్ఞాపించెను? తమరు దయచేసిన
కార్యమేమి? సాక్షాత్తుగ మీరు బృహస్పతివంటివారు." ప్రశ్నించిన
రామునిమాటలువిని మహర్షియైన తానువచ్చినపని చెప్పుట కుపక్ర
మించెను: "రామా! ప్రీతితో నీమేనమామ చెప్పుమన్న మాటలు
చెప్పెదను. ఈగంధర్వదేశము ఫలమూలశోభితము. సింధునది రెండు
ప్రక్కలను బహుశోభనముగా నున్నది. దానిని యుద్ధవిశారదులగు
గంధర్వు లాయుధములు పట్టుకొని రక్షించుచున్నారు. వారు శైలూషుని
కొడుకులు; మూడుకోట్లమంది మహాబలవంతులు. రామా! వారిని
జయించి శుభమగు గంధర్వనగరమును స్వాధీనముచేసికొనుము. అన్యుల
కాదేశము స్వాధీనముగాదు. ఇది నీకిష్టమగుగాక. నేను హితము
బోధించువాఁడనుగాను" అని చెప్పుమన్న మాటలు గార్గ్యుఁడు చెప్పఁగా
రాముఁడు 'మంచిదే' యని భరతునివైపు చూచెను. రాముఁడు చేతులు
జోడించుకొని యా బ్రాహ్మణునితో నిట్లనెను: "ఈకుమారు లాదేశమును
గూర్చి వచ్చెదరు. వీరు భరతుని కొడుకులు. వీనిపేరు తక్షుఁడు. ఇతఁడు
పుష్కలుఁడు. మేనమామను జూచుటకుఁ గొడుకులతోఁగూడ భరతుని
సైన్యముతోఁగూర్చి పంపెదను. గంధర్వకుమారులనుజంపి రెండుపట్టణ
ములుగా విభజించి కొడుకులిద్దఱను రెండుపట్టణములలోనుంచి, ధార్మికుఁ
డగు భరతుఁడు మరల నాయొద్దకు వచ్చును. ఇటు గార్గ్యునితోఁజెప్పి
కుమారులకు వెంటనే యభిషేకముచేసి సైన్యముతోఁగూడ భరతుని
బంపెను. ఇంద్రునివెంట దేవసైన్యమువలె నాసేన భరతునివెంట బయలు
దేఱినది. రాక్షసులు పిశాచములు మొదలైనవి రక్తమాంసాదుల కాసించి
భరతునితోఁ బోయినవి. భూతములు దారుణములైనవి మాంసమును
భక్షించుటకుఁ బోయినవి. గంధర్వమాంసముతినుటకు, వారలరక్తము
ద్రావుటకు సమయము తటస్థించినందుల కవియన్నియు మిగుల సంతో
షించి బయలుదేఱినవి. సింహములు, పెద్దపులులు, వరాహములు ఖేచ
రములగు పక్షులు మొదలగునవి వేలకొలఁదిగ సేనముందఱ బయలు
దేరినవి. నిరామయముగా సేన దారిలోఁ బదునేనుదినములునడిచి క్రమ
ముగా సంతోషించుచుఁ గేకయదేశమునఁ బ్రవేశించినది.

## 101-వ సర్గము

### భరతుఁడు గంధర్వుల గెల్చుట

కేకయదేశాధిపతియగు యుధాజిత్తు సేనను దీసికొని భరతుఁడు గార్గ్యునితోఁ గూడివచ్చె ననివిని చాల సంతోషించెను. కేకయాధిపుఁడు చాలసైన్యమును వెంటఁబెట్టుకొని తొందరగాఁ గామరూపులగు గంధర్వులపైకి బయలుదేఱెను. భరతుఁడును యుధాజిత్తుఁ గలిసికొని సైన్యసమేతులై గంధర్వనగరమును సమీపించిరి. భరతుఁడు వచ్చె ననివిని గంధర్వులు యుద్ధసన్నద్ధులై యంతటను సింహనాదములు చేసిరి. తరువాత వీరికి వారికిని దొమ్మియుద్ధము జరిగినది. ఏడుదినములు రోమహర్షణముగా యుద్ధము జరిగినదిగాని యెవ్వరికిని జయము గలుగలేదు. ఖడ్గములు శక్తులు ధనుస్సులు గ్రాహములుగా, రక్తము నీరుగా, నదులు నృకళేబరములను బ్రవహింపఁజేసినవి. తరువాత భరతుఁడు కోపించి సుదారుణమగు సంవర్తమను కాలాస్త్రమును గంధర్వులపైని బ్రయోగించెను. ఆగంధర్వులు కాలపాశములచే బద్ధులై సంవర్తాస్త్రముచే విదారితులై మూఁడుకోట్లమంది నిమేషమాత్రములో నిహతులైరి. ఘోరతరమగు నాఘాతమును దేవతలు నిమేషాంతరమాత్రమున స్మరింపనైరి. అట్లు గంధర్వులందఱును హతులుకాఁగా భరతుఁడు వెంటనే యాదేశమును రెండుభాగములుగా విభాగించెను. తక్షశిలయందుఁ దక్షుని, పుష్కలుని పుష్కలావతమందును నుంచెను. ఇట్లు గంధర్వదేశమందును మనోహరమైన గాంధారదేశమందును భరతుఁడు కొడుకుల నుంచెను. ఆరెండు పట్టణములును ధనముతోడను రత్నములతోడను నిండి యుద్యానవనములచే మనోహరములై యొకదానిశోభ నొకటి సహింపనంత స్పర్ధగలిగి యున్నదా యన్నట్లు సొంపుగా నున్నవి. మఱియు నారెండుపట్టణములు సురుచిరములైనవియు,అకిల్బిషములైన వ్యవహారములతోఁగూడినవియును, ఉద్యానములతోడను యానములతోడను గూడినవియు వేరుపఱుపఁబడిన యంగడివీథులు గలవియును, విశాలములైనవియును, విమానములతో సమానములగు నుత్తమగృహములతోఁ గూడినవియును, దేవాయతనములచే సొంపారుచున్నవియును, తాల తమాల తిలక వకులాదివృక్షములచే రమ్యములైనవియును నగు నాపట్టణములయందు భరతుఁ డైదు

సంవత్సరములు నివసించి మరల నయోధ్యకు వచ్చి సాక్షాత్తు అపరధర్మ దేవతవలె నున్న యన్నకు దేవేంద్రుఁడు బ్రహ్మకువలె నమస్కరించి, యా గంధర్వులవధను గూర్చి యంతయుఁ జెప్పెను. పట్టణముల విభాగము మొదలైనవి చెప్పఁగా విని రాముఁడు సంతోషించెను.

## 102-వ సర్గము

### అంగదచంద్రకేతులపట్టాభిషేకము

ఇట్లు భరతుఁడు చెప్పిన వృత్తాంతము విని చాల సంతోషించి యప్పుడు లక్ష్మణునిఁజూచి యత్యద్భుతముగ నిట్లనియె: “తమ్ముఁడా! లక్ష్మణా! ఈ నీకుమారులగు అంగదుఁడు, చంద్రకేతుఁడును రాజ్యమేలఁ దగినవారు; దృఢవిక్రములు. మఱియు ధర్మవిశారదులు. వీరిని రాజ్యాభిషిక్తులను జేసెదను. తగిన దేశమాలోచింపుము. అది రమణీయమైనదియుఁ, జిక్కులు లేనిదియు, వీరి యిష్టమైనదియుఁగా నుండవలయును. అచట రాజులకును, మున్యాశ్రమములకును పీడగలుగరాదు. అటువంటి దేశము చూడుము. మనమెవ్వరికి నపరాధము చేసినవారము కాఁగూడదు” అని రాముఁడు చెప్పఁగా భరతుఁడిట్లనియె: “అన్నా! కారుపథ మను దేశము నీవు చెప్పిన చొప్పున నుండును. రమణీయమై యది నిరామయముగా నున్నది. అచ్చట నంగదునకుఁ బట్టణమేర్పఱుపవలయును. చంద్రకేతునకుఁ జంద్రకాంతమనునది సురుచిరము నిరామయమునై యుండును.” అట్లు భరతుఁడు చెప్పినదానిని రాముఁ డంగీకరించెను. శ్రేష్ఠుఁడగు చంద్రకేతునకు మల్లభూమియందలి చంద్రకాంతమని ప్రసిద్ధికెక్కి, రెండవస్వర్గము వలెనుండు పట్టణమును రాజధానిగాఁ జేసెను. యుద్ధమున జయింప సాధ్యముగాని రామలక్ష్మణభరతులు స్వయముగాఁ గుమారుల రాజ్యాభిషిక్తులఁ జేసిరి. అట్లు వారి నభిషిక్తులను జేసి యంగదుని పశ్చిమమువైపునకును, చంద్రకేతు నుత్తరమువైపునకును బంపించెను. అంగదునివెంట లక్ష్మణుఁడును, చంద్రకేతునివెంట భరతుఁడును వెళ్లిరి. అంగదునితో వెళ్లి లక్ష్మణుఁడు సంవత్సరమువఱకు నందుండి కొడుకునకు రాజ్యము స్థిరము కాఁగానే మరల నయోధ్యకు వచ్చెను. భరతుఁడును మఱొకసంవత్సరము పైఁగానుండి యయోధ్యకు వచ్చి రాముని సేవించుచుండెను. ఇట్లు భరతుఁడును లక్ష్మణుఁడును రాముని పాదములు సేవించుచు, నతిధార్మికులగు

వారు స్నేహాధిక్యమువలన గతించినకాలమునుగూడఁ దెలియఁజాలరైరి. ఇట్లు ధర్మాసక్తులై నిత్యమును పౌరులకార్యములు నెఱవేర్చుచుండువార లకుఁ బదివేలసంవత్సరములు గడచినవి. ఇట్లు మహాక్రతువులయందలి యగ్నిత్రయమువలె వెలుఁగుచుఁ బరిపూర్ణమానసులై శ్రీమంతులై ధర్మ మును జక్కఁగా నడపుచుండిరి.

## 103-వ సర్గము

### యముఁడు తాపసవేషముతో వచ్చుట

ఇట్లు రాముఁడు ధర్మముదప్పక రాజ్యమేలుచుండఁగాఁ గొంత కాలమునకు యముఁడు తాపసవేషముతో రాజద్వారముచెంతకువచ్చెను. అతఁడు ధైర్యశాలియుఁ గీర్తిమంతుఁడును నగు లక్ష్మణునిజూచి యిట్లనియె: "లక్ష్మణా! నేను కార్యగౌరవమువలన వచ్చియుంటినని రామునితో విన్న పింపుము. నేనతిబలుఁడును; అమితతేజస్కుఁడును నగు మహర్షి పంపిన దూతను; కార్యముండుటచే రామునిఁ జూడవచ్చితిని" అని యతఁడు చెప్పఁగా లక్ష్మణుఁడు త్వరగా రామునియొద్దకేఁగి తాపసునిరాక మనవి చేసెను. "మహాద్యుతివగురామా! ధర్మముచేత నుభయలోకములను జయించుము. దూత నిన్ను జూచుటకు వచ్చెను. అతఁడు తేజస్సుచే సూర్యునివలె నున్నాఁడు" అని చెప్పిన లక్ష్మణునిమాటలు విని రాముఁ డిట్లనియె: "నాయనా! లక్ష్మణా! ఆమునిని లోపలఁ బ్రవేశింపఁజేయుము" అని రాముఁడుచెప్పఁగానే విని లక్ష్మణుఁడు బయటికివచ్చి మునిని లోపలఁ బ్రవేశపెట్టెను. రెండవయగ్నిహోత్రునివలె వెలుఁగుచున్న యాతాప సుఁడు రామునిసమీపించి మధురవాక్కున వృద్ధినొందుమని దీవించెను. రాముఁ డతని కర్ఘ్యపాద్యములిచ్చి పూజించి కుశలమడుగుట కుపక్ర మించెను. ఆముని రామునిచేఁ గుశల మడుగఁబడి దివ్యమగు బంగరు గద్దియపైఁ గూర్చుండెను. తరువాత రాముఁడతనిని స్వాగతమడిగి, వచ్చిన కార్యము చెప్పుమనెను. ఇట్లు రామునిచేఁ బ్రార్థితుఁడై యాముని యిట్ల నియె: "రామా! నేను వచ్చినకార్యము రహస్యముగఁ జెప్పఁదగినది. అట్లయిన హితకరమగును. మనము మాటలాడునపుడు వినువారినిగాని, చూచువారినిగాని నీవు చంపవలయును. అట్లయిన నేను మునివాక్యము చెప్పెదను." అట్లతఁడు చెప్పఁగానే రాముఁ "డట్లే" యని లక్ష్మణునితో

నిట్లనియె : "తమ్ముఁడా! ద్వారపాలుని బంపివైచి నీవు జాగరూకతగా ద్వారమునందుండుము. నేనీఋషితో మాటలాడుచుండుట వినువారు గాని చూచువారుగాని వధార్హులగుదురు" అని లక్ష్మణుని ద్వారమందు నియోగించి తర్వాత మునినిజూచి "నీవు చెప్పఁదలఁచినవానిని జెప్పుము. నిన్నెవ రెందులకుఁబంపించిరో? ఆసంగతి నిశ్శంకముగాఁజెప్పిన వినవలయు"నని నాకును గోరికయున్నది.

## 104వ సర్గము

### యముఁడు బ్రహ్మసందేశము చెప్పుట

"రామా! మహాబాహూ! నేనెందులకువచ్చితినో చెప్పెదను వినుము. మహాబలా! నేను బ్రహ్మదేవునిచేఁ బ్రేషితుఁడనై వచ్చితిని. అతఁడు నీకుఁ బూర్వభావమునఁ గుమారుఁడు. వీరా! నేను మాయ నవలంబించి వచ్చిన యముఁడను. సర్వమును సంహరించువాఁడను. లోక పతియుఁ బ్రభువునగు బ్రహ్మదేవుఁడు నీకు సమయమేర్పాటుచేసి యిట్లు చెప్పు"మనెను. "సౌమ్యా! లోకములను రక్షించుటకై నీవు ప్రతిజ్ఞచేసి తివి. పూర్వము మాయచేత లోకములను సంక్షేపించి స్వయముగా మహార్ణవజలమున శయనించి నీవు నన్నుఁ బుట్టించితివి. అనంతరము పడగ లతో నొప్పుచున్న యనంతుని, మధుకైటభులను, దానవులను సృజించితివి. నీవామహాభోగశాలి యగు ననంతుని సృజియించి యతనిపై శయనించి యుండఁగా బలవంతులగు మధుకైటభు లనువారి నిద్దఱనుజంపి వారియస్థి మాంసములచేఁ బర్వతములతోఁ గూడిన యీభూమిని జేసితివి. సూర్య సంకాశమగు నీనాభిపద్మమునుండి నన్నుఁబుట్టించితివి. నన్నుఁ బ్రాజాపత్య కృత్యమందు నియోగించితివి. నేను సన్న్యస్తభారుఁడనై జగత్పతి వగు నిన్ను సేవించితిని. నాకుఁ దేజస్సునిచ్చిన నీవు నన్ను రక్షించు"మని విన్న పింపఁగా నీవును దుర్ధర్షమును సనాతనమును నగు నాభావమునుండి సర్వ భూతములను రక్షించుకొఱకు విష్ణుత్వమును బొందితివి. అదితియందు వీర్యవంతుఁడవైన పుత్త్రుఁడవై పుట్టి నీసహోదరులకు బలమును గలిగిం చుచుఁ గార్యములు దటస్థించినపుడు వారికి సాయపడుచుంటివి. అట్టి నీవు ప్రజలు భయపడుచుండఁగా రావణవధకై మనుష్యుఁడ వగుటకు సంకల్పించితివి. పదునొకండువేలసంవత్సరములు భూమియందుండుటకు నీవే నిర్ణయించి వచ్చినాఁడవు. అట్టి నీవు మనోమయపుత్త్రుఁడవు.

మానుషజన్మమున నిదినీకుఁ బూర్ణాయువు. నరశ్రేష్ఠా! నీకు మాసమీపముఁ జేరుట కిది సమయము. ఇంకను నీవు మనుష్యలోకములో నుండుట కిచ్ఛయుండినచో నుండుము. "బ్రహ్మ నీతో నీసంగతి చెప్పుమని నన్నుఁ బంపెను. ఒకవేళ దేవలోకమునకు రానిచ్ఛయున్నచో దేవతలు విష్ణునితోఁగూడి విగతజ్వరులగుదురు" అనియిట్లు బ్రహ్మదేవుఁడు చెప్పుమనిన మాటలు యముఁడు చెప్పఁగా విని రాముఁడు నవ్వుచు సర్వసంహారి యగు యమునితో నిట్లనియె: పరమాద్భుతములైన బ్రహ్మదేవునిమాటలు వినుటచేతను నీరాకచేతను నాకుఁ జాలసంతోషము గలిగినది. మూఁడు లోకములవారి కార్యములనిమిత్తమై నేనవతరించితిని. నీకు భద్రమగుఁ గాక! నేనెచ్చటనుండి వచ్చినాఁడనో మరల నచ్చటికిఁబోయెదను. నేనును దలంచుచునేయుంటిని. ఇంతలో నీవును వచ్చితివి. ఈవిషయమై నాకు విచారణ యక్కఱలేదు. సర్వకార్యములయందును నేను దేవతలకు వశవర్తినై యుండవలెను. బ్రహ్మదేవుఁడు చెప్పినదంతయు సత్యమే."

## 105-వ సర్గము

### దుర్వాసోముని రాముని జూడవచ్చుట

రాముఁడు యముఁడు నిట్లు రహస్యముగ మాటలాడుచుండఁగా దుర్వాసోముని రామునిదర్శనమునకై వచ్చి ద్వారముననుండెను. ఆఋషిసత్తముఁడు లక్ష్మణునియొద్దకువచ్చి యిట్లనియె: "లక్ష్మణా! వెంటనే నాకు రాముని జూపింపుము. ఆలస్యముచేసితివేని నాకార్యము చెడిపోవును." ఇట్లనిచెప్పిన యామునిమాటలువిని లక్ష్మణుఁడాయనకు నమస్కరించి యిట్లనియె: "మహాత్మా! తమరు దయచేసినకార్యమేమి? ఏమిచేయుమని సెలవు? మాయన్న కార్యవ్యగ్రుఁడై యున్నవాఁడు. ముహూర్తమాత్రము ప్రతీక్షింపవలయును" అని లక్ష్మణుఁడు చెప్పఁగానే యాముని కోపాంధుఁడై కన్నుల నిప్పులురాల్చుచు లక్ష్మణునితో నిట్లనియె: "లక్ష్మణా! ఈక్షణమే నన్ను రామునియొద్దకుఁ దీసికొనిపొమ్ము. అట్లు చేయవేని నిన్ను నీపట్టణమును నీదేశమును నీయన్నను భరతుని మీవంశమును నశించునట్లు శపించెదను. నాకుఁ గోపము వచ్చినది. నేనాఁపుకోఁజాలను" అని యిట్లు ఘోరముగాఁ జెప్పిన దుర్వాసోమునిమాటలు విని యతని మాటల నిశ్చయమునుగూర్చి లక్ష్మణుఁడు చింతింపఁదొడఁగెను. "నే

నొక్కఁడన నశింతును; సర్వవినాశము కాఁగూడదు" అని నిశ్చయించి వెంటనేవెళ్లి రామునితో మనవిచేసెను. రాముఁడు లక్ష్మణునిమాటలువిని యమునికి సెలవిచ్చి వెంటనేవచ్చి యత్రికుమారుని సందర్శించెను. మండుచున్న యగ్నిహోత్రమువలెనున్న యామునికి నమస్కరించి చేతులు జోడించుకొని వినయముగా "నేమియాజ్ఞ?"యని యడిగెను. మునివరుఁడగు దూర్వాసుఁడు రాముఁడన్నమాటవిని "భక్తవత్సలా! వినుమ"ని యిట్లుచెప్పుట కుపక్రమించెను: "రామా! నేనిప్పటికి వేయిసంవత్సరముల నుండి తపమాచరించుచుంటిని. అది నేటితో ముగిసినది. కావున వెంటనే నాకు భోజనము గావలసియున్నది. అది నీవలన నెఱవేఱునని వచ్చితిని" అని యతఁడు కోరఁగానే రాముఁడు సంతోషించి యతనికోరికప్రకారము భోజనముపెట్టించెను. అతఁ డమృతోపమమగు నాయన్నమును భుజించి రామునిఁగొనియాడి తనయాశ్రమమునకుఁబోయెను. అతఁ డట్లుపోయిన తోడనే రాముఁడు యమునిమాటలు స్మరించుకొని దుఃఖింప మొదలిడెను. అతఁడు దుఃఖసంతప్తుఁడై తనప్రతిజ్ఞను స్మరించుకొని తలవంచుకొని దీనుఁడై మాటలాడఁజాలకపోయెను. తరువాత రాముఁడు యమునిమాటలు బుద్ధిచే నిశ్చయించి "యిదిగా"దని నిశ్చయించుకొని తూష్ణీంభావము నవలంబించెను.

## 103-వ సర్గము

### లక్ష్మణుఁడు స్వర్గమున కేఁగుట

తరువాతఁ దలవంచుకొని రాహుగ్రస్తుఁడగు చంద్రునివలె నున్న దీనుఁడగు రామచంద్రునితో లక్ష్మణుఁడు సంతోషించుచు మధురముగా నిట్లనియె: "మహాబాహూ! నానిమిత్తమై నీవు సంతాపమునుబొందు టుచితముగాదు. పూర్వజన్మకర్మమిట్టిది. దానినెవరును దప్పింపఁజాలరు. కాలగతి తెలియదుగదా! సౌమ్యా! నన్నుఁజంపి నీప్రతిజ్ఞను నిలుపుకొనుము. పట్టినప్రతిజ్ఞను దప్పినవారు నరకమునకుఁ బోవుదురుగదా! నాయందు నీకుఁ బ్రీతియున్నచో, నన్ననుగ్రహింపవలయుననియున్నచో నిర్విశంకముగా నన్నుఁజంపి ధర్మమును నిలుపుము" అని యిట్లు లక్ష్మణుఁడన్నమాటలువిని రాముఁడు విచలితేంద్రియుఁడై మంత్రిపురోహితాదులను రావించి వారియెదుట జరిగినసంగతియంతయుఁ జెప్పెను. పురోహితాదులు రామునిమాటలువిని యూరకుండిరి. అపుడు వసిష్ఠమహాముని

యిట్లనియె: "మహాబాహూ! రోమహర్షణమగు నీనాశము సిద్ధము. మహాయశా! లక్ష్మణునితోడి వియోగము నీకుఁదప్పనిది. వీనిని విడుము. విధి బలవంతమైనది. ప్రతిజ్ఞను దప్పకుము. నీవంటివాఁడే ప్రతిజ్ఞనుదప్పినచో నిఁక ధర్మము నశింపకయుండునా? ధర్మము నశించినతోడనే మూఁడు లోకములును నిమిషమాత్రమున నశించిపోవును. సంశయములేదు. కావున నోపురుషశార్దూలా! మూఁడులోకములను నిలుపుటకై లక్ష్మణుని విడువుము. జగత్తును నెమ్మదిగానుంచుము" అనియిట్లు సభాసదులందఱును సమ్మతించునట్లు వసిష్ఠభగవానుఁ డన్నమాటలువిని రాముఁడు లక్ష్మణునితో నిట్లనియె: "లక్ష్మణా! నిన్ను విడిచెదను. ధర్మమునకు నాశము కాఁగూడదు. త్యాగముగాని, వధముగాని రెండును సమానమే యని పెద్దలందురు" అనియిట్లు రాముఁ డనినతోడనే లక్ష్మణుఁడు బాష్పవ్యాకులితేంద్రియుఁడై స్వగృహమునకైనను బోకుండనే త్వరితముగా సరయూతీరమునకుఁబోయి యాచమనముచేసి చేతులు జోడించుకొని సర్వేంద్రియములును నిరోధించుకొని నిట్టూర్పునైనను బయటికిరానీయఁడాయెను. ఇట్లు నిట్టూర్పు విడువకుండ యోగముపట్టి యున్న లక్ష్మణుని పైని దేవేంద్రుఁడు మొదలగు దేవతలందఱును ఋషులును బుష్పవర్షము గురియించిరి. మనుజుల కెవ్వరికిని గనుపడనీకుండ మహాబలుఁడగు లక్ష్మణుని శరీరముతోడనే యింద్రుఁడు స్వర్గమునకుఁ దీసికొనిపోయెను. అపుడు దేవతలందఱును విష్ణునినాలవభాగము వచ్చుటచూచి సంతుష్టాంతరంగులై మహర్షులతోఁగూడఁ బూజించిరి.

## 107-వ సర్గము

### కుశలవుల పట్టాభిషేకము

అట్లు రాముఁడు లక్ష్మణుని విడిచి దుఃఖశోకసమన్వితుఁడై పురోహితుని మంత్రులను బౌరులను జూచి యిట్లనియె: "నేఁడు నేను భరతుని రాజ్యాభిషిక్తుని జేసెదను. అతని నయోధ్యకు రాజునుగాఁజేసి నేనిపుడే యడవికిఁ బోయెదను. కాలహరణముగాకుండ మీరు సంభారములను సిద్ధముచేయుఁడు. లక్ష్మణుఁడు పోయినదారినే నేనును బోయెదను" అని యిట్లు రాముఁడనఁగానే ప్రజలందఱును రామునిపాదములమీఁదఁబడి ప్రాణముపోయినవారివలె నిశ్చేష్టితులై యుండిరి. రామునిమాటలు విని

భరతుఁడు విసంజ్ఞుఁడాయెను. కొంతతడవునకు తెలిసి రాజ్యమును గర్హించుచు రామునితో నిట్లనెను: "రాజా! సత్యముగాను నీవులేని రాజ్యము నాకేల? స్వర్గముకూడ నీవులేనిచో నాకక్కఱలేదు. నీకుమారులఁ గుశలవులను రాజ్యాభిషిక్తులఁ జేయుము. కోసలదేశమునకుఁ గుశుని, ఉత్తరకోసలదేశమునకు లవుని రాజులనుగాఁ జేయుము. దూతలు శీఘ్రముగాఁబోయి మా యీ వృత్తాంతము శత్రుఘ్నునకుఁ దెలియఁజేయుదురుగాక!" అని యిట్లు భరతుఁడు చెప్పినమాటలువిని దుఃఖాంతప్తులై యధోముఖులైన పౌరులను జూచి వసిష్ఠభగవానుఁ డిట్లనెను: "వత్సా! రామా! ఈప్రజలందఱును దుఃఖాతురులై తలలు వంచుకొని భూమిని జూచుచున్నారు. వీరియభిప్రాయమును దెలిసికొని సంతోషింపఁజేయుముగాని విప్రియమాచరింపకుము." వసిష్ఠుఁడు చెప్పినమాటలువిని రాముఁడు ప్రజలను లేవనెత్తి యందఱితోడను నేమిచేయఁ గోరుచున్నారని యడిగెను. అప్పుడు ప్రజలందఱును రామునితో నిట్లనిరి: "రామా! నీ వెచ్చటికిఁబోయినను నీవెంటనే వచ్చెదము. నీకుఁ బౌరులయందుఁ బ్రీతియున్నచో, నీకు మాయందవిచ్ఛిన్నస్నేహము నిరాలవ్యమైనదే నైనచో మేము భార్యలతోడను బిడ్డలతోడను నీవు పోవుచోటికి వచ్చెదము. ఇందు కంగీకరింపుము. తపోవనమునకుఁగాని, దుర్గమప్రదేశమునకుఁగాని నదినేని, సముద్రమునేని బ్రవేశించుటకుఁగాని మేమందఱమును సిద్ధులమై యున్నాము. మాయందు దయయుంచి మమ్ముల నత్యాజ్యులనుగాఁ దలఁచితివేని యీశ్వరా! మమ్ములను దోడ్కొనిపొమ్ము. ఇదియే మా పరమప్రీతి. ఇదియే మాకు ముఖ్యమైనవరము. నీవెంటనే రావలయునని మాయందఱిహృదయములలోనికోరిక" రాముఁడిట్లుచెప్పుచున్న పౌరుల మాటల కంగీకరించెను. దక్షిణకోసలములకుఁ గుశుని, ఉత్తరకోసలములకు లవుని రాజులనుగాఁజేసి వారినిద్దఱను దొడలపైఁ గూర్చుండఁ బెట్టుకొని కౌఁగిలించి మాటిమాటికిని ముద్దులాడి శిరస్సులు మూర్కొనెను. వేలకొలఁది రథములు, పదివేలుగజములు, లక్షగుఱ్ఱములు, వలసినంతధనము నొక్కొక్కనికిచ్చెను. మఱియు కుశీలవులఁగు కుశలవులను చాల రత్నములు, ధనమునిచ్చి హృష్టపుష్టజనముగల వారివారి పట్టణములకుఁ బంపించెను. ఇట్లు కుమారులను బట్టాభిషిక్తులనుగాఁజేసి రాజ్యములయం

దుంచి వెంటనే శత్రుఘ్నుని దోడ్కొనివచ్చుటకై రాముఁడు మధురా పట్టణమునకు దూతలను బంపెను.

## 108-వ సర్గము

### రాముఁడు సుగ్రీవాదులను దనతో రానీయకొనుట

లఘువిక్రములగు దూతలు రామునిచేఁ బ్రేరితులై దారిలో నిలువకయే యతివేగముగా మధురకుఁ బయనమైరి. వారు మూఁడహో రాత్రములు నడచి మధురఁజేరి జరిగినవృత్తాంతమంతయు శత్రుఘ్నునితోఁ జెప్పిరి. రాముని ప్రతిజ్ఞ, లక్ష్మణునిత్యాగము, కుశలవుల రాజ్యాభిషేకము, పౌరులయనుగమనము, వింధ్యపర్వతప్రాంతమున రాముఁడు కుశునికిఁ గుశావతియను రమ్యమైన పట్టణము నిర్మింపించుట, లవునికి శ్రావస్తి యను పట్టణము నిర్మింపించుట, యయోధ్యను నిర్మానుష్యముగాఁజేసి రాముఁడు భరతుఁడు స్వర్గమునకుఁ బోవుటకు సిద్ధముగ నుండుట మొదలగు నెల్ల వృత్తాంతములను మహాత్ముఁడగు శత్రుఘ్నునకుఁ దెలిపి యతనిఁ ద్వరపడుమనిచెప్పిరి. శత్రుఘ్నుఁడు ఘోరమైన కులక్షయమునకు దుఃఖించి ప్రజలను, పురోహితుని రావించి జరిగినదియు, జరుగఁబోవునదియు నగు వృత్తమును సర్వమును వారికిఁ దెలిపెను. తరువాతఁ గుమారులకుఁ బట్టాభిషేకముచేసి శత్రుఘ్నుఁడు మధురకు వచ్చెను. ధనమును సైన్యమును రెండుభాగములుగాఁజేసి యిద్దఱుకుమారులకును బంచియిచ్చెను. సుబాహుఁడను కొడుకునకు మధురాపురియు, శత్రుఘాతి యనువానికి వైదిశ మనుపట్టణము నిచ్చెను. ఇట్లంతయు నెఱవేర్చి శత్రుఘ్నుఁడు రథమెక్కి యతివేగముగ నయోధ్యకు వచ్చి మండుచున్న యగ్నివలె వెలుఁగుచున్నవాఁడును, సన్ననిపట్టువస్త్రము గట్టుకొన్నవాఁడును, నక్షయులగు మునులతోఁ గూడియుండువాఁడును నగు మహాత్ముని రాముని జూచి నమస్కరించి చేతులు జోడించుకొని ధర్మమును స్మరించుచు నిట్లనియె: "అన్నా! కుమారులకుఁ బట్టాభిషేకము చేసినవాఁడనయి నీవెంట వచ్చుటకు నిశ్చయించుకొనియున్నాను. నావిషయమున మాఱుమాట చెప్పకుము. నీయాజ్ఞ మీఱరానిది. నన్నును దప్పక యనుగ్రహింపవలయును. అందును నీయెడ మిగుల భక్తిగలవాఁడను. రాముఁడట్టి పౌరుషవంతమైన శత్రుఘ్నుని బుద్ధిని దెలిసికొని యాతని యనుగమనమున కంగీ

కరించెను. ఇట్లు వాఁడు మాటలాడుచుండఁగనే కామరూపులగు సకల ఋక్షవానరరాక్షసులతోడ సుగ్రీవవిభీషణులును వచ్చిచేరిరి. రాముఁడు స్వర్గమునకుఁ బోవుటకు నిశ్చయించుకొని యుండెనని వారు విని వచ్చిరి. దేవపుత్రులు, ఋషికుమారులు, గంధర్వసుతులు రాముని స్వర్గయాత్రా సన్నాహమును విని వచ్చిరి. ఇట్లువచ్చి వారెల్లను రామునకు నమస్కరించి "రామా! మేము నీవెంట వచ్చుటకు నిశ్చయమనస్కులమై యిటకేతెంచి తిమి. పురుషోత్తమా! మమ్ములను విడిచి నీవు పోవుదువేని నీవు యమదండ ముతో మమ్ములను జంపినవాఁడవగుదువు" అనిరి. ఇట్లు వారందఱును కోరఁగానే రాముఁడు "సరే యం"డని యంగీకరించెను.

అంతలో మహాబలుఁడగు సుగ్రీవుఁడును వినయయుక్తముగ నమస్కరించి రామునితో నిట్లనెను: "రామా! నేనంగదునకుఁ బట్టాభిషేకముచేసి వచ్చితిని. నేనును మీవెంటవచ్చుటకు సిద్ధుఁడనై యుంటిని" అని యిట్లు చెప్పిన సుగ్రీవునిమాటలువిని రాముఁ డతిస్నేహము నాలోచించుచు నతనితో నిట్లనెను: "మిత్రమా! సుగ్రీవా! నేను నీతో వినాకృతుఁడనై స్వర్గమునకుఁగాని, దేవలోకమునకుఁగాని, పరమపదమునకుఁగాని పోవు వాఁడనుగాను" అనిచెప్పి విభీషణునితో నిట్లనెను: విభీషణా! ఎంత వఱకు భూమియుండునో, ఎంతవఱకు సూర్యచంద్రాదులుందురో అంత వఱకును నీవు లంకారాజ్యమేలుచుండుము. వేయేల? నాకథ భూలోక మునందున్నంతవఱకును నీవు లంకలోనుండక తీఱదు. నీవు స్నేహితుఁడ వని భావించి నిన్ను శాసించితిని. నాశాసనము నీవుఁ దప్పఁజనదు. నీవు ధర్మముగాఁ బ్రజలను బాలింపుము. నామాటకు బదులు చెప్పకుము. మహామతీ! మఱియు నీతో నింక నొకసంగతి చెప్పుచున్నాను. ఇంద్రాదిదేవతలచే నారాధింపఁదగినవాఁడును, ఇక్ష్వాకుకులదైవతమును నగు జగన్నాథు(శ్రీరంగనాథు)ని నిరంతరము నారాధించుచుండుము" అని యిట్లుచెప్పిన రామవాక్యములను విభీషణుఁ డంగీకరించెను. రాక్షస రాజగు విభీషణునికి రామశాసనము దప్ప వీలులేనిదిగదా! ఇట్లు విభీషణు నితోఁజెప్పి హనుమంతునితో నిట్లనెను: "ఆంజనేయా! నీవు జీవించి యుండ నిశ్చయించుకొంటివి. ఆనిశ్చయమునకు లోపము రానీకుము. హరీశ్వరా! నాకథలు భూలోకమునఁ బ్రచారమునం దున్నంతవఱకును నామాట ప్రతిపాలనచేయుచు సంతోషముగా నుండుము" అని యిట్లు

రాముఁడు చెప్పఁగా, హనుమంతుఁడు సంతోషించుచు నిట్లని విన్నవిం
చెను: "రామా! పావనమగు నీకథ యెందాఁక భూలోకములోనుండునో
నేనంతవఱకు నీయాజ్ఞను బాలించుచు భూమియందుండెద"ననెను. తరు
వాత రాముఁడు బ్రహ్మసుతుఁడును వృద్ధుండును నగు జాంబవంతునితో
నట్లేచెప్పి మైందుని ద్వివిదుని నెుత్తమైదుగురిని కలిసంప్రాప్తించువఱకును
జీవింపుఁడనెను. వారలతో నిట్లుచెప్పి మిగిలినయందఱను దనతోడవచ్చుట
కంగీకరించెను.

## 109-వ సర్గము

### రామాదుల మహాప్రస్థానము

కమలపత్త్రాక్షుఁడును, విశాలోరస్కుఁడును, మహాయశుఁడును
నగు రాముఁడు తెల్లవాఱినతోడనే పురోహితునితో నిట్లనియె: "ముం
దుగా, బ్రాహ్మణులతోఁగూడ దీప్యమానమగు నగ్నిహోత్రమును ప్రకా
శించుచున్న వాజపేయాతపత్త్రమును బంపవలయును" అని చెప్పఁగానే,
వసిష్ఠభగవానుఁడు చేయవలసిన కర్మములన్నియు మహాప్రస్థానవిధి ననుస
రించి నిరవశేషముగాఁ జేసెను. తరువాత రాముఁడు సన్నినవస్త్రమును
గట్టుకొని దర్భపాణియై బ్రహ్మము నావర్తించుచు బయలుదేఱెను. అతఁడు
కొంచెమైనను మాటలాడకే నిశ్చేష్టుఁడై నిస్సుఖుఁడై వెలుఁగుచున్న
సూర్యునివలె నింటినుండి బయలుదేఱెను. రాముని దక్షిణపార్శ్వ
మునఁ బద్మము చేతితోఁబట్టుకొని శ్రీదేవియు, నెడమప్రక్కను హ్రీయు,
ముందుభాగమున వ్యవసాయమును నాశ్రయించి నడచుచుండెను. బాణ
ములు, నానావిధములైన యస్త్రములు, గొప్పది యగు ధనుస్సు, ఆయుధ
ములు పురుషవిగ్రహములనుధరించి బయలుదేఱెనవి. బ్రాహ్మణరూపమును
ధరించి వేదములు, సర్వరక్షిణి యగు గాయత్త్రి, ఓంకారము, వషట్కా
రము రాముని ననుసరించినవి. తెఱచియున్న స్వర్గద్వారమైన యారాముని
గూర్చి మహాత్ములగు ఋషులును, సకలబ్రాహ్మణులు ననుసరించిరి. అట్లు
పోవుచున్న రామునితో నంతఃపురస్త్రీలందఱును, వృద్ధబాలదాసులతో
వర్షధరకింకరులతో బయలుదేఱిరి. భరతశత్రుఘ్ను లంతఃపురస్త్రీలతో
బయలుదేఱిరి. సాగ్నిహోత్రుఁడగు రాముని గతిగాఁ దలంచిరి. మహాత్ము
లందఱును నగ్నిహోత్రములతోడను, పుత్త్రదారాదులతోడను మహా
మతియగు రాముని ననుసరించిరి. మంత్రులు భృత్యులు సపుత్త్ర పశు

బాంధవులై సంతోషించుచు రాము ననుసరించిరి. తర్వాత ప్రజలంద
ఱును హృష్టపుష్టజనావృతులై గుణరంజితులై రాముని వెంట నడిచిరి.
తరువాత స్త్రీపురుషులందఱును సపత్నీకసవాహనులై విగతకల్మషులునై
సంతోషించుచు రాము ననుసరించిరి. వానరులందఱును స్నానముచేసి
సంతోషముతోఁ గిలకిలారవములుచేయుచు రాము ననుసరించిరి. అప్పుడు
దీనుఁడుగాని, సిగ్గుపడినవాఁడుగాని, దుఃఖితుఁడుగాని లేఁడు. వారంద
ఱును సంతోషముతోను, ఉత్సాహముతోను పరమాశ్చర్యముగాఁ గను
పడుచుండిరి. రాముని నిర్యాణమునుజూడఁగోరివచ్చిన పల్లెవారుగూడ
రామునితో స్వర్గమునకు బయలుదేఱిరి. ఋక్షవానరరాక్షసులు, నగర
వాసులు మిగుల భక్తితో వెంబడి వచ్చిరి. ఆపట్టణములో నంతర్ధానమై
యున్న భూతములుగూడ స్వర్గమునకు రామునితో బయలుదేఱినవి.
రామునిఁజూచిన స్థావరజంగమములు రాముని ననుగమనముచేసినవి. ప్రాణ
ముతోఁగూడినజంతు వొక్కటియు నాపట్టణములో మిగిలియుండలేదు.
తిర్యగ్జంతువులుగూడ రాముని వెంట బయలుదేఱిపోయినవి.

## 110-వ సర్గము

### శ్రీమన్నారాయణుఁడు స్వస్థానము

రాముఁ డందఱితోడను నిట్లు బయలుదేరి యర్ధయోజనదూర
మందు పశ్చిమవాహినియై ప్రవహించుచుండు సరయూనదిని జూచెను.
అంతట నాకులమైన యావర్తములుగల యానదిని బ్రజలందఱితోడను
వచ్చిన రాముఁడు సమీపించెను. పిమ్మట బ్రహ్మదేవుఁడు సమస్తదేవతల
తోడను, బ్రహ్మర్షులతోడను గూడి స్వర్గమునకు బయలుదేఱిన రాముఁ
డున్నచోటికి సంతోషముగా వచ్చెను. ఆకాశమంతయు దేవతలవిమాన
కోట్లచే నావరింపఁబడియుండెను. ఆకాశమంతయు దివ్యజ్యోతులచే వెలిఁగి
పోవుచుండెను. స్వయంప్రభులును పుణ్యకర్ములును నగు స్వర్గవాసు లాక
సమునిండియుండిరి. పవిత్రవాయువులు పరిమళముగలిగి సుఖస్పర్శములై
చల్లఁగా వీవఁదొడఁగినవి. దేవతలు పూలవాన గురియించిరి; దేవదుందు
భులు మ్రోఁగినవి. ఇట్లంతరిక్షమందు నృత్యగీతవాదిత్రాదులచే నిండి
యుండఁగా రాముఁడు సరయూజలమును పాదములతో స్పృశించెను.
అపుడు బ్రహ్మ యంతరిక్షముననుండి యిట్లనియె: "విష్ణూ! రమ్ము. నీకు

భ్రష్టము గాక. రాఘవా! దైవవశమున బ్రాప్తించితివి. దేవాభులగు తమ్ములతోఁగూడ నీశరీరమును ధరింపుము. నీకేశరీరము కావలెనో దానినే యవలంబింపుము. మహాతేజా! నీవైష్ణవశరీరము ధరించుము. అది సనాతనము వైకుంఠవిరాజమానము. దేవా! నీవే లోకములకు దిక్కు. నీపూర్వ పరిగ్రహమగు నొక్కమాయను తప్ప నిన్నెవ్వరును దెలిసికొనఁజాలరు. మహాతేజా! నీవు అచింత్యము, మహద్భూతము, అక్షయము, నజరము నగు నీశరీరమును ధరించినను సరియే, నీయిష్టము." మహామతి యగు రాముఁడు బ్రహ్మమాటలువిని బాగుగా నిశ్చయించుకొని తమ్ములతోఁ గూడ వైష్ణవశరీరమును బ్రవేశించెను. అపుడు విష్ణుమయుఁడగు నా దేవుని దేవతలు పూజించిరి. మఱియు సాధ్యులు, మరుద్గణములు, ఇంద్రాదులు, అగ్ని మొదలగువారు, దివ్యఋషులు, బ్రహ్మర్షులు, గంధర్వులు, అప్సరసలు, సుపర్ణులు, నాగులు, యక్షులు, దైత్యదానవరాక్షసులు మొదలగువారందఱును సంతోషించి సంపూర్ణమనోరథులైరి. వారందఱును విష్ణుదేవుని సాధువాదములతో నభినందించిరి.

అపుడు మహాతేజశ్శాలియగు విష్ణుఁడు బ్రహ్మనుజూచి యిట్లనియె: "సువ్రతా! ఈవచ్చిన ప్రజలందఱకును మంచిలోక మీయవలయును. ఈ మనుష్యులందఱును నాయందలి స్నేహమును విడువఁజాలకవచ్చిరి. భక్తులు, భజింపఁదగినవారు, నావిషయమై ప్రాణము లర్పించువారు" అని చెప్పిన విష్ణునిపల్కు లాలకించి లోకపితామహుఁడగు బ్రహ్మ వీరు సాంతానికములను లోకములనుఁజేర్చి పోఁగలరు. నీవిషయమై ప్రాణములు విడువఁదలఁచిన తిర్యగ్జంతువులును, నిన్నుఁ జింతించువారును, నీయందు భక్తిగలవారును సాంతానికలోకములలో నుందురు. అది బ్రహ్మలోకమునకు ననంతరపుది. బ్రహ్మలోకమునందలి గుణములతో నిండియున్నది. వానరులు, ఋక్షనాయకులు తమతమ స్వస్వరూపములను బొందుదురు. వారేయే దేవతలవలనఁ బుట్టిరో మరల వారిలోఁ గలియుదురు. అందు సుగ్రీవుఁడు సూర్యమండలమును సమస్తసురలును జూచుచుండఁగా బ్రవేశించెను. దేవేశుండగు బ్రహ్మ యిట్లుచెప్పుచుండఁగా నందఱును గోప్రతారఘట్టమును బొందినవారై సరయువును బ్రవేశించిరి. సరయువు నీటిలో మునిఁగిన యెల్లవారును దివ్యదేహములతో విమానములయందుండిరి. తిర్యగ్జంతువులు సరయూజలములో మునిఁగి ప్రభాసురశరీరములతో స్వర్గమును బొందినవి. వారందఱును దేవతలవలెనే ప్రకాశించుచుండిరి.

స్థావరములు జంగమములును పరంధామజలమును స్పృశించి దేవలోకమును బొందినవి. అప్పటికి వచ్చిన ఋక్షవానరరాక్షసులు నీటిలోఁ దమదేహములను విడిచి దివ్యదేహములను దాల్చినవారై స్వర్గమును బొందిరి. తరువాత లోకగురుండగు శ్రీమన్నారాయణుండు తనతో వచ్చిన వారినందఱను స్వర్గమందు నిలిపి సదా సంతసించు దేవతలతోఁ గూడ స్వర్గమును బొందెను.

## 111-వ సర్గము

### రామాయణ ఫలశ్రుతి

బ్రహ్మపూజితమును, ఉత్తరచరితముతోఁ గూడినదియును నగు నీయాఖ్యానమింతవఱకే. ఇది రామాయణమును పేరుగలది; ముఖ్యమైనది; వాల్మీకిమహామునిచే రచింపఁబడినది. తరువాత విష్ణుదు స్వర్గలోకమం దెప్పటియట్లు ప్రతిష్ఠితుఁడాయెను. అతనిచేతనే యీచరాచర ప్రపంచమంతయు నిండియున్నది. అందువలన దేవతలు, గంధర్వులు, సిద్ధులు, పరమఋషులు సంతుష్టులై నిత్యమును దివ్యమగు రామాయణమును స్వర్గమందు వినుచుందురు. ఈయాఖ్యానము దీర్ఘాయువును సౌభాగ్యమును గలిగించి పాపములను నశింపఁజేయును. రామాయణము వేదములతో సమానమైనది. దీనిని ప్రాజ్ఞులు శ్రాద్ధములయందు వినిపించుచుండవలెను. ఈరామాయణములోని యొక్కపదమునైనను బఠించువాఁ డధనుఁడైనచో ధనమును బొందును. పుత్రులులేనివారు పుత్రులను బడయుదురు. సర్వపాపములును దొలఁగిపోవును. మానవుఁడు ప్రతిదినమును బాపములు చేయుచుండినను దీనిలోని యొక్కశ్లోకమును బఠించిన యెడల నన్నిపాపములును బోవును. రామాయణవాచకునికి వస్త్రములు ధేనువు బంగారు మొదలగునవి యీయవలయును. వాచకుఁడు సంతోషించినచో సర్వదేవతలును సంతోషింతురు. ఆయుష్యవర్ధనమగు నీ రామాయణకథను బఠించిన నరుఁడు పుత్రపౌత్రాదులతో నిహలోకమున సమస్తసుఖములు ననుభవించి పరలోకమున నుత్తమగతినిబొంది గౌరవింపఁబడుచుండును. రమ్యమగు నయోధ్యాపట్టణము బహుసంవత్సరములు జనశూన్యమై ఋషభునిరాజునుగాఁబొంది సుజనాశ్రయమగును. ఆయుష్యకరమగు నీయాఖ్యానము భవిష్యముతో నుత్తరచరిత్రతో ప్రచేతసునిపుత్రుఁడు రచించెను. దానిని బ్రహ్మవిని యనుమోదించెను. వేయశ్వమేధములును, పదివేలువాజపేయములును జేసినఫలమిందులోని యొక్క

సర్గము చదివినవానికిఁ గలుగును. ప్రయాగాదులగు తీర్థములు, గంగాదులగు నదులు, నైమిశాదిపుణ్యారణ్యములు, కురుక్షేత్రాదులు రామాయణము విన్నవారు వెళ్లి సేవింప నక్కఱలేదు. సూర్యగ్రహణసమయమునఁ గురుక్షేత్రమున బంగారు తులాభారముతూఁగి దానమిచ్చినవాఁడును, రామాయణము విన్నవాఁడును సమానులు. భక్తిశ్రద్ధాతాత్పర్యములతో రామకథను విన్నవారు పాపవర్జితులై విష్ణులోకమును బొందుదురు. ఇది యాదికావ్యము, ఆర్షము, పూర్వము వాల్మీకిచే రచింపఁబడినది. దీనిని విన్నవారు విష్ణుసాయుజ్యమును బొందుదురు. పుత్రదారాదులు వృద్ధి పొందుదురు. వారి సంపదలు, సంతతి వృద్ధిని బొందును. ఇది సత్యమని తెలిసికొని నియతాత్ములై వినవలయును. ఇందు గాయత్రి యిమిడియున్నది. ఈరామాయణ మనుత్తమమైనది. దీనియం దొక్కపదమునైనఁ జదివినచోఁ బుత్రులులేనివారికిఁ బుత్రులు గలుగుదురు, ధనములేనివారికి ధనముదొరకును; వారిపాపములన్నియుఁ బటాపంచలై పోవును. రాముని చరిత్రను జదివినవారును విన్నవారును భక్తివలన నిష్కల్మషులై దీర్ఘాయువును బొందుదురు. శ్రేయస్సును బొందవలయునను నిచ్ఛయున్నచో నిత్యమును రాముని జింతింపవలయును. నిత్యమును రామునిచరిత్రమును బ్రాహ్మణులకు వినిపింపవలయును.. ఈరఘురామునిచరిత్రమునంతయుఁ జదివినవారు దేహాంతమందుఁ దప్పక విష్ణులోకమును బొందుదురు. వారి తండ్రి, తాత, తాతతండ్రి, వానితండ్రి, వానితండ్రిగూడ నిస్సంశయముగా విష్ణుసాయుజ్యము నొందుదురు. ధర్మార్థకామమోక్షముల నిచ్ఛ సీరామచరితమును నిత్యమును బ్రయత్నపూర్వకముగా వినుచుండవలయును. భక్తితో సీరామాయణములోని పాదమునుగాని పదమునుగాని విన్నవారు బ్రహ్మలోకమునుగూర్చిపోయి సదా బ్రహ్మచేఁ బూజింపఁబడుదురు. ఈయాఖ్యానము పూర్వమం దిట్లు జరిగినది. మీయందఱకును భద్రమగుఁగాక. విష్ణునిబలము వృద్ధిని బొందును గావుతమని నిర్భయముగాఁ బలుకుచుండుఁడు.

ఇది శ్రీమద్వాల్మీకిరామాయణమునందలి
యుత్తరకాండము సమాప్తము.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954.